ప్రత్యేక
సంచిక

# ఆంధ్రసచిత్రవారపత్రిక

11-17

రు.









కొమ్మూరి రవీంద్రబాబు పూర్తినవల
ఈ కలలు కనే కళ్ళు

- ☐ సుప్రసిద్ధ రచయితల కథలు
- ☐ సినీ ప్రముఖుల వ్యాసాలు
- ☐ ప్రత్యేక శీర్షికలు, కార్టూన్‌లు, గేయాలు,
- ☐ కొత్త వ్యాస రచన పోటీ, సినిమా

వసంత

# చరిత్ర సృష్టించిన వ్యాపారవేత్త!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

ఆ పేరు పలకటానికి నోరు తిరగక పోవచ్చు కాని ఆ వ్యక్తి చరిత్ర సృష్టించాడు. ఆయన ఆత్మకథ ప్రచురింపబడి సంవత్సరం పైనే అయినా అదింకా బాగా అమ్ముడవుతున్న పుస్తకాల జాబితాలో నే ఉన్నది. ఇప్పటికి అది 30 లక్షల ప్రతులకి పైగా అమ్ముడుపోయింది. దానిపై వచ్చే రాయల్టీలని ఆయన ధర్మనిధికి రాస ఉండకపోతే ఈ పాటికి ఆయన ఇంతకి పదింతలు కోటీశ్వరుడై ఉండేవాడు. అయితే ఆయన జిమ్మీ కార్టర్ వంటి మంచి చేసే రాజకీయ నాయకుడు కాదు, రజనీష్ లాంటి గురువూ కాదు. వ్యాపారం చేయడం అంటే సిగ్గు పడనటువంటి వ్యాపారవేత్త, మార్కెట్ అంటే భయం లేని సెల్స్‌మన్, ఏది ఏమైనా సరే తన లక్ష్యంవైపు దూసుకుపోయే కార్యసాధకుడు.

లీ అయాకోక్కా ఆధునిక అమెరికన్ కథానాయకులనదగిన వారిలో ఒకరు. ఆయన తల్లిదండ్రులు అమెరికా సంయుక్తరాష్ట్రాలక వలస వచ్చినప్పుడు కట్టు బట్టలు తప్ప వారి వద్ద ఇంకేమి లేవు అమెరికాసంయుక్త రాష్ట్రాలకి వచ్చిన ఆయన తండ్రి అక్కడ ఒక బొగ్గు గనిలో కార్మికుడిగా చేరాడు తర్వాత ఇటలీ వెళ్లి పెళ్లి చేసుకుని నవ వధువుతో తిరిగి అమెరికా చేరాడు అప్పటికి వారికి ఇంగ్లీషు అంతగా రాదు. వారి కుమారుడు లీ అయాకోక్కా- అసలు పేరు ఇంకా విచిత్రంగా ఉంటుంది- కళాశాలలో చదివి ఇంజనీరింగ్ పట్టభద్రుడైనాడు. త్వరలో నే ఆయన ఫోర్డ్ మోటారు కంపెనీలో ఉద్యోగంలో చేరాడు. ఇప్పటి మాదిరిగానే అప్పుడూ అమెరికాలోని పెద్ద కంపెనీలలో ఫోర్డ్ అయిదవదిగానో, ఆరవదిగానో ఉండేది.

ఆ సంస్థలో వలస వచ్చిన ఈ దంపతుల కుమారుడు కార్ల తయారీ, వాటి అమ్మకాలలో తన ప్రతిభని చూపించాడు. అతి త్వరలో నే అతను హెన్రీ ఫోర్డ్ తర్వాతి స్థానానికి ఎదిగాడు ఫోర్డ్ కంపెనీ స్థాపకుని మనుమడే ఇప్పటి హెన్రీ ఫోర్డ్. ఆ దేశంలో అత్యధిక జీతాలు తీసుకునే వ్యక్తులు అయా కోక్కా, హెన్రీ ఫోర్డ్‌లు ఇద్దరే. ఏటా చెరొక పది లక్షల డాలర్లు ఆర్జించేవారు. ఫోర్డ్ సంస్థ అధ్యక్షుడిగా ఎనిమిదేళ్లపాటు పని చేసిన అయాకోక్కా ఆ తర్వాత ఆగ్రహానికి గురైనారు. దీనికి కారణం తనంటే ఫోర్డ్‌కి ఇష్టం లేకపోవటమేనని అంటారాయన ఆయన కార్యాలయం ఒక గిడ్డంగి వంటి దానిలోకి మార్చబడింది. ఎంతో విలాసవంతంగా జీవితాన్ని అనుభవించిన ఆయన కాగితం కప్పులతో కాఫీ తాగాల్సిన పరిస్థితి ఏర్పడింది

అయాకోక్కా క్రిస్లర్‌కి మారిపోయారు. అప్పుడు అది దివాలా తీసే పరిస్థితిలో ఉన్నది. అదృష్టవశాత్తు రీగన్ కాకుండా జిమ్మీ కార్టర్ అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడిగా ఉండడంతో ప్రభుత్వ సహాయం పొంది దానిని నిలబెట్టగలిగారాయన. బాంక్ అప్పులన్నిటినీ గడువు తేదికి చాలా ముందే తీర్చి వేసారు. ఆ విధంగా తోటి అమెరికన్‌ల దృష్టిలో ఆయన ఒక జానపద కథానాయకుడిలా ఒక వెలుగు వెలిగారు. ఇటు డెమోక్రాట్‌లూ అటు రిపబ్లికన్‌లూ చెరొక వైపూ ఆయనని అమెరికా సంయుక్తరాష్ట్రాల అధ్యక్ష పదవికి, ఫోర్డ్ కంపెనీకి కాదు, పోటీ చేయమని పురికొల్పుతున్నారు.

ఇయాకోక్కా ప్రభుత్వాన్ని కానీ, తమ సహచర వ్యాపారవేత్తలని కానీ ఎవరినీ వదిలిపెట్టరు. ఎందుకంటే ఫోర్డ్ ఆయనని తీసివేసినప్పుడు ఎవరూ ఏమీ చెయ్యలేదు. ఆయన పుస్తకంలో మనకి కనిపించేదేమిటంటే అమెరికన్ వాణిజ్య రంగంపై స్థూలమైన అవగాహన. అది హార్వర్డ్ ప్రొఫెసర్‌లు వెయ్యి వ్యాసాలు, ప్రసంగాలకన్నా ఎక్కువ. అమెరికన్ వాణిజ్యం, అది ప్రభుత్వ జోక్యం లేనిదనండి లేదా మరొకటి అనండి, దానిని ఆ సమాజం అంగికరించింది.

అమెరికన్ సమాజం అంగికరించేది అయాకోక్కా వంటి వ్యక్తులనే. ఆయన ఆ సమాజం తయారీయే కావచ్చు కానీ అటువంటి వారే ఒక సమాజానికి రూపకల్పన చేసి తమతో పాటు నడిపించగలరు. అయాకోక్కా ఏవిధంగా చూసినా స్వేచ్ఛ ఉన్నటువంటి వ్యక్తి. అమెరికన్ కాంగ్రెసు మొదలుకొని తమ యజమానివరకూ ఆయన నిర్మొహమాటంగా వ్యవహరిస్తారు. అమెరికా అధ్యక్షుడి నుంచి క్రింది వరకూ, ఆఖరికి తమ క్షురకునితో సహా అందరితో ఆయన చాలా సహజంగా సంభాషిస్తారు. ఆయన సిద్ధాంతంలో హెచ్చుతగ్గులు లేవు. ఇబ్బందులు ఎదురైనప్పుడు ఆయన తమ బాంక్ అధికారితో ఎలా సంప్రదింపులు జరుపుతారో అలాగే తమ క్షురకునితో కూడా చర్చలు జరుపుతారు. అన్నిటినీ మించిన విషయం ఆయన గొప్ప ఆత్మ విశ్వాసం కల వ్యక్తి. తమపైనా, తమ కుటుంబం, దేశం, ప్రపంచంలో తమ ఉనికిపై ఆయనకి అచంచల విశ్వాసం ఉన్నది. అయితే మన నాయకులమని చెప్పుకునే వారిలాగా ఆయన అహంభావి మాత్రం కాదు. ఎందుకంటే వారిలాగా ఆయన డూస్



స్కూలుకి వెళ్ళలేదు. తమ కుటుంబ పలుకుబడితో కేంబ్రిడ్జిలో చదవలేదు. ఆయన తండ్రి ఒక బొగ్గు గని కార్మికుడు, తల్లి వంట మనిషి.

మన వ్యాపారవేత్తలు మనకి ఉన్నారు. కానీ వారిని వ్యాపారవేత్తలనేకన్నా కమిషన్ ఏజంట్ల వంటి వారనటం సబబుగా ఉంటుంది వాళ్ళకి దేనిమీదా నమ్మకం ఉండదు. దేశం ఎదుర్కొంటున్న ఏ సమస్యపైనా వారికి సరైన అవగాహన లేదు. మన వ్యాపారవేత్తలు పిరికి వారు. వాళ్ళు ఎలాంటి వారంటే శ్రీమతి గాంధి అత్యవసర పరిస్థితి విధించిన మరునాడు బెంగాలీ మార్కెట్ నించి ఆమె నివాసం దాకా ఊరేగింపుగా వెళ్ళి ఆమెను అభినందించారు. రాజీవ్, విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ బృందం ప్రగతిశీలక, పెట్టుబడిదారి వ్యతిరేక దృక్పథం కల వారనుకున్న భ్రమ కల్పించడానికి పెద్ద వ్యాపారవేత్తలపై కోర్టులలో ఆరోపణలు చేసినప్పుడు వారి పిరికితనం మరోసారి బుజువైంది. అందంతా ఒక ఫార్సులాంటిది. అయినప్పటికి ఏ వ్యాపారవేత్త దానిని ఫార్స్‌గా గట్టిగా పైకి చెప్పలేకపోయారు. ఎందుకంటే వాళ్ళంతా తాము కొల్లగొట్టిన దానిని లెక్కపెట్టుకుంటూ తమ ఎయిర్ కండిషన్ గదులలో దాక్కున్నారు.

నా దగ్గరికి వ్యాపారవేత్తలు కొందరు వచ్చి ప్రభుత్వంపై ఫిర్యాదులు చెపుతూ ఉంటారు. కానీ రాజీవ్ అద్భుతమైన వ్యక్తి అని చెప్పటం మాత్రం వాళ్ళు మరువరు, అలాగే ఆయన ఆర్థిక మంత్రి గురించి కూడా చెప్తారు.పాల్కీవాలా అంటే నాకెంతో గౌరవం. ఈ మధ్యే ఆయన బడ్జెట్ గురించి చేసిన ఉపన్యాసంలో అలాగే చెప్పారు. ఇటీవల జరిగిన దాడులకి అధికారులే తప్ప రాజీవ్‌గాంధీ కానీ, ఆయన ఆర్థిక మంత్రి కానీ బాధ్యులు కారని ఆయన అన్నారు. అది ఆయనకి ఎలా తెలుసు? కిర్లోస్కర్‌ని అరెస్టు చెయ్యమని ఉన్నతస్థానంలో ఉన్నవారినించి ఆదేశాలు రాలేదన్న విషయం ఎలా తెలిసింది ఆయనకి? ఇలాంటి చిన్న విషయాలు తమ స్థాయి వరకూ రావని విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ అంటూ ఉండవచ్చు. కానీ ఆయన మాటలపై నాకు నమ్మకం లేదు. ఈ దాడులన్నీ తమ ప్రతిష్టని ఇనుమడింపచేసుకోడానికి జరిపించినటువంటివే. వ్యాపార వర్గం అంతా మేలుకొని ప్రతిఘటిస్తుందనుకున్నాను. అయితే వాళ్ళలో అయాకోక్కా ఎవరూ లేరు. ఎంతో మంది భారతీయ వ్యాపారవేత్తలు తాము వ్యాపారస్తులమని చెప్పుకోడానికే సిగ్గుపడతారు.

నిజంగా వారెందుకలా ఉంటారో నాకు తెలియదు. ఒక కర్మాగారాన్ని నడపటానికి ఎవరైనా ఎందుకు సిగ్గుపడాలి? కొందరికి ఉద్యోగాలు ఇవ్వటానికి, పన్నులు కట్టటానికి. విదేశీ మారక ద్రవ్యాన్ని ఆర్జించటానికి ఎవరైనా ఎందుకు సిగ్గు పడాల్సి ఉంటుంది? ప్రపంచంలోని అయాకోక్కాలంతా హాయిగా చేస్తున్నది అదే కదా? అయాకోక్కాకి తాము అనుకున్నది చెయ్యటంలో నమ్మకం ఉన్నది. ఆయన దేశం వారు ఆయనని మెచ్చుకుంటారు. మన వ్యాపారవేత్తలు తాము చేసేదాన్ని గురించి తామే సిగ్గుపడతారు. ప్రజలు కూడా వారిని మెచ్చరు. మన రాజకీయ నాయకులు కూడా వాళ్ళని నేరస్తులలాగే చూస్తారు. □

# మనలో మాట

మా పాఠకులు, రచయితలు, రచయిత్రులు, ఏజంట్లు, ప్రకటనకర్తలందరికి అక్షయ ఉగాది శుభాకాంక్షలు.

అంతకుముందు ఆంధ్రపత్రిక దినపత్రిక అనుబంధంగా వెలువడుతున్న ఉగాది సంచికని ఆంధ్రసచిత్ర వారపత్రిక చదివేవారికి అందుబాటులోకి తీసుకురావాలన్న సంకల్పంతో గత రెండేళ్ళుగా ఆంధ్రసచిత్ర వారపత్రికకి అనుబంధంగా ప్రచురిస్తున్నాము. పాటికి పాఠకుల ఆదరణ విశేషంగా లభించిన కారణంగా ఆంధ్రసచిత్ర వారపత్రిక అక్షయ ఉగాది ప్రత్యేక సంచికని మరింత ఆకర్షణీయంగా వెలువరించటానికి ప్రయత్నం చేసాము. ఈ సంచిక కూడా పాఠకుల ఆదరాభిమానాలని అందుకుంటుందని ఆశిస్తున్నాము.

పాఠకులకి ప్రత్యేక ఆకర్షణగా ఈ సంచికలో సుప్రసిద్ధ నవలా రచయిత, ప్రముఖ శస్త్రవైద్యులు డా. కొత్త రవీంద్రబాబుగారు రాసిన పూర్తి నవల "కలలు కనే కళ్ళు" ప్రచురించాము వైవిధ్యంతో కూడిన ఈ నవల పాఠకులని అలరించగలదని అనుకుంటున్నాము.

ఈ ప్రత్యేక సంచికలోనే శ్రీమతి దేవినేని ఉష రాసిన సరికొత్త సీరియల్ నవల "వసంత గీతం" ప్రారంభిస్తున్నాము. ఉత్కంఠ కలిగించే చక్కని కథా సంవిధానం కల ఈ సీరియల్ నవల వారం వారం పాఠకులని ఉర్రూతలూగించగలదని ఆశిస్తున్నాము.

శ్రీయుతులు మధురాంతకం రాజారాం, కలువకొలను సదానంద, సంగరాజు రామచంద్రమూర్తి, యర్రంశెట్టి శాయి, శ్రీమతి 'జ్యోతిర్మయి' గారలు ప్రత్యేకంగా రాసిన కథలని ఈ సంచికలో వేసాము.

సినీ ప్రముఖులు శ్రీయుతులు డి. వి. నరసరాజు, కొసరాజు, జంధ్యాల, రంగనాథ్, నటి రాధిక గార్ల ప్రత్యేక వ్యాసాలని ఈ సంచికలో ప్రచురించాము.

మామూలు శీర్షికలన్నిటితో పాటు ఈ సంచికలో అక్షయనామ సంవత్సర ఫలం – రాశిబలం, 1985 సినిమా బాలట్ ఫలితాలు వేసాము. సినిమా బాలట్‌లో ఉత్సాహంగా పాల్గొని దానిని జయప్రదం చేసిన పాఠకులకి మా కృతజ్ఞతలు, బాలట్ విజేతలకి మా అభినందనలు తెలియచేస్తున్నాము.

ఈ ప్రత్యేక సంచికలో మరో ప్రత్యేక ఆకర్షణ మేము నిర్వహిస్తున్న కొత్త తరహా వ్యాసరచన పోటీ! దీనికి సంబంధించిన వివరాలని ఈ సంచిక మధ్య పేజీలలో వేసాము. పాఠకులందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని విజయవంతం చెయ్యగలరని ఆశిస్తున్నాము. □



త్తది!




# ఈ రోజును
# సూపర్ ఫ్రెష్ రోజుగా చేసుకోండి.

## కొండలోయల పుష్పాల పరిమళంతో

సూపర్ ఫ్రెష్ సహజమైన హాయనిపించే సుఖానుభూతిని
చేకూర్చే సుగంధ భరిత క్రొంగొత్త సబ్బు, మీచర్మానికి మృదుత్వాన్ని
చేకూర్చి మీకు ఉల్లాసాన్ని కొనితెస్తుంది
అందుకే కొద్దిగా తాజాదనాన్ని జల్లుకోండి. —
ఈ రోజును సూపర్ ఫ్రెష్ రోజుగా తీర్చుకోండి

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)
11-17 ఏప్రిల్, 1986
శ్రీ అక్షయ నామ సం. చైత్ర. శు. విదియ
సంపుటము 78 : సంచిక 31
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
విడి ప్రతి వెల రు. 5/-
ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
శోభన్‌బాబు, విజయశాంతి
చంద్రమోహన్, శారద

కథలు :



పూర్తి నవల:



సీరియల్ నవలలు:



వ్యాసాలు, శీర్షికలు :



# ఉత్తరాలు

### ప్రశంసనీయం

28, ఫిబ్రవరి, 6 మార్చిన నటుడు చిరంజీవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక మా హృదయాలను రంజింప జేసింది.

విశారద, విధ్యాధరకు వ్రాసిన పుత్తరములో తన వ్యక్తిత్వాన్ని, టీచర్‌గా తన బాధ్యతను గుర్తు చేస్తూ, కేవలం కొద్ది పరిచయానికే అతనితో జీవితాన్ని పంచుకోకుండా, తనకు పెండ్లి అయి, భర్త యాక్సిడెంట్‌లో చనిపోయాడని వ్రాయడం ఆమె సంస్కారాన్ని చాటుతుంది. ఏది ఏమైనా ముగింపు ప్రశంసనీయం నిరీక్షణ కథలో.

– జి. మణిమాల, కడప

### ఆలోచింప చేసేదిగా ఉంది

సుప్రీమ్ "చిరంజీవి" ముఖచిత్రం (28 ఫిబ్రవరి 6 మార్చి) అత్యంత ఆకర్షనీయంగా వుంది మమ్మల్నెంతో అలరించింది.

డా. జయప్రదగారి "తీర్పు" కథ వాస్తవానికి దగ్గరగా వుండి– ఆలోచింప చేసేదిగా వుంది.

– కర్నా ప్రభాకర్, కావలి

### నిరీక్షణ!

ఈ వారం 28 ఫిబ్రవరి, 6 మార్చి '86 వారపత్రిక "చిరంజీవి" ముఖచిత్రంతో ముచ్చటగా వెలువడింది. హవురా వైపు వెళ్ళే ట్రైన్ కోసం నిరీక్షిస్తున్న నన్ను ఈ వారపు పత్రికలోని కథలలో "నిరీక్షణ" నచ్చింది.

– పక్కి గోపాలకృష్ణపట్నాయక్, బల్లిగూడ (ఒరిస్సా)

### ఆసక్తికరం

మీ (మా) పత్రికలో ప్రచురిస్తున్న అభిమాన తారలపై అభిప్రాయాలు శీర్షిక చాల ఆసక్తికరముగా వున్నది.

–యల్లపు భాస్కరరావు, అనకాపల్లి

### ఆకర్షణీయం

మా అభిమాన నటుడు డైనమిక్ హీరో చిరంజీవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా బాగుంది. అభిమాన తారలపై అభిప్రాయం శీర్షిక చాలా ఆకర్షణీయంగా ఉంది.

– దువ్వాడ శ్రీకాంత్, కాశీబుగ్గ

### ఆకట్టుకుంది

(28–6) ఫిబ్రవరి 86, ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంచికపై మా అభిమాన నటుడు డైనమిక్ అండ్ డేరింగ్ హీరో "చిరంజీవి" ముఖచిత్రం ఎంతో ఆకర్షణీయంగా ఉంది. "సీక్రెట్ ఏజంట్ విక్రమ్" బొమ్మల సీరియల్ మమ్ములను ఎంతో ఆకట్టుకున్నది.

– సి. హెచ్. సుధీర్‌కుమార్, అద్దంకి

### నచ్చింది

చిరంజీవి ముఖచిత్రంతో వెలువడిన 28–6 సంచిక చాలా బాగుంది. డాక్టర్ సోమిరెడ్డి జయప్రద గారి "తీర్పు" కథ మా యింటిల్లిపాదికి నచ్చింది.

– జి. వి. రంగయ్య, ఒంగోలు

### బాగుంది

చిరంజీవి (28–6) ముఖ చిత్రంతో వెలువడిన పత్రిక చాలా బాగుంది. "మువ్వల సవ్వడి" కథ చాల బాగుంది. – జొగ్గ ప్రసాద్ యాదవ్, గొల్లలపాలెం

### సీరియల్స్

చిరంజీవి ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా చూడ ముచ్చటగా ఉంది. "సాక్షి" సీరియల్ ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టుకొంది.

– ఎం. బాలు, పురుషోత్తపల్లి

* * *

మా అభిమాన నటుడు డైనమిక్ హీరో "చిరంజీవి" ముఖచిత్రంతో వెలువడిన మన పత్రిక చాలా మంచిగా ఉన్నది. "ప్రేమసాగరం" సీరియల్ చాలా బాగున్నది.

– అర్వపల్లి అంజనేయులు, అర్వపల్లి రాజ్యాలక్ష్మి, ఖమ్మం

* * *

సుప్రీం హీరో "చిరంజీవి" ముఖ చిత్రంతో వెలువడిన పత్రికలో "సాక్షి", ప్రేమసాగరం" సీరియల్స్ చాలా బాగున్నాయి. ఆద్యంతం ఉత్కంఠ కలిగిస్తున్నాయి.

– రామచందుని సుబ్బలక్ష్మి, ఒంగోలు □




"కాఫీ యిలాగేనా యిచ్చేది?" కళ్ళు వురిమిచూస్తూ అరిచింది మయూరి. "ఏమయిందమ్మా?" చేతులు నలుపుకుంటూ మెల్లగా అడిగింది వంటమనిషి రమణ.

"ఏమయిందా? చల్లగా ఐస్ నీళ్ళలా వుంది!"

"నేను తెచ్చినప్పుడు సెగలుగక్కుతూ బాగా వేడిగానే వుందమ్మా! మీరుపరధ్యానంగా వుండంతో వెంటనే తాగకపోయేసరికి కాఫీ కాస్తా చల్లారిపోయింది!"

"అపు నీలెక్చర్లు! చల్లారిపోతే మళ్ళీ వెచ్చచేసుకురాలేవూ? పో! నీ శనేశ్వరపు ముఖం నాకు చూపకు! వెళ్ళు!" కాఫీ కప్పును విసిరి గోడకేసి కొట్టింది మయూరి.

రమణ ముఖం జేవురించుకుపోయింది. భయపడుతూ గదిలో నుండి బయటకు నడిచింది.

మెట్లు దిగుతుంటే రమణ మనసులో కోపం పెల్లుబికింది

"అయ్యగారి ముఖం చూసి వూరుకుంటున్నా! లేకపోతే యీవిడ విసుర్లు కసుర్లు పడుతూ ఇక్కడే వుండాల్సిన కర్మ నాకేం వచ్చింది?" చెమ్మగిల్లిన కనులు వొత్తుకుంటూ ముందుకు నడిచింది

ఆవిర్లుగక్కే వేడి కాఫీ కప్పుతో తిరిగి మయూరి గదిలోకి వచ్చింది రమణ

"ఇదిగో నమ్మా! వేడిగా వుంది కాఫీ!"

"ఎవరిక్కావాలి నీ బోడి కాఫీ! ఎనిమిది గంటలు దాటాక నేనెప్పుడైనా కాఫీ తాగానా?"

ఉసూరుమంటూ తల వంచుకుని తిరిగి వెళ్ళబోయింది రమణ.

'ఆగు' గర్జిస్తున్నట్లు అన్నది మయూరి

ఏమ్మా!"

"అయ్యగారేంజేస్తున్నారు?'

'చీకటితో లేచి నిత్యలోక బాబా ఆశ్రమానికి వెళ్ళారు!" అని సమాధానం చెప్పి యిక అక్కడ నిలబడివుంటే ఏం తిట్లు తినాలో అన్నట్లు వెళ్ళిపోయింది రమణ

'తెల్లవారి లేచింది మొదలు ఆశ్రమంచుట్టూ ప్రదక్షిణలు చేయడంతప్ప వేరే పనిలేదాయనకు!" మెట్లమీదనుండి దిగుతున్న రమణకు మయూరి పెద్దగా గొణుక్కోవడం వినబడింది!

వంట గదిలోకి వచ్చి కూరగాయలు తరుగుతున్న రమణతో "ఏమిటక్కయ్యా! పొద్దున్నే అమ్మగారు ఎవరిమీద అరుస్తున్నది?" అన్నాడు పెరటి వాకిలి దగ్గర నిలబడ్డ పకీరయ్య

ఇంకెవరిమీద! నామీదే అరుస్తున్నది! చిన్నప్పట్నుంచి మధుబాబును చేతులమీద ఎత్తుకు పెంచాను! పెంచిన మమకారం తెంచుకోలేక యిల్లు వదలి వెళ్ళలేకపోతున్నాను! లేకపోతే యీమె అరుపులు, కేకలు పడివుండాల్సిన ఖర్మ నాకేం పట్టింది!"

అమ్మగారు నామీద కూడా వుత్తి పున్నేనికి అరుస్తుందక్కా! చెట్టుకు నీళ్ళుపోస్తే పోశావంటుంది! పోయకపోతే పోయలేదంటుంది! నిన్న నామీద అరిచినప్పుడే పని మానుకెళ్ళిపోదామనుకున్నా!"

"అరే పకీరూ! నువ్వు గూడ వెళ్ళిపోతే ఒక్కదాన్ని యీ మేడలో వుండలేనురా!"

అందుకేగదక్కా అమ్మగారు ఎంత అరిచినా, ఎన్ని తిట్టినా పడివుంటున్నది!ఎల్తే యిద్దరం కలిసే ఎల్దాం!"

"ఈ దిక్కుమాలిన దివాణంలో నాకు నువ్వు నీకు నేను తోడుగా వుంటున్నాం!వెళ్తే యిద్దరం వొక్కసారే వెళ్ళిపోదాం!" అంది రమణ పకీరయ్యతో మాట కలుపుతూ

'అడుగో అయ్యగారొచ్చారు!" అంటూ బయటకు పరుగెత్తాడు పకీరయ్య

మధు కారు దిగి లోపలకు వస్తూ "పకీరయ్యా రోజా అంట్లు చిగుళ్ళు వేసాయి! జాగ్రత్తగా నీళ్ళు పోయి సుమా!" అంటూ లోపలకు వెళ్ళేడు

"అలాగే బాబూ!" అంటూ మధు వెళ్ళిన వైపుగా చూస్తూ నిలబడ్డాడు

'బాబుగారు బంగారం!అమ్మగారు చీటికి మాటికి కసురుకుంటారనిగాపోతే యిక్కడ్నుంచెల్లాల్సినవసరం ఏవుంది? బతికున్నన్నాళ్ళు యీడ్నే బడుండొచ్చు!" అనుకున్నాడు పకీరు

మధు హాలులో కడుగెట్టగానే ఎదురయింది మయూరి

మయూరి! ఇవ్వాళ ఆశ్రమంలో చిద్రూపస్వామి ఉపన్యాసం వుంది వస్తావా?"

'ఉహూ! నేను రాను! నాకు తలనొప్పిగా వుంది!" ,

'తలనొప్పిగావుంటే డాక్టరుగారికి చూపించుకోకపోయావా?"

'నీరసంగా కళ్ళు తిరుగుతున్నట్టుంటే వెళ్ళలేకపోయాను!"

"అరే! అట్లాయితే డాక్టరుగారిని రమ్మని ఫోన్ చేస్తానుండు!"

"వద్దు! నేనే వెళతానులెండి!"

"సరే! వుండు డ్రైవర్‌ను గారేజినుండి కారు తెమ్మంటాను" అంటూ మేడ వెలుపలకు వచ్చి,

"కృష్ణా! అమ్మగారిని డాక్టరుగారి దగ్గరకు తీసుకు వెళ్ళాలి! కారు పోర్టికోలోకి తీసుకురా!" అన్నాడు బిగ్గరగా

డ్రైవర్ కృష్ణ మేడ ఆవరణలో వొకమూలనవున్న గారేజి దగ్గరకు వెళ్ళి ప్లిమత్‌కారు డ్రైవ్ చేసుకుని తెచ్చి పోర్టికోలో ఆపాడు

డ్రైవింగ్ సీటు నుండి దిగి వెనుక డోర్ తెరిచి పట్టుకుని నిల్చున్నాడు కృష్ణ

భర్తతో తలనొప్పి అని చెప్పిన మయూరి చకచక నడుచుకుంటూ వచ్చి కారులో కూర్చోగానే తలుపువేసి వెళ్ళి డ్రైవింగ్ వీల్ ముందు కూర్చున్నాడు కృష్ణ. మరుక్షణంలో నే తెల్లని ప్లిమత్‌కారు రాజహంసలా ముందుకు కదిలింది

"కృష్ణా! పబ్లిక్ గార్డెన్సు దగ్గరకు పోనీయ్" కృష్ణకు ప్లిమత్ కారంటే ప్రాణం కంటే ఎక్కువ అభిమానం! తెల్లని ప్లిమత్ కారుమీద ధూళి రేణువు కూడా పడకుండా ఎప్పుడూ నీట్‌గా వుంచుతాడు ప్లిమత్ కారులో అమ్మగార్ని ఎక్కించుకుని హాయిగా స్పీడుగా నడపడం ఎంతో యిష్టం అతనికి!

పబ్లిక్‌గార్డెన్స్ దగ్గర కారు దిగి లోపలకు నడిచి వెళ్ళింది మయూరి గుబురుగా పెరిగిన పొదరింటి నీడలో కూర్చుని కనులు మూసుకుంది!



## కలలుకనే కళ్ళు

పొదరింటి నీడలో కూర్చుని కలలు కనడం మయూరికి అలవాటే! మయూరికి ముందు వెనక అరడజనుమంది అప్ప చెల్లెళ్ళు వుండడంతో ఆమె విషయమై ఎక్కువ శ్రద్ధ తీసుకునే అవకాశం యిటు తండ్రికిగాని, అటు తల్లికిగాని లేకపోయేది! మయూరికి పన్నెండేళ్ల వయసప్పుడు జరి అంచు పట్టు పరికిణీ కట్టుకుని పట్టు జాకెట్ తొడుక్కోవాలని వుండేది!

"అమ్మా! ఎదురింటి కామాక్షి కట్టుకున్నట్లాంటి పట్టు పరికిణీ కుట్టించవూ?"

"అలాగే!" పరధ్యానంగా అంది తల్లి.

"పట్టు జాకెట్ గూడా కుట్టించు జడకు మంచి పట్టు రిబ్బను కూడా కావాలి!"

అప్పటికి మయూరి తల్లి పరధ్యానం వదలింది! "ఆసి భడవా! వేలెడు లేవు! నీ కెన్ని ఆలోచనలే! కామాక్షి తండ్రి లక్షాధికారి! పట్టు పరికిణీలు కట్టుకున్నా వంటినిండా నగలు దిగేసుకున్నా చెల్లుతుంది!

నీ తండ్రి పచారి షాపులో గుమాస్తా! నీకంటే పెద్దవాళ్ళు ముగ్గురు,

చిన్నవాళ్ళు ముగ్గురూ అప్పజెళ్ళెల్లున్నారు' కన్న కూతుళ్ళకు కడుపునిండా తిండి పెట్టలేని మీ అయ్య పట్టు పరికిణీలేం కుట్టిస్తాడే?" అమ్మ కసురుకోవడంతో బయటకు పరుగెత్తింది మయూరి.

ఎవరిమీద కోపం వచ్చినా పబ్లిక్ గార్డెన్సుకు పరుగెత్తుకు వచ్చి పొదరింటికింద కూర్చుని కలలు కనడం అలవాటయిపోయింది చాలా రోజులుగా!

పట్టు పరికిణీ, పట్టు జాకెట్ వేసుకుని ధగధగలాడే రవ్వల నగలు



## కలలుకనే కళ్ళు

పెట్టుకుని వుషారుగా తిరుగుతున్నది తను.

"నా బంగారు తల్లి అచ్చు లక్ష్మీదేవిలా వుంది!" దగ్గరకు తీసుకుని తల్లి ముద్దు పెట్టుకుంటూ వున్నది-ఆనందాతిశయంతో కనులు తెరిచింది మయూరి. తనుకంటున్నది పగటికల అని తెలియగానే మనసు క్షణం సేపు విలవిల లాడింది.

రెండు మూడు గజాల దూరంలో నిలబడి తన వంకే చూస్తున్నాడొకాయన. గిరజాల జుట్టూ, లాల్చీ, పైజమా ఆకర్ణాంత విశాల నేత్రాలు – క్షణం ఒకచోట నిలకడగా చూడలేని ఆ కళ్ళు పది నిముషాలుగా మయూరి ముఖాన్ని పరీక్షగా వీక్షిస్తున్నాయి.

"రత్నాల మొలకలాటి యీ అమ్మాయికి నాట్యం నేర్పితే? వికసించిన పద్మాల్లాంటి యీమె కనులు, బెదిరే లేడికూన కనులలా క్షణ క్షణం చలిస్తున్నాయి! క్షణంలో సంతోషం, ఆనందం, మరుక్షణంలో విచారం, క్షణం వివశత్వం మరుక్షణం విషాదం – సప్త వర్ణాలను ప్రతిఫలించే హరివిల్లులాటి యీమె చూపులు తెర ముందు కూర్చున్న ప్రేక్షకులను అలరించి మెస్మరైజ్ చేస్తాయి.

ఇంతవరకూ నాట్యాచార్యుడుగా అనేక మందికి శిక్షణ యిచ్చాను!

నాట్య భంగిమలను నేర్పగలిగానేగాని హావభావాలను కనుగొనలలో ప్రదర్శించగల నేర్పు ఎవరకూ అలవడలేదు!

ఈ అమ్మాయిని నా శిష్యురాలిగా జేసుకుని భరతనాట్యం నేర్పుతాను!" అనుకుంటూ నటరాజు వచ్చి మయూరి ముందు నిలబడ్డాడు.

"నీ పేరేంటమ్మా పాపా!" అతని గొంతులో వొలుకుతున్న కరుణ, మమత, ఆప్యాయతలకు మయూరి మనసు కరగిపోయింది.

కేవలం కలలలో తప్ప నిజ జీవితంలో ఆప్యాయత, ఆదరణ ఎరుగని మయూరి జీవితంలో మొదటిసారి ఒక చల్లని మాట విని ఆనందంతో పొంగిపోయింది! ఆనందాతిశయంతో కనులనుండి అవిరళంగా భాష్పధారలు రాలుతుండగా గద్గద కంఠంతో "మయూరి" అన్నది.

"మయూరి! ఎంత చక్కని పేరు! పాపా! నువు డాన్సు నేర్చుకుంటావా?"

జవాబుగా బావురుమని ఏడ్చింది మయూరి! మయూరిని అక్కున జేర్చుకుని వీపు నిమురుతూ,

"వూరుకోమ్మా! వూరుకో!" అన్నాడు నటరాజు.

"పట్టు పరికిణీ కుట్టించమంటే అమ్మ తిట్టింది!" వెక్కిళ్ళమధ్య చెప్పింది మయూరి

"ఏడవకమ్మా! మయూరి! నీకు మంచి పట్టు లంగా జాకెట్ కొనిపెడతాను పద!"

మయూరిని రెడీమేడ్ షాప్‌కు తీసుకువెళ్ళాడు నటరాజు. బంగారు జరీ వున్న పట్టు పరికిణీ, పట్టు జాకెట్ కొనిపెట్టాడు. రెడీమేడ్ షాపులో అద్దంలో తన రూపం చూసుకుని మురిసిపోయింది మయూరి!

ఎదురింటి కామాక్షి కట్టుకున్న పట్టు లంగా కంటే తన లంగా ఎక్కువ జరితో మెరిసిపోతూ బాగున్నది! మధ్యాన్నంపూట నీరసంతో అర్థాకలితో సొమ్మసిల్లి పడుకున్నప్పుడు వచ్చే కలలో కనిపించే రాకుమారిలా వున్నది తను! పక్కకు తిరిగింది మయూరి! పిరుదుల వరకు వచ్చిన జడ కనపడింది.

"మంచి రిబ్బన్ యివ్వవయ్యా!" నటరాజు మాటలు విని ఎర్ర రంగు రిబ్బన్ యిచ్చాడు షాపతను. జడకు ఎర్ర రిబ్బను కట్టుకుని జడ ముందుకు వేసుకుని అద్దంలో తన ప్రతిబింబం చూసుకున్న మయూరి కనులలో వ్యక్తమవుతున్న ఆనందాన్ని తృప్తిగా చూస్తూ, "పదమ్మా! ఇంటికి వెళదాం!" అన్నాడు నటరాజు.

టాక్సీలోంచి దిగుతున్న మయూరి వంక విస్తుపోయి చూస్తూ నిలబడింది తల్లి జగదంబ.

టాక్సీ దిగి ఎదురింటి కామాక్షిని చూడటానికి పరుగెత్తింది మయూరి!

## గడుసులోకం

—బాబు







మొదటిసారిగా కామాక్షి కనులలో కనపడుతున్న అసూయను తృప్తిదీరా చూస్తూ,

"కామాక్షీ! తొక్కుడుబిళ్ళ ఆట ఆడుదాం! రా!" కామాక్షికి తొక్కుడుబిళ్ళ ఆటమీదకు మనసు పోలేదు!

"మయూరీ! పట్టు లంగా జాకెట్ బలే బాగున్నయ్యే! ఎర్రటి శాటిన్ రిబ్బన్! ఎక్కడివే నీకు?"

"అదుగో! మామయ్య కొనియిచ్చాడు. నాకు డాన్సు నేర్పుతాడట!" చక్రాల్లా కళ్ళు తిప్పుతూ చెప్పింది మయూరి!

మయూరి వంక ఈర్ష్యగా చూస్తూ ముందుకడుగువేసి శాటిన్ రిబ్బన్ చేతితో పుచ్చుకోబోయింది కామాక్షి. గిరుక్కున వెనక్కి తిరిగి లేడికూనలా చెంగున గంతులు వేస్తూ వీధంతా తిరిగి వచ్చింది. ఇరుగు పొరుగు యిళ్ళల్లోని వాళ్ళ మాటలు మయూరికి అమితానందాన్నిచ్చాయి!

"ఎవరే ఆ పిల్ల!"

"ఇంకెవరు! జగదంబ కూతురు మయూరి!"

"ఆ పరికిణీ చూసావా! జానెడు వెడల్పున జరీ తళతళ మెరుస్తున్నది!"

"పిల్ల ఎంత అందంగా వుంది!"

"చందనం బొమ్మే అనుకో!"

"మయూరీ! ఇలారా! ఈ పరికిణీ ఎక్కడిది!"

జవాబు చెప్పకుండా పరుగెత్తుకు యింటికి వచ్చింది.

తల్లితో నటరాజు చెబుతున్న మాటలు వింటూ నిలబడిపోయింది.

"మీ అమ్మాయి ముఖంలో రాచ కళ వున్నది! హావ భావ ప్రదర్శన నాట్య విన్యాసాలు నేర్పిస్తే నాట్య మయూరి అవుతుంది! పెద్ద పెద్ద డాన్సర్లందరూ అమ్మాయి ముందు దిగదుడుపవుతారు."

"బాబుగారూ! పేదవాళ్ళం! గుట్టుగా సంసారం నెట్టుకొస్తున్నాం! మీబోటి మహారాజులవద్ద చదువు చెప్పించాలంటే మావల్ల అవుతుందా!"

"జగదాంబగారూ! మయూరిని చూచిన క్షణమే అనుకున్నాను! ఈ అమ్మాయిని నాట్యరాణిగా జేయాలని! మీరు నాకు కానీ యివ్వక్కర్లేదు!"

"బాబుగారూ! మీరు వూరికే పాఠాలు చెబుతారు! కాని!"

"ఏమిటమ్మా నీ సంకోచం!"

"పిల్లది ఎంబ్రాయిడ్రీ కుట్టి రోజుకు పది కరుకులు తెస్తుంటే యీ కరువు రోజుల్లో భారంగా కాలం వెళ్ళదీస్తున్నాం! మీరు వూరికే డాన్సు నేర్పించినా పిల్లదాన్ని పంపించటానికి వీల్లేదు!"

క్షణం విచలితుడై చూచాడు నటరాజు.

"ఏంజేస్తాం బాబూ! రెక్కాడితేగాని డొక్కాడదు! లేని సంసారం! చూడబోతే జింజాకానా పెద్దది!"

"జగదంబగారూ! డబ్బు కోసం మయూరి భవిష్యత్తు నాశనం జేస్తామంటారా?"

జగదాంబ బదులు పలుకలేదు.

"సరే! మయూరికి స్కాలర్‌షిప్ వచ్చే ఏర్పాటు చేస్తాను. నెలకు మూడు వందలు వస్తుంది!"

"అయ్యో! నా మతిమండా! బాబుగారిని నిలబెట్టే మాట్లాడుతున్నాను! అసే పెద్దా! కుర్చీ తెచ్చి వెయ్యవే! ఇంటికి పెద్దవాళ్ళొస్తే మర్యాద చేయటం తెలియదటే?" జగదాంబ హడావిడి చేసి వీధినంతా వొక కొలిక్కి తెచ్చింది.

పక్కింటినుండి పాలు, ఎదురింటి నుండి పంచదార ఎరువు తెచ్చి కాఫీ కాసి నటరాజుకి యిచ్చింది.

ఆరోజు నుండి మయూరి కనులలో దైన్యం, విచారం కనపడలేదు!

మయూరి ఆకర్ణాంత విశాల నేత్రాలలో ఏ భావం కావాలంటే ఆ భావం ప్రతిఫలించేది! లేత వయసు కావటంతో శరీరంలోని ప్రతి కీలు ప్రతి అవయవం ఎటు కావాలంటే అటు వంగిపోయేది!

రక రకాల నృత్య విన్యాసాలకు తగినట్లు నిరంతరం చలిస్తున్న కళ్ళతో రక రకాల భావాలు వయసును మించిన నేర్పుతో ప్రదర్శించేది మయూరి.

నెల నెల నటరాజు పంపుతున్న డబ్బుతో కుటుంబ ఖర్చులు జరిగిపోతుంటే జగదంబ మయూరిని సంతోషంగా డాన్స్ స్కూలుకు పంపేది!

ఎదురింటి కామాక్షితో సహా వీధిలో వున్న పిల్లలందరూ మయూరిని చూసి అసూయ పడేవారు!

"చేసుకున్నవారికి చేసుకున్నంత! నా బిడ్డ ఏ మహారాణి కడుపునో పుట్టాల్సింది! అసలది పుట్టినప్పుడే అంతా అన్నారు! లక్ష్మీదేవిలా వుంది ఏ జమిందారు పెళ్ళాడతాడో అని! నా బిడ్డను చూసి అసూయపడిన వాళ్ళంతా నాశనమైపోతారు!" అంటూ డాన్సు స్కూలు నుండి రాగానే మయూరికి దిష్టి తీసి వీధిలో పడవేసేది.

నటరాజువద్ద డాన్సు నేర్చుకుంటానని స్కూలుకి వచ్చింది కామాక్షి! రెండు రోజులయ్యేసరికి కాళ్ళు నొప్పులంటూ మానుకుంది.

మయూరికి మాత్రం డాన్స్ స్కూలే సర్వస్వం! నటరాజు గురుడు హితుడూ దైవం! నిర్భాగ్య జీవితానికి నిరంతరానంద జ్యోతి నాట్య సాధన నటరాజు మనసులోని విషయాన్ని ముందుగానే గ్రహించి నాట్య భంగిమలు ప్రదర్శించేది మయూరి!

"ఈ మయూరి నాట్య కళా విశారద అవటానికి ఎంతో సమయం పట్టదు! ఆంధ్రదేశం గర్వించదగ్గ కళాకారిణిగా రూపు దిద్దుతాను!" అనుకునేవాడు నటరాజు.

మయూరి పదహారోఏట అరంగేట్రం ఏర్పాటు చేసాడు నటరాజు. పండితులూ, పామరులూ 'ఓహో' అన్నారు. పత్రికలలో మంచి రివ్యూలొచ్చాయి.

"నర్తించే మయూరి కనులలో కనపడే సుందర స్వప్నాలను వీక్షిస్తుంటే ఒక అలౌకికానందానుభూతి కల్గుతుంది! పురి విప్పిన నెమలిలా నర్తించే నాట్యమయూరి సందర్శన భాగ్యంతో అలరించిన ప్రేక్షకులు జీవితమంతా గుర్తుంచుకోగల రసానుభూతిని మనసులో నిక్షిప్తంచేసికో

# కలలుకనే కళ్ళు

గల్గుతారు!ఆంధ్రదేశానికి నాట్య రాణిని అందించిన నటరాజు ధన్యుడు!" అని రాసిందో పత్రిక.

నటరాజుకు పేరు, జగదాంబకు డబ్బు సంపాదించి పెడుతూ రెండు సంవత్సరాలు ఆంధ్రదేశంలో పలుచోట్ల ప్రదర్శన లిచ్చింది మయూరి."

మయూరి ఏ పట్టణంలో నాట్య ప్రదర్శన యిచ్చినా ముందు వరసలో కూర్చుని తదేకంగా ఆమె నాట్యాన్ని చూస్తుండేవాడొక యువకుడు. సుందరరూపి అయిన ఆ యువకుడు ఒకరోజున నాట్య ప్రదర్శన అనంతరం ఒక తాగుబోతు మయూరిపై అఘాయిత్యం చేయబోతే అడ్డుపడ్డాడు. ఆ పరిచయం కొద్ది రోజులలోనే రెండు యువ హృదయాలను దగ్గరకు చేర్చింది. మయూరి మేఘవాహనుల ప్రేమ కొనసాగడానికి వీల్లేదని పేచీ పెట్టింది జగదంబ.

"ఏ జమిందారుల యింట్లోనో కోడలుగా అడుగు పెట్టాల్సిన నా బంగారు తల్లిని వలలో వేసుకోవాలనుకుంటున్నాడీ బుక్కా పకీరు వెధవ!" అని అతడు వినేట్లుగా పెద్దగా అన్నది.

మయూరి మేఘవాహనుల స్నేహం నటరాజుకి యిష్టం లేకపోయింది. భరతశాస్త్ర నిష్ణాతగా చేయాలనే ధ్యేయానికి ప్రేమ, వివాహం అడ్డు వస్తాయనే ఆలోచనతో శిష్యురాలి దగ్గరకు రావద్దని మేఘవాహనుడిని గట్టిగా మందలించాడాయన!

పబ్లిక్‌గార్డెన్సులో పొదరింటినీడన ఆఖరిసారిగా మేఘవాహనను కలుసుకొన్న సన్నివేశం గుర్తొచ్చింది మయూరికి! ఆరు సంవత్సరాలక్రితం జరిగినా యింకా క్షణం క్రితం జరిగినట్లు నిత్యనూతనంగా మనసులో మెదులుతూనే వున్నది!

"మయూరి! ఈ క్షణం నుండి నా జీవిత ధ్యేయం ఏమిటో తెలుసా?"

"ఏమిటి?"

"ఎలాగైనా డబ్బు సంపాదించి లక్షాధికారిని కావాలి! ఎందుకో తెలుసా?"

"ఎందుకు?"

"మేఘవాహనుడు లక్షాధికారి అని తెలిస్తే మీ అమ్మ మన ప్రేమకు అడ్డు పడదు!"

సమాధానంగా మయూరి కళ్ళ వెంట నీరు కారాయి. కుడి చేతి చూపుడు వేలుతో కనుగొలుకులనుండి కారుతున్న నీరు తుడుస్తూ "మయూరి!జీవితమంతా నీ సన్నిధిలో గడపాలంటే కొద్దికాలం ఎడబాటు తప్పదు! నేనెక్కడున్నా నా మనసునిండా నీ రూపమే వుంటుంది!" అన్నాడు.

అష్టాదశ వర్షప్రాయ, ముగ్ధ మోహనరూప అయిన మయూరి కన్నె మనసులో ఆరని చిచ్చురేపి కువైట్ వెళ్ళిపోయాడు మేఘవాహన.




జగదంబ, నటరాజు ఏ ప్రయోజన మాశించి మయూరి మేఘవాహనులను వేరు చేసారో అందుకు భిన్నంగా జరిగిందా తర్వాత.

మేఘవాహనునిపై లగ్నమైన మయూరి మనసు నటరాజు నాట్యపాఠాలపై మరల్చలేక పోయింది. హావభావ చంచద్విలసిత నేత్ర ద్వయంలో నిరాశ, నిర్వేదం గూడుకట్టుకొని కాపురం చేయసాగాయి. మెరపు తీగలా మెరసిపోతూ వివిధ నాట్య భంగిమలనూ ప్రదర్శించే నాట్య మయూరి శరీరం వడలిన తామరతూడులా మారిపోయింది.

మయూరి మనసులోని నిర్వేదం తొలగి పోతుందని నిరీక్షిస్తూ వుండిపోయాడు నటరాజు! రోజులు వారాలై వారాలు నెల లైనాయి! మయూరి మనసులో రగిలిన మూగవేదన అణగారి పోలేదు! మయూరి కాలి గజ్జెల సవ్వడి మరి వినపడలేదు! నటరాజు హతాశుడైనాడు! జగదంబ అరుపులుగాని కన్నీరుగాని మయూరిపై ప్రభావం చూపలేక పోయాయి.

ఆ సమయంలో పులిమీద పుట్రలా కువైట్ నుండి మేఘవాహనుని మరణ వార్త తెచ్చాడు నటరాజు స్నేహితుడు. అంతులేని మనోవేదనతో మయూరి కుమిలి పోయింది.

ఆ సమయంలో కోటీశ్వరుడైన మధు మయూరిని వివాహం చేసుకుంటానని వచ్చాడు.

శిలలా మూగబోయివున్న మయూరిని మధుని వివాహం చేసుకోమని పోరుకాడసాగింది జగదంబ.

"అమ్మా! మయూరి! పోయినవాళ్ళతో మనమూ పోలేంగదా!మేఘవాహనుడికి నీమీద వున్న ప్రేమ ఏపాటిదో పరిశీలిద్దామని ఆ రోజలా అన్నాను! దానివలన అతడు డబ్బు సంపాదిద్దామని దేశం కాని దేశం వెళ్తాడనీ అనుకోలేదు! వెళ్ళినవాడు అక్కడే హరీ మంటాడనీ అనుకోలేదు!

ఈ పాపం అంతా నాదేనే తల్లీ! నాదే! కాని యిప్పుడు మన సంసారం పరిస్థితి మళ్ళీ సున్నకు సున్న హళ్ళికి హళ్ళి అయింది! నా కోసం గాకపోయినా నీ చిన్ని చెల్లెళ్ళ కోసమైనా నువ్వు ఆ మధుబాబునువివాహం చేసుకో!

లక్షలకు వారసుడు! లేమి బాధనుండి మన కుటుంబం బయట పడాలంటే యింతకంటే మార్గంలేదే తల్లీ!

నీటముంచినా పాల ముంచినా నీదే భారం!" అంటూ ప్రాణాలు తీసింది!

మయూరి మాట్లాడలేదు! నటరాజు వచ్చాడు.

"అమ్మా! మయూరి! మేఘవాహనుడి మరణం నన్ను కుదిపి వేసింది!ఇప్పుడు నీ మనసెంత క్షోభపడుతుందో నేనర్థం చేసుకోగలను. కాలం ఎవరికోసం ఆగదు! బతికివున్నంత కాలం జీవిత ధర్మాన్ని పాటించి తీరాలి. మధు గుణవంతుడు, ఐశ్వర్యవంతుడు. నిన్ను పువ్వులో పెట్టి పూజిస్తాడు! అన్నిటికన్న ముఖ్యం మీ కుటుంబాన్ని ఆదుకుంటాడు!" అని చెప్పాడు.

శిలా విగ్రహంలా విని వూరుకుంది మయూరి! నటరాజు వెళ్ళిపోయాడు. ఆ రోజు రాత్రి జగదంబ పెరటిలోని నూతిలో దూకింది. అతికష్టం మీద యిరుగు పొరుగు వాళ్ళు ఆమెను వెలికితీసి ప్రాణాలు కాపాడారు. ఇంట్లోవాళ్ళు, ఇరుగు పొరుగువాళ్ళు జగదంబ ఆత్మహత్యా ప్రయత్నానికి మయూరి ప్రవర్తనే కారణం అని గొడవ చేసారు.

శిలలావున్న మయూరిలో చలనం వచ్చింది! తల్లి మంచం దగ్గరకు వచ్చి, "అమ్మా! నేను మధుబాబును వివాహం చేసుకొంటాను!" అని అంది.

జగదంబ నీరసం మాయమయింది!

"మా అమ్మే! మా తల్లే! మయూరి నా బంగారు కొండ!" అంటూ లేచి కూర్చుంది. పురోహితుడికి కబురంపింది! పెళ్ళి పనులు పురమాయించ సాగింది!

తర్వాత కొద్ది రోజులకే కుందనపు బొమ్మలావున్న మయూరి మెడలో తాళికట్టాడు మధు.

అల్లుడి దగ్గర్నుండి పెళ్ళి ఖర్చులకనీ వీటికనీ వాటికనీ డబ్బు వడుక్కుని ఆ తర్వాత మయూరిని అతని వెంట పంపింది జగదంబ!

మయూరి అత్తవారింటికి వచ్చింది! జగదంబ చెప్పినట్లు మధుకు ఏ లోటులేదు! పెద్ద మేడ, చుట్టూ ఆవరణ, జమీలాంటి ఆస్తి, తల్లి తండ్రి లేరు!

మయూరి నాట్యం చూసిన మధు ఆమెను వివాహం చేసుకోవాలను కొన్నాడు! చేసుకున్నాడు. ప్రాణం పోసుకున్న కుందనపు బొమ్మలాంటి నాట్య



# తిరుమల-తిరుపతి దేవస్థానము తిరుపతి

## తిరుమలలో వసతికి విరాళాల పథకాలు

కలియుగ వైకుంఠ తిరుమల శ్రీ వేంకటేశ్వరుని ఆవాసము, అనునిత్యం వేలాది భక్తులు ఈ క్షేత్ర దర్శనం చేసుకుంటున్నారు. రోజురోజుకు పెరిగే భక్తుల అవసరాలను తీర్చేందుకు తిరుమల తిరుపతి దేవస్థానములవారు విరాళాల పథకాల క్రింద ఫర్నీచరుతోకూడిన కాటేజీలను, సత్రాలను, అతిథి గృహాలను నిర్మిస్తోంది. వివిధ పథకాల వివరాలు ఈ క్రింద ఇవ్వబడినవి.

### గరుడాద్రి నగర్ కాటేజి పథకము

ఇందు 10 కాటేజీలను టి.టి.డి. నిర్మిస్తుంది. ఒక్కొక్క కాటేజీలో క్రింది అంతస్తులో 4 సూట్లు, మొదటి అంతస్తులో 4 సూట్లు వుంటాయి.

★ ప్రతి సూటులో 10'×12' హాలు, అటాచ్‌డ్ టాయిలెట్స్, కామన్ వరండా వుంటుంది.

★ విరాళాలు ఇచ్చేవారు రు 30,000 లు చెల్లిస్తే 320 చ.అ. ప్లింత్ ఏరియాగల సూట్ వారిపేరుతో నిర్మించబడుతుంది. రు 2.4 లక్షలు చెల్లించడంద్వారా 8 సూట్లుగల పూర్తి కాటేజినిగాని, రు. 1.2 లక్షలు చెల్లించడం ద్వారా 4 సూట్లుగాని, రు. 60,000 చెల్లించి 2 సూట్లుగాని తమ పేర్న నిర్మించుకొనవచ్చును.

### రామబగీచ అతిథి గృహం పథకం

ఆలయానికి వాయవ్య దిక్కుగా ఈ అతిథి గృహం నిర్మాణమవుతోంది.

★ ఇందులో 3 అంతస్థులు వుంటాయి. ప్రతి అంతస్థులో 50 సూట్లు, ఒక్కొక్కటి 14'×18' గదితో పాటు, కామన్ వరండా, 600 చ.అ. ప్లింత్ ఏరియాతో నిర్మాణం జరుగుతుంది.

★ ఒక్కొక్క సూట్‌కు రు. 60000 లు విరాళం చెల్లించాలి.

### సప్తగిరి ధర్మశాల

"సప్తగిరుల సత్రములు" పేరిట నిర్మించే ఈ బృహత్ నిర్మాణాన్ని రు. 8.5 కోట్లు అంచనాతో టి.టి.డి. చేపట్టింది. ఇందు ఒక్కొక్క సూట్ రు. 80,000 లు అంచనా వేయబడింది. ఇందులో సగం అంటే రు. 40,000 లు చెల్లించే దాతపేర్న సూట్ నిర్మించబడుతుంది.

### ప్రయోజనాలు

★ దాతల ఉదారానికి ప్రతిఫలంగా సంవత్సరంలో వారికి 60 రోజులు ఆయా కాటేజి/సూట్‌లలో నివసించేందుకు అవకాశం కల్పించబడుతుంది.

★ సంస్థల విషయంలోను, పెద్ద కంపెనీల విషయంలోను ఈ సదుపాయం 15 సంవత్సరాలవరకే పరిమితం చేయబడింది.

★ అలాట్‌మెంటు విషయంలో దాతల బంధుమిత్రాదులకు ప్రాధాన్యత చూపబడుతుంది.

★ ప్రతి సూట్/కాటేజి ముందు దాతల పేర్లుగల ఫలకాన్ని ప్రముఖంగా ప్రదర్శించడం జరుగుతుంది.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, టి.టి. దేవస్థానములు వారిపేర్న డ్రా చేసిన డిమాండు డ్రాఫ్టులతో సహా మీ ఉత్తరాలను ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ - V, తిరుమలవారికి పంపవచ్చును.

**"ఉన్నదానిలో కొంత ఖర్చుపెట్టుకో - అంతులేని దైవకృపను సాధించుకో!"**

ఇతర వివరాలకు :

**ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, టి.టి. దేవస్థానములు, తిరుపతి వారిని సంప్రదించండి.**

**ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్.**

## కలలుకనే కళ్ళు

మయూరిని వివాహం చేసుకున్నాడు! పద్మం బురదలో పుడుతుంది! మయూరి కుటుంబం ముఖ్యంగా జగదంబ లేనితనం రోత పుట్టించినా జగదేకసుందరి మయూరిని కన్న తల్లిగా ఆమెను సహించి వూరుకున్నాడు.

జగదంబకు వుషారు హెచ్చింది బంగారు గుడ్లు పెట్టే బాతులాటి అల్లుడు దొరికాడు!

"అమ్మాయిని చూడందే వుండలేనల్లుడు గారూ! అందుకే యింటి దగ్గర పనులు వున్నా పరుగెత్తుకు వచ్చా!" అంది అల్లుడింటికి వచ్చిన జగదంబ

"కబురంపితే కారు పంపేవాడ్ని కదా! బస్సులో వచ్చారా?" అన్నాడు మధు

"నా బాబే! నా తండ్రే! కొండంత అండగా నువ్వుండగా యిక నాకేం లోటు నాయనా!" అంటూ సోఫాలో కూర్చుంది జగదంబ

మేడమీద నుండి దిగివచ్చిన మయూరి నిర్లిప్తంగా తల్లి ముందు నిల్చుంది

జగదంబ దిగ్గున లేచి వచ్చి మయూరి తల నిమురుతూ, "నా తల్లి బంగారు కొండ, రతనాల రాశి, ముత్యాల మూట! అంటూ ఆప్యాయత వొలకబోయసాగింది

"నువ్విక్కడ కెందు కొచ్చావ్?" కర్కశంగా వున్న మయూరి గొంతు విని రెండడుగులు వెనక్కు వేసింది జగదంబ

క్షణం సేపుండి తెప్పరిల్లుకుని, "అదేమిటే అలా అంటావు? ఇక్కడి కెందు కొస్తాను? నిన్ను చూట్టానికి!" అంది

"చూసావుగా! ఇక వెళ్ళు!" అంది మయూరి.

"మయూరి!" మందలింపుగా పిలిచాడు మధు

కాని అతని పిలుపులోని మందలింపు సరకుగొనే స్థితిలో లేదు మయూరి!

"ఊఁ! ఇంకా నిలబడ్డావేం? పద?" గర్జించింది తల్లిమీద

కూతురు కోప్పడ్డ దానికంటే అది అల్లుడు చూసాడన్న బాధ ఎక్కువ కుంగదీసింది జగదంబను.

"అయ్యో! అయ్యో! అడ్డాలనాడు బిడ్డలుగాని ఎదిగొచ్చాక కాదు అంటారు!కని, పెంచి, పెద్ద చేసి పెళ్ళి చేసి నీ ముచ్చట చూద్దామని యింటికి వచ్చిన తల్లిని పరాభవం చేస్తావా? ఇది నీకు న్యాయమేనా?" ముక్కు చీదుతూ అడిగింది జగదంబ

"అమ్మా! నువ్వు ప్రతిదీ రూపాయలు పైసలు రూపంతో ఆలోచిస్తావు! నన్ను కని పెంచినందుకు ప్రతిఫలంగా అల్లుడిగారి దగ్గర్నుండి కావాల్సినంత డబ్బు తీసుకున్నావు! ఏదైనా వస్తువును అమ్మివేసాక దాని మీద హక్కును కోల్పోతావు అన్న విషయం గుర్తులేదా నీకు?"

"అమ్మో! ఎంత మాటన్నావే తల్లీ! కన్న ప్రేమ తెంచుకోలేక యింత దూరం వచ్చానుగాని గతిలేక నీ యింటికి రాలేదు! లక్షాధికారవగానే మిడిసిపాటు. పనికిరాదు! డబ్బు శాశ్వత మనుకున్నావా? ఇవ్వాళ వుంటుంది రేపు పోతుంది! అయినవాళ్ళను పోగొట్టుకుంటే తరువాత అనుభవించాల్సి వస్తుంది!"

"అమ్మా! నీకింత వైరాగ్యం ఎప్పుడొచ్చిందే?" అని, "కృష్ణా! అమ్మగారిని తీసుకువెళ్ళి ఇంటి దగ్గర దింపిరా!" అని డ్రైవర్‌ను కేక వేసి చెప్పింది

ఏడుస్తూ, రుసరుసలాడుతూ తుమ్ముతూ చీదుతూ శాపనార్థాలు పెడుతూ యింట్లోంచి వెళ్ళిపోయింది జగదంబ!

ఆమె తర్వాత మళ్ళీ కూతురు యింటి ఛాయలకు రాలేదు

"మయూరీ! ఆమెను ఎందుకలా అవమానపరచి పంపావు?" అని అడిగాడు మధు

సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయింది మయూరి!

"ప్రాణంవున్న బంగారు బొమ్మను వివాహం చేసుకున్నాను!" అనుకున్నాడు మధు. 'బ్రహ్మదేవుడు సర్వాంగసుందరి అయిన అద్భుత రూపాన్ని సృష్టించాడు. సుందర సుమధుర సుమనోజ్ఞ సురభిళ రూపానికి ప్రాణం పోసాడు! కాని ప్రాణం పోయబోయే ముందు రూపంలో మనసును ప్రతిష్ఠించాలన్న సంగతి

మరచిపోయాడు!"

"మయూరికి మనసులేదని అనుకోవడ మెందుకు? ఆమె మనసులో ఏదయినా తీరని కోరిక బాధ పెడుతుందేమో?" మయూరి మనసు తరచి చూడాలని విశ్వ ప్రయత్నమూ చేసాడు మధు! ఏమి అడిగినా నిర్లిప్తతే సమాధానంగా మూగనోము పట్టిన మయూరికి సన్నిహితం కాలేక పోయాడు

సహనశీలి సాధువర్తనుడు అయిన మధు మారు మాటాడకుండా మయూరి సహజీవన సౌభాగ్యమే వరంగా భావించి కాలం గడుపసాగాడు.

మయూరి మాత్రం ఏమాత్రం అవకాశం దొరికినా ప్లిమత్‌కారులో పబ్లిక్ గార్డెన్సులో ని పొదరింటిలో కూర్చుని కాలం గడపటం నేర్చుకుంది

వివాహమై ఆరు సంవత్సరాలయినా అమె ప్రవర్తనలో మార్పు రాలేదు!

పొదరింటిలో కూర్చున్నంతసేపూ మేఘవాహన తదేకంగా తనవంక చూస్తున్నట్లు, పరవశించిన అతని కనుల నుండి వెలువడ్డ చూపులు మన్మథుని బాణాల్లా తన శరీరం అపాదమస్తకం తూట్లు పొడుస్తున్నట్లు మధురానుభూతులకు లోనయ్యేది

మయూరి!" మేఘవాహనుని పిలుపు విన్నట్లు మనోవిభ్రాంతి కల్గగానే మనసు అనంద లోకాలలో విహంగంలా విహరిస్తుండేది!

మేఘవాహన కువైట్ వెళ్ళి ఆరేళ్ళు దాటిపోయింది! కాని పొదరింటి దగ్గర కూర్చుని వున్నప్పుడు మయూరి మనసులో అతని ఆలోచనలు సజీవ దృశ్యాలుగా మెదులుతూనేవున్నా యింకా!

మధుతో తలనొప్పిగా వున్నదని చెప్పి కారులో వచ్చిన మయూరి ఆ రోజు కూడా పొదరింటి కింద కూర్చుని కనులు మూసుకుని మేఘవాహన గూర్చి ఆలోచిస్తూ వుండిపోయింది

"మయూరి!"

తనను అంత ప్రేమగా సంబోధించగల స్వతంత్రం యీ ప్రపంచంలో వొకే వొకరికి వున్నది! వళ్ళంతా పులకింతలతో నిండిపోగా తుళ్ళిపడి కనులు తెరిచింది!

ఎదురుగా మేఘవాహన నిలబడి వున్నాడు!

కలకాదు గదా? కలలు కనీ కనీ కళ్ళు భ్రాంతి చెందటం లేదు గదా?

'మయూరి!" అత్యంత మధురమైన మేఘవాహన పిలుపు మరలా వినపడింది చివాలున లేచింది మయూరి

"మేఘవాహనా!"

"మయూరి!"

చేతులు చాచిన మేఘవాహన కౌగిటిలో గువ్వలా వొదిగిపోయింది మయూరి.

ఆనందాతిశయంతో మాటలురాని మూగదయి పోయింది.

"మయూరి! నీ కోసం యీ ఆరేళ్ళు ఎన్ని కష్టాలు పడ్డానో తెలుసా?"

చివాలున తల ఎత్తి చూచింది మయూరి మయూరి కనుగొలుకుల నుండి జాలువారుతున్న అనంద భాష్పాలను విలోకిస్తూ

"కలలు కనే నీ కళ్ళనుండి కన్నీరు జాలువారడమా?"

"మేఘవాహనా! నువ్వు! . నువ్వు .. బతికే వున్నావా?"

"మయూరి! ఏమిటి నువ్వనేది? ఇన్నేళ్ళుగా నీకోసం తపించి క్షణమొక యుగంగా దుర్భర విరహయాతన ననుభవించి వచ్చిన నన్ను "బతికి వున్నావా?" అని అడుగుతున్నావా?"

"కువైట్ జేరిన పది రోజులకే కారు ఏక్సిడెంట్‌లో నువ్వు మరణించావని చెప్పారు?"

"ఓ! అదా? కారు ఏక్సిడెంటయిన మాట నిజమే! కాని నేను మరణించ లేదు! డాక్టర్లు ఆశ వదులుకున్నారు కూడాను! నెల రోజులు అపస్మారక స్థితిలో వుండి చివరకు కోలుకుని మామూలు మనిషి నయ్యాను! ఒక అరబ్‌షేక్ కంపెనీలో గుమాస్తాగా జేరి క్రమంగా బాస్ అభిమానానికి పాత్రుడనయ్యాను! లక్షాధికారిగా భారతదేశం తిరిగి వస్తానన్న నేను కోటీశ్వరుడ నైనాను! వారం రోజుల క్రితం మొదటిసారి నా కరుణామయ జీవిత గాథను మా బాస్‌కు తెలియ జేసాను!

"కోరుకుంటే కావాల్సినంత మంది పడతులు దొరికే దేశంలో ఒక ఆడపిల్ల జ్ఞాపకాలతో ఆరేళ్ళు జీవితం గడిపావా? ఎంత విచిత్రం! వెంటనే మీ దేశం వెళ్ళి నీవు మనసుపడిన పడతిని వివాహమాడి తిరిగి సతీసమేతంగా కువైట్‌రా!" అని అన్నాడు బాస్

ఆ తర్వాత భారతదేశం వచ్చే మొదటి ఫ్లైట్‌లో టికెట్ కొనుక్కొని వచ్చేసాను!

ముందుగా మీ యింటికి వద్దామనుకున్నాను! కాని ఎందుకో నాకు పబ్లిక్‌గార్డెన్స్‌లో పొదరింటి కింద నీవు నాకోసం నిరీక్షిస్తూ వుంటావని పించింది!

నా వూహను నిజం చేసావు నువ్వు!"

'మరి నువ్వు యిన్నాళ్ళూ నీ క్షేమ సమాచారాలు నా కెందుకు తెలియజేయలేదు?"

"మయూరి! నీవు జవాబు రాయకపోయినా నేను నీకు వుత్తరాలు రాస్తూనే వున్నాను! నీకవి అందలేదా?"

'ఏ అడ్రసుకు వుత్తరాలు రాసావు?"

'ఇంకే అడ్రసుకు! మీ యింటి అడ్రసుకు!"

'అమ్మ నాకొక వుత్తరమూ పంపలేదు!"

'అదేమిటి మయూరి! నువ్వు ఎక్కడ వుంటున్నా విప్పుడు? అమ్మ వుత్తరం

# ఉగాది వెళ్ళిపోతూంది!

ఉగాది వచ్చేసిందనీ వసంతాన్ని తెచ్చేసిందని
కవులంతా గొంతులు చించుకుని
కవితాగానం చేస్తున్నారు! కమ్మగా ఊదరకొట్టేస్తున్నారు!
అయినా అదేం ఖర్మమో
జనం పెడచెవిని పెట్టేస్తున్నారు, ఎడం చేత్తో ఆసింటా నెట్టేస్తున్నారు!
మరే!– ఉగాది వస్తే ఎవడిక్కావాలి?
వసంతం తెస్తే ఎవడిక్కావాలి?

పువ్వుల్ని పిండి అత్తరులో దోగి
నవ్వుల్ని పిండి నెత్తురు తాగి
కరెన్సీ మేడల్లో ఖరీదైన భోగాల్లో జోగేవాడికి
ఉగాది రాకపోతేనేం? వసంతం తేకపోతేనేం?

తెల్లచొక్కా కింద కుళ్ళిన బ్రతుకును దాచుకుంటూ
ఫైళ్ళూ జీతం రాళ్ళూ జాగ్రత్తగా లెక్కించుకుంటూ
ఆఫీసుకీ ఇంటికీ ఆసులో గొట్టంలా పరుగు లెత్తే వాడికి
శిశిరం ఎప్పుడు పోతేనేం? వసంతం ఎప్పుడు వస్తేనేం?

కండలు కరిగించి గంజినీళ్ళు కొనుక్కుంటూ
లాటరీ టిక్కెట్లలో అదృష్టాన్ని వెదుక్కుంటూ
సారానిషాలో సమస్యల్ని దాటేద్దామనుకుంటూ
సతమతమౌతున్న సామాన్యుడికి
ఉగాది ఊసులెందుకు? వసంత వర్ణన లెందుకు?

ఆరాటాన్ని పూరుగా తాగి, ఆశలతో నే కడుపు నింపు కుని
అవసరాల ఇరుకు గదిలో అవివేకపు ముసుగు బిగించి
స్వార్థంతో మునగ దీసుకున్న మానవుణ్ణి చూచి
నిండుగా కాచిన గున్న మామిడి నిట్టూర్చి తలవంచుకుంది!
నిలు వెల్లా పూచిన సిరిమల్లె
మంచు బొట్లు కన్నీరుగా విడిచింది!
వసంత రాగం కాసింత ఆపి కోయిల జాలిగా కూసింది!
ఎవరికీ పట్టని వెర్రి మొహం ఉగాది
వసంతాన్ని వదిలేసి రుసరుసా వెళ్ళిపోతోంది!

–వేదాంతం శరచ్చంద్రబాబు

# కలలుకనే కళ్ళు

సంపలేచంటున్నావు?"

"మేఘవాహనా! నీవింత సేపట్నుంచి నా అలంకరణలో వచ్చిన మార్పు చూడలేదా?"

మేఘవాహన మయూరి మెడలోని నల్లపూసల గొలుసును, కాలి వేళ్ళకున్న మెట్టెలను చూచి ఎలుగెత్తి–

"మయూరి! ఎంత పని చేసావు మయూరి!" అన్నాడు. బదులుగా నెమ్మదిగా చతికలబడి పోయింది మయూరి. గద్గద కంఠంతో జరిగిన విషయాలు చెప్పింది.

"మయూరి! నువ్వు చెబుతున్నది కట్టుకథ అని చెప్పు మయూరి!" భోరున పసిపిల్లవాడిలా ఏడుస్తూ అడిగాడు.

నిర్లిప్తంగా అతనివంక చూస్తూ వుండిపోయింది మయూరి! అరగంట వున్నాక లేచి నిలబడి, "వస్తాను మేఘవాహనా! ఇవ్వాళ యింటికి గెస్ట్స్ వస్తున్నారు! భోజనపు ఏర్పాట్లు చూడాలి!" అంటూ అడుగడుగుకూ వెనుదిరిగి చూస్తూ వెళ్ళిపోయింది.

మయూరి వెళ్ళిపోయాక ప్రాణంలేని కట్టెలా వుండిపోయాడు మేఘవాహన.

* * * *

"రామ్మా మయూరి! రా! తల నొప్పి తగ్గిందా? డాక్టరు గారేమన్నారు?" మయూరి కారు నుండి దిగుతుండగానే ఎదురొచ్చి అడిగాడు శేషగిరి.

"చల్లగాలికి కాసేపు పబ్లిక్‌గార్డెన్సులో తిరిగి వచ్చాను. తలనొప్పి కొంచెం తగ్గింది!" అంటూ లోపలకు వచ్చింది మయూరి.

"బాగున్నావా అక్కా?" అంటూ పలుకరించింది సోఫాలో కూర్చున్న లతిక.

"బాగున్నావా లతికా?" అంటూ వంట గదిలోకి వెళ్ళి భోజనపు ఏర్పాట్ల గూర్చి రమణతో చెప్ప వచ్చింది మయూరి.

మధు మేనమామ శేషగిరి. అతని కూతురు లతిక. మయూరికి భర్త తరపు బంధువులు వాళ్ళిద్దరే! కలుపుగోలుగా పలుకరించే శేషగిరి అన్నా, అమాయకురాలు లతికఅన్నా మయూరి మనసులో సద్భావం వున్నది. "మధు జీవితంలో నేను తారసపడక పోయినట్లయితే మధు ఇల్లాలుగా యీ యింట్లో వుండేది లతిక!" అన్నభావం మనసులో మెదిలి మయూరి మనసు ఆర్ద్రమయ్యేది.

డైనింగ్ టేబిల్ దగ్గర జోక్స్ వేసి అందర్నీ నవ్విస్తున్న శేషగిరి మయూరి ముఖం వింత తేజస్సుతో వెలిగి పోతుండటం ఆమె ఆకర్ణాంత విశాల నయనాలలో ఏదో అలౌకికానందానుభూతి గోచరించడం గమనించాడు

* * * *

భోజనాలయినాక మధు, మయూరి, లతిక ఎవరి గదులలోకి వాళ్ళు వెళ్ళి పడుకున్నారు! లంక పొగాకు చుట్ట కాలుస్తూ శేషగిరి వంట యింట్లోకి వెళ్ళాడు.

"ఏం రమణమ్మా! బాగున్నావా?" ఆప్యాయంగా శేషగిరి పలుకరించే సరికి రమణమ్మ ముఖం చింకి చాటంత చేసుకుని–

"రండి బాబుగారూ! రండి! కూర్చోండి!" అంటూ స్టూలు చూపింది. శేషగిరి స్టూలుమీద సర్దుకు కూర్చుని–

"ఆఁ! ఏమిటి విశేషాలు!" అని అడిగాడు మళ్ళీ!

"ఏం చెప్పమంటావు బాబూ! చిన్నప్పట్నుంచీ పెంచిన మమకారం వల్ల మధుబాబును వదలి వెళ్ళలేక పోతున్నా! లేకపోతే ఆ మయూరమ్మ విసుర్లూ కసుర్లూ పడుతూ యిక్కడ పడివుంటానా?"

"అదేమిటి రమణమ్మా! పెద్ద దానివి! తల్లిలాంటి దానివి! నీమీద అరుస్తుందా?"

"అయ్యో! నేనొక లెక్కా! చాకలి బట్టలు విదిలించినట్లు విదిలించి పారేస్తుంది! బాబునిమట్టుకు లెక్క జేస్తుందనా? ఎడముఖం పెడముఖంగా వుంటం తప్ప ప్రేమగా మాట్లాడుతుందనుకున్నారా?"

"నిజంగానా?"

"ఒట్టు! నీ తోడు! నీకు అబద్ధం చెబుతాననుకున్నావా శేషగిరి బాబూ! కుక్కని సింహాసనం మీద కూర్చోబెడితే ఏం జేస్తుంది?"

"ఆఁ! మరి అంత అధ్వాన్నంగా వుందా పరిస్థితి?"

"అవును బాబూ! అయినా మధు బాబు చక్కగా లతికమ్మను వివాహం జేసుకుని వుంటే హాయిగా కాపురం జేసుకుంటూ వుండేవాడు! చూడ ముచ్చటగా వుండేది!" మూతి మూడు వంకరులు తిప్పుతూ అంది రమణమ్మ.

"ఇప్పుడు మాత్రం ఏం తక్కువయిందంటావు! ఏరి కోరి అందమైన అమ్మాయిని చేసుకున్నాడు!"

"హయ్యో! అందంగా వుంటే సరిపోయిందా! బుద్ధి ఎక్కడ తెద్దాం!" అంటూ రెండు చేతులూ తలవైపు పోనిచ్చి మెటికలు విరిచింది.

శేషగిరి రెచ్చిపోతున్న రమణమ్మను యింకా రెచ్చగొట్టటానికి "ఏమో రమణమ్మా! నువ్వు చెప్పే మాటలు నమ్మలేక పోతున్నాను!" అన్నాడు

"నువ్వు సత్తెకాలపు మనిషివి గనుక నమ్మలేవు! ఎంతెంత ఘోరాలు జరుగుతున్నయ్యో నీకేం తెలుసు?" అంది దీర్ఘాలు తీస్తూ.

"ఘోరాలేమిటమ్మా?" అన్నాడు ఆశ్చర్యపడిపోతున్నట్లు ముఖం పెట్టి

అటూ యిటూ చూసి ఎవరూ లేరని నిర్ధారించుకుని, "ఇంటి దగ్గర మధుబాబు ఏలిస్తేనే పలకదా– యిందాక పబ్లిక్‌గార్డెన్స్‌లో మయూరమ్మ 'ఎవరో వొకతన్ని కావిలించుకుని ఒకటే యికయిక పకపకనంట' డ్రైవర్ కృష్ణ చెప్పాడు.

ఆస్తికోసం మధుబాబుని చేసుకుంది! ముచ్చటలు తీరటానికి మరొకడున్నాడు! ఇట్లాంటి వ్యవహారమేదో వుందని యిన్నాళ్ళ నుంచి చూస్తున్నాను! ఆఖరికి విషయం యివ్వాళ బయటపడింది!" రహస్యంగా మంత్రోపదేశం చేస్తున్నట్లు చెవిలో చెప్పింది.

"తలనొప్పిగా వుంటే పబ్లిక్‌గార్డెన్సుకు వెళ్ళానందే!"

"అలా చెప్పక నిజం చెబుతుందా బాబూ? ఈ విషయం నీ కడుపులో వుంచుకో! బయటకు వస్తే నా మీద మండి పడుతుంది!"

అలాగే అన్నట్లు తలూపుతూ వెళ్ళిపోబోయాడు శేషగిరి....

"బాబూ! నీకు నా మాటమీద నమ్మకం లేకపోతే యీసారి మయూరమ్మ పబ్లిక్‌గార్డెన్స్‌కు వెళ్ళగానే వెంబడే నువ్వూ వెళ్ళి దూరంగా వుండి చూడు! నిజం నీకే తెలుస్తుంది!" అంది నెమ్మదిగా రమణమ్మ.

శేషగిరి ఆలోచనలో పడిపోయాడు!

రమణమ్మ చెప్పినట్లు చేయాలనే నిర్ణయించుకున్నాడతను చివరకు!

ఆ రోజు సాయంత్రం మయూరి ప్లిమత్‌కారులో బయటకు వెళ్ళడం చూడగానే దూదిగోతాం లాంటి వళ్ళు అదిరిపోయేలా పరిగెత్తుకు వెళ్ళి వీధి మొగదలనున్న టాక్సి ఎక్కి ప్లిమత్‌కారును వెంబడించి వెళ్ళాడు శేషగిరి.

మయూరి ప్లిమత్‌కారు దిగి పబ్లిక్‌గార్డెన్సులోని పొదరింటి దగ్గరకు వెళ్ళడం గమనించి తనూ నెమ్మదిగా చెట్లచాటుగా ఆ ప్రదేశానికి వెళ్ళాడు.





# వోల్టాస్ లాంటి మరొక రిఫ్రిజిరేటర్ కోసం వెదకిచూడండిక...

## లోకంలో సగం చుట్టూ తిరిగిరావల్సొస్తుందిక.

రిఫ్రిజిరేటర్ల సంగతెత్తితే, మీరు వోల్టాస్ కొనడం అన్నిటికన్నా మంచిదిక. మిగతా రిఫ్రిజిరేటర్లన్నీ కలిసికూడా దీనికిగల అంతర్జాతీయ స్థాయికిగాని, ప్రత్యేక లక్షణాలతోగాని, లాభాలతోగాని సరితూగలేవు మరి.

కేవలం వోల్టాస్ 165 లీటర్ల రిఫ్రిజిరేటర్లోనే పూర్తి తీరులో గల ఆటోమేటిక్ డీఫ్రాస్టింగ్ సిస్టమ్ వుంది. అలా డీఫ్రాస్ట్ అయిపోయిన నీళ్ళు వాటంతట అవే ఆరిపోతాయి.

వోల్టాస్ రిఫ్రిజిరేటర్ చూడటానికైతే నాజూకుగా అలా సన్నగావుంటుంది గాని, నిజానికి లోపలగనక చూస్తే, కావలసినంత విశాలంగా వుంటుంది— యీ పొందిక పాలియురేథీన్ ఫోమ్ ఇన్సులేషన్ వల్ల వచ్చింది. దాంతోబాటే యిది కీటకాలను ఏమాత్రం పెరగనివ్వదు, దరికి చేరనివ్వదిది.

వోల్టాస్ యొక్క ఏ బీ ఎస్ కేబినెట్, డోర్ లైనర్లూ. దృఢమైన, గీతలు పడకుండా వుండేలావుంచే పదార్ధంతో చేయబడ్డాయి.

వోల్టాస్ రిఫ్రిజిరేటర్, అధునికమైన పొడరు కోటింగు ప్రక్రియతో పెయింట్ చేయబడింది, ఇది తుప్పు పట్టదు, పెకుల్కూడదు, పాలిపోదు.

వోల్టాస్ 165 లీటర్ల రిఫ్రిజిరేటర్, మీరు ఎంచుకోగల రంగుల్లో దొరుకుతుంది.

300 లీటర్ల డబుల్ డోర్ మోడల్, అంతర్జాతీయ స్థాయీ, హోదాకి చెందిన రిఫ్రిజిరేటరు.

వోల్టాస్ యొక్క శక్తివంతమైన కంప్రెసర్‌కి ఏడేళ్ళ గ్యారంటీవుంది.

వోల్టాస్ రిఫ్రిజిరేటర్. దీనికి మరేదీ సాటిలేదిక.








అన్నింటికన్నా మేలైనదే కావాలనుకుంటే.

ULKA-VR-101-86 TEL

# కలలుకనే కళ్ళు

"మేఘవాహన! నువ్వెప్పుడు వచ్చావు?"

"ఎప్పుడు రావటం ఏమిటి? నేనస లిక్కడి నుండి వెళ్ళలేదు!"

"పొద్దుటి నుండి యిక్కడే వున్నావా?"

"హోటల్‌కు వెళ్ళటానికి అక్కడ ఏముంది? ఈ పొదరింటి కింద కూర్చుని వుంటే నీతో గడపిన మధుర క్షణాల జ్ఞాపకాలతో కాలక్షేపం జరుగుతున్నది!"

"మరి భోజనం?.... ఉండు యిప్పుడే వస్తాను!" అంటూ మయూరి పరుగెత్తుకు కారు దగ్గరకు వెళ్ళింది. కారులో బజారుకు వెళ్ళి కమలా పండ్లు బిస్కెట్ పాకెట్లు తీసుకుని తిరిగి వచ్చింది.

తన చేతులతో బిస్కెట్లు, పళ్ళు మేఘవాహనకు తినిపించింది!

* * * *

పోలరాయిడ్ కెమెరాతో మయూరి మేఘవాహనులను ఫోటోలు తీసిన శేషగిరి మనసులో ఒక ఆలోచన పుట్టి క్షణాలలో పెరిగి పెద్దది అయింది.

"గతం గతః" అని మేనల్లుడు మధు మయూరిని వివాహం చేసుకున్నప్పుడు, ఆ వివాహం తన కిష్టం లేకపోయినా, తనకు యుక్త వయసు వచ్చిన కూతురువున్నా చూస్తూ వూరుకున్నాడు! ఆరు సంవత్సరాలుగా మధు మయూరితో గడుపుతున్న సంసార జీవితం తీరు తెన్నులు చూచి చూడనట్లుగా వూరుకున్నాడు! కట్టుకున్న భర్త వుండగా పబ్లిగ్గా మయూరి పర పురుషుడితో ప్రేమసల్లాపాలు సలుపుతుంటే చూచి వూరుకునే చవటకాదు శేషగిరి అనుకుంటూ పబ్లిక్‌గార్డెన్స్ బయటకు వెళ్ళాడు.

పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుండి "టైగర్ సూరి"కి ఫోన్ చేసాడు.

"టైగర్ సూరిగారేనా మాట్లాడేది?"

"యస్! స్పీకింగ్!"

"నేను శేషగిరిని మాట్లాడుతున్నాను! అర్జంటుగా మీతో పని పడింది! ఇప్పుడు మీ అపార్టుమెంట్‌కు రావచ్చా?"

"ఓ! తప్పకుండా రావచ్చు!" అని ఫోన్ పెట్టేసాడు టైగర్! మనిషిని నామ రూపం లేకుండా చేయాలన్నా, వంట్లోవున్న కొళ్ళు విరిచి వేయాలన్నా రౌడీ సూరికంటే సమర్థుడు మరి దొరకడు. అయితే స్పెన్సర్ రేట్లు వసూలు చేస్తాడు.

ఇరవైకి పైగా మర్డర్లు చేసి పోలీసు రికార్డులోకి ఎక్కకుండా తప్పించుకోవటానికి అతను బడా స్మగ్లర్ శంకర్ మేనల్లుడవటం కారణం! అప్పజెప్పిన పనిని చూచా తప్పకుండా అమలు చేస్తాడనే ప్రతీతి వున్నదతనికి.

సూరి అపార్టుమెంట్ తలుపు తట్టాడు శేషగిరి. పాతిక సంవత్సరాల పడుచుపిల్ల వచ్చి తలుపు తెరిచింది.

"నా పేరు శేషగిరి! సూరిగారితో పని వుంది!" అన్నాడు శేషగిరి వినయంగా!

"రండి!" అంటూ లోపలకు తప్పుకుని శేషగిరి లోపలకు వెళ్ళటానికి దారి యిచ్చింది. అతను లోపలకు వెళ్ళగానే తలుపు తాళం వేసుకుని తనూ లోపలకు వచ్చింది.

టైగర్ సూరి లుంగి కట్టుకుని సోఫామీద బోర్లాగా పడుకుని వున్నాడు.

తల తిప్పకుండానే, "మాలతీ! వచ్చింది ఎవరు?" అని అడిగాడు. మాలతి సమాధానం చెప్పేలోపల శేషగిరి–

"నేనే! శేషగిరిని!" అన్నాడు.

సూరి లేచి కూర్చోలేదు! పడుకున్న పొజిషన్ నుండి కదలలేదు కూడాను! మాలతి వెళ్ళి సోఫా పక్కన స్టూలుమీద వున్న నిమ్మ నూనెను చేతులకు రాసుకుని సూరి మెడ, వీపు, కాళ్ళు మర్దన చేయసాగింది. నెమ్మదిగా బహు నెమ్మదిగా కండరాలను మసాజ్ చేస్తూ మధ్య మధ్య చేతులకు నూనె రాసుకుంటూ వుండిపోయింది.

పక్కా గంటసేపు ఆ మసాజ్ సాగింది. మనసులో సూరిని తిట్టుకోసాగాడు శేషగిరి! "అవతల కొంప లంటుకుంటున్నా యివతల వీడిలా వళ్ళు పట్టించుకుంటాడు కాబోలు! అయినా చక్కగా ఓ ముత్తైదువ చేత వళ్ళు పట్టించుకోక ఇదేం తెగులు" అని మనసులో అనుకుంటూన్న శేషగిరి వులిక్కి

పడ్డాడు.

"ఏమయ్యా శేషగిరి! ఈవేళప్పుడొచ్చావు! ఏంది గిరాకో!" ఖంగు మంది సూరి గొంతు

అనుమానంగా మాలతి వంక చూసాడు

"మాలతిని చూసి భయపడుతున్నావా! భలేవాడివయ్యా! విషయం ఏమిటో చెప్పు! తల స్నానం చెయ్యాలి!"

"తమ యిలాకాలో వున్న మనిషిని నమ్మకపోవటమా? చెబుతా! నన్నూ నా కూతుర్ని నానా యాతనలపాలు చేసిన వ్యక్తిని అడ్డు తొలగించాలి!"

"వాడు ఎవరో చెప్పు? రేపిపాటికి వళ్ళు చితగ్గొట్టి ఖైమా వుండలా తయారు చేస్తాను!"

"ఆ పిశాచి మగవాడు కాదు! ఆడది!"

"ఆడదాన్ని చూసి భయపడుతున్నావా! ధూత్!"

"అది ఆడది కాదు! కామినీ పిశాచి! తాళి గట్టిన భర్త వుండగా పబ్లిగ్గా మరొకడితో పార్కులో చెట్టాపట్టాలేసుకు తిరుగుతుంది!"

భలే చిక్కు తెచ్చావయ్యా! ఆడదాన్ని అనుభవించటమే గాని సఫా చెయ్యటం అన్నది నా సర్వీస్‌లో జరుగలేదు!"

"బాబ్బాబు! అలా అనకు! ఆ కామినీ పిశాచి నా మేనల్లుడిని పెళ్ళి చేసుకుని మరో మేఘవాహనుడితో షికార్లు కొడుతుంది! దాన్ని అడ్డు తొలగిస్తే నా మేనల్లుడు నాకు దక్కుతాడు! నాల్గు నెలలుపోయాక మా ఎల్లదాన్ని అతనికిచ్చి వివాహం చేస్తా!

"ఉఁ! తప్పదంటావు!"

'ఈ సాయం జేసావంటే నీ మేలు మర్చిపోలేను!'

"మన రేటు తెలుసుగా!" అంటూ కుడిచేతి చూపుడువేలు పైకెత్తి చూపాడు సూరి.

"బాబ్బాబు! బీదవాడ్ని! నా తాహతుకొద్దీ యాభైవేలు యిచ్చుకుంటాను! మన్నించండి!"

"ధూత్! ప్రాణాలు తీయటానికి బేరాలాడతావా! పద! పద!

"తవరికోపమొస్తే నా పనిగాదే! డెబ్బైవేలిస్తాను! నిలువునా పొడిచినా ఇక ఆపైన నా దగ్గర నయాపైసా దొరకదు!"

"అరె సైతాన్! సరే! బయానా ఏమైనా పట్టుకొచ్చావా?"

"ఎంతమాట! ఇదిగో అయిదు వేలు! ఇదిగో ఆ మాయలాడి ఫొటో!"

"ముష్టి విదిలిచ్చినట్టు అయిదువేలా! రేపు వుదయం మరో పాతిక వేలు పట్రా! ఆ అమ్మాయి గూర్చి పూర్తి వివరాలు దినచర్యతో సహా తెలుసుకునిరా!"

"అలాగే సూరిబాబూ! వరాలిచ్చే దేవుడివి నువ్వుండగా నాకు దిగులెందుకు? డబ్బు విషయంలో మాత్రం కాస్త కనికరం చూపు!" అంటూ వెళ్ళాడు శేషగిరి

"అరే సైతాన్‌కే బచ్చే! మనిషి ప్రాణం తీయటం అంటే మజాకా అనుకున్నాడు! మంచి సమయంలో వచ్చి మూడ్ చెడగొట్టాడు" అంటూ బాత్‌రూంలోకి వెళ్ళాడు టైగర్

మాలతి అతని వెంటే వెళ్ళి వంటికంటిన నూనె పోయేలా శుభ్రంగా శికాయపొడితో రుద్దింది నిండా వేణ్ణీళ్ళు వున్న బాత్ టబ్‌లో పడుకోగానే బాత్‌రూం బయటకువచ్చేసి ఇస్త్రీ లుంగీ లాల్చీ మంచంమీదుంచింది. చపాతీ, వేడిగా చికెన్ ఫ్రై ప్లేట్లల్లో వుంచి ఎదురుగా టీపాయ్ మీదుంచింది! విస్కీ గ్లాసులో రాయల్ స్కాచ్ వంపి వుంచింది

బాత్‌రూం నుండి వచ్చిన టైగర్ ఎర్ర చారల లుంగీ, అలాటిదే లాల్చీ వేసుకుని చపాతీ ముక్క చికెన్ కర్రీతో నోట్లో పెట్టుకుని ఒక గుక్క విస్కీ నోట్లో వేసుకుని మాలతి వంక చూస్తూ,

"శేషగిరి యిచ్చిన అడ్రసుకువెళ్ళి ఎంక్వయిరిచేసి వస్తావా?" అని అడిగాడు.

"అలాగే బాస్!" అంది వినయంగా మాలతి

"శేషగిరిని చూసావుగా! వాడి గురించి నీ అభిప్రాయం ఏమిటి?"

"ముసలినక్కలా వున్నాడు! నమ్మదగిన వ్యక్తిలా లేడు!"

"శభాష్! బాగా కనుక్కున్నావ్! పైగా పీనాసి వెధవ!"







* * * * * *

"అమ్మగారూ! కూరలు కొంటారా?" పెరటి వాకిలి దగ్గర వినపడ్డ గొంతు విని వులికి పడింది రమణ

"ఇంట్లో కూరగాయలున్నాయే!" అంటూనే తట్టలో నవనవలాడే వంకాయలు, బెండకాయలు చూచి,

"సరే! కిందకు దింపు!" అంది వంకాయలు బుట్టలోంచి ఏరుకుంటూ.

"కూరలు తెచ్చే సోమయ్య రాలేదేం?" అంది.

"కడుపు నొప్పిగావుంది రాలేకపోయాడు! అమ్మగారు కూరలకోసం ఎదురుసూత్తంటారు! ఎలాగా? అని యిదవుతూంటే నేవచ్చా"

"రమణమ్మా! ఓ కప్పు కాఫీ యిస్తావా?" అంటూ వంట గదిలోకి వస్తున్న శేషగిరిని చూసి తలుపుచాటుకు వెళ్ళింది కూరలమ్మి.

"ఇదుగో బాబూ! క్షణంలో కాఫీ యిస్తా!" అంటూ స్టౌవ్ వెలిగించింది.

"శేషగిరిబాబూ చూసావుగా మయూరమ్మగారి వరస! సాయంత్రం మళ్ళీ పబ్లిక్ గార్డెన్స్‌కు వెళ్ళి – హవ్వ! ఎంత విడ్డూరం!" అంది నోరు నొక్కుకుంటూ.

"చూసా రమణమ్మా! కళ్ళారా చూసా! మయూరి యింత నీచానికొడికడుతుందనుకోలేదు?"

"బాబూ! ఇదంతా నీ మంచితనంవల్ల వచ్చినచెరుపే! ఆరోజు మధుబాబు

# కలలుకనే కళ్ళు

మయూరమ్మను చేసుకుంటానన్నప్పుడు నువ్వు గట్టిగా కాదనివున్నట్లయితే బాబు ఆ యమ్మను పెళ్ళి చేసుకునేవాడూగాదు, ఇంటి కీ తిప్ప లొచ్చేవిగాదు నువ్వేమో పెద్ద మనసుతో ఆరోజు వాళ్ళ పెళ్ళి జరిపించి నెత్తిన అక్షింతలు వేస్తివి! ఈరోజు మయూరమ్మకు నడమంత్రపు సిరి నెత్తికెక్కి అదూ ఆపూ లేకుండా తిరుగుతుంటే చూడలేక ఛస్తున్నాననుకో!'

కాఫీ కప్పు చేతిలో కందుకుంటూ 'అరే! లేత వంకాయలు! రమణమ్మా నీ చేత్తో వండిన ముద్వొంకాయ కూర తిని ఎన్నాళ్ళయిందో! మసాలావేసి భేష్షుగ్గా వండుతావా?

అలాగే బాబు! వంకాయకూరకేం భాగ్యమా, ఈ పూట ముద్వంకాయ కూరే వండుతాను '

కాఫీ కప్పు చేత బుచ్చుకుని శేషగిరి అవతలకు వెళ్ళాక తలుపు చాటునుండి బయటకు వచ్చింది కూరలమ్మి. రమణమ్మ కూరలు తీసుకున్నాకతోటమాలి పకీరయ్యతోనూ, ఆతర్వాత కారు డ్రైవరు కృష్ణతోనూ కబుర్లు చెబుతూ కాసేపున్నది తర్వాత నెమ్మదిగా గేటుదాటి వంద గజాల దూరం నడిచి అక్కడవున్న ఆటో ఎక్కి వెళ్ళిపోయింది!

టైగర్ సూరి ఏడు గంటలకు బద్ధకంగా వళ్ళు విరుచుకుంటూ మంచంమిద నుండి లేచేసరికి ఆవిర్లుగక్కే కాఫీ కప్పుతో ఎదురయింది మాలతి

సూరి కాఫీ చప్పరిస్తుంటే 'బాస్! శేషగిరి చెప్పిన అడ్రస్‌కు వెళ్ళి ఎంక్వయిరి చేసి వచ్చాను!"

"ఉ! అప్పుడే?!"

"శేషగిరి మేనల్లుడు కోటీశ్వరుడు '

'అరే సైతాన్! కోట్లు చేజిక్కించుకోవాలని ఆశ! ఒక్క లక్ష యివ్వమంటే బీదరుపులు అరుస్తాడు

'బాస్! శేషగిరి మేడిపండులాటివాడు! పైన చూడటానికి అంతా మంచిగా నిగనిగలాడుతూ కనవడతాడు! లోపల కుళ్ళి పురుగులు తిరుగుతుంటాయి!"

"వరేవా! మాలతీ! సైతాన్ సంగతి బాగా కనిపెట్టావు! నీ బుర్ర పాదరసంలా పరిగెడుతున్నది!'

'బాస్! అంతా నీ దయ! నైట్ క్లబ్‌లో నికృష్టంగా జీవిస్తున్న నన్ను రక్షించి తీసుకువచ్చావు! నాతెలివి అందం చందం నీకు వుపయోగపడకపోతే మరెవరి కుపయోగపడుతాయి!" అంది మాలతి గద్గద కంఠంతో!

సూరికి మాలతి గత చరిత్ర గుర్తొచ్చింది! ఉబుసుపోకకు సూరి జాలీ బార్‌కు వెళ్లాడు ఒక రాత్రి! బార్‌లో సేల్సు పెరగటానికిస్ట్రిప్‌టీజ్ డాన్స్ పెట్టారు!

మ్యూజిక్ కనుగుణంగా నృత్యం చేస్తున్న అందమైన అతివ ఒక్కొక్క వలువ వూడుస్తూ నగ్నమవుతున్న దేహాన్ని ప్రదర్శిస్తుంటే సుందరాంగి వొంపు సొంపులు తిలకిస్తూ మనసులో ఎగసిపడే కాంక్షలను కంట్రోలు చేసుకోవటానికన్నట్లు గబగబ గ్లాసులు కాళీ చేయసాగారు బార్‌కొచ్చిన జనం.

అతివ వంటి మిద నూలుపోగు లేకుండా డాన్స్ చేయసాగింది. పీకలనిండా తాగిన కస్టమర్లు కరతాళ ధ్వనులు చేసారు

తృటిలో నగ్న సుందరి స్టేజి మిద నుండి మాయమైంది! ఆమెను వెతుకుతూ లోపలకు వెళ్లాడు సూరి

గదిలో అరుపులు కేకలు వినపడ్డాయి బార్లగా తెరచివున్న వాకిలి గుండా లోపలకు వెళ్ళాడు

కొట్లు కుక్కల్లా పోట్లాడుకుంటున్నారు నలుగురు యువకులు మందు నిషా తలకెక్కి బండబూతులు తిట్టుకుంటున్నారు

"ముందు నేను"

"కాదు నేను!"

'రోజూ చాన్సు నీదేనా?"

"మాట్లాడితే మూతి పళ్ళు రాలగొడుతా!"

"అరేయ్ నిన్ను నరికి పోగులు పెడ్తా!"

"కీళ్ళు విరిచి కుంటివాణ్ని చేస్తా!"

ఇక ఆ తర్వాత బూతుల పంచాంగం విప్పి పరమ అశ్లీలంగా వొకరినొకరు దూషించు కుంటూ కలబడ్డారు!

గదిలో ఒక మూల చలికి, భయానికి గడగడ వణికిపోతున్నది డాన్సరు స్టేజి మిద సెక్సీగా అంత మందిని కవ్వించిన ఆ అమ్మాయి కుక్క చింపిన విస్తరాకులా మారబోతున్న తన బతుకును తల్చుకుని మనసులో కుమిలి పోతున్నది

నలుగురి పోట్లాట సమసి పోయేట్లు కనపడలేదు! పక్కనున్న టవల్ కప్పుకుని బయటకు పరిగెత్తబోయింది

పోట్లాట ఆపి గబాలున ఆమెను పట్టుకున్నారు.

'ఎక్కడకు పారిపోతావే? ద్రౌపది అయిదుగురితో జీవిత మంతా కాపరం చేసింది! నువ్వు ఒక్కరాత్రి నలుగురితో . ."

సూరి కరాటే చాప్ దెబ్బ తిని నేల గూలాడు వదరుబోతు,

అర నిముషంలో నేల గూలారు మిగిలిన వాళ్ళు

జాలీ బార్‌లోని రౌడీలంతా పరుగెత్తుకు వచ్చారు! టైగర్‌ను చూసి అంతా వెనక్కు తగ్గారు! మేనేజర్ వచ్చాడు

ఒక్క ఆడపిల్ల కోసం టైగర్‌తో తగాదా తెచ్చుకోవడం ఇష్టం లేక పోయింది మేనేజర్‌కు

వంటిమిద టవల్ కప్పుకున్న మాలతిని టాక్సీలో తీసుకు తన అపార్ట్ మెంట్ దగ్గరకు వచ్చాడు సూరి సూరి వెంట వస్తున్న అమ్మాయి వంక వింతగా చూసాడు లిఫ్ట్‌బాయ్ అపార్ట్‌మెంట్‌కు వెళ్ళగానే కట్టుకోవటానికి తన లుంగి, లాల్చీ యిచ్చాడు సూరి లుంగి కట్టుకుని లాల్చీ వేసుకుని భయపడుతూ ఒక మూల నుల్చున్నది

'నీ పేరేమిటి?

"మాలతి!"

'మాలతీ! ఈ పూట భోం చేసావా?"

సమాధానం చెప్పకుండా వెక్కి వెక్కి ఏడ్చింది. వంటగదిలోకి వెళ్ళి ఫ్రిజ్ నుండి బ్రెడ్ తెచ్చాడు సూరి

ఆవురు మంటూ తిన్నది మాలతి! డాన్స్ ప్రోగ్రామ్ ముందు ఆహారం తీసుకోలేదామె!

సూరి తనను దుష్ట చతుష్టయం బారినుండి తప్పించాడన్న కృతజ్ఞతతో మాలతి, క్లబ్‌లో ఆమె నగ్నదేహం వీక్షించిందగ్గర్నుండీ మనసులో ఆమె పై క్రేజ్ పెంచుకుంటున్న సూరి ఆరాత్రి నిద్రపోలేదు! తెల్లగా తెల్లవారాక మగత నిద్రలోకి జారుకున్నాడు సూరి

అతనికి మెలుకువ వచ్చే సరికి మధ్యాన్నం పన్నెండయింది హేంగోవర్‌తో తల పట్టుకు కూర్చున్నాడు మంచం మిద ! ఆవిర్లు గక్కే బ్లాక్ కాఫీ తెచ్చి యిచ్చి, నుదురు, కణతలు, మెడ మాసేజ్ చేసింది మాలతి

తల నొప్పి కొంత తగ్గింది! ఆవిర్లు వచ్చే వేడి నీటితో బాత్ టబ్‌నింపి సూరిని టబ్‌లో పడుకో బెట్టింది నెమ్మదిగా అతని కళ్ళు మాసేజ్ చేసింది! అరగంటలో హేంగోవర్ పోయింది!

చికెన్ బిర్యాని, ప్రాన్స్‌కర్రి ప్లేట్లో వుంచి పట్టుకొచ్చింది ఆశ్చర్యంగా – చూస్తున్న సూరితో

"ఫ్రిజ్‌లో చికెన్, ప్రాన్స్ వున్నాయి! నాకు చేతయిన విధంగా వండాను!" అంది

ప్రాన్స్ కర్రి కలుపుకుని బిర్యానీ తిన్నాడు సూరి

'వరెవా! వండర్‌ఫుల్! నీ చేతి వంట అమృతంతో సమానం మాలతీ! అన్నట్టు వంట వాడేమైనాడు!"

'కడుపు నొప్పిగా వుందని పొద్దున్నే వెళ్లి పోయాడు".

"సోమలింగం వంటతిని నోరు చవిజచ్చి పోయింది! నువ్వు స్ట్రిప్‌టీజ్ చేయడమే గాకుండా వంటకూడా బాగా వేస్తావే!"

'అమ్మ చిన్నప్పుడే పోయింది! నాన్న నైట్ క్లబ్ కాంటీన్‌లో వంట చేసే వాడు నేను కూడా వంట చేయడంలో సహాయం చేస్తుండేదాన్ని! తెగతాగి లివరు చెడిపోయి చనిపోయాడు నాన్న కుక్క చింపిన విస్తరిలా బజారుపాలయింది నాజీవితం! తెగిన గాలిపటంలా గాలికి కొట్టుకు వెళుతున్న నన్ను జేరదిసారు!

మీరు పొమ్మన్నా యిక్కడ్నుంచి వెళ్ళను! వేళకింత తిండి పెట్టండి చాలు! మీ యిల్లూ వాకిలీ శుభ్రంగా వుంచుతాను. చక్కగా వంట చేసి పెడతాను!"

"వెరిగుడ్! నిక్షేపంలా వుండు. సోమలింగం చేతి వంట తినేగతి పట్టకుండా వుండాలి. నువ్విక్కడే వుండు ! నో అబ్జెక్షన్!" అప్పట్నుంచి మాలతి సూరి దగ్గరే వుంటున్నది.

వంట మనిషిని , పని మనిషిని, చాకలి మనిషిని మాన్పించి అన్ని పనులూ తనే అలకనగా చేసుకు వెళ్ళసాగింది అందం, అణకువ కాక సమర్థత తెలివి వున్నాయని నిరూపించుకుంది కూడా!

ఒక రోజు సూరి 'పని' మీద బయటకు వెళ్ళాడు కాలింగ్ బెల్ మోగింది వెళ్ళి తలుపు తీసింది మాలతి.

"సూరి వున్నాడా?" గర్జించాడు వాకిట్లో నిలబడ్డ వ్యక్తి చూడటానికి రౌడీలా వున్నాడు!

పవిట చెరుగు భుజాల నిండా కప్పుకుంటూ 'లేరు" అంది మాలతి

మాలతిని ఎడం చేత్తో ఒక నెట్టు నెట్టి లోప

"పబ్లిగ్గా స్ట్రిప్ టీజ్ డాన్సు చేసే దానికి ఎం ...డు బూతు మాటల మధ్య.

"సూరిగాడి అంతు జూచిగాని వదలను! నా ఏరియాలో కొచ్చి రుబాబు చేస్తాడా!" అంటూ బొడ్లోవున్న స్ప్రింగ్ కత్తి తీసి స్ప్రింగ్ నొక్కి మూరెడు పొడవు సాగిన కత్తి పదును చేతితో తనిఖీ చేయసాగాడు గంటసేపు గడిచాక –

'ఇంతసేపున్నా రాలేదు! వీడెళ్ళింది రౌడీజులుం చేయటానికా? లేకపోతే పోయి అక్కడే కాపురం పెట్టాడా?" అన్నాడు మరిన్ని అశ్లీల పదాలు రువ్వుతూ

"ఇదిగో! నిన్నే!" వంట యింట్లో వున్న మాలతి వులికిపడింది

'దాహంగా వుంది!" అని అరిచాడు. మాలతి ఒక గ్లాసులో మంచి నీళ్ళు మరో గ్లాసులో స్కాచ్ విస్కీ వుంచుకుని ముందుగదిలోకి వెళ్ళింది. గ్లాసులు బల్లమీదుంచింది చప్పున చెయ్యందుకోబోయిన రౌడి చేతిని తప్పుకుని లోపలకు వచ్చింది

లేచి రాబోయాడు గాని వచ్చిన పని గుర్తొచ్చి మరలా కూర్చుండి పోయాడు. ఎదురుగా వున్న విస్కీ గ్లాసందుకున్నాడు. గంటవున్నాక సూరి వచ్చాడు

బెల్ మోగగానే చప్పున వెళ్ళి తలుపు తీసింది! ఎదురుగా సోఫాలో కూలబడివున్న రౌడీరాణాని అతని చేతిలో నుండి జారిపడిన స్ప్రింగ్ కత్తిని చూడగానే విచలితుడై పోయాడు సూరి.



# కలలుకనే కళ్ళు

"వీడిక్కడి కెప్పుడు వచ్చాడు?"

"రెండు గంటలైంది. మీరు లోపలకు రాగానే పొడిచేస్తా నన్నాడు! అందుకని విస్కీలో మందు కలిపి యిచ్చాను!"

"మంచి పని చేసావు ! లేకపోతే చాలా రభస చేసి వుండేవాడు!" అంటూ వెళ్ళి రాణా చేయి పుచ్చుకు చూసాడు.

"చేయి చల్లగా మంచులా తగిలింది!

"మాలతీ! రాణా !?"

"చచ్చి పోయాడు! విస్కీలో విషం కలిపాను! మా నాన్నకు మూలికా వైద్యం తెలుసు! క్షణాలలో ప్రాణాలు తీసే పొడి నా దగ్గరుంది!" అన్నది మాలతి.

"వరెవా! న్నాశిష్యురాలి వనిపించుకున్నావు! ఇప్పుడీ రాణాను ఏం చేద్దాం?"

"బజారుకు వెళ్ళి పెద్ద ట్రంకు పెట్టె తెస్తాను! వీడిని అందులో కుక్కి అర్ధరాత్రప్పుడు తీసుకు వెళ్ళి హుసేన్ సాగర్‌లోకి దొర్లించి వద్దాం!"

మాలతి చెప్పినట్లే చేసాడు సూరి! అప్పట్నుంచి క్లిష్ట సమయాలలో మాలతి సలహాలను తీసుకుంటూ వస్తున్నాడు . "రాచ కార్యాలు" వచ్చినప్పుడు మాలతిని వుపయోగించుకుంటున్నాడు కూడాను!

గత స్మృతుల నుండి బయట పడి వర్తమానంలోకి.వచ్చాడు సూరి! శేషగిరి గురించి ఇది వరకే చూచాయగా విని వున్నాడతను! అతనికి ఒకటి రెండు సార్లు సహాయపడి వున్నాడు కూడాను! అతను విన్న మాటలకు యిప్పుడు మాలతి చెప్పిన వాటికి సరిపోయింది. " కోట్ల ఆస్తి చేజిక్కించుకో బోతూ తనకిచ్చే డబ్బు కోసం అఘోరిస్తున్నాడు శేషగిరి. వాడికో గుణపాఠం నేర్పాలి" అనుకున్నాడు సూరి!

కాలింగ్ బెల్ నెమ్మదిగా మోగింది. మాలతి వెళ్ళి తలుపు తీసింది. చేతులు నులుముకుంటూ లోపల కొచ్చాడు శేషగిరి.

"ఆహా! ఆదిశేషుడిపై పవళించి లక్ష్మీదేవితో కొలువు దీర్చిన విష్ణుమూర్తిలా వున్నారు మీరు!" అంటూ సూరి ఎదురుగా నిలబడ్డాడు.

"బజారు కెళ్ళి షాపుల ముందు నిలబడి భట్రాజు పొగడ్తలు చేస్తే తలో రూపాయి నీ మొఖానేస్తారు! ఇక్కడెందుకు ఆ మాటలు!" విసుక్కున్నాడు సూరి.

"ఎంత మాటన్నారు! నావి పొగడ్తలా! లేదు అక్షరసత్యాలు!" అన్నాడు శేషగిరి.

"ఈ కబుర్ల కేంలే! పైసలు తెచ్చావా?"

"ఆ! యివిగో!" అంటూ వందరూపాయల నోట్లకట్ట తీసి బల్ల మీద పెట్టాడు శేషగిరి.




"బాంకు లాకర్లో వున్న పిల్లదాని నగలు తీసుకుని వెళ్ళి అమ్మి యీ సొమ్ము పట్టుకొచ్చాను!" అన్నాడు శేషగిరి.

"ఎంత?" అన్నాడు కట్టవంక చూస్తూ సూరి.

"ఇరవై వేలు!" అన్నాడు శేషగిరి.

"ధూత్తెరి!" అంటూ రూపాయల కట్ట విసిరి శేషగిరి ముఖాన కొట్టాడు.

కిందపడ్డ నోట్ల కట్టను తీసి కళ్ళకద్దు కుంటూ "తమరు కోప్పడితే నేను బతుకగలనా! ఇదిగో అమ్మగారికోసమని మా పిల్లదాని గొలుసు తెచ్చాను! మూడు కాసులుంటుంది! ఎంత తీసి వేసినా అయిదు వేలు చేస్తుంది!" అంటూ డబ్బూ బంగారు గొలుసూ బల్ల మీదుంచాడు.

"ఆర్నీ! కాలిడ్డిసి వేలికి వేలిడ్డిసి కాలికి వేస్తున్నావు! ఆ ఏడు పేదో ముందే ఏడవకపోయావు!"

"ముందే యిద్దామని జేబులో వుంచుకున్నా! వెధవది మతిమరు పొకటి తగలడ్డది! పెద్ద వాడినయి పోయాగదా!"

"ఆ అమ్మాయి పూర్తి వివరాలు సేకరించావా?"

"ఆ! ఇదుగో ఆ అమ్మాయి ఫొటో ! పక్కనున్న వాడు దానిరంకు మొగుడు!"

"వయెసెంత?"

"ఇరవైనాలుగు సంవత్సరాలు!"

"ఏం జేస్తుంటుంది?"

"నా మేనల్లుడి సొమ్ము తెగతిని కొవ్వు పెంచుకుంటున్నది!"

"అది కాదు! పొద్దున లేచిన దగ్గర్నుండి రొటీన్‌గా ఏం చేస్తుంది? బయట కెక్కడకైనా వెళుతుందా?"

"ఆ ! ప్రతిరోజూ సాయంత్రం పబ్లిక్ గార్డెన్సుకు వెళ్ళి పొదరిళ్ళ కింద రంకు మొగుడితో సరసాలాడు తున్నది!"

"ప్రతిరోజు పబ్లిగ్గార్డెన్సుకు వెళ్తుందా?"

"ఒక్క రోజు నాగా లేకుండా వెళ్తుంది! ఈ మధ్య కొన్నేళ్ళు మేఘవాహన- అదే దాని ప్రియుడు దేశంలో లేడు! అయినా అది తంచనుగా ప్రతిరోజు పబ్లిక్ గార్డెన్సుకు వెళ్ళేది."

"ఎప్పుడూ ఒకే చోట కూర్చుంటుందా?"

"ఆ! ఎప్పుడూ పొదరిళ్ళ కింద కూర్చుని వుంటుంది!"

"మరింకేం! ఒక్క బాంబు విసిరితే సఫా అయిపోతుంది! పోలీసులు అదెవరో తీవ్ర వాదుల పని అనుకుంటారు!"

"సూరిబాబూ! భేషుగ్గా వుంది నీ ఆలోచన!"

"ఊ! మరి డబ్బు మాట? మిగిలిన డబ్బు మాటేమిటి"

"మా వూరెళ్ళి భూములూ, మేడ తనఖా పెట్టి అయినా సరే రేపీపాటికి డబ్బు పట్టుకు వస్తాను!"

"సరే ! వెళ్ళు!"

"చిత్తం!" వంగి నమస్కారం చేసి వెళ్ళి పోయాడు శేషగిరి.

"సైతాన్ పోకడ చూసావా మాలతీ!"

"చూసాను! డబ్బుకీ వీడికీ లంకె! వీడికి బాంకులో పది లక్షల దాకా డిపాజిట్లున్నాయనీ, చాలా డబ్బు వడ్డీకి తిప్పుతాడనీ డ్రైవర్ కృష్ణ చెప్పాడు."

"అయినా చూడు ఎలా బాధ ఏడుపులు ఏడుస్తున్నాడో. ఈ పిశాచం ముక్కు పిండి డబ్బు గుంజుతాను చూస్తుండు! మాలతీ! ఒకపని చేస్తే?"

"ఏమిటి బాస్!"

"ఆ అమ్మాయిని తీసుకెళ్ళి ఎక్కడయినా దాచి పెడదాం! పది లక్షలు మూట తెచ్చి పెడితేనే పని పూర్తి చేస్తాను అంటా. కుడితిలో పడ్డ ఎలుకలా గిజగిజ లాడి చస్తాడు శేషగిరి!"

"ఐడియా బాగుంది బాస్!"

"ఆ అమ్మాయిని ఎక్కడ దాయాలా అని ఆలోచిస్తున్నా!"

"బాస్! పక్క అపార్టమెంట్‌లో పంజాబీ దంపతులు నిన్ననే వాళ్ళ దేశం వెళ్ళారు! తాళం చెవి నాకిచ్చారు- అపార్టమెంట్ మీటరు రీడింగ్ అవీ చూడటానికి డిపార్టమెంటు వాళ్ళు వస్తే వుంటుందని!

ఆ అమ్మాయిని కొన్నాళ్ళపాటు అక్కడ అట్టిపెడదాం!

# పట్టభద్రుడైన గోపాలానికి తన ఊరిలోనే చిన్నపరిశ్రమ పెట్టాలంటే పెట్టుబడి దొరకలేదు

# యిప్పుడు అతని పిండిమర చక్కగా నడుస్తోంది

## ఆం.ప్ర. సహకార బ్యాంకింగ్ విధానము గ్రామీణ జీవితాల్లో పరిశ్రమలకు దోహదకారి

గోపాల్ తన ఊరిని వదిలి పట్నంలో అదృష్టాన్ని వెతుక్కుందామని ఆలోచిస్తున్న సమయంలో..... అతనికి ఆప్కాబ్‌వారు గ్రామాల్లోనే పరిశ్రమలు నెలకొల్పడానికి చేయూతనిస్తున్నారని తెలిసింది. గోపాల్ కన్న కలలకు రూపు వచ్చింది

సహకార బ్యాంకింగు వ్యవస్థ గ్రామీణ అభివృద్ధికి సత్వర సహాయం సక్రమంగా అందించేందుకు ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడింది

ఈ వ్యవస్థ మూడుదశలుగా విభజింపబడింది. మూలసంస్థ ఆంధ్రప్రదేశ్ స్టేట్ కో ఆపరేటివ్ బ్యాంకు 'ఆప్కాబ్' ఆధ్వర్యం క్రింద 27 జిల్లా కేంద్ర సహకార బ్యాంకులు 430 శాఖలతో ఉన్నాయి. ఈ సంస్థలకనుబంధమైన 6729 ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాల (PACS) పరిధిలో ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామాలన్నీ ఉన్నాయి

PACS లో చేరిన వారికి కేవలం సహకార బ్యాంకింగు వారి సహాయాలన్నీ లభించడమే కాకుండా వారు ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాల వాటాదార్లు కూడా అవుతారు

ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణాభివృద్ధికిగాను యిచ్చే ఋణాలలో ఆప్కాబ్‌దే అగ్రస్థానం. మొత్తం ఋణాల పంపిణీలలో 30% ఆప్కాబ్ వారిదే.

వ్యవసాయాభివృద్ధికి ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చినా కూడా కుటీర పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు, పశువుల పెంపకాలు, కోళ్ళఫారాలు మొదలగువాటికి కూడా సహాయం అందిస్తారు అసలుకి వచ్చిన ఆదాయాన్నంతా తిరిగి ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామాల అభివృద్ధి కొరకు మాత్రమే వెచ్చించే ఏకైక ఆర్థిక సంస్థ ఆప్కాబ్ ఒక్కటే.

ఆప్కాబ్ రిజర్వుబ్యాంకు వారి అత్యంత నిర్దిష్టమైన నిబంధనలతో అతి సమర్థవంతంగా నిర్వహించబడుతుంది మిగతా వాణిజ్య సంస్థలు యిచ్చే సహాయాలన్నీ యివ్వటమే కాకుండా -మీ జమలన్నిటిమీద 1/4% ఎక్కువ వడ్డీ కూడా చెల్లిస్తారు దీనిని రెట్టింపు చేసి జిల్లా కేంద్ర సహకార బ్యాంకు 1/2% ఎక్కువ వడ్డీ చెల్లిస్తారు

ఆప్కాబ్ వారిచ్చే సమయానుకూల సహాయం లేకుంటే గోపాల్ వంటి యువకులు ఎందరో గ్రామాలు వదిలి పట్నానికి వలస వెళ్ళేవారు



## ఆంధ్ర ప్రదేశ్ సహకార బ్యాంకులు

## ఆంధ్ర ప్రదేశ్‌లో గ్రామీణ ప్రజలకు శ్రీరామరక్ష

Sista's/APCOB/420/86

"బిడియా బాగుంది మాలతీ!"

★ ★ ★ ★

"మేఘవాహనా!"

"మయూరీ!"

"ఇంటిదగ్గర వున్నంత సేపూ 'ఎప్పుడు పబ్లిక్ గార్డెన్స్‌కు వెళదామా ! ఎప్పుడు మేఘవాహనను చూద్దామా' అని మనసు తొందర చేస్తుంది! తీరా యిక్కడకు వచ్చి నీ సన్నిధిలో కూర్చుంటే" ఏదో తప్పుచేస్తున్నానా?" అనేభావం నన్ను ముంచెత్తుతున్నది!"

"మయూరీ!" బాధగా పిలిచాడు మేఘవాహనుడు.

"నా శరీరమూ మనసూ పరస్పర విరుద్ధంగా బద్ధ శత్రువులలా ప్రవర్తిస్తున్నాయి.

"మధుతాళి కట్టింది నామెడలో ! నామనసును అతను యీ జన్మలో తాకలేదు! ఎందుకంటే అది అంతకుముందే మేఘవాహనుడికి అర్పితమై పోయింది!" అని పిస్తుంది కాసేపు.

"మనసు ఒకరి కర్పించావు! శరీరం మరొకరికి అర్పించావు! మనసుకు శరీరానికి జరిగే సంఘర్షణ వలన ప్రళయాగ్ని పుట్టి నిన్ను దహించి వేస్తుంది!" అని ఎవరో అన్నట్టు అనిపిస్తుంది!

"ఇష్టపడి చేసుకున్నా అయిష్టంగా చేసుకున్నా వివాహ బంధం విడదీయరానిది! మధు నీ భర్త! అతని నీడన బతకడమే నీ ధర్మం"

"మగువ మనసులో ఏముందో తెలియకుండా చేసిన వివాహం వివాహం కాదు!"

"తెలిసి ముట్టుకున్నా తెలియక ముట్టుకున్నా నిప్పు కాలుతుంది".

"స్త్రీ పురుషులు స్వేచ్ఛగా, స్వచ్ఛందంగా మనసావాచా కర్మణ ఒకరి నొకరు కోరుకుని ఆ స్నేహబంధం శాశ్వతం చేసుకోవటానికి సంఘం ఏర్పరిచిన కట్టుబాటు వివాహం!

'నీ మనోభీష్టానికి విరుద్ధంగా కేవలం ధన కాంక్షతో నీ తల్లి చేయించిన యీ పెళ్ళికి నువ్వు తల వొగ్గ వలసిన పనిలేదు!

కాని ఈ విషయంలో మధు తప్పేముంది? నిన్ను ప్రేమించి, నీ కోసం తపించి, మీ అమ్మ కోరికలు తీర్చి నిన్ను వివాహమాడి నువ్వు ఎడముఖం పెడముఖంగా వున్నా ఆరు సంవత్సరాలుగా పల్లెత్తు మాట అనకుండా వున్న వుత్తముడు నీభర్త.

ఇలా రకరకాల భావనలు వొకదానివెంట వొకటి వచ్చి మనసును కల్లోలపరుస్తున్నాయి!

ఏం చేయను?"

"మయూరీ! నేను ఇక్కడకు రావడంలో పొరపాటు చేసానా అనిపిస్తుంది. నీ గురించి కలలు కంటూ, నీ జ్ఞాపకాలతో సేదదీరుతూ కువైట్ లో నే వుండి పోతే బాగుండేదేమో!

పంజరంలో చిలుకలా పరాధీనవైన నిన్ను చూచి కుమిలిపోవటం మినహా ఏం చేయగలను?"

"మేఘవాహనా! ఈక్షణాన మరణిస్తే ఎంత బాగుండును! మరు జన్మలో నైనా మనిద్దరం....."

"మయూరీ! ఏమిటి పొగ.....

పబ్లిగ్గార్డెన్సులో పొదరిళ్ళు వున్న ప్రాంతంలో పొగబయల్దేరింది! పొగవచ్చిన క్షణాలలో పొదరిళ్ళలో వున్న యువ జంటలు స్పృహకోల్పోయారు. ఆ సమయాన పబ్లిక్‌గార్డెన్సులో ఎక్కువ మంది జనంలేరు. దూరంగా వున్నవాళ్ళు ఆ ప్రాంతానికి పరుగెత్తుకు రాసాగారు.

ఫేస్‌మాస్క్ తగిలించుకున్న వ్యక్తి పొదరిళ్ళలోకి వెళ్ళి ఒక యువతిని చేతులు మీద తీసుకుని బయటకు వచ్చాడు. చకచక బయటకు నడిచి ఆమెను కారులో వెనుకసీటు మీద పడుకోబెట్టాడు. రోడ్డు మీద జనం కారు చుట్టూ మూగేలోపల మాస్క్ తీసివేసుకున్నాడు. కారు బయల్దేరి వెళ్ళింది.

పొగరావడం స్పృహకోల్పోయిన మయూరిని ఎత్తుకుని వచ్చి కారులో పడుకోబెట్టడం, కారు బయల్దేరి వెళ్ళడం నిముషాలలో జరిగి పోయింది. మాలతి కారును స్పీడుగానడుపుతూ ముందుకు పోనిచ్చింది!

అరగంట వున్నాక పెద్ద సూట్‌కేసును నెమ్మదిగా మోస్తూ ఎపార్టమెంట్ లిఫ్ట్‌దగ్గర కొచ్చాడు సూరి. కారు డ్రైవ్ చేసుకు వెళ్ళి పోయింది మాలతి.

లిఫ్ట్‌బాయ్ ఒకసారి సూరి వంక మరోసారి సూట్‌కేస్ వంక చూసి వూరుకున్నాడు. సూరి విషయాలు పట్టించుకోకుండా వుండడమె మంచిదని అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాడతను! బటన్ నొక్కగానే లిఫ్ట్ పైకి వెళ్ళసాగింది.

రెండు నిముషాలున్నాక పక్కవున్న పంజాబీ దంపతుల ఎపార్టమెంట్‌లో మంచం మీద సూట్‌కేస్ వోపెన్ చేసాడు సూరి.

స్పృహలేకుండా పడివున్న మయూరిని మంచం మీద పడుకోబెట్టి కాళీ సూట్‌కేస్ తీసుకుని తన ఎపార్టమెంట్‌కు వచ్చేసాడు తను.

★ ★ ★ ★ ★ ★

పబ్లిక్‌గార్డెన్సులో పొగరావటానికి పదినిముషాల ముందు పార్క్ చేసిన ప్రీమత్ కారులో కూర్చుని వున్న డ్రైవర్ కృష్ణకు 'తుస్'మని శబ్దం వినపడింది. డిటెక్టివ్ నవల చదువుతూ ఆ విషయం పట్టించుకో లేదతను!

"గురూ! వెనక టైరులో గాలిపోయింది!" కొంచెం దూరంలో పార్క్ చేసి వున్న ఆటో డ్రైవర్ కేకవిని వులికిపడి కిందకు దిగాడు. వెనక టైరులో గాలిపోయి చప్పగా వుంది!

"అరినీ! పార్క్ చేసిన కారుటైరులో గాలి పోయిందెందుకని?" అని గొణుక్కుంటూ కిందకుదిగి అక్కడ స్పెపినీ టైరు మార్చుకోవటానికి అనువుగా లేదని గమనించి కారు ముందుకు పోనిచ్చాడు షుమారు వందగజాల దూరంలో రోడ్డు పక్కన కారు ఆపుకుని జాకీ తీసి కారు డిక్కీలోని స్పెపినీ టైర్ కారుకువేసే ప్రయత్నంలో పడ్డాడు. అతను టైరు మార్చుకునేసరికి పదిహేను నిముషాలు పట్టింది. ఈ లోపల పబ్లిక్ గార్డెన్సులో 'పొగ రావడం జనంలో పలకు పరుగెత్తటం చూసాడతను!

టైరు మార్చుకుని ప్రీమత్‌కారును పబ్లిగ్గార్డెన్స్ గేటు దగ్గరకు తీసుకుని వచ్చాడు, అందరూ లోపలకు పరుగెడుతూంటే తనూ వెళ్ళాడు.

అప్పటికే పొదరిళ్ళు వున్న ప్రదేశంలో కొద్దిగా పొగవున్నది. చుట్టూ మూగిన జనం పొదరిళ్ళ మధ్య పడివున్న యువజంటలను చూస్తూ వుండిపోయారు.

"అమ్మగారు యిక్కడే కూర్చుంటారు!" అనుకుంటూ దగ్గరకు వెళ్ళి

## దరహాసంతో దీవించుమా!

ఉగాదీ, ఉర్విఎల్ల ఉత్సుకత ఉద్భవింప
ఆరాధనీయవై ఎలమితో ఏతెంచినావా
పుడమిలోని పేదల పతితుల
ప్రతారితుల ప్రక్షోభితుల మనుగడకు
పట్టుకొమ్మ ఏదైనా ప్రసాదించెదవా
బ్రతుకు బరువై నిట్టూర్చు నిరుద్యోగుల
నైరాశ్యమును నిర్మూలించెదవా
నిరుద్యోగ రాక్షసి కంఠం నులిమివేసెదవా
నరుల నెమ్మనములను నెమ్మితో నింపి వేయలేవా
ఉగాదీ, ఉపశోభితా మణీ, ఓ జస్వినీ
చిమ్మ చీకట్లు చిందులాడు నా జీర్ణ కుటీరమున
పసిడి కాంతులు ప్రసరింప చేయుమా
ఎండి మోడైన యీ జీవిత వృక్షమును చిగురింప చేయుమా
ఈ ఎడారి ఎదదారి పై సెలయేటిను జాలువారి చేయుమా
దయానిధి, దరహాసంతో దీవించి ప్రశాంతి పీయూష మొసగుమా

—జనస్వామి కోదండరామశాస్త్రి

పొదరింటిలోకి చూసాడు కృష్ణ.

స్పృహలేకుండా నేలమీద పడివున్నాడు మేఘవాహన!

"అరె! అమ్మగారేరి?" అనుకుంటూ పొదరిళ్ళన్నింటిలోనూ చూసాడు. పబ్లిక్ గార్డెన్సులో పల అన్ని ప్రదేశాలు తిరిగి చూసాడు.

"ఒకవేళ నేను స్టెపినీ టైరు మార్చుతున్నప్పుడు అమ్మగారు బయటకువచ్చి కారు కనపడక పోతే టాక్సీలో యింటికి వెళ్ళలేదుగదా?" అనుకుంటూ కారులో యింటికి వెళ్ళాడు కృష్ణ.

వాకిట్లో నిలబడివున్న శేషగిరిని "అమ్మగారు యింటికి తిరిగివచ్చారా?" అని అడిగాడు.

"అదేమిట్రా కృష్ణా! అలా అడుగుతావు! ఇందాక అమ్మాయిని కారులో ఎక్కించుకు వెళ్ళింది నువ్వుగాదూ?"

"ఎక్కించుకుని వెళ్ళానయ్యా! పబ్లిక్ గార్డెన్సు దగ్గర దిగి లోపలకు వెళ్ళారు!" అంటూ పొదరిళ్ళ దగ్గర పొగరావటం వైనం చెప్పాడు.

"అయ్యో! అయ్యో! అమ్మాయి ఏమయిపోయిందో!" శేషగిరి గావుకేకలు విని మేడమీద నుండి దిగివచ్చాడు మధు.

"ఏమిటి మామయ్యా! ఏమయింది?"

"పబ్లిక్ గార్డెన్స్‌లో మయూరి మీద ఎవరో బాంబు విసిరారట" అన్నాడు శేషగిరి ఆందోళనగా!

"అలాగా!" అంటూ వెళ్ళి కారులో కూర్చుని "పబ్లిక్ గార్డెన్స్‌కు పోనీయ్ కృష్ణా" అన్నాడు మధు.

"వుండు! నేనూ వస్తున్నా!" అంటూ తనూ వెళ్ళి కారులో కూర్చున్నాడు శేషగిరి.

"అమ్మగారెప్పుడూ ఇక్కడే కూర్చుంటారు!" అంటూ ఒక పొదరింటివైపు చూపాడు కృష్ణ. అప్పటికే స్పృహలేని వ్యక్తులను కొందరిని హాస్పిటల్‌కు తరలించేసారు! మధు గబగబ ఆ పరిసర ప్రాంతాలన్నీ గాలించి వచ్చాడు. పబ్లిక్ గార్డెన్సులో మారుమూల ప్రదేశాలు కూడా చూద్దామని అటూ యిటూ తిరుగసాగాడతను.

మధు మయూరిని వెతుకుతూ తిరుగుతుండగానే శేషగిరి బయటకు వెళ్ళాడు. పబ్లిక్‌కాల్ ఆఫీసునుండి పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేసాడు.

"హలో! యస్ఐ రంగనాథం మాట్లాడుతున్నాను."

"ఫోన్ మవుత్ మీద జేబురుమాలుంచి కీచుగొంతుతో "బంజారాహిల్స్‌లో కోటీశ్వరుడి భార్య మయూరిని హత్యచేసారు" అన్నాడు.

"మీరేవరు? ఎక్కడ నుండి మాట్లాడుతున్నారు?"

"నేనెవరినైతేనేం? ఎక్కడనుండి మాట్లాడితేనేం? మీరు వెంటనే బయల్దేరి మధు నివాస్‌లో మధు బెడ్‌రూం సోదా చేయండి! హత్య గూర్చి ఆచూకి దొరుకుతుంది! వుంటా!"

"హలో! హలో!" ఫోన్ పెట్టేసిన శబ్దం విని రిసీవర్ చేతిలో వుంచుకుని ఆలోచనలో పడిపోయాడు రంగనాథం.

బంజారాహిల్స్‌లో నివశించే కోటీశ్వరులలో మధు ఒకడు. అయన భార్య హత్య జరిగిన మాట నిజమయితే చాలా హడావిడి జరుగుతుంది!

పోలీస్‌స్టేషన్‌కు వచ్చే ఆకాశరామన్న ఫోన్‌కాల్సన్నీ నిజంకావు! కొంతమంది సరదాకోసం అలా ఫాల్స్‌కాల్స్ చేస్తుంటారు! అలాగని నిర్లక్ష్యంగా వుంటానికి వీల్లేదు! ఫోన్‌కాల్‌లో చెప్పిన విషయం నిజమయి పోలీసాఫీసర్ నిర్లిప్తంగా వుండిపోయినప్పుడు తర్వాత పశ్చాత్తాప పడవలసి వుంటుంది! పైనుండి తాఖీదులు హెచ్చరికలూ వస్తాయికూడాను! ఎటూ పాలుపోక అయిదు నిముషాలు కూర్చుండిపోయాడు. ఆలోచనలు ఒక కొలిక్కి రాగానే దిగ్గున లేచి స్టేషన్ బయటకువచ్చి మోటర్‌సైకిల్ మీద ఎక్కి బంజారాహిల్స్‌లోని మధు మేడ వైపుగా ప్రయాణమై పోయాడు.

★ ★ ★ ★ ★ ★

లాఠీతో తలుపుమీద కొడుతూ "ఎవరమ్మా యింట్లో" అన్నాడు రంగనాథం– దూరంగా రమణమ్మను వెనుక గదిలో చూసి.

"ఎవరు బాబూ?" అంటూ చేతులు చీర చెరగుతో తుడుచుకుంటూ ముందుహాల్లోకొచ్చింది రమణమ్మ.

పోలీసాఫీసర్ని చూడగానే క్షణం మనసులో భయపడింది. అంతలోనే తమాయించుకొని "ఎవరు కావాలి బాబూ" అంది.

"మధుబాబు గారి భార్య మయూరి గారితో మాట్లాడాలి".

"బాబూ! మయూరమ్మగారు రెండు గంటల క్రితం పబ్లిక్ గార్డెన్స్‌కు వెళ్లారు! తర్వాత ఒక గంటసేపటికి డ్రైవర్ తిరిగివచ్చాడు. ఆ కారులో ఎక్కి మధుబాబు వెళ్ళిపోయాడు!"

"అలాగా! అయితే వారొచ్చేదాకా యిక్కడే వుంటా!" అంటూ సోఫాలో కూర్చున్నాడు. కాసేపు అక్కడే నిలబడి పొయ్యి మీద కూరగిన్నె వున్నదన్న విషయం గుర్తొచ్చి వెళ్ళిపోయింది రమణమ్మ.

రమణమ్మ అవతలకు వెళ్ళగానే మెట్లెక్కి మేడ మీదకు వెళ్లాడు రంగనాథం. దక్షిణపు వేపు వున్న బెడ్ రూమ్‌లోకి వెళ్లాడు. మధుబాబును అదివరకు కొన్ని ఫంక్షన్స్‌లలో చూసాడు. అందువలన గోడ మీద వున్న మధు ఫోటో తేలిగ్గా గుర్తుపట్టాడు.

గది మధ్య డబుల్ కాట్ - పైన యు ఫోం బెడ్, టీపాయ్ గోడ వారగా సోఫా సెట్, పక్కన చిన్న టేబిల్ కనపడ్డాయి. టేబిల్ సొరుగు తీసి చూసాడు. పబ్లిక్ గార్డెన్స్‌లో యువతీ యువకులు కూర్చుని వున్నప్పుడు తీసిన ఫోటోలు కనపడ్డాయి. యువతి తన తలను యువకుని భుజానికి ఆనించి వున్నప్పుడు తీసిన ఫోటో. వొకరి చేతులు వొకరు పుచ్చుకొని తీయించుకున్న ఫోటో, ఒకరినొకరు




ఆర్తిగా కౌగలించుకున్నప్పుడు వివిధ ఏంగిల్స్‌లో తీసినవి వున్నాయి. టీపాయ్ మీద మధు వివాహమప్పుడు తీసిన ఫోటో కనపడింది. పెళ్ళికూతురు, పబ్లిక్‌గార్డెన్స్‌లో తీసిన ఫోటోలో వున్న అమ్మాయి వొకరేనని పోల్చుకున్నాడు రంగనాథం.

ఆకాశరామన్న ఫోన్‌కాల్ విని వచ్చినందుకు కొంతయినా ప్రయోజనం దొరికిందనుకుంటూ ఫోటోలు జేబులో వేసుకొని కిందకు దిగివచ్చాడు.

హాలులో ఎవరూ కనపడలేదు!

మోటార్‌సైకిల్ మీద పబ్లిక్‌గార్డెన్స్ దిశగా బయల్దేరి వెళ్లాడు రంగనాథం.

పల్లెటూళ్ళలో చిన్న వార్తలు త్వరలో వ్యాపిస్తాయి. కాని పెద్ద పట్టణాలలో ఒకోసారి ఒకో చోట నుండి మరో చోటకు వార్త చేరటం ఆలస్యమవుతుంటుంది. పబ్లిక్ గార్డెన్స్‌కు వెళ్ళిన రంగనాథం పొదరిళ్ళ వద్ద బాంబు పేలి కొంతమంది స్పృహ కోల్పోయారని, వాళ్ళని నిజాం ఆర్థోపెడిక్ హాస్పిటల్‌కు తీసుకు వెళ్లారని తెలుసుకున్నాడు.

పబ్లిక్ గార్డెన్స్ నుండి హాస్పిటల్ వార్డుకు వెళ్ళి స్పృహ తప్పి పోయిన రోగులున్న వార్డులో మంచం మీద వున్న రోగులను పరీక్షగా చూడసాగాడు రంగనాథం.

మేఘవాహన దగ్గరికి వచ్చేసరికి ఆగిపోయి జేబు నుండి ఫోటో తీసి చూసాడు! ఫోటోలో వున్నది మంచం మీద వున్నది ఒకే వ్యక్తి అని

## కలలుకనే కళ్ళు

నిర్ధారించుకున్నాడు.

"మయూరి! మయూరి!" మేఘవాహన పలవరించడం వినపడింది.

"మర్డర్ జరిగిందో లేదో తెలియదు గాని ఎడల్టరీ కేసు కనపడుతున్నది" అనుకుంటూ పోలీస్‌స్టేషన్‌కు వెళ్లాడు రంగనాథం.

తన టేబిల్ దగ్గరకుర్చీలో మధు కూర్చుని వుండడం గమనించి ఆశ్చర్యపోయాడు తను!

"హలో మిస్టర్ మధూ! హౌ ఆర్‌యు!" అన్నాడు రంగనాథం మధు ముఖ కవళికలను గమనిస్తూ.

"గుడ్ మార్నింగ్ సార్! ఐ హేవ్ ఏ కంప్లయింట్ టు మేక్" అన్నాడు మధు.

రంగనాథం చెప్పండి అన్నట్టు తలూపగానే –

"నా మిసెస్ మయూరి రెండు మూడు గంటల క్రితం పబ్లిక్‌గార్డెన్స్‌కు వెళ్ళింది! గంట గంటన్నర క్రితం అక్కడ ఎవరో బాంబు పేల్చారు! కొంతమంది స్పృహ కోల్పోయారు! వాళ్ళను హాస్పిటల్‌లో చేర్చారు. మయూరి మాత్రం వాళ్ళలో లేదు! పబ్లిక్‌గార్డెన్స్ అంతా గాలించాను. ఎక్కడా కనపడలేదు! ఆ విషయం మీకు కంప్లెయింట్ యిద్దామని వచ్చాను!"

"అలాగా! కిడ్నాప్ కేసన్న మాట! మీరు కంప్లయింట్ రాసి యివ్వండి తర్వాత మీ బంధువులను స్నేహితులను వాకబు చేయండి! ఒక వేళ ఆమె మీకు చెప్పకుండా ఎవరింటికైనా వెళ్ళి వుండవచ్చు!"

"లేదు ఇన్‌స్పెక్టర్ గారూ! మయూరి సాధారణంగా ఎవరింటికీ వెళ్లదు!"

"అయినా ఒకసారి వాకబు చేయండి!" అంటూ మధు యిచ్చిన కంప్లెయింట్ ఫైల్ చెయ్యమని రైటర్‌కు పురమాయించాడు.

మధు లేచి వెళ్ళటానికి నిలబడగానే రంగనాథం మధు పక్కన వున్న శేషగిరి వంక చూస్తూ –

"వీరు?"

"ఈయన నా మేనమామ! శేషగిరిరావుగారు!" అన్నాడు మధు.

"నమస్తే!" విష్ చేసాడు శేషగిరి.

"నమస్తే" అంటూ శెలవు తీసుకున్నాడు రంగనాథం.

ఫ్లిమత్ కారులో యింటికి తిరిగివస్తుంటే శేషగిరి మనసు ఆనందంతో నిండిపోయింది.

"ముప్ఫై వేలు చేతిలో పడగానే మయూరిని ఖతం చేసేసాడు సూరి! పని అయిపోయింది కాబట్టి పాతికో పరకో చేతిలో పెట్టి ఇహ అంతకంటే మిగల్చేదని మొరాయిస్తాను! నాలుగు అరుపులు అరిచి చప్పబడిపోతాడు!

ఆహా ఎంత చవకగా మయూరి పీడ వదిలించుకున్నాను!" అనుకుంటూన్న శేషగిరి మధు పిలుపుకు వులికిపడ్డాడు.

"మామయ్యా మయూరి ఏమయ్యి వుంటుంది?"

"ఆ" ఏమవుతుంది? పోలీస్ కంప్లయింట్ యిచ్చాం గదా ఎక్కడ వున్నా గాలించి తీసుకువస్తారు!"

"నాకేమిటో భయంగా వుంది మామయ్యా!"

"ఇలాటి సమయాలలోనే మనిషి సత్తా బయటపడేది! నువ్వు ధైర్యంగా వుండు! అన్ని విషయాలూ నే చూసుకుంటాను".

★ ★ ★ ★ ★

"శేషగిరి బాబూ! ఫోన్ మోగుతున్నది!" రమణమ్మ కేక విని హాలులో వున్న ఫోన్ దగ్గరకు వెళ్లాడు శేషగిరి.

వెళ్తూ వెళ్తూ "అమ్మాయి లతికా! బావ పొద్దుట్నుంచీ ఏం తీసుకున్నట్టు లేదు! కాఫీ తీసుకు వెళ్ళమ్మా!" అని గదిలో వున్న కూతురుతో చెప్పి మరీ వెళ్లాడు. "మయూరి లేని లోటు భర్తీ చేయాలంటే యిదే సమయం" అని రమణమ్మ చెప్పిన మాట గుర్తొచ్చింది శేషగిరికి.

ఫోన్ రిసీవర్ తీసి "హలో" అన్నాడు శేషగిరి.

"హలో సూరి స్పీకింగ్!" సూరి గొంతు వినగానే శేషగిరి వంట్లో వుత్సాహం

పొంగి పొరలింది.

"బాగున్నారా సూరిగారూ!"

"ఆ! మయూరిని కిడ్నాప్ చేసి ఒక చోట దాచాను!"

"అదేమిటి! మనం అనుకున్నది ఒకటి! ..." నీళ్ళు నమిలాడు శేషగిరి.

"ఏమిటిబే? అలా నీళ్ళు నములుతావు! నువ్విచ్చిన ముహూర్తానికే మర్డర్ చేస్తాననుకొన్నావా!"

"తమరు నాకు మాట యిచ్చారు! ఎంతో ఆశపెట్టుకున్నాను!"

"పది లక్షలు కాష్ పట్రా! పని పూర్తి చేస్తా!"

"అమ్మయ్యో! అంత డబ్బు నేనెక్కడ తేను?!" నెమ్మదిగా రిసీవర్‌లో గొణిగాడు శేషగిరి.

"పక్షవాతం వచ్చిన వాడిలా అలా గొణుగుతావేంటి? చెప్పు! డబ్బు తేకపోతే మయూరిని వదిలేస్తా!"

"బాబ్బాబు! తమరలా శెలవిస్తే నేనేమయి పోవాలి?"

"మరయితే డబ్బు పట్రా!"

"ప్రయత్నిస్తా బాబూ! కొంచెం వ్యవధి కావాలి!"

"సరే! సరిగా నాలుగు రోజులు సమయమిస్తున్నా! ఈ లోపల వచ్చావో సరే! లేకపోతే మయూరిని వదిలేస్తా! తర్వాత నీ యిష్టం!"

"వద్దు! వద్దు! ఆ పని చేయకండి!" నెమ్మదిగా మాట్లాడినా కంఠంలో వణుకు మొదలయింది శేషగిరికి.

ఫోన్ పెట్టేసి సోఫాలో చతికిలబడిపోయాడు శేషగిరి. "మయూరి శని వదిలిపోయిందనుకుంటే మళ్లా వీడిలా మాట్లాడుతున్నాడు! పది లక్షలు గుమ్మరిస్తే గాని పని కాదంటున్నాడు! పది లక్షలు! బాంక్‌లో వున్న డబ్బు మొత్తం తెచ్చి సూరిగాడి కర్పించాలి!

కోటి రూపాయల పైగా వున్న ఆస్తి చేజిక్కాలంటే పదిలక్షలు మదుపు పెట్టాలి! తప్పదు!

అరే! సూరి! ఆశపెట్టావురా! నీకు ఆశ కురుపులు లేస్తాయి.

ఊ! కానీ! బాంకు డిపాజిట్లు మొత్తం పోతే పోయాయి. శేషగిరి తలుచుకున్న పని సాధించి తీరుతాడు!" అనుకొంటూ తనలో తను ఆలోచనలో వుండిపోయాడు.

"బాబూ మయూరమ్మ ఏమయింది?"

"ఏమో రమణమ్మా! ఆచూకీ తెలియలేదు! మధు పోలీస్ కంప్లయింట్ యిచ్చాడు కూడాను!" అన్నాడు ఆలోచనల నుండి తెప్పరిల్లుకుని!

* * * *

"బాస్! శేషగిరి ఏమన్నాడు! పది లక్షలు తెస్తానన్నాడా?"

"తేక ఏంజేస్తాడు! దణ్ణాలు పెడుతూ మరీ తెచ్చి యిస్తాడు! మాలతీ! యింత మంచి సలహా యిచ్చినందుకు యీ వ్యవహారం పూర్తవగానే నీకు మంచి రవ్వల నెక్లెస్ చేయిస్తాను!"

"బాస్! బంగారమూ రవ్వలూ నాకెందుకు? జీవితాంతం నీ వద్ద నాకు నీడ దొరికితే చాలు! తింటానికి యింత ముద్ద పెట్టావంటే సేవ చేస్తూ యిక్కడే పడి వుంటాను!"

"ఇక్కడా? పది లక్షలు చేతిలో పడ్డాక గూడా ఈ అద్దె అపార్ట్‌మెంట్‌లో పడి వుందామా! బంజారాహిల్స్‌లో చిన్న బంగళా కొంటాను!"

"అలాగే బాస్! నీ యిష్టం!"

"ఇంతకీ మయూరి ఏమంటున్నది?"

"ఇంకా మగత వదలలేదు బాస్!"

"పబ్లిగ్గార్డెన్స్‌లో పేల్చింది స్మగుల్డ్ బాంబ్! గాలి పీల్చిన వాళ్ళు ఇరవై నాలుగ్గంటలపాటు స్పృహ కోల్పోతారు! కొంచెం పాలుగానీ, కాఫీగానీ తాగించకపోయావా?"

"ఇందాక హార్లిక్స్ తాగించి వచ్చాను!"

"మాలతీ! ముసలి పీనుగతో ఫోన్‌లో మాట్లాడుతుంటే మెడ పట్టింది మసాజ్ చేస్తావా?"

"అలాగే బాస్!"

"మాలతీ!"

"మయూరికి తెలివి వచ్చి యింటికి ఫోన్ చేయదు గదా?"

"ఫోన్ వైర్లు కట్ చేసాను! కరెంట్ మీటరులోని ఫ్యూజ్ తీసి వేసాను ఎపార్ట్‌మెంట్‌లోని కిటికీల తలుపులన్నీ వేసాను! డోర్ బయట లాక్ చేసాను!"

"వరెవా! నా శిష్యురాలివనిపించుకున్నావు!"

* * * *

"మామయ్యా! మయూరి ఆచూకీ ఏమన్నా తెలిసిందా?"

"లేదురా మధూ! తెలిసిన వాళ్ళందరకూ ఫోన్ చేసాను!"

"మామయ్యా నాకేమిటో భయంగా వుంది!"

"భయపడకు! పెద్దవాడిని నేనున్నాగా! అన్నట్టు మర్చిపోయాను! అర్జంటుగా పని పడింది. మా వూరెళ్లాలి! అయినా నీక తోడుగా లతికను వదలి వెళ్తున్నా! ఇక యీ ప్రపంచంలో నీకు లతికా, లతికక నువ్వూ తప్ప వేరెవరున్నారు! వస్తా మధూ!" అంటూ బయటకు వెళ్లాడు శేషగి సూట్‌కేస్ తీసుకుని.

"బావా!" లతిక పిలిచింది.

"ఏమిటి?"

"అక్క చనిపోయిందటగా?" భయంగా అడిగింది లతిక.

"నో! నో! నా మయూరి చావలేదు!" పెద్దగా అరిచాడు మధు.

* * * *

మాలతి కాఫీ ఫ్లాస్కు తీసుకుని పక్కనున్న అపార్ట్‌మెంటులో అడుగు పెట్టింది.

"మయూరిని మరచిపో మేఘువాహనా!" బిగ్గరగా కలువరిస్తున్నది మయూరి.

క్షణం సేపు వాకిలి దగ్గరే నిలబడిపోయింది మాలతి. మయూరి కంఠధ్వని ఆమె మనసులో నిక్షిప్తమైపోయిన జ్ఞాపకాలను పైకి తేసాగింది. సన్నగా, ముక్కుతో పలికే మయూరి - తన చిన్నప్పటి నేస్తం కాదు గదా?

అయిదో తరగతిలో కొత్తగా చేరిన మాలతి వంక క్లాసులో పిల్లలందరూ కళ్ళు పెద్దవి చేసుకొని చూశారు. చారెడేసి కళ్ళున్న మయూరి బెదిరే కళ్లలాటి కళ్లతో మాలతిని తదేకంగా చూసింది.

"ఏయ్ నిన్నే!" పిలిచిందో పొగరుమోతు పిల్ల రాణి. మాలతి పలుకలేదు.

"పిలుస్తుంటే నిన్నుగాదూ! నీ పేరేమిటి?" భయపడతూ "మాలతి" అంది తను.

"మాలతి! మట్టిబొగ్గు! ఇలా రా! నీ గౌనుకు ఆ మసి ఏమిటి?" తల వంచుకు నిల్చుంది.

"మసిగుడ్డ తొడుక్కు వచ్చిందర్రా!" చుట్టూ తిరిగి గంతులేస్తూ అరిచింది రాణి.

గౌను వెనుక చిన్న చిల్లు వుంటే వేలు పెట్టి "మర్రిచెట్టు తొర్ర!" అంటూ సర్రున చించింది.



# కలలుకనే కళ్ళు

"వంటమనిషి కూతురు! అందుకే చినిగిపోయిన మసి పాత తొడుక్కుని చ్చింది!" చప్పట్లు కొడతూ గంతులేసింది రాణి.

అప్పటికీ మాట్లాడకుండా కళ్ళ నీళ్ళు కుక్కుకుని నుల్చుంది తను

'ఏయ్! మూగి మొద్దూ పలకవేం!"

వెక్కి వెక్కి ఏడవసాగింది! బళ్ళోకొచ్చిన మొదటి రోజు యింత పరాభవం ాలవుతానుకోలేదు! అంతమంది చోద్యం చూస్తూ నిలబడ్డారే గాని మాలతి రవున మాట్లాడలేదు అందరి వంకా దీనంగా చూసింది

'ఏడ్పుగొడ్డు ముఖమా!" అంటూ వెక్కిరించింది రాణి అప్పుడు మయూరి ందర్ని తోసుకుని వచ్చి రాణి ముందు నిల్చుని -

ఏమిటి రాణీ! ఎందుకా అమ్మాయిని అల్లరి చేస్తావు?" అని అడిగింది

ఎందుకో నా యిష్టం! నువ్వెవరు అడగటానికి?"

'ఆ అమ్మాయి గౌనెందుకు చించావు?"

బడికి చినిగిపోయిన గౌను ఎవరు తొడుక్కు రమ్మన్నారు?"

అందరికీ సిల్కు గౌనులుంటాయా? నీకే సిల్కు గౌనులున్నా య్యని ందర్ని ఎగతాళి చేస్తావు!'

పోవే బోడి! చక్రాల్లా కళ్ళు తిప్పుతూ వచ్చావు!

మాలతీ! రా! రాణితో నీకెందుకు?" అంటూ తన చేయి పుచ్చుకొని తీసుకు ెళ్ళబోయింది మయూరి

"ఏయ్! ఆగు! గర్జించింది రాణి

మయూరి ఆగలేదు మాలతి చేయి పుచ్చుకుని ముందుకు కదిలింది

"ఎంత పొగరే నీకు! నన్నే ఎదిరిస్తావా!" వెనుక నుండి శివంగిలా మయూరి మీద పడి జుట్టు పట్టుకుని వంచింది ఎడాపెడా గుద్దుల వర్షం కురిపించింది.

నిర్ఘాంతపోయి చూడసాగింది మాలతి. మయూరి ఎదురు తిరగాలని చూసింది గాని రాణి పశుబలం ముందు నిలబడలేక పోయింది. పొడుగ్గా పెంచిన గోళ్ళతో మయూరి వళ్ళంతా రక్కింది మయూరి రాణిని రెండు చేతులతో బలంగా నెట్టివేసింది రాణి వెల్లకిలా పడిపోయింది. మరుక్షణం రెచ్చిపోయిన కోపంతో మయూరి మీద పడి కుడి చేతిని కసుక్కున కొరికింది చర్మం వూడి బొల బొలా రక్తం కారింది! టీచరు రావటంతో ఎటు వాళ్లటు గప్‌చుప్‌గా వుండిపోయారు మయూరి చేతి మీద గాయం మానటానికి చాలా రోజులు పట్టింది! ఆ సంవత్సరం మాలతి మయూరి ఒక జట్టుగా వుండేవాళ్ళు! చిరుతపులిలా మాటి మాటికి మీదకు వచ్చే రాణి నుండి మాలతిని కాపాడుతుండేది మయూరి

మరుసటి సంవత్సరం మాలతి అమ్మ వేరే చోట వంటకు కుదిరింది. మాలతి తర్వాత మయూరిని చూడనేలేదు. ఆ ఏడే మాలతి తల్లి చనిపోయింది. మాలతి తండ్రి నైట్ క్లబ్‌లలో వంటవాడుగా జేరాడు.

పదిహేను సంవత్సరాల నాటి జ్ఞాపకాలు స్మృతిపథంలో మెలగడంతో మాలతి మనసులో ఏదో తీయని పరిమళం గుబాళించినట్లనిపించింది. ఆమె నిర్భాగ్య జీవితంలో అప్యాయత ఆదరణ చూపించిన వాళ్ళు బహుకొద్దిమంది!అందులో ముఖ్యురాలు మయూరి!

"ఈ మయూరి నా చిన్నప్పటి నేస్తం కాదు కదా!" అనుకుంటూ మాలతి వెళ్ళి మయూరి చేయి పుచ్చుకుని పరీక్షగా చూసింది. ముంజేతి మీద మచ్చ కనపడింది! పదిహేను సంవత్సరాలయినా రాణి పంటి గాట్ల గుర్తు యింకా మయూరి చేతి మీద వున్నది!

"మయూరి! మయూరి!" ఆనందాతిరేకంతో ఎలుగెత్తి పిలిచింది మాలతి.

మయూరి కండ్లు తెరిచింది పరీక్షగా మాలతి వంక చూస్తూ "మీరు! మీరు! నువ్వు. " అంది. మాలతిని పోల్చుకుంటున్నట్లుగా.

మాలతి మనసులో ఎంతో ఆనందం కలిగిందా క్షణాన. కాని వివేకం మేల్కొని ముఖంపై ప్రసరిస్తున్న ఆనందరేఖలను హరించివేసింది

"నేనెవరో మయూరికి తెలియకూడదు! నేను సూరి దగ్గర వుంటున్న విషయమూ తెలియకూడదు



# కలలుకనే కళ్ళు

కుక్క చింపిన విస్తరిలా మారిన నా జీవితానికి సూరి ఆలంబనంగా వున్నాడు. సూరికి ఏ ఆపదా రాకుండా వుండాలి! సూరివల్ల యీమెకు ఏ ఆపదా రాకుండా వుండాలి!

నాకు ప్రాణంతో సమానమైన యిద్దరు వ్యక్తులు సూరి, మయూరి! ఇద్దరూ నాకు రెండు కళ్ళు! ఒకరి వలన మరొకరికి ప్రమాదం రాకుండా వుండాలంటే ఒకరి విషయం వొకరికి తెలియకుండా వుండాలి! ఈ దశలో నేనెవరో మయూరికి తెలియకూడదు!" అని మనసులో అనుకుంటూ

"ఏమ్మా ఎలా వుంది?" అని అడిగింది మాలతి.

"నువ్వు మాలతివి కదూ!" నీరసంగా అడిగింది మయూరి.

"మాలతా" మాలతెవరు? నా పేరు మాధురి!"

మయూరి కళ్ళలో కనుపించిన వెలుగురేఖలు మాయమయ్యాయి.

"మాధురా" అంది నీరసంగా మయూరి.

"చూడమ్మా! ఈ కాఫీ తాగు!" ఫ్లాస్కులో కాఫీ కప్పులో పోసి మయూరికి యివ్వబోయింది మాలతి

వద్దు అన్నట్లు తల అడ్డంగా తిప్పింది మయూరి.

"మా అమ్మవు గదూ! తాగమ్మా!" చిన్న పిల్లను బతిమిలాడినట్లు బతిమిలాడుతూ అడిగింది

ముఖం పక్కకు తిప్పుకుంది మయూరి.

"నేనిప్పుడెక్కడున్నాను?"

"కాఫీ తాగు చెబుతా!" అంటూ బుజ్జగిస్తూ బలవంతాన కాఫీ తాగించింది కాఫీ తాగి మరలా మగత నిద్రలోకి జారుకుంది మయూరి. అపార్ట్‌మెంట్ తాళం వేసుకొని తిరిగివచ్చింది మాలతి.

"మాలతి! మయూరికి స్పృహ వచ్చిందా?" సూరి అడిగాడు మాలతిని

"కొంచెం కొంచెం స్పృహ వస్తున్నది! మళ్ళీ అంతలోనే మగత నిద్రలోకి జారుకుంటున్నది!"

"మాలతీ మంచి వార్త! బంజారాహిల్స్‌లో యూరోపియన్ టైప్ బంగళా వొకటి అమ్మకానికున్నది ధర ఏడు లక్షలు చెబుతున్నారు. కొందామా?"

"మీ యిష్టం బాస్!"

'ఇవ్వాళో రేపో ఆ ముసలి పీనుగ పదిలక్షలు డబ్బు పట్టుకొస్తాడు! సంపాదించిన డబ్బు ఖర్చు పెట్టెయ్య మేగాని నిల్వజేయడం టైగర్ సర్వీస్‌లో లేదు!"

'బాస్!"

'ఊ!"

"శేషగిరి డబ్బు తెచ్చి యిచ్చాక మయూరిని ఏం చేస్తారు?"

"పీక పిసికి చంపి గోతాంలో కట్టి సాగర్‌లో పారేస్తా!"

"ఆ! చంపేస్తారా?"

"డబ్బుచ్చుకుని పనిచేయక పోవడమన్నది టైగర్ చరిత్రలోలేదు!"

"బాస్! డబ్బు తీసుకుని మయూరిని వదిలిపెట్టినా ముసలిపీనుగ ఏం చేయగలడు?"

"వాడేం చేయలేడు కాని డబ్బు తీసుకుని పని చేయలేదంటే టైగర్ ప్రెస్టేజి గంగలో కలిసిపోతుంది! ఏమిటి మాలతి? ఇలాటి సలహా యిస్తున్నావు?"

మనసులో వువ్వెత్తున బాధ భయం ఎగసిపడుతుంటే తలవంచుకుని లోపలకు వెళ్ళిపోయింది మాలతి! వంటచేస్తూ కుమిలిపోసాగింది మాలతి!

జీవితంలో మొదటిసారి స్నేహ మాధుర్యం చవిచూసింది మయూరి దగ్గర! కనపడక కనపడక పదిహేను సంవత్సరాల తర్వాత బాల్య స్నేహితురాలు కనపడిందన్న సంతోషం లేకుండా పోయింది! ఎలాగైనా టైగర్‌కు నచ్చజెప్పి మయూరిని ప్రాణాలతో వదిలేయమని ప్రాధేయపడితే?

ఆ విషయం బాస్‌కు ఎలా చెప్పాలా అన్న ఆలోచనతో వుక్కిరి బిక్కిరి అయిపోసాగింది మాలతి.

* * * * * * *

"రంగనాథం! పబ్లిగ్గార్డెన్సులో బాంబు ప్రేల్చిన విషయం ఆ చూకి ఏమైనా తెలిసిందా?" అడిగాడు ఎ. ఎస్. పి శ్రీనివాస్

"తెలీలేదు సార్!"

"కోటేశ్వరుడు మధు భార్య మయూరి కిడ్నాప్‌కూ బాంబు ప్రేలుడుకు సంబంధం వుండేమో?"

"ఆ విషయం ఎక్వయిరీ చేస్తున్నాను సార్! సార్ యీ ఫోటోలు మధు బెడ్‌రూంలో దొరికాయి నాకు!" అంటూ ఆకాశ రామన్న ఫోన్‌కాల్ విషయం చెప్పాడు రంగనాథం

ఫోటో లవంక పరీక్షగా చూస్తూ "ఎవరు?" అని అడిగాడు శ్రీనివాస్.

"అందులో వున్నామె మయూరి – మధు భార్య! అతను మేఘవాహన – కువైట్‌నుండి కొద్దిరోజుల క్రితమే వచ్చాడు మయూరి మేఘవాహన ఒకరినొకరు ప్రేమించుకున్నారు మయూరి తల్లి అడ్డుపడడంతో వాళ్ల వివాహం జరుగలేదు! డబ్బు సంపాదించుకు రావాలని మేఘవాహన కువైట్ వెళ్లాడు అతను చనిపోయాడన్న వార్త వచ్చింది మయూరి తల్లి ఆమెను మధుకు యిచ్చి వివాహం చేసింది! ఇదంతా జరిగిన ఆరేళ్ళకు లక్షలు సంపాదించుకుని మేఘవాహన తిరిగి వచ్చాడు!" ఆగిపోయాడు రంగనాథం!

"ఈ విషయాలన్నీ మధుకు తెలుసా?"

"సార్! ఈ ఫోటోలు అతని బెడ్‌రూంలో దొరికాయి"

"రంగనాథం! మధుమీద ఒక కన్నేసి వుంచు! ఆడదానికోసం మహా సంగ్రామాలే జరిగాయి! మర్డర్లొక లెక్కా!"

"మీరు పర్మిషన్ యిస్తే అలాగే చేస్తాను!"

'రంగనాథం! చట్టం ముందు అందరూ సమానులే! కోటీశ్వరులనీ బీదవారనీ తేడా చూపకూడదు!'

శ్రీనివాస్‌కు సెల్యూట్‌చేసి వెళ్ళిపోయాడు రంగనాథం

* * * * * * *

తనడబ్బు ఫిక్సెడ్ డిపాజిట్ చేసిన బ్యాంకు దగ్గరకు వెళ్లాడు శేషగిరి!

"రండిసార్! రండి!" అంటూ సాదరంగా ఆహ్వానించాడు మేనేజరు

"నమస్కారం సార్! అంటూ కుర్చీలో కూర్చున్నాడు శేషగిరి

'ఏమిటిసార్! బహుకాల దర్శనం! డబ్బు ఎఫ్ డి లో వేస్తారా!"

"అహ! డబ్బు జరూరుగా కావాలి! విత్ డ్రా చేయటానికి వచ్చాను!"

"ఎకౌంట్ ఇయర్ క్లోజింగ్ టైమ్! ఇప్పుడు డబ్బుతీస్తే ఎలాగాసార్!"

"తప్పదు! అమ్మాయి పెళ్లి కుదిరింది!"

' అలాగా! శుభం! ఎంత డబ్బు కావాలేం?"

"మొత్తం అంతా కావాలి!"

"ఇప్పుడు అంతపెద్ద ఎమౌంట్ తీస్తే రిమార్కు వస్తుందే! శేషగిరిగారూ! ఒక్కవారం గడువివ్వండి! అమ్మాయి పెళ్లెప్పుడు!'

"చాలా అవసరంగా కావాలి! రేపీపాటికి డబ్బు చేతిలో పడితేగాని ముహూర్తం పెట్టుకోటానికి వీల్లేదంటున్నాడు పెళ్లికొడుకు తండ్రి"

"ఆ! ఎవరండీ ఆయన! మ్యెడాస్‌లా వున్నాడే!"

"మేనేజర్‌గారూ! నాకున్నది ఒక్కగానొక్క కూతురు! ఆమెకు వివాహానికి వుపయోగపడకపోతే యిక యీ డబ్బెందుకు?"

"అలాగే సార్! కస్టమర్‌ని కష్టపెట్టడం నా పాలసీ కాదు!" బాంకులన్నిటి చుట్టూ తిరిగి నానా అవస్థలూ పడి పదిలక్షలు విత్‌డ్రాచేసి తెచ్చాడు శేషగిరి మరురోజు మధ్యాహ్నానికి!

సాయంత్రం మధు యింటికి ఫోన్ చేసాడు శేషగిరి.

"హలో! ఎవరు మాట్లాడేది?"

'నేను బాబూ! రమణమ్మని!"

"రమణమ్మా! మధు ఏమంటున్నాడు?"

"ఇప్పటిదాకా నామీద, లతికమ్మ మీద అరిచి తోటలోకి వెళ్లాడు!"

'అరవడమెందుకు?"

"పొద్దుట్నుంచి అన్నం తినకుండా వుంటే "బాబూ అన్నానికిరా" అన్నాను

మాట్లాడలేదు!" మయూరమ్మ కనపడకపోతే అన్నం తినగూడదా" అన్నాను "ఫో! అవతలకు! నన్ను విసిగించకు!" అని అరిచాడు! కాసేపాగి లతికమ్మ ఉప్మాప్లేటు తీసుకువెళ్ళింది "వద్దుపో!" అని అరిచాడు. "అక్క లేకపోతే వుప్మా తినడానికేం? పోనీ నేను తినిపించేదా? అంటూ దగ్గరకు వెళ్ళింది. "ఛీ, ఫో! వద్దంటుంటే నీకుగాదూ! వెళ్ళు! అంటూ లాక్కొని నేలకేసి కొట్టి వెళ్ళిపోయాడు "

"అలాగా! సరే నేవస్తున్నాలే!" అంటూ ఫోన్ పెట్టేసాడు రమణమ్మ చెప్పిన మాటలు విన్నదగ్గర్నుండి శేషగిరి మనసు మనసులో లేదు!

"మేనల్లుడు- కోటీశ్వరుడు- లతికను చేసుకుంటాడు అని అపేక్ష పెంచుకుంటే పుటిక్కున పోయి మయూరిని పెళ్ళి చేసుకున్నాడు! పోనీలే మనకు ప్రాప్తం లేదుగాబోలు అని వుపేక్షించి ఆరేళ్ళు వూరుకుంటూ వచ్చాను! పెళ్ళాం పబ్లిగ్గా మరోడితో బలాదూర్‌గా తిరుగుతున్నా వాడికి దానిమీద మోజు చావక పోవడమేమిటి? పదిలక్షలు తీసుకెళ్ళి ఆ సూరిగాడికిచ్చి ఆ మయూరిని ఖతం చేయించినా వీడుదాన్ని మరచిపోయేట్టులేడే? ఏంచేయాలి?" అంటూ తలపట్టుకు కూర్చున్నాడు శేషగిరి

"కార్యసాధకుడు అడ్డంకులు ఎదురైనప్పుడు వెనుకంజ వేయగూడదు! ముందు మయూరిని అంతం చేయించి తర్వాత మధుసంగతి చూసుకుంటాను! నయాన వినకపోతే భయాన లొంగదిసుకుంటా!" అంటూ మీసం మెలివేసాడు

పదిలక్షల రూపాయలు వందరూపాయి నోట్లకట్టలుగా సూట్‌కేస్‌లో పల సర్దుకుని బయల్దేరాడు శేషగిరి. టాక్సీలో బయల్దేరి మధు యింటికి వచ్చేసాడు

మధు మేడ ఆవరణ ముందువున్న కిళ్ళీకొట్టు దగ్గర బెంచీ మీద కూర్చుని వున్న రంగనాథం టాక్సీలో శేషగిరి లోపలకు వెళ్ళడం చూసాడు. ఆ సమయంలో రంగనాథం మారువేషంలో వున్నాడు. గడ్డం, మీసం, ముదురు ఆకుపచ్చ లుంగీ, ముదురు ఎరుపు లాల్చీ, నెత్తిన లేసు టోపీతో ముస్లిం యువకునిలా వున్నాడతను ఎ ఎస్. పి శ్రీనివాస్‌తో మాట్లాడివచ్చిన దగ్గర్నుండి అతను మధును ఒక కంట కనిపెట్టి వుండాలనుకున్నాడు. అందుకే మారువేషం వేసుకుని కిళ్ళీ కొట్టుముందు కూర్చుని వున్నాడు.

శేషగిరి మేడలో అడుగుపెట్టగానే ముందుగా రమణమ్మ ఎదురయింది!

"శేషగిరి బాబూ! అమ్మాయిని మధుబాబు కసురుకున్నాడుట! వెర్రిబాగులది ఒకటే ఏడుస్తున్నది!" అని చెప్పింది

శేషగిరి చక చక లోపలకు వెళ్ళి సూట్‌కేస్ ఇనుప బీరువాలో వుంచి తాళంవేసి తాళం చెవి జేబులో వేసుకున్నాడు.

"అమ్మాయి! లతికా!"

"నాన్నా! మనం యిక్కడ నుండి వెళ్ళిపోదాం!"

"ఏమ్మా! ఎందుకని?"

"బావ కోపంగా వున్నాడు! వెళ్ళి పొమ్మని అరిచి కేకలు వేసాడు!"

"మయూరిని బాంబుపేల్చి చంపేసారు! ఇంకా శవం కూడా దొరకలేదు! అందుకని బావ చిరాకుగా వున్నాడు నీకెందుకు నువ్వు గదిలో వుండు బయటకు రాకు! బావ సంగతి నీకు తెలిసిందేగా! ఇష్టమైన వస్తువు పోతే పిచ్చివాడిలా ప్రవర్తిస్తారెవరైనా!"

"నాన్నా! అక్క చనిపోలేదట! మనం అందరంజేరి అక్కను తన నుండి వేరు జేసామంటున్నాడు మధుబావ!"

"ఆ! అంత మాటన్నాడా!"

"నాన్నా! నే నిక్కడ వుండను! బావ నా ముఖం చూస్తేనే మండిపడుతున్నాడు."

"మా తల్లివిగదూ! రెండు రోజులు వోపిక పట్టమ్మా!" లతిక మూతి ముడుచుకుని లోపలకు వెళ్ళిపోయింది.

శేషగిరి మేడ మీద మధుగది దగ్గరకు వెళ్ళాడు గది తలుపులు వేసి వున్నాయి! నెమ్మదిగా తలుపుల మీద తట్టాడు.

"ఎవరది? నన్ను డిస్టర్బ్ చెయ్యవద్దని చెప్పలా! వెళ్ళు!"

"నేను! మామయ్యని!"

"నాకు తలనొప్పిగా వుంది! నన్ను డిస్టర్బ్ చెయ్యకు! వెళ్ళు మామయ్యా"

శేషగిరి మేడదిగి కిందకు వచ్చాడు ఫోన్‌చేసి సూరితో డబ్బు రెడీగా వుందని చెబుదాం అనుకున్నాడు హాలులోని ఫోన్‌లో చెబుదాం అనుకుని మళ్ళా విషయాలన్ని అక్కడ మాట్లాడుకోవడం బాగుండదని బయటకు నడిచాడు. గేటు దాటి రోడ్డు వెంట చక చక నడుచుకుంటూ పబ్లిక్ కాల్‌ఆఫీసు దగ్గరకు వెళ్ళాడు శేషగిరి హడావిడిగా మేడలోంచి బయటకు వెళ్ళడం చూచిన రంగనాథ్ వెనుకనే తనూ బయల్దేరాడు.

అరఫర్లాంగు దూరంలో వున్న పబ్లిక్‌కాల్ ఆఫీస్ నుండి ఫోన్ చేస్తుంటే గోడచాటుగా వుండి వినసాగాడు రంగనాథ్.

"సూరి బాబుగారూ! నమస్తే!"

★ ★ ★ ★

"మొత్తం కాష్ రెడీగా వుంది!"

★ ★ ★ ★

"మరి పనిపూర్తి కాగానే యిస్తా!"

★ ★ ★ ★

"నన్ను ఆ మాత్రం నమ్మలేరా సూరిబాబుగారూ!"

★ ★ ★ ★

"సరే! కాష్ తీసుకువస్తాను! నా కళ్ళ ఎదురుగా పని పూర్తి చేద్దురుగాని'

★ ★ ★ ★

"అలాగె సార్! తమ మాటకు అడ్డేమిటి? రేపు వుదయం డబ్బు తీసుకువస్తాను! అన్ని విషయాలు మాట్లాడుకుందాం!"

★ ★ ★ ★

"సరకు ఎక్కడ అన్‌లోడ్ చేస్తారు?"

★ ★ ★ ★

"హుస్సేన్‌సాగర్‌లో నా!"

★ ★ ★ ★

ఫోన్ పెట్టేసిన శబ్దం వినబడింది

రెండుక్షణాలాగి మరలా ఫోన్ డయల్ చేయడం వినపడ ఎలర్ట్‌గా మారిపోయాడు రంగనాథం

"హలో! పోలీస్‌స్టేషనా!" గిరగొంతు- తనను ఫోనులో మయూరి గూర్చి హెచ్చరించిన గొంతు వినపడి ఆశ్చర్య పోయి కొంచెం ముందుకు వచ్చి తొంగి చూసాడు రంగనాథం

శేషగిరి రిసీవర్ మీద కర్చీఫ్ వుంచి మాట్లాడం చూసాడు రంగనాథం!" నాకు ఆకాశరామన్న ఫోన్‌కాల్ చేసింది వీడేనన్నమాట" అని మనసులో అనుకొని కుతూహలంగా వినసాగాడు.

హలో! రైటర్‌గారా?"

★ ★ ★ ★

"నే నెవరైతేనేంలెండి! మీకో విషయం చెబుదామనీ!"

★ ★ ★ ★

"కోటీశ్వరుడు మధుబాబు భార్య మయూరి శవం రేపిపాటికి హుసేన్‌సాగర్‌లో తేలుతుంది!"



## రుసరుసలాడే మిరపకాయ
## మిసమిసలాడే టమోటాను వరించింది

అప్పుడే అడ్డుకోనలవిగాని ఆశలు పరుగులుదీయ ప్రారంభించాయి.

కిసాన్‌వారి క్రొత్త టమోటా చిల్లీ సాస్ రుచులన్నీ సక్రమంగాకూడి ఆవిర్భవించిన నోరూరించే సరిక్రొత్త సాస్. ఆ రుచి, ఆ పక్వము, ఆ ఘాటు, ఓ•••లొట్టలేయించే ఆ రుచుల మేలు కలయిక••• చివరి బొట్టువరకు జుర్రుకోవాలనిపించే మీ ప్రయత్నాన్ని ఎవరైతే ఆపగలరు.

### కారకారంగా, రుచి రుచిగా రెంటి కలయికలా

చిదిమితే పగిలేలాయుండే తేనెలొలుకు టమోటాలు, తలుచుకుంటే చాలు గగనానికి ఎగిరించే ఎర్ర గారపు మిరపకాయలతో చేయగలిపాయి పరిపక్వము చెందిన రెండు విభిన్న రుచుల కలయికలో ఉద్భవించిన సరిక్రొత్త నోరూరించే రుచికి, సాస్‌ల తయారీలో అసమాన పేరు ప్రతిష్ఠలు గాంచిన కిసాన్ వారి అనుభవము తోడైంది. మీకు లభించే రుచి ఇక చెప్పాలా! మీ జివ్హా చాపల్యం తీరదూ!

### మొదటిసారే ఆ రుచికి అంకితం

మొద్దుబారిపోయిన మీ నాలుకకు జీవముట్టిపడేలా చేయండి. మీరు ఇష్టపడే ఎ వంటకాల జతలోనైనా కిసాన్‌వారి టమోటా చిల్లీసాస్‌ను వాడి చూడండి. ఆ పైన ఆ పేరు చెబితే చాలు ఆరుచికి బానిసైపోగలరు. ఉత్తేజం పరుగులు వేయనివ్వండి. కిసాన్‌వారి చవులూరించే క్రొత్తటమోటా చిల్లీసాస్‌ను పూర్తిగా ఒంపుకోండి. ఎందుకంటే మీరు ఇష్టపడే ప్రతి వంటకముతో బాటుగాని లేక ఇతర ఏ వంట కపు జతకుగాని అలా జీవముట్టిపడే రుచిని మరే ఇతర సాస్ అందించ లేదు. ప్రయత్నించి చూడండి. ఆ రుచికి అంకితమై పోగలరు.






కిసాన్‌వారి క్రొత్త
టమోటా చిల్లీ సాస్
మరేదీ దీనికి సరిరాదు

OBM 2004 Tel

# కలలుకనే కళ్ళు

ఫోన్ పెట్టేసిన శబ్దం విని రంగనాథం గోడచాటుకు వెళ్ళిపోయాడు. శేషగిరి రోడ్డు మీదకు వచ్చి అటూ యిటూ పరికించి చూచి ముందుకు సాగి పోయాడు.

శేషగిరిని ఇరవై గజాల దూరం పోనిచ్చి వెనుకగా అతన్ని వెంబడిస్తూ "ఆరి దొంగ రాస్కెల్! నన్నే ఫూల్‌ని చేద్దామనుకున్నావా!" అనుకున్నాడు. శేషగిరి మేడ దగ్గరకు వెళ్ళగానే ఎదురుగా యిరవై రెండేళ్ళ అమ్మాయి ఎదురు రావడం చూసాడు రంగనాథం.

"గురూ! ఆ అమ్మాయి ఎవరు?" అని అడిగాడు కిళ్ళీకొట్టతన్ని.

"ఆ అమ్మాయి ఆ ముసలాడి కూతురు? కొంచెం వెర్రి బాగుల్ది!" అన్నాడు కిళ్ళీ కొట్టతను.

"అంటే ఆ అమ్మాయి మధుబాబుకు..."

"మేనమామ కూతురు! మధుబాబు మయ్యూర్మను ప్రేమించి పెళ్ళి చేసుకోకపోతే మధుబాబు భార్యగా యీ మేడకు అధికారి అయి వుండేది!"

"అలాగా!" అంటూ బెంచీ మీద కూర్చుండి పోయాడు రంగనాథం.

కిళ్ళీ కొట్టతను 'ఏంభాయ్! మీ అబ్బాయి కనపడలేదా" అని అడిగాడు రంగనాథాన్ని.

"లేదుభాయ్! అవసరమైతే యిక్కడే వుండిపోతా! మతిస్థిమితంలేని మా చిన్నబ్బాయి యీ ప్రాంతాలలోనే తిరుగుతున్నాడని నా స్నేహితుడు పోలీస్ కానిస్టేబిల్ కాశిం చెప్పాడు!" అన్నాడు రంగనాథం గడ్డం సవరించుకుంటూ.

"అలాగేభాయ్! కూర్చో! రాత్రి పన్నెండింటిదాకా నాకిళ్ళీ కొట్టు తెరిచే వుంటుంది.!"

అర్ధరాత్రి పన్నెండింటి వరకూ కిళ్ళీకొట్టు దగ్గర కూర్చుని వుండి అప్పుడు స్టేషన్‌కు ఫోన్ చేసి కానిస్టేబిల్ కనకయ్యను పిలిపించుకుని అతనికి వాచ్ డ్యూటీ అప్పజెప్పి యింటికి వెళ్ళాడు రంగనాథం. స్నానం భోజనం కానిచ్చి ఒక కునుకుదీసి మళ్ళీ తెల్లవారేసరికి వచ్చి కిళ్ళీకొట్టు ముందు నిలబడ్డాడు రంగనాథం! అప్పటికింకా కిళ్ళీకొట్టు తెరవలేదు!

"కనకయ్యా! విశేషాలేమిటి?" అని అడిగాడు రంగనాథం.

"ఏంలేవు సార్!" అని పోయి రోడ్డు మొగదలన నుల్చున్నాడు కనకయ్య.

★ ★ ★ ★ ★ ★ ★ ★

హాస్పటల్‌లో మంచంమీద స్పృహ లేకుండా పడివున్న మేఘవాహన అటూ యిటూ కదలసాగాడు.

అతని పెదవులు అస్పష్టంగా "మయూరి" అని నెమ్మదిగా గొణగసాగాయి. దూదికన్న తేలికైన మేఘవాహన శరీరం పైకి, పైపైకి వెళ్ళిపోసాగింది. నల్లటి మేఘంగా మారిపోయాడు తను....! ఆకాశంలో వేగంగా బహు త్వరగా కదిలి వెళ్ళిపోతున్నాడు. కింద– భూమిమీద– దూరంగా బహు దూరంగా చిన్న నలుసులా మయూరి కనబడసాగింది. పురివిప్పుకుని సంతోషాతిరేకంతో క్రేంకరిస్తూ నయనానందకరంగా నాట్యం చేయసాగింది. ఈ లోకంలోని అందం అంతా నాదే అన్నంత అహంకారంతో ఆనందావేగంతో అపరిమితోద్రేకంలో నాట్య విన్యాసాలు చేస్తున్నది.

మయూరి భువన సమ్మోహన నాట్య విన్యాసాన్ని మరింత దగ్గరగా విలోకించాలనే తపనతో వురుకులు పరుగులతో పరిగెడుతున్నాడు తను!

కాని ఎంత పరిగెత్తినా, ఎంత ప్రయాస పడినా ఆకాశంలో నివసించే తను భూమిమీద నృత్యం చేసే మయూరిని అందుకో గలడా? గగనానికి యిలకూ వున్న దూరం అధిగమించగల శక్తి తనకు లేదని గ్రహించి ఆకాశంలోనే గిరగిర తిరుగసాగింది మేఘం!

మేఘం ఆకాశంలో చిత్ర విచిత్రంగా గర్జిస్తూ తన మనసులోని భావాలను వ్యక్తీకరించసాగింది.

నేలమీద మయూరి నాట్యమయూరిగా మారి వయ్యారంగా నర్తించసాగింది.

నాట్య మయూరిని చూసిన సంతోషాతిరేకంతో మేఘం, పరవశించి పరుగిడుతున్న మేఘాన్ని చూసి నాట్య మయూరి వివశులైపోసాగారు!

"నా అందం, నృత్యం, ఆనందాతిరేకం అన్నీ నీకోసమే" అన్నట్లు మేఘంవ[ంక] చూడసాగింది మయూరి.

"కేవలం నీ విలోకన భాగ్యంచేత నా వొడలు పొంగిపోతున్నది. నా శరీరంలో ప్రతి అణువూ కరగి పోవటానికి సిద్ధంగా వున్నది!" అనుకున్నది మేఘం.

పరవశించి పరవళ్ళు తొక్కుతూ మరింత వుద్రేకంగా నృత్యం చేస్తున్న[ది] మయూరి.

మయూరిని అందుకోవాలన్న తహ తహ ఎక్కువై అటు ఇటు పరుగెత్తు[తో]ం[ది] మేఘం! కిందకు దిగిపోవాలన్న కోర్కె ప్రబలమై మనసును వుక్కిరి బిక్క[ిరి] చేయసాగింది.

"వస్తున్నా మయూరీ! వస్తున్నా! నీ చెంతకు వస్తున్నా! ఈ విరహం భరించలేను! నీ దరిజేరి ప్రేమతో నీ శరీరం నిమిరి అలసి బడలిన నీ దేహాన్ని బిగితర కౌగలించుకుంటాను!"



వసంతహేల  చిత్రకారిణి : యస్. మంగేశ్వరి

ప్రియ సంగమ నాభిలాషతో విచక్షణ, భయం, కోల్పోయిన మేఘం వళ్ళు పులకరించి కరగి నీళ్లై, వాన చినుకులుగా మారి మయూరి మీద పడసాగింది. ప్రియ స్పర్శ కల్గించిన ఆనందంతో కరగిపోతున్న మేఘం 'కణేల్'మని గర్జించింది!

మేఘం కరగి వాన నీరుగా మారిపోసాగింది! త్వరితగతిన అంతరించిపోతున్న స్వరూపాన్ని చూచుకుని భయపడలేదు మేఘం!" ఎలాగైనా మయూరి దగ్గరకు జేరటమే నా ధ్యేయం! నేనేమైపోయినా నాకు చిగులులేదు" అనుకుంటూ కిందకు చూసింది. ఆశ్చర్యంతో బిగుసుకుపోయింది!

వర్షధారలతో మయూరి తడసి ముద్ద అయింది. ఈకలు తడసి భారమై పురి ముడుచుకు పోయింది! భయంతో అలసటతో, చలితో, వణకుతో గడగడలాడుతూ నేలకూలింది మయూరి!

"మయూరీ!" దిగ్దిగంతాలు దద్దరిల్లేలా మేఘం గర్జించింది!

# కలలుకనే కళ్ళు

"మయూరి!" పెద్దగా అరుస్తూ లేచి కూర్చున్నాడు మేఘవాహన, హాస్పటల్ బెడ్‌మీద.

తెల్లవారుతున్న సూచనగా వెలుగురేకలు తూర్పు దిక్కును ప్రభావితం చేస్తున్నాయి!

చెమటలతో నిండిన వొళ్ళు గడగడ వణకిపోసాగింది.

"నేనెంత మూర్ఖుణ్ణి! మయూరిని ప్రేమించాను! నిజమే ప్రపంచంలో ఏ యువకుడూ ఏ యువతిని ప్రేమించలేనంత గాఢంగా ప్రేమించాను! నా శరీరంలోని ప్రతి అణువులోనూ మయూరి రూపమే ప్రతిష్ఠించుకుని పూజ చేస్తున్నాను!హృదయాధి దేవతగా ఆరాధిస్తున్నాను!

పరాధీన అయిన మయూరి దరిజేరి ఆమెను కష్టాల కడలి పాల్జేస్తున్నానని తెలుసుకోలేని మూర్ఖుణ్ణయ్యాను!

నేను ప్రాణప్రదంగా ప్రేమించే మయూరి సుఖంకన్న నాకు కావాల్సిందేముంది!

వెళ్ళిపోతాను! మయూరి మీద నానీడ పడనంతదూరంగా వెళ్ళిపోతాను!

అంతర్మథనంతో ఉక్కిరి బిక్కిరి అయిపోతున్న మయూరికి స్వాస్థ్యం కలగాలంటే నేను ఇక్కడనుండి వెళ్ళిపోవాలి!"

మంచంమీద లేచి కూర్చున్నాడు మేఘవాహన! శరీరం నీరసంగా వుంది. కళ్ళు మూతలు పడుతున్నాయి. లేచి నిలబడ్డాడు. నరాల బలహీనతవల్ల చేతులు కాళ్ళు గడగడ వణకసాగాయి.

దుర్బలమైన శరీరాన్ని మనో బలంతో ముందుకు నడుపుతూ వెళ్ళిపోయాడు మేఘవాహన.

అరగంట వున్నాక కాఫీ కప్పుతో ప్రవేశించిన స్టాఫ్‌నర్స్ మేఘవాహన మంచం కాళీగా వుండడం చూసి ఆశ్చర్యపోయింది!

* * * * * *

ఆవిర్లు గక్కే బ్లాక్ కాఫీ కప్పు సూరికి యిస్తూ "ఏమిటి బాస్! ఈ రోజు పెందరాళే లేచారు?" అంది మాలతి.

విస్కీ హేంగోవర్ పోవటానికి వేడి కాఫీ ఒకో గుక్కా చప్పరిస్తూ తాగసాగాడు సూరి.

"మాలతీ!" ఈ రోజునుండి కిరాయి రౌడీ జీవితానికి స్వస్తి పలుకబోతున్నాను! ముసలినక్క పదిలక్షలు తెచ్చి యిస్తాడు! సాయంత్రం బంజారాహిల్స్‌లో బంగళాకు బయానా యిచ్చివేస్తాను. వారంరోజులలో మకాం మార్చేద్దాం. సొంత బంగళాలో నిశ్చింతగా బాదరబందీ, టెన్షన్, వర్రీలేకుండా కాలం గడుపుదాం!"

"బాస్!"

"ఊ! ఏమిటి?"

"శేషగిరి డబ్బు పట్టుకొస్తున్నాడా?"

"ఆ! ఫోన్‌చేసి చెప్పాడు కూడా!"

"ముసలాడికి డబ్బుకు లంకెగదా! వాడంత తేలికగా పదిలక్షలు వదులుకుంటాడా? అసలు బాంకుల్లోంచి డబ్బు తీసాడా అని?"

"నా శిష్యుడొకడు బాంకుక్లర్కుగా పనిచేస్తున్నాడు. వాడిని పంపి ఆరా తీసాను! శేషగిరి బాంకుల్లోంచి డిపాజిట్లు విత్ డ్రా చేసాడు. మొత్తం పదిలక్షలు కాష్ తీసుకున్నాడు! మయూరిని ఖతం చేస్తే మేనల్లుడికి కూతురు లతికను యిచ్చి వివాహం జరిపి కోట్ల ఆస్తిని గుప్పెట్లో పెట్టుకుంటాననుకుంటున్నాడు. అందువలన యిష్టంలేకపోయినా చచ్చినట్లు డబ్బు తెచ్చియిస్తాడు"

"బాస్! డబ్బు తీసుకున్నాక మయూరిని ఏం చేస్తారు!"

"మాలతీ! కిరాయి రౌడీకి కూడా నీతి అనే దొకటుంటుంది. వృత్తి ధర్మం ప్రకారం ప్రవర్తించక తప్పదు! డబ్బు తీసుకున్నాక మయూరిని మర్డర్ చేస్తాను!"

"తప్పదంటారా బాస్!"

"ఏమిటి మాలతి? ఎప్పుడూ లేంది యీసారి ఇలా అడుగుతున్నావు? తమాషాగా వుంది!"

"ఏంలేదు బాస్! వూరికే అడిగాను!" అంటూ లోపలకు వెళ్ళిపోయింది.

* * * * *

ఉదయం ఏడున్నర అయేసరికి శుభ్రంగా స్నానంచేసి నుదుట పంగనామాలు తీర్చి ఇస్త్రీ పంచె లాల్చీ వేసుకు సూట్‌కేస్ చేత బుచ్చుకుని మేడలోనుండి బయటకు వచ్చాడు శేషగిరి.

అటూ యిటూ చూసి వీధి చివరవున్న టాక్సీని చేయి వూపి సైగచేసి పిలిచాడు! టాక్సీ రాగానే అందులో ఎక్కి వెళ్ళిపోయాడు! కిల్లీకొట్టు పక్కన వున్న మోటర్‌సైకిల్ ఎక్కి టాక్సీని వెంబడించి వెళుతూ దారిలో వున్న కానిస్టేబిల్ కనకయ్యను ఫాలో అవమని సైగ చేసాడు రంగనాధం.

శేషగిరి ఎక్కిన టాక్సీ వెళ్ళి అయిదంతస్తుల అపార్ట్‌మెంట్స్ వున్న భవనం ముంగిట ఆగటం చూసి – బజారు చివర్న మోటార్ సైకిల్ ఆపుకున్నాడు రంగనాధం. అతను వచ్చేసరికి శేషగిరి ఎక్కిన లిఫ్ట్ పైకి వెళ్ళిపోతున్నది. ఇండికేటరు లైటు మూడు మీద వుండటంతో శేషగిరి మూడవ అంతస్తులోకి వెళ్తున్నాడని అర్థం అయి రంగనాధం మెట్లమీదుగా చకచక ఎక్కి వెళ్లాడు.

ఎంత పరిగెత్తుకు వెళ్ళినా లిఫ్ట్ రంగనాధం కన్న ముందుగా మూడువ అంతస్థు జేరుకున్నది. రంగనాధంకు మూడవ అంతస్తు కుడివైపున వున్న అపార్ట్‌మెంట్‌లోకి వెళ్ళిపోతున్న శేషగిరి కనబడ్డాడు!

రంగనాధం వెళ్ళి అపార్ట్‌మెంట్ డోర్ కీ హోల్‌గుండా చూసాడు. లోపల సోఫాలో కూర్చుని వున్నాడు టైగర్ సూరి! అతని ఎదురుగా సూట్‌కేస్ చేతబుచ్చుకుని నిలబడి వున్నాడు శేషగిరి!

"అయితే నిన్న శేషగిరి మాట్లాడింది సూరితో నన్నమాట!" అనుకుంటూ ఎస్. పి. కి ఫోన్‌చేసి పర్మిషన్ తీసుకుని స్టేషన్‌కు ఫోన్‌చేసి అదనపు బలగం తెప్పించుకుందామనుకున్నాడు రంగనాధం.

టైగర్ సూరి గూర్చి తక్కువ అంచనా వేయగూడదని రంగనాధానికి మనసులో ఒకమూల హెచ్చరికలు అదే పనిగా వినవస్తుండటంతో పక్కనున్న అపార్ట్‌మెంట్ తలుపు తట్టాడు! తలుపులు తెరుచుకున్నాయి.

"ఎక్స్క్యూజ్‌మీ!" అంటూ లోపలకు వెళ్ళి తలుపు గడియవేసుకుని ఆశ్చర్యపోయి చూస్తున్న అపార్ట్‌మెంట్ వోనరుకు తన ఐడెంటిడీ కార్డు చూపించాడు రంగనాధం.

"సారీ! అర్జంటుగా ఫోన్‌చేయాలి!" అపాలజిటిక్‌గా అన్నాడు.

అపార్ట్‌మెంట్ వోనరు రంగనాధాన్ని బెడ్‌రూంలో వున్న ఫోన్ దగ్గరకు తీసుకువెళ్లాడు.

రంగనాధం ఫోన్ రిసీవర్ చేతిలోకి తీసుకోగానే అతడు గది బయటకు వెళ్ళిపోయాడు.

* * * * *

"నమస్కారం సూరిబాబుగారూ!" రెండు చేతులూ జోడించి నిలబడ్డాడు శేషగిరి.

"పొద్దున్నే వచ్చావే! అదేమిటి?"

"వరాలిచ్చే దేముడి దగ్గర కొచ్చేప్పుడు వట్టి చేతులతో రాగూడదని పెద్దలు చెబుతారు!"

"రూపాయి కొబ్బరికాయ కొట్టి లక్ష రూపాయలు అడగటానికి నేనేమైనా శిలా విగ్రహాన్ననుకున్నావా?"

"కొండంత దేముడికి కొండంత పత్రి తేగలమా? ఏదో వుడుతా భక్తిగా..."

"ఆపవయ్యా నీ భట్రాజు మేళం! డబ్బు తెచ్చావా?"

"ఎంతమాట! తమరితో మాట అన్నాక తప్పుతానా తలతాకట్టు పెట్టుకుని యావదాస్తి కరిగించి మరీ తెచ్చాను! మరి తమరు నాకిచ్చిన మాట తప్పరు గదా?"

"ఛూత్! ముసలి పీనుగా! ఏమన్నావు? టైగర్ మాట తప్పటమా?!"

"తమరు మాటంటే మాటే! వెనకటి కాలంలో సత్య హరిశ్చంద్రుడు యీ కాలంలో మీరు – అటు సూర్యుడు యిటు పొడిచినా అడినమాట తప్పరు – కాని ఏదో పెద్దవాణ్ని! ఆస్తి కరిగించి డబ్బు పట్టుకువచ్చాను? చల్లని మాట తమ

నోటిమీద విందామని!"

"పది లక్షలు పట్టుకొచ్చావా? ఏది ఇటుతే!"

"డబ్బు తమరి దగ్గరుంటేనేం? నా దగ్గరుంటేనేం?" ఆ మాయలాడిని హతమార్చే విధానం ఒక్క ముక్క తమనోటి మీదుగా విందామని!..."

"ఓరి నీ! డబ్బుకు నీకు లంకె! మయూరిని చంపితేగాని డబ్బివ్వనంటావు! నువ్వు నన్ను నమ్మనప్పుడు నేను నిన్నేలా నమ్మేది? ఒక పనిచేయి! సూట్‌కేస్‌లో డబ్బు నాముందుగా లెక్కపెట్టి తాళం వేయి.

ఇద్దరం మయూరి వున్న గదిలోకి వెళ్దాం! నీ కళ్ళెదురుగా మయూరిగొంతు పిసికి చంపేస్తా! మయూరి చచ్చిపోయాక తిరిగి మన ఎపార్ట్‌మెంట్‌కు వద్దాం! అప్పుడు డబ్బు తీసుకుంటాను!"

"సూరిబాబుగారూ! మీరింత నిక్కచ్చి మనుష్యులు గనుకనే మీ పేరు రాష్ట్రమంతా మారు మోగింది! తమరెలా చెబితే అలాగే చేద్దాం!

ఇదిగో పది లక్షలు- ఎంచి చూడండి!" టైగర్ సూట్‌కేస్ తెరచి నోట్ల కట్టలు ఎన్ని వున్నాయో లెక్కెట్టాడు. మధ్యలో తెల్ల కాగితాలున్నాయేమోనని పుచ్చుకు కొన్ని కట్టలుబయటకు లాగి చూసుకున్నాడు. సూట్‌కేస్‌లో పది లక్షలున్నయ్యని నమ్మకం కలిగాక మూత వేసి పక్కన పెట్టాడు.

"సూరిబాబుగారూ! ఇక వెళ్దామా?" లేచి నుల్చుంటూ అడిగాడు శేషగిరి.

**"అంత ఆత్రపడితావేం కూర్చో!" అంటూ "మాలతీ! తీర్థం తెస్తావా? పనికి వెళ్ళబోతూ ఒక గ్లాసు పుచ్చుకుంటే మజాగా వుంటుంది!" అని కేకేసాడు.**

వెనుక గదిలో వుండి వాళ్ళ సంభాషణ వింటున్న మాలతి గుండెల్లో రైలు పరిగెత్తినట్లు దడ పుట్టింది. ఎలాగో మనసుకుదుట పరుచుకుని రాయల్ స్కాచ్ గ్లాసుల్లో వొంపి సోడా కలిపి ట్రేలో గ్లాసులుంచి ముందు గదిలోకి వచ్చి ట్రే సూరి, శేషగిరి కూర్చున్న సోఫా ముందుంచింది.

"పుచ్చుకోవయ్యా శేషగిరి! ఫారిన్ సరుకు!" అంటూ గ్లాసందుకున్నాడు సూరి.

"ఇప్పుడెందుకు సార్!" అంటూనే గ్లాసందుకున్నాడు శేషగిరి. వూరికే వచ్చిన ఫారిన్ విస్కీ వదులుకోవాలనిపించలేదతనికి!

రెండు గుక్కలు తాగి గ్లాసు కింద పెట్టాడు సూరి! "ఏమిటది? ఎప్పుడూ లేంది వళ్ళు తిరుగుతుంది! అరే ముసలాడేంటి అలా పడిపోయాడు?" అనుకుంటూ సోఫా మీదకు వొరిగిపోయాడు సూరి.

వెనక గదిలోంచి వచ్చింది మాలతి! చకచక నడుస్తూ తలుపు తెరుచుకుని బయటకు వచ్చింది. తలుపు మూసి తాళం వేసి మయూరి వున్న అపార్ట్‌మెంట్ దగ్గరుకు వెళ్ళింది. తాళం చెవితో తలుపు తెరచుకుని లోపలకువెళ్ళింది.

'మయూరి! మయూరి!" మాలతి పిలుపు విని మంచం మీద పడుకున్న మయూరి లేచి కూర్చున్నది.

"ఏమిటి మాధురి!"

"నువ్విక్కడ వుండటం మంచిది కాదు! నీ ప్రాణాల తీయటానికి కుట్ర పన్నుతున్నారు! తక్షణం నువ్విక్కడ నుండి వెళ్ళిపోవాలి!"

"నువ్వు చెప్పేదేమి నాకర్థం కావటం లేదు ! నెనిక్కడకేలా వచ్చాను?"

"అవన్నీ చెప్పే వ్యవధి లేదు! పద నిన్ను టాక్సీ ఎక్కించి మీ యింటికి పంపిస్తాను!" అంటూ మయూరి రెక్క పుచ్చుకుని అపార్ట్‌మెంట్ బయటకు నడిపించుకు వెళ్ళింది. అపార్ట్‌మెంట్ తలుపు తాళం వేసి లిఫ్ట్ దగ్గరకు మయూరిని తీసుకు వెళ్ళింది.

లిఫ్ట్ కిందకు కదలిన మరు నిముషంలోనే రంగనాథం నలుగురు కానిస్టేబిల్స్‌వెంట రాగా సూరి అపార్ట్‌మెంట్ వాకిలి దగ్గరకువెళ్ళి తలుపు టకటక బాదసాగాడు.

లిఫ్ట్ దిగి అపార్ట్‌మెంట్ బిల్డింగ్ ముందుకు వచ్చారు మయూరి, మాలతి! దూరాన వున్న టాక్సీని "టాక్సీ! యిదరావో!" అంటూ పిలిచింది మాలతి.

"టాక్సీ రాగానే మయూరిని టాక్సీలో ఎక్కించి డ్రైవర్‌తో "బంజారా హిల్స్‌కో జానా!" అని చెప్పింది.

మయూరి ఎక్కిన టాక్సీ కదలి వేగం పుంజుకుని కనుమరుగైంది.

"క్షమించు నేస్తం! నేనుమాధురిని కాదు! నీ చిన్నప్పటి ప్రాణస్నేహితురాలు మాలతినే! నీకు అబద్ధం చెప్పాను!" అనుకుంటూ కనుల నుండి కారుతున్న నీటిని తుడుచుకుంది మాలతి.

దూరంగా పార్క్ చేసి వున్న ఆటో వద్దకువెళ్ళింది మాలతి. ఆటో ఎక్కి డ్రైవర్‌తో "బస్ స్టేషన్‌కో జానా!" అని చెప్పింది. ఆటో కదలి వెళ్తుంటే వెనకకు తిరిగి అపార్ట్‌మెంట్ బిల్డింగ్ వైపుగా ఆఖరిసారి చూసింది.

"క్షమించు టైగర్! కుక్క చింపిన విస్తరిలా వున్న నా జీవితంలో కొంత కాలం వెలుగును నింపావు! నా జీవితానికి నీడనిచ్చి నీ ప్రేమతో అభిమానంతో సేద తీర్చావు. నీ ఋణం యీ జన్మలో తీర్చుకోలేను!" అనుకుంటూ మరోసారి కనులు వత్తుకుంది.

టైగర్ చేయదలచుకున్న హత్యాకాండకు ఎవరు అడ్డం వచ్చినా ప్రాణాలతో వదలడని మాలతికితెలుసు! అందుకే హైద్రాబాదు వదలి పారిపోదామని నిర్ణయించుకున్నదామె!

మయూరి ఎక్కిన టాక్సీ, మాలతి ఎక్కిన ఆటో వెళ్ళిన రెండు నిముషాలలో ఎ.ఎస్.పి. శ్రీనివాస్ పోలీస్‌వాన్ నిండా కానిస్టేబిల్స్‌ను వుంచుకుని అక్కడకు వచ్చాడు.

క్షణాలలో ఎపార్ట్‌మెంట్స్ బిల్డింగ్‌ను చుట్టుముట్టారు కానిస్టేబిల్స్.

ఎ.ఎస్.పి. శ్రీనివాస్ సూరి అపార్ట్‌మెంట్ దగ్గరకువెళ్ళే సరికి రంగనాథం తలుపు బద్దలు కొట్టాలని విశ్వ ప్రయత్నమూ చేస్తున్నాడు. నాలుగు గజాల వెనక్కు వెళ్ళి వేగంగా పరుగెత్తుకువచ్చి భుజాన్ని బలంకొద్దీ తలుపుకు మోటిచ్చాడు రంగనాథం. నూట ఎనభై పౌనుల బరువున్న రంగనాథం శరీరం యిచ్చిన కుదుపుకు తలుపులు విచ్చుకున్నాయి.

ఎ.ఎస్.పి. శ్రీనివాస్, రంగనాథం, కానిస్టేబిల్స్ లోపల సోఫాల మీద పడి వున్న సూరి, శేషగిరిలను చూసారు.

టీపాయ్ మీద వున్న విస్కీ గ్లాసు తీసుకు వాసన చూసి "సార్! స్కాచ్ విస్కీ!" అన్నాడు రంగనాథం.

శ్రీనివాస్ సూట్‌కేస్ మూత తీసి చూసాడు. "వాట్ ఎ వండర్! ఈ సూట్‌కేస్‌లో యింత డబ్బున్నదేం?" అన్నాడు. నిముషమాగి "మనం ఆలస్యంగా వచ్చామేమో రంగనాథం!" అన్నాడాయన.

ఆ క్షణాన ఫోన్ మోగింది! రంగనాథం ఫోన్ రిసీవర్ తీసుకుని మాట్లాడి "సార్' ఫోన్ మీకే! ఎస్.ఐ. ఖాన్ మాట్లాడుతున్నారు!" అంటూ రిసీవర్ యిచ్చాడు.

"హలో! ఎ.ఎస్.పి. శ్రీనివాస్ స్పీకింగ్!"

'నమస్తే! ఏమిటి విశేషం.'

"సార్! హుసేన్‌సాగర్‌లో పాతిక సంవత్సరాల యువతి శవం దొరికింది సార్! ఆమె కిడ్నాప్ చేయబడ్డ మయూరి అని అనుమానంగా వుంది!"

"బాప్‌రే! అనుకున్నంతా జరిగిందన్న మాట! మిస్టర్ ఖాన్ నేనిప్పుడే బయల్దేరి వస్తున్నాను!" అంటూ ఫోన్ పెట్టేశాడు శ్రీనివాస్.

"రంగనాథం! వుయ్ ఆర్ లేట్! హుసేన్‌సాగర్‌లో మయూరి శవం దొరికిందట!



# కలలుకనే కళ్ళు

నేను బయల్దేరి వెళుతున్నాను ఆ! మధుబాబును హుసేన్‌సాగర్ వద్దకు రమ్మని ఫోన్ చేసి చెప్పు" అంటూ హడావిడిగా వెళ్ళిపోయాడు.

ఎ.ఎస్.పి. శ్రీనివాస్ వెళ్ళిపోగానే రంగనాథం మధుకు ఫోన్ చేశాడు.

"హలో! మధుబాబుగారేనా?"

"అవును మీరెవరు?"

"నేను ఎస్.ఐ. రంగనాథాన్ని! మీ శ్రీమతి కిడ్నాప్ విషయం గూర్చి నాకు రిపోర్టిచ్చారు! గుర్తొచ్చిందా?"

"గుర్తొచ్చింది సార్ మయూరి ఆచూకీ ఏమైనా తెలిసిందా?"

"సారీ మిస్టర్ మధూ!! మేమెంత ప్రయత్నించినా ఆమె ఆచూకీ దొరకలేదు!"

"ఆ!"

"మిస్టర్ మధూ! ఎ.ఎస్.పి. శ్రీనివాస్‌గారు మిమ్మల్ని హుసేన్‌సాగర్ వద్దకు రమ్మన్నారు!"

"ఎందుకు? చెప్పండి మయూరికేమయింది?"

"మయూరికేం కాలేదు! మీరు కొంచెం ధైర్యంగా వుండాలి."

"రంగనాథంగారూ నిజం చెప్పండి! నేనేమీ భయపడను!"

"హుసేన్‌సాగర్ వద్ద ఒక యువతి శవం దొరికిన మాట వాస్తవమే! ఆమె మయూరి కాకపోవచ్చు! మీరుఒకసారి అటు వస్తే మాకు బాడీ ఐడెంటిఫికేషన్‌లో వుపయోగపడతారు."

మధు చేతిలోంచి రిసీవర్ జారి కింద పడిపోయింది. చేష్టలుడిగిన ప్రతిమలా నిలబడిపోయాడు! మనసులో నిర్వేదం నిండిపోయింది.

"మయూరి మరణించింది! నా మయూరి చనిపోయింది. నా జీవితంలో మెరుపులా మెరసిన మయూరి అంతర్ధానమైపోయింది! ఇక నా జీవితం గాఢాంధకారం నిండిన చీకటి రాత్రిగా మారిపోతుంది!"

గబగబ మెట్లెక్కి తన గదిలోకి వెళ్ళాడు. గ్లాసులోకి నీళ్ళు వంపుకున్నాడు. అలమరలో నుండి నిద్ర మాత్రల సీసా తీసుకుని మాత్రలు చేతిలోకి వంపుకున్నాడు.

"మయూరి! మరు జన్మంటూ వుంటే నీవు నాకు ప్రేయసిగా దక్కాలి! ఈ జన్మలో పొందలేని నీ ప్రేమ అప్పుడైనా పొందగలగాలి! మనిషి జీవితంలో ఆఖరుసారిగా కోరుకునే కోరిక తప్పక నెరవేరుతుందంటారు" అనుకుంటూ బిళ్ళలు మింగేసాడు.

అయిదు నిముషాలలో కనులు మూతలుబడి సోఫానుండి నేల కూలిపోయాడు.

ఇంటి ముందు టాక్సీ దిగిన మయూరి పరుగెడుతూ మేడ మెట్లెక్కి పైకి వచ్చింది.

నేల గూలి వున్న మధును చూసి "మధూ!" అని బిగ్గరగా అరుస్తూ దగ్గరకువెళ్ళింది. అచేతంగా పడి వున్న మధును పక్కన పడి వున్న నిద్ర మందు బిళ్ళల సీసాను చూడగానే ఆమె కళ్ళలో నీరుబికింది!

కిందకు దిగి వెళ్ళి డాక్టరుకు ఫోనేచేసింది. డాక్టరుగారు వస్తూనే "ఏదమ్మా! స్లీపింగ్ పిల్స్ సీసా చూపు" అని అడిగారు.

సీసా చూస్తూ "ఇవి ఎప్పుడు పట్టుకువచ్చాడమ్మా!" అంటూ స్టమక్ ట్యూబ్ వేసి జీర్ణ కోశం లోని ద్రవం, స్లీపింగ్ పిల్స్‌తో సహా వెలికి రప్పించాడు.

"మయూరి! యూ ఆర్ లక్కీ! బిళ్ళలుయింకా గ్యాస్ట్రిక్ జ్యూస్‌లో పూర్తిగా కరగలేదు!! మధు బిళ్ళలు మింగి ఎక్కువసేపు అయి వుండదు!" అని ధైర్యం చెబుతూ మధును మంచం మీద పడుకోబెట్టి సెలైన్ డ్రిప్ స్టార్ట్ చేశాడు.

మంచం పక్కన కూర్చుని తదేకంగా మధుని చూస్తూ వుండిపోయింది మయూరి. ఆమె కనుగొలుకుల నుండి నీరు అవిరళంగా కారసాగింది.

మయూరి మనసును పశ్చాత్తాప జ్వాలలు దహించి వేయసాగాయి. "ఏరి









కోరి, తల్లి జగదంబ హిరణ్యాక్షవరాలు తీర్చి తనను వివాహం చేసుకున్న మధుకు ప్రతిగా నేనేమిచ్చాను! అన్య మనస్కనై ఎడ మొఖం పెడ మొఖంగా వుంటూ తీరని మనో క్షోభ కల్గించాను'' అనుకుంటూ వాపోసొంది.

మత్తు బిళ్ళలు వెంటనే వెలికి రప్పించినందు వలన మధు శరీరం పూర్తి అపస్మారక స్థితిలోకి వెళ్ళలేదు! డాక్టరు సైకో ఎనాలిసెస్ కోసం సంపెంటో థాల్ ఎక్కించినపుడు రోగి మనసులోని విషయాలు వెలిగక్కినట్లు తన మనసులోని విషయాలను చెప్పుకురాసాగాడు మధు కనులు మూసుకుని.

''మయూరీ! చిన్నప్పట్నించి అందమైన వస్తువులను సేకరించడం నా హాబీ!నేను కోరుకున్న వస్తువు నాకు దక్కటానికై ఎన్ని అవస్థలనైనా పడేవాడిని.

నిన్ను చూసిన క్షణాన్నే విపరీతమైన ప్రేమ భావం నా మనసును ఆక్రమించుకుంది! ఎలాగైనా నిన్నే పెళ్ళాడాలనే కాంక్ష కలిగింది.

నీ మనసు మేఘవాహనపై లగ్నమై వున్నదని తెలిసి నేను నా కోర్కెను సడలించుకోలేదు.

డబ్బు పిచ్చి మిక్కుటంగా వున్న మి అమ్మను కలుసుకుని నా కోర్కె విషయం చెప్పాను! నా ఆస్థి వివరాలు తెలసుకున్న మి అమ్మ మేఘవాహనను చిడ పురుగుకన్న హీనంగా చూసింది. అతను డబ్బు సంపాదించాలనే కాంక్షతో కువైట్ వెళ్ళాడు! నటరాజు స్నేహితుడు మేఘవాహన ఏక్సిడెంట్‌పాలయ్యాడు అని నాకు చెబితే అతడు మరణించాడు అన్న అసత్య వార్త పుట్టించి ప్రచారం చేసాను. ఫలితంగా మయూరి నీవు నాదానవైనావు! కాని ప్రేమికులను విడదీయగలిగాను గాని నిన్ను మనసా వాచా కర్మణా నాదాన్నిగా చేసుకోలేకపోయాను! నీవు మనసులో కుమిలిపోతుంటే చూసి విచారించడం మినహా మరేం చేయలేకపోయాను.

మయూరి!

అందమైన వస్తువును సొంతం చేసుకోవాలనే ఆకాంక్ష వలన నా జీవితం నాశనం చేసుకున్నాను! నన్ను క్షమించు మయూరి.

మయూరి! నీవు చనిపోలేదు! స్వర్గలోకంలో విహరిస్తున్న నీ కోసం నేనూ వస్తున్నా!

మయూరి! నా మయూరి! ఒక్కసారి నోరారా 'మధూ' అని పిలువు''.

మధు గొంతు నుండి వస్తున్న శబ్దాలు ఆగిపోయాయి.

''మధూ!'' గద్గద కంఠంతో మయూరి పిలుపు విని మధు ''మయూరి'' అని బదులు పలికాడు!

మధు మరల మగత నిద్రలోకి వెళ్ళాడు. అప్పుడే లోపలకు వచ్చినడాక్టరు మధును పరీక్ష చేసి–

''మత్తు బిళ్ళల ప్రభావం వలన మనసు పొరలలో దాగి వున్న విషయాలన్నీ చెప్పాడు మధు! సుషుప్తి జాగ్రదవస్థల మధ్య కొట్టుమిట్టాడుతున్న మనిషి మనసులోని విషయాలు అలా అసంకల్పంగా బయటకు వస్తాయి!''

యు ఆర్ లక్కీ మయూరి! హి విల్ కం రౌండ్ ఇన్ ఎ ఫ్యూ అవర్స్!'' అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి పొద్దు పోయాక మధుకు స్పృహ వచ్చింది. మత్తు బిళ్ళల ప్రభావం వలన అస్పష్టంగా కనపడుతున్న మయూరి రూపాన్ని చూస్తూ ''మయూరి! నా మయూరి!'' అన్నాడు నెమ్మదిగా.

''మయూరిని, నీ మయూరిని!'' అంది మయూరి గాద్గద కంఠంతో.

మధు కళ్ళల్లో ఆందోళన, పశ్చాత్తాపం, విచారం కనపడ్డాయి.

''నేను పాపిని మయూరి! గాఢంగా ప్రేమించుకున్న ఒక యువ జంటను వేరుచేసాను!'' అన్నాడతను బాధగా.

కన్నీరు తుడుచుకుంటూ చిరునవ్వుతో ''నాకు తెలుసు మధూ!'' అంది మయూరి.

''తెలిసి కూడా నన్ను క్షమిస్తున్నావా మయూరి!''

''ఆకాశంలో తిరిగే మేఘాన్ని చూసి మయూరి పురి విప్పి నాట్యం చేస్తుంది! అంతే! మేఘం, మయూరి కలుసుకోలేవు మధూ!

ఈ సత్యం తెలుసుకోవటానికి నాకు ఆరుసంవత్సరాలు పట్టింది!''

''మయూరి!''

''మధూ! నీవే నన్ను క్షమించాలి! మనసా వాచా కర్మణా నీ ఇల్లాలుగా వుంటానని అగ్నిసాక్షిగా ప్రమాణం చేసి వివాహమాడి యీ ఆరేళ్ళుగా నిన్ను నరక యాతనలపాలు చేసాను! ఇల్లాలుగా నా బాధ్యతను విస్మరించాను''

''మయూరి!''

''మధూ!''

మధు కౌగిలిలో గువ్వలా యిమిడిపోతూన్న మయూరి మనసు నిశ్చల సరోవరంలా మారిపోయింది.

ఇన్నాళ్ళు మేఘవాహన జ్ఞాపకాల రూపంలో మయూరి మనసులో సుడులు తిరుగుతున్న సుడి గుండం ఆ క్షణాన అంతర్ధానమైపోయింది.

మొదటిసారిగా మనసులు కలిసిన దంపతుల అన్యోన్య సరాగం చూడలేనట్లు మబ్బుల చాటుకు వెళ్ళిపోయాడు చంద్రుడు!

* * * * *

''సార్! హుసేన్‌సాగర్‌లో దొరికిన శవం మాధురి అనే ఒక డాక్టరమ్మదట!'' ఎ.ఎస్.పి. శ్రీనివాస్‌తో అన్నాడు రంగనాధం!

''అలాగా మయూరి శవమని భ్రమపడ్డాడు ఎస్.ఐ. ఖాన్.''

''సార్! కిడ్నాప్, ఎటెంప్ట్ టు మర్డర్ కింద సూరి, శేషగిరిలను రిమాండులో వేసాను.''

''గుడ్! అలాటి నర రూప రాక్షసులకు శిక్ష పడకపోతే యీ దేశం ఆడపిల్లలు వొంటరిగా బజారులో తిరుగటానికి వీలుండదు!''

(అయిపోయింది)

## వ్యక్తిగతం



ప్రముఖ అంతర్జాతీయ నేరస్తుడు ఛార్లెస్ గురుముఖ్ శోభరాజ్ (41) మార్చి 16 మధ్యాహ్నం తిహార్ జైలు నించి తప్పించుకున్నాడు. ఒక పథకం ప్రకారం జైలు అధికారులకి, గార్డులకి మత్తు మందు కలిపిన మిఠాయిలు పెట్టి మరో ఆరుగురు ఖైదీలతో సహా తప్పించుకుని పారిపోయాడు. హత్యలు, దోపిడీ, మోసం, ఫోర్జరీ, మాదకద్రవ్యాల అక్రమ రవాణా వంటి ఘోరమైన నేరారోపణలు ఈయనపై ప్రపంచంలోని తొమ్మిది దేశాలలో మోపబడి ఉన్నాయి. థాయిలాండ్‌లో ఎన్నో నేరాలు చేసాడు. ఒక మహిళను దారుణంగా చంపినందుకు ఇతనికి ఆ దేశంలో మరణశిక్ష విధింపబడింది. శోభరాజ్‌ని తమకి అప్పగించవలసిందిగా ఆ దేశం భారతప్రభుత్వాన్ని కోరుతున్నది. మొత్తం నాలుగు దేశాల ప్రభుత్వాలు శోభరాజ్‌ని తమకి అప్పగించవలసిందిగా భారత ప్రభుత్వాన్ని కోరుతున్నాయి. ఇతను ఫ్రెంచి పౌరసత్వం ఉన్న వియత్నామ్ మహిళ నోయేకి, సైగాన్‌లో స్థిరపడిన భారతీయ సింధీ జవుళి వ్యాపారి హోట్‌చంద్‌కి పుట్టిన ఫ్రెంచ్ పౌరుడు. ఇతని భార్య పేరు చంతల్, కుమార్తె మధు. భారతదేశంలో ఇతను చేసిన మొదటి పెద్ద నేరం 1971లో ఒక అమెరికన్ డాన్సర్‌ని బంధించి, ఆ గదిలో నేలకి కన్నం పెట్టి కిందవున్న బంగారు నగల దుకాణాన్ని దోచుకుని దాని యజమానిని, అతని అనుచరుడిని బంధించటం. నేపాల్‌లో రెండు హత్యలు చేసినట్లు ఇతనిపై ఆరోపణలు ఉన్నాయి. గ్రీస్‌లో టూరిస్టులని దోచుకున్నందుకు శిక్ష అనుభవించాల్సి ఉన్నది. థాయిలాండ్‌లో 1975-76 మధ్య కాలంలో ఘోరమైన నేరాలు చేసాడు. బికినీలు ధరించిన అమ్మాయిలని హత్యచేసి 'బికినీ కిల్లర్'గా భయాందోళనలు సృష్టించాడు. జైలునించి తప్పించుకోవడం అన్నది ఇతనికి చాలా సులువైన పని అని ఎన్నోసార్లు నిరూపించాడు. తిహార్ జైలులో ఇతను ఇష్టా రాజ్యంగా ప్రవర్తిస్తున్నాడని, అధికారులు కొందరిని లోబరుచుకున్నాడని, మాదకద్రవ్యాలు అమ్ముతున్నాడని, ఏ నిమిషంలో అయినా అతను జైలునించి తప్పించుకు పోవడానికి అవకాశం ఉందని 1981 లోనే ఒక సీనియర్ అధికారి తమపై అధికారులకి తెలియజేసినా ఎవరూ పట్టించుకోలేదు. శోభరాజ్ చక్కని సంభాషణా చాతుర్యం కల వ్యక్తి, నయవంచన ఇతనికి వెన్నతో పెట్టిన విద్య, జూడో, కుంగ్‌ఫూ వంటి మార్షల్ ఆర్ట్స్‌లో నిపుణుడు. □

## వారఫలం

### 11-4-1986 శుక్రవారం మొదలు 17-4-1986 గురువారం వరకు

★ **మేషం :** ఈ వారం ఎలా ఉంటుందో! అని బెంగ అవసరం లేదు. గ్రహబలమున్నది. రాశిబలం ఆర్థిక బలం చేకూర్పనున్నది. వ్యాపారమందు ఊహించని అనుకూలత, వ్యవహారం సర్వానుకూలం. అనుకొన్న విధంగా 'ప్రమోషన్' లభిస్తుంది. స్త్రీలకు : శుభ సంబంధ చర్చలు. ఆనందాతిశయపు రోజులు.

★ **వృషభం :** నూతనంగా ఏదో మేలు జరుగబోవుచున్నది. వ్యాపారరీత్యా కావచ్చు, రాజకీయ రంగ విషయం కావచ్చు, ఉద్యోగ విషయం తప్పక కాగలదు. ఎవరో వచ్చి ఏదో సమకూర్పబోతారనుకోవటం పొరబాటు. కృషివలననే మేలు సంభవిస్తుంది. స్త్రీలకు : వృత్తి రీత్యా ఆనందం, ఆర్థికాదాయం.

★ **మిథునం :** ఆనందవర్ధకమైన వారం. వ్యాపారాన మేలుంటుంది. నూతన వస్తుసేకరణకు అవకాశమున్నది. ఎంతో కాలంగా ఆశిస్తున్న వాహనం అందుకోవటం జరుగుతుంది. ఈ రాశి వారికి కొందరకు విధి విరామం లేకుండా కష్టించినా పెద్దగా లాభించే మార్గం లేదు. స్త్రీలకు : పొదుపునందు శ్రద్ధ, ఆరోగ్యమందు వృద్ధి.

★ **కర్కాటకం :** నూతన వృత్తి కొందరకు లభ్యం కాగలదు. కొందరకు రచనా విధానాన అభివృద్ధి చేకూరగలదు, కొందరకు ఆశించిన 'ప్రమోషన్' లభ్యం కాగలదు. వ్యాపార రీత్యా కొందరకు ప్రయాణం చెప్పదగిన వారం. పత్రికా ప్రకటనదారులకు, విలేఖరులకు కొంత హాయి, ఆనందం కలిగించే వారం. స్త్రీలకు : నగలు కొనుగోలు, వస్త్ర సేకరణ, వృత్తి మెరుగు చెప్పవచ్చు.

★ **సింహం :** చాల మంది దూర ప్రాంతాలకు, ఒక వేళ విదేశాలకు పోవటం నిశ్చయం, వృత్తియందు వికాసం చెప్పదగిన అంశం. ప్రతిభ రాణించగల సమయం. రాజకీయంగా ఎలాంటి మేలు జరుగబోదని గ్రహించుట అవసరం. స్త్రీలకు : ఆదాయమున్నది. వృత్తియందు పెంపున్నది. వ్యాపారమందు మేలున్నది. ప్రశాంతదాయక వారం.

★ **కన్య :** బాగా విజయవంతమైన వారం. చుట్టాపక్కాలు రాగలుగుతారు. శుభ కార్య ప్రశ్నలుదయిస్తాయి. ఇక, వ్యాపారమా బాగా సాగిపోతుంది. వ్యవహారం కూడా విజయవంతమే, అంతా 'శనిగ్రహ' మహిమే. ధనాదాయంగల వారం. స్త్రీలకు : వస్తుసేకరణ, ఉద్యోగ రీత్యా హాయి, అనుకూలం.

★ **తుల :** నాలుగ రకాల సంపాదనా వ్యర్థమే. అనవసర వ్యయం. ఆరోగ్యమందు లోపం. సుఖ శాంతులకులోపం, ఏదో తెలియని ఆందోళనతో బాధ, సాయం చేస్తామన్నవారు చేయపోవటంతో, బాగా అశాంతి ప్రబలుతుంది. స్త్రీలకు : ఏవో గొడవలు. ధన లోపం, ఉద్యోగమందు శ్రమ.

★ **వృశ్చికం :** నూతన వ్యక్తులతో పరిచయం, ధనవంతుల సహాయం లభ్యం కావటం, ఆలోచన ప్రకారం అంతా విజయవంతంగా జర్గటం, శ్రమకరమైనా ఒకానొక విషయంలో మేలు చేకూరుట కూడా గమనిస్తారు. దూరాన్నుండి బంధువులు రావచ్చు. స్త్రీలకు : అనుకోకుండా ప్రయాణాలు తగులవచ్చు.

★ **ధనుస్సు :** స్థిమితంగా చేసినందున ఒకానొక విషయంలో విజయసాధన జరిగిందనే తృప్తి ఏర్పడుతుంది. సంఘసేవా పరాయణత్వంతో, బంధువులకు సహాయం చేయిటంతో కాలక్షేపం. ధన విషయంలో ఎలాంటి అంతరాయం రాదు. స్త్రీలకు : ప్రత్యేకంగా ఒకానొక విషయాన మేలు చేకూరుతుంది.

★ **మకరం :** ఏనాడో చేసిన బాసను ఈ వారం నెరవేర్పక తప్పదు. చాక చక్యంతో ఒకానొక వ్యవహారం అనుకూలం చేసికొంటారు. నూతన వ్యక్తులతో పరిచయం ఏర్పడుతుంది. ఎదురు చూచే వాహనం సమయానికి అందుతుంది. స్త్రీలకు : పలువురిలో పేరు ప్రతిష్ఠలకు అవకాశమున్నది, గ్రహించండి.

★ **కుంభం :** ఏమనుకొన్నా ప్రయోజనం లేదు. తొందరపడి ఏదో చేసారుగా! దాని ఫలితం అనుభవించి తీరాలి. ఉద్యోగరీత్యా యిబ్బందులు తప్పవు. తలవని తలంపుగా బంధువులో మిత్రులో యింటికి వస్తారు. బాగా శ్రమకరమైన వారంగా గ్రహిస్తారు. స్త్రీలకు : ఆదాయవృద్ధి, వృత్తియందు ప్రసిద్ధి.

★ **మీనం :** దూర ప్రాంతాల నుండి బంధువులు రావచ్చు, మీ సహాయం కోరవచ్చు. ప్రయాణం చేయవలసిన పరిస్థితులు చాల మందికి రాగలవు. వ్యాపార రీత్యా కొందరకు ప్రయాణం చెప్పనైన వారం. స్త్రీలకు : దూరాన్నుండి శుభ వర్తమానం కొందరకు, వృత్తియందు పెంపు కొందరకు చెప్పవచ్చు.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

ఇంద్రాణి.

"ఊఁ! కలువపూలు తెమ్మన్నావుగా?" అంటూ చెప్పులు తొడుక్కున్నాడు సురేంద్ర. గిఁయ్యిమని ఈల వేస్తూ గబగబా మేడ మెట్లు దిగసాగాడు. మెట్ల మలుపులో టక్కున ఆగిపోయాడు.

మల్లె తీగలా ఒయ్యారంగా పైకి ఎక్కి వస్తూన్న చిత్రరేఖ అతన్ని చూసి అంతకుముందే అక్కడ నిలబడింది. అతడి కళ్ళలోకి సూటిగా చూసి చిరునవ్వు నవ్వింది. తగ్గు గొంతుకతో 'చాన్నాళ్ళయింది కదూ?" అంది కవ్వింపుగా, కళ్ళు తిప్పుతూ.

నోటికి వేలు అడ్డం పెట్టుకుని "ఉష్!" అన్నాడు సురేంద్ర.

"అమ్మాయిగారొచ్చారు కదూ?"

అతను పైకి చూపాడు.

గుండె ఒడిలోకి వచ్చి పడిపోయేలా నిట్టూర్చిందామె. "ఈ పిల్లి మా ఉట్లో పెరుగు కోసం యింకెందు కొస్తుందిలే!" అంటూ పైకి నడిచింది. ఆమె పిరుదు మీద ఒక్క చరుపు చరిచి కిందికి వచ్చాడు సురేంద్ర.

సేద్యం నాద్యం, వ్యాపారం వ్యవహారం అన్నీ నాగమనాయుడు గారే చూసుకుంటారు. కోరింది అనుభవించటం తప్ప సురేంద్రకు మరో వ్యాసంగం లేదు. అలాంటి వాడు ఈ పూట పనిగట్టుకొని పాచికుంటకు బయలుదేరాడు, తన మరదలి కోసం

కలవపువ్వులంటే ఇంద్రాణికి ఎంతో ఇష్టం. పాచికుంటలో కలువలు పూస్తాయని ఆమెకు తెలుసు అందుకే యింటికి రాగానే అడిగింది, 'బావా, పాచికుంటలో కలువపువ్వులున్నాయా?' అని. 'అబ్బో, ఎన్ని పువ్వు లున్నాయనుకున్నావు? చూట్టానికి వెయ్యికళ్ళు కావాలి. 'వొస్తావా, వెళ్దాం?' అన్నాడు తాను. 'ఊహూఁ, నేరాను. నువ్వే తీసుకురా!' అంది ఇంద్రాణి. వెధవ బుద్ధి తనది, ఆమె దృష్టిలో నమ్మకం పోగొట్టుకున్నాడు తాను. మునుపోసారి కలువపువ్వుల కోసమని వెంట తీసుకెళ్ళి వెధవ వేషాలు వెయ్యబోతే, ఏడ్చినంత పని చేసింది. అప్పటి నుంచీ తన వెంట ఒంటరిగా ఎక్కడికీ రాదు.

సురేంద్ర క్రికెట్ కామెంటరి వింటూ, ఎండి పిరుగులైన వాగు దాటుకొని, మరికొంత దూరం నడిచి గుట్ట మలుపు తిరిగి పాచికుంట చేరుకునే సరికి, ఒళ్ళంతా చెమటలు పట్టింది.

చూట్టానికి వెయ్యి కళ్ళు కావాలని తానన్నాడు గానీ. కుంటలో డజన్ పువ్వులైనా లేవు. అది కూడా కుంట నడుమ చేతికి అందనంత దూరాన వున్నాయి. వాటి కోసం నడుం లోతు నీళ్ళలోకి దిగి వెళ్ళక తప్పదు.

పాచికుంటకు అవతల నాగమనాయుడు గారి పొలాలున్నాయి. వాటి నడుమ పెద్ద వంపు బావి వుంది. సురేంద్ర పొలం గట్ల మీదుగా నడుస్తూ బావిని సమీపించాడు. ఆశ్చర్యం! గోడకు వేలాడదీసిన జలాశయ దృశ్యంలా బావి నిశ్చలంగా, నిశ్శబ్దంగా వుంది. వేసవికాలం గనక, పొద్దు గూట్లో



పడే వరకు ఊళ్ళోని పిల్లలంతా బావిలో మునకలు వేస్తూ వుంటారు. ఎందుకో మరి, ఇవాళ ఒక్క పిట్టయినా లేదు. చాలా దగ్గరలో – తలకోనలో ఒకటీ, కొటాలలో ఒకటీ సినిమా షూటింగ్‌లు జరుగుతున్నాయి. కుర్ర మూకంతా యిక్కడెందుకుంటారిక?

పంపుషెడ్డు తాళం వేసి వుంది. "కావేటిగా! ఓరి కావేటీ!" అంటూ గొంతెత్తి పిలిచాడు సురేంద్ర. బదులు రాలేదు. వీడు కూడా తలకోనకో, కొటాలకో వుడాయించేసి నట్టున్నాడు. వెధవ! సేద్యగాడికి కూడా మగబిడ్డే!

ఆటకు అంతరాయం కలిగిన కారణంగా క్రికెట్ కామెంటరీకి బదులు సినిమా సంగీతం వీనులకు విందు చేస్తోంది. సురేంద్ర తన చేతి గడియారం, ట్రాన్సిస్టరూ, చెప్పులూ బావి గట్టున వుంచాడు. వాటి పక్కనే ధోవతీ, చొక్కా విప్పి పెట్టాడు. చొక్కా జేబులోంచి సిగరెట్టు ప్యాకెట్టు, అగ్గిపెట్టె తీసి సిగరెట్టు ఒకటి వెలిగించుకున్నాడు. తువాలు భుజాన వేసుకుని పాచికుంట వైపు నడిచాడు. వేసవి ఉక్కకు రోసి అతను ఈ పూట బనీను తొడుక్కుని రాలేదు. ఆరుబయట తన అందమంతా ఆరబోసుకునే అవకాశం దొరికినందుకు అతడి కట్‌డ్రాయరు మదపిచ్చి పట్టిన వాడిలా పదేపదే నవ్వుకుంటోంది. ఎర్రటి ఒంటి మీద వంపులు దిరిగిన నల్లటి రోమాలు కోకలు పోగొట్టుకున్న గోపికల్లా గోల పెడుతున్నాయి.

కుంట నిండా పాచి, జమ్మిపొదలు. నీళ్ళ అడుగున ప్రశాంతంగా పవళించిన బురద. నీలంగా వున్న నీళ్ళ నడుమ పచ్చని ఆకుల పహరాలో పలుకు లెరుగని పరలోక బాలికల్లా ముగ్ధమోహనంగా చెంగలువలు! సురేంద్ర నీటిలోకి నడచి పొడుగాటి తూండ్లతో సహా వాటిని తుంచుకుంటుంటే, గ్రహపాటుకు తలలు వంచే అబలల్లా మౌనంగా రోదించాయి అవి.

అరడజను పువ్వుల్ని తుంచుకుని మళ్ళీ బావి

# నీలిపోగుల్లో నూలిపున్నమి

దగ్గరికి వచ్చాడతను. మోకాళ్ళ దాకా నల్లటి బురద, నడుం చుట్టూ పచ్చటి పాచి, ఒళ్ళంతా దురద పెడుతోంది.

ఎండ మాయమైంది. ఒంటికి గంధం రాస్తూ చల్లటి గాలి వీస్తోంది. పొదుగు కింది కోడిపిల్లల్లా ఆకాశంలో మబ్బులు 'గుమిగూడుతున్నాయి. పక్కనున్న మట్టి దిబ్బ మీద ఎవరిదో పెంపుడు నెమలి పురి విప్పి ఆడుతోంది. వాతావరణం హాయి గొలుపుతూంది. ట్రాన్సిస్టర్‌లో మామూలు కార్యక్రమాలు ప్రసారమౌతున్నాయి.

సురేంద్ర మెట్ల వెంబడి బావిలోకి దిగి, బుడుంగున నీళ్ళలో దూకాడు. డుబుక్కు డుబుక్కున బావి అంచుల వెంబడి ఓ చుట్టు వేసి వచ్చి, కింది మెట్టు మీద నిలబడి చేతులతో ఒళ్ళంతా రుద్దుకున్నాడు. రకరకాల విన్యాసాలతో అరగంట సేపు తనివిదీరా ఈదులాడాడు. వేసవి కాలంలో ఒక్కసారి నీళ్ళల్లోకి దిగిన తర్వాత కాస్సేపటికే లేచి వెళ్ళాలంటే మనసు రాదు కదా?

ఆకాశంలో మబ్బులు బావిలోకి దూకుతాయేమో నన్నట్లుగా బరువుగా వేలాడుతున్నాయి. బోనులో నుంచి బయట పడబోతున్న సింహంలా దూరాన ఎక్కడో మేఘం గర్జించింది. పిట్టలన్నీ గోలగోలగా పరుగులు తీస్తున్నాయి. ట్రాన్సిస్టర్ ఉర్దూలో వార్తల్ని ఏకరువు పెడుతోంది.

హఠాత్తుగా ఆకాశంలో నించి వాన చినుకులు వూడిపడి బావి నీళ్ళ మీద జలతరంగిణి వాయించడం మొదలెట్టాయి. సురేంద్ర గబగబా గట్టు మీదికి పరుగు తీసి, తువ్వాలు అందుకోబోయాడు. క్షణంలో విభ్రాంతికి లోనై వెలవెలబోతూ నిలబడ్డాడు.

కలువపువ్వులున్నాయి, చెప్పులున్నాయి, వాచీ వుంది. సిగరెట్లూ అగ్గిపెట్టే వున్నాయి – అయితే, తువ్వాలు లేదు, చొక్కా లేదు, ధోవతీ లేదు. ఒంటి మీదున్న కట్ డ్రాయర్ మాత్రమే అతనికి మిగిలింది. ఇవేమీ పట్టించుకోకుండా కళ్ళు మూసుకుని ఇంగ్లీషులో వార్తలు వల్లిస్తోంది ట్రాన్సిస్టర్.

* * * * *

దొంగైతే, వాచీ, చెప్పులూ ట్రాన్సిస్టర్ అన్నీ మాయమై వుండాలి కదా? ఏ కొంటె వెధవ చేశాడీ పని?

చినుకుల జబర్దస్తీ ఎక్కువైంది. ఏం చెయ్యాలో తోచలేదు. చెప్పులు తొడుక్కుని, వాచీ కట్టుకుని, దుస్తుల చోరీ మినహా లోకంలోని విశేషాలన్నిటి గురించీ తెగవాగిన ట్రాన్సిస్టర్ గొంతు నొక్కి పంపు షెడ్డు గోడ వార ఒదిగి నుంచున్నాడు సురేంద్ర.

బట్టలెత్తుకెళ్ళిపోయిన కొంటె కోనంగి ఎవడో తిరిగి వస్తాడేమోనని ఆశించాడు. ఆ జాడ కనిపించలేదు. తన సేద్యగాడైనా యిటు వస్తాడేమో, వాణ్ణి యింటికి పంపి బట్టలు తెప్పించుకుందా మనుకున్నాడు. వాడూ రాలేదు. చెరకు తోటల్ని దాటి అవతలికి వెళ్తే, ఎవరైనా కనిపించవచ్చు. అయినా ఈ వానలో ఎవరుంటారు?

చుట్టూ చెరకు గుములు, కొబ్బరి చెట్లు, మామిడి తోపులు, కొండలు – అన్నీ అడుగు కదపలేకుండా నిలబడి పోయాయి వానలో, తనలాగే! నింగి నేలా రెండూ బూడిదరంగు ముతక కంబళి ముసుగులో బిగి కౌగిళ్ళలో ఒదిగిపోయాయి. పంపుషెడ్డు తాళం పెట్టకుండా వుంటే, లోపలనైనా తలదాచుకుని వుండవచ్చు. ఎప్పుడు వెలుస్తుందో ఈ వాన!

చీకట్లు చిక్కబడిన చాలా సేపటికి వాన వెలిసింది. వాచీ చూసుకున్నాడు సురేంద్ర. గంట ఏడున్నర! వాగు దాటి రోడ్డు వెంబడి యింటికి వెళ్ళడం తప్ప గత్యంతరం లేదిక! ఎలా వెళ్ళడం? నలుగురూ నవ్వరూ? మానం పోదూ? బట్టలకు బావుటా ఎత్తిన తాను ఉండీ లేనట్లున్న కట్‌డ్రాయర్‌తో ఊరేగుతుంటే, తెల్ల పులిని చూసినట్లు విడ్డూరంగా చూడరూ ఊళ్ళోవాళ్ళు?

సిగరెట్టు మీద సిగరెట్టు కాలుస్తున్నాడు సురేంద్ర. బావిలో బండ దొర్లిపడి అంచులకు తప్పుకునే మురికి తెట్టులా ఆకాశంలో తేటదేలిన నల్లమబ్బులు దిగంతాలకు తొలగిపోతున్నాయి. తూరుపు వైపున సముద్ర కెరటంలా సాగిలబడి చెదిరిపోతున్న ఓ నల్లమేఘం చాటున పున్నమిచంద్రుడు తొంగి చూస్తున్నాడు.

క్రమంగా ఆకాశం తేటబడింది. సిరాలో తడిసిన కాగితంలా ఆకాశమంతా నీలిమ. తెల్ల నూలుపోగులు పడుగూ పేకా వేసుకుంటున్నట్లు వెన్నెల. నీళ్ళలో మునిగిలేచిన కుందేళ్ళకు మల్లే చెట్టూచేమా పైరూ పచ్చా ఆ వెన్నెల్లో ఒళ్ళు దులుపుకుంటున్నాయి. వెండి బిళ్ళల మొలతాడు కట్టుకున్న చంటిపాపడు నిక్కరు వూడదీసి చింపి పోగులు వెదజల్లుతూ పాలపళ్ళతో నవ్వుతూ బోంగ రాల్చుకుంటూ పడుతూ లేస్తూ పరుగులు తీస్తున్నట్లుగా వున్నాడు చంద్రుడు. బావి గట్టున





# తల్లి పాలు బిడ్డకు అన్నిటికీ మించిన పోషకాహారమేకాక ఎంతో మానసిక సంతృప్తిని కూడా కలుగచేస్తాయి

తల్లిపాలు తాగటం వలన మాతా శిశువుల ఆత్మానుబంధం ఎంతో దృఢతరమవుతుంది. తల్లి ప్రేమను బిడ్డకు పంచి పెట్టేందుకు యిదే ప్రకృతి సిద్ధమైన పద్ధతి. శిశువు సంతోషంగా సంతృప్తిగా పెరిగేందుకు దోహద పడుతుంది.

కేవలం తల్లిపాలు మాత్రమే బిడ్డకు కావలసిన పోషకాహారాన్ని, సమపాళ్ళలో అందించ గలుగుతాయి.



**మీ బిడ్డను, మీ చనుపాలతోనే పెంచండి. అదే ప్రకృతి నిర్దేశించినది, మీ శిశువుకు కావలసినది.**

కాని ఏదైనా అనుకోని ఇబ్బంది వచ్చినపుడు, అంటే ఏదైనా జబ్బు చేసినప్పుడో, పాలు సరిపడనప్పుడో విజయ స్ప్రేను వాడండి – చక్కగా పరీక్షించబడిన నమ్మకమైన శిశు ఆహారం. మీ బిడ్డ ఆరోగ్యం కాపాడడానికి డబ్బా మీద వ్రాసిన సూచనలను క్షుణ్ణంగా చదివి, అమలు పెట్టండి.

**శిశు సంరక్షణ కొరకై, విజయ స్ప్రే తయారీ దారులైన ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య వారిచే విడుదల చేయబడినది.**

పడి వున్న కలువపూలు నిక్కి చూశాయి.

చీకట్లో గనిమల మీద జాగ్రత్తగా నడుస్తూ చెరకు తోట దాటి వెళ్ళి, ఊరి వైపు చూశాడు సురేంద్ర. గుట్ట మరుగున ఊరు కనిపించటం లేదు. వెన్నెల్లో చెట్లు నల్లగా, నేల మసకమసకగా కనిపిస్తున్నాయి. ప్రకృతి కునుకు తీస్తోంది. పెద్ద దగ్గరికే తిరిగి వచ్చాడు సురేంద్ర. ఊరు ఒళ్ళు మరిచి నిద్రపోయే దాకాయిక్కడ నక్కి వుండి, ఏదో విధంగా గూడు చేరుకోవాలి.

చిరుచలికి సన్నగా వొణుకు పుట్టుకొస్తోంది. ఈ వాన కూడా ఒకందుకు మేలే అయింది. వీధుల్లో ఎవరూ మంచాలు వేసుకుని పడుకోరు ఈ రాత్రికి.

సిగరెట్లన్నీ అయిపోయాయి. గంట పదకొండు!. చందమామ నడి నెత్తి మీదున్నాడు. ఊళ్ళో సినిమా థియేటర్ ఒకటుంది. రెండో ఆట ఒంటి గంటకు వదులుతారు. అంచేత యిప్పుడు బయలుదేరటం మంచిది.

సురేంద్ర కలువ తూండ్లు చేతబట్టుకుని వెన్నెల నీలి వెలుగుల్లో అడుగులో అడుగు వేసుకుంటూ చెరకు తోట దాటి వచ్చి పాచికుంట పక్కన ఆగాడు. గోంద్రు కప్ప ఒకటి క్షంగున నీళ్ళలోకి దూకింది. నీళ్ళలో చంద్రుడు కుంటంతా ఈదులాడాడు.

సురేంద్ర చేతిలోని కలువపువ్వుల్ని కుంటలోకి విసిరేశాడు. చంద్రుణ్ణి ముక్కలు ముక్కలుగా చింపి మొలకు కట్టుకుంటున్నాయి కలువలు.

వాగు దాటి వూళ్ళోకి వెదుతోంది రోడ్డు. సురేంద్ర వాగులోకి వచ్చి నిలబడ్డాడు. రోడ్డు వెంబడి వెళ్ళడం కుదరదు. ఎందుకంటే, వీధి దీపాలు కన్నార్పకుండా చూస్తుంటాయి. ఇప్పుడిలా యింటికి వెళ్ళటానికి కూడా వీల్లేదు. ఇంట్లో ఇంద్రాణి వుంది కదా! తాను వెళ్ళి కాలింగ్ బెల్ నొక్కగానే, తలుపు తీసేది అమ్మే అయితే ఫరవాలేదు. ఇంద్రాణి అయితే, ముఖం ఎక్కడ దాచుకోవాలి?

అందుకని, అలాంటి పరిస్థితికి అవకాశం యివ్వకుండా ఒక నిర్ణయం చేసుకున్నాడు సురేంద్ర. అర్ధచంద్రాకారంగా ఊరి అంచుల వెంబడి వంపు తిరుగుతూ పోతుంది వాగు. వాగులో నడిచి వీలు దొరికిన చోట ఊళ్ళోకి వెళ్ళిపోవచ్చు. అలా వెళ్ళి సంపాయించుకోదగిన ఆశ్రయం దగ్గరి దారిలో ఏది వుంది?

లీలామోహన్‌కి, తనకీ మంచి స్నేహమే వుంది. లీలా మోహన్ ఉద్యోగ రీత్యా ఈ వూరొచ్చి నాలుగు నెలలైంది. ఓ గొందిలో మేడపై పోర్షన్‌లో అద్దెకుంటున్నాడు. ఇంకా కాపురం తెచ్చుకోలేదు. ఈలోగా తానూ, లీలామోహన్ ఆ పోర్షన్‌లో అన్ని రకాల అలగా పనులూ చేశారు. కనుక కాస్సేపు లీలామోహన్ బట్టలు తొడుక్కుంటే నామోషీ ఏమీ లేదు.

వాగు వెంబడి దారి తీశాడు సురేంద్ర. కడుపులో ఆకలి మారాం చేస్తున్నా, ఇప్పుడు అది సమస్య కానే కాదు. ఎవరైనా చూస్తారేమోననీ, 'ఎవరది' అని పలకరిస్తారేమోననీ ఓ భయం. పురుగూపుట్రా ఏదైనా కాలి కింద పడుతుందేమోననీ మరో భయం.

## నీలిపోగుల్లో నూలిపున్నమి

వాగు గట్ల వెంబడి నల్లటి నీడలు. ఆ నీడల్లోంచి పైకి లేచి నిలబడిన భూతాల్లా – ఈత, కాకి వెదురు, జమ్మి, కానగ, కలబందలాంటి మొక్కలు. వానకు తడిసిన ఇసుకలో సర్రు సర్రుమంటూ తన అడుగులు తనకే భీతి గొల్పుతున్నాయి. పక్కన పొదలో దాగిన ఏదో పిట్ట గుండె జల్లుమనేలా తుర్రుమంది. వాగు మీదికి వాలిన చింతకొమ్మలో గుడ్లగూబ లబలబలాడింది. వెనక వైపు సమాధుల చాటు నుంచి గుంటనక్క ఊళ పెట్టింది. సురేంద్ర అలా వాగులో నడవటం నిజంగా అదొక గొప్ప సాహసయాత్రే! నీలాకాశంలో మల్లెపూల తెప్పలా తేలిపోతున్న పూర్ణచంద్రుడొక్కడే అతడికి అభయం. సాధ్యమైనంత వరకు ఇసుక పర్రల మీద వాలిన వెన్నెల పొడల మీదనే అడుగులు వేస్తున్నాడతను. తన ఈ దుస్థితికి కారణమైన వాళ్ళి ఈ ఇసుకలోనే గుంట తీసి పాతెయ్యాలనిపించింది.

వాగులో సాహసయాత్ర ముగిసింది. దగ్గరగా యిళ్ళు కనిపిస్తున్నాయి. దడదడలాడుతున్న గుండెలతో మొండిగోడల చాటున నక్కుతూ నడయాడుతూ ఓ ఇరుకు వీధిలోకి వచ్చాడు సురేంద్ర. అక్కడ వీధి దీపాలు లేవు. చీకటి, నిశ్శబ్దం యథేచ్ఛగా రాజ్యమేలుతున్నాయి. గోడల వెంబడి కదిలి ఓ మేడ ముందు ఆగాడతను. ఓ సారి పైకి చూశాడు. పై అంతస్తులోని చీకటి కిటికీ చువ్వల్ని పట్టుకుని కిందికి చూస్తూ కొంటెగా నవ్వుతోంది.

సురేంద్ర మేడ మెట్ల మీదుగా పైకి వెళ్ళి గుమ్మం ముందర విలాసంగా నిలబడ్డాడు. అతడి గుండె కుదుటబడింది. తన కష్టాలన్నీ గట్టెక్కినట్లనిపించింది. లీలామోహన్ పైన పేలటానికి ముందు రూపుదాల్చి నుంచున్న పెద్ద జోక్‌లా తనని తానే వూహించుకుని చారెడు నవ్వు ముఖాన పులుముకుని మెల్లగా తలుపు తట్టాడు.

అలా రెండు మూడు సార్లు తట్టిన తర్వాత లోపల భళ్ళున ట్యూబ్‌లైట్ వెలిగింది. ఆ వెమ్మట తలుపులు తెరుచుకున్నాయి. సురేంద్ర ముఖాన మోసులెత్తిన నవ్వు పిడుగు దెబ్బతిన్న పూలచెట్టులా మాడి భస్మమైపోయింది; తలుపు తీసిన వ్యక్తి లీలామోహన్ కాదు; నిద్ర కళ్ళతో శాంతంగా సహనంగా లేచి వచ్చిన ఎవరో సంసారస్త్రీ! చెప్పులతో, వాచితో, ట్రాన్సిస్టర్‌తో గుమ్మాని కెదురుగా పాల వెలుగుల్లో మునిగి తేలుతున్న ఆ అవతారాన్ని చూసి ఆమె మూర్ఛ వచ్చినట్టు కెవ్వున కేక వేసింది.

సురేంద్ర బెదిరిన లేడిలా ఒక్క ఊపున మేడ మెట్లు దిగి తన నీడతో చెట్టాపట్టాలు వేసుకుని పరుగందుకున్నాడు. తలనీలా లిచ్చేస్తానని ఆ పరుగులో నే వెంకటేశ్వరుడికి వాగ్దానం యిచ్చేశాడు. వీధిదీపాలు ఎదురైనప్పుడు చేతుల్లో ముఖం దాచుకున్నాడు. భౌ భౌ మంటూ ఊరకుక్కలు వెంటబడ్డాయి. అతడి ఒళ్ళంతా చెమటలు పట్టింది.

ఆయాసంగా ఓ సందులో ఆగాడు. అతడి కళ్ళలో వెయ్యిదీపాలు ఒక్కసారిగా వెలిగాయి. ఎదుట కనిపిస్తున్న పెంకుటిల్లు చిత్రరేఖదే! మొగుడు వొదిలేసిన చిత్రరేఖ ఆ యింట్లో ఒంటరిగా స్వేచ్ఛగా వుంటోంది. ఆ చోటు తనకు కొత్త కాదు గదా? తన పడుచుదనం ఎన్నిసార్లు అక్కడ విందులు చేసుకోలేదు! ఇంతకంటే అనువైన ఆశ్రయం యింకేముంటుంది?

తలుపు తట్టాడు సురేంద్ర. బదులు లేదు. రెండోసారి తట్టాడు. "ఎవరూ?" అంది చిత్రరేఖ. మూడోసారి తట్టాడు.

"వస్తున్నా!"

లోపల వెలిగిన దీపకాంతి తలుపు సందులోంచి చొచ్చుకొచ్చింది. చిత్రరేఖ తలుపు తీయడం ఆలస్యం, దీపకాంతి కంటే చురుగ్గా, లోపలికి

## ఈ ఉగాది నాడు ....

పావని  
రసయామినియై  
ఆమనిలో  
తేలియాడు వేళ  
అల బృందావన సాక్షాత్కారం  
కృష్ణ జిగీషతో!

ప్రకృతి  
మధురరాగశ్రుతిని  
పరమప్రీతిగా  
ఆలపించు వేళ  
మురళీ మోహన సౌభాగ్యం  
కృష్ణ వివిదిషతో!

రాచిలుకలు  
రమ్యగీతులు పలికే వేళ  
గండు కోయిలలు  
హంసధ్వనులు వినిపించే వేళ  
రాసలీలా విశేషం!  
కృష్ణతత్త్వ విలాసం!

సెలయేటి రాచహంసలు  
కైశికీ పాదాల పరవశించే వేళ  
వలపు నెమరుల తీపి భ్రమరాలు  
మయి మరుపుల పులకించే వేళ  
రాధికాశృంగార విరహసౌందర్యం!  
కృష్ణ తృష్ణ వంశీ పారవశ్యం!

ప్రాయం పరువం పాదరసం  
కందర్ప దర్పదరహాసం వింగడించేవేళ  
సత్యం తత్త్వం రతీత్వం  
చిత్ర చైత్ర చైతన్య వసంతమై సందడించేవేళ  
పారమార్థిక వైభవ నికుంజం!  
ప్రతి ప్రత్యగాత్మా సమర్పించే కర్పూర నీరాజనం!

– డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# ఎల్లప్పుడూ ఆంప్రోనే!

పిల్లలకు
ఆంప్రో అంటే ప్రాణం...
అందుకే ఎప్పుడూ
తయారుగా ఉంచుతాను!
అందులో ఎంతో రుచి,
బలమూకల బిస్కట్లు!

కాస్త ఆగండి...
ఒక్క బిస్కట్టును తినండి.




## ఆంప్రో గ్లూకోజ్ బిస్కట్లు
## ఆంప్రో తో మీకు నాణ్యత ఖాయం.

Sista's/AIL/232/85 Tel a




# ఎందరు దేవతలు?!

భగవంతుడు సర్వత్రా వ్యాపించి ఉన్నాడనీ, ఆయన రూపరహితుడూ, నిర్గుణుడూ అనీ, ఆ మహత్తర శక్తి రూపుని వల్లనే సృష్టి స్థితి లయలు కలుగుతున్నవనీ విజ్ఞులు తెలుపుతున్నారు. ఇలా ఉన్నప్పుడు మనం వేరు వేరు దేవతలను కల్పించడం, వారి విగ్రహాలను దేవాలయాలలో ప్రతిష్ఠించి షోడశోపచార పూజలూ చెయ్యడం ఎందుకని కొందరికి సందేహం కలగడం సహజం.

ప్రతిభావంతులైన తత్త్వజ్ఞులు, మనస్సును నిలకడగా ఉంచుటకు ఎదురుగా ఒక లక్ష్యం లేకపోయినా స్వరూప రహితుడైన పరమాత్మ పైనే చిత్తాన్ని నిలిపి ధ్యాననిష్ఠులయి కృతార్థులు కాగలరు. కాని, సామాన్య మానవులకు అది సాధ్యం కాదు. చంచలమైన మనస్సును స్థిరంగా నిలపడానికి ఒక లక్ష్యం ఉండాలి. దీన్ని గ్రహించే మన ప్రాచీనులు విగ్రహ రూపాలను ఏర్పరచి, వాటికి సత్త్వ రజస్తమో గుణాలను కల్పించి, వాటి విశిష్టతను, మహాశక్తినీ వివరించే గాథలను పురాణాల ద్వారా ప్రచారం చేసి జనసామాన్యానికి వానిని పూజించుటకు ఎంతో ఆసక్తిని కలిగించారు. కేవలం ధ్యానం వల్ల ప్రయోజనం వుండదని షోడశోపచారాలతో పూజలను నిర్ణయించారు. ఈ విధంగా ఎందరో దేవతల దేవాలయాలు గల పుణ్యక్షేత్రాలూ, పవిత్ర తీర్థాలూ ఏర్పడినవి!మహేశ్వరుడు, నారాయణుడు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, వినాయకుడు, హనుమంతుడు, కుమారస్వామి మున్నగు పురుష దేవతలు, లక్ష్మి, పార్వతి, మున్నగు స్త్రీ దేవతలు భక్తుల పూజలను అందుకొంటూ వారి కోరికలను సఫలం చేస్తున్నారు. ఒక దేవతయే పెక్కు పేర్లతో వివిధ స్థలాలలో ఆరాధింపబడుతున్నారు. ప్రజల నమ్మకాలు విభిన్నంగా ఉన్నందున వారి వారి యిష్ట దేవతలనే కొలవడం జరుగుతున్నది. వారి దృష్టిలో ఇతర దేవతలు తమ యిష్ట దైవాలకంటే ఎక్కువ అనే భావం ఉండదు. సామాన్య ప్రజలకు ఆధ్యాత్మిక చింత కలగవలెననే సంకల్పమే ఇందరు దేవతలకూ, ఇన్ని క్షేత్రాలకూ ప్రధాన కారణం.

ఎవరు ఏ దేవతను పూజించినా, ఆ పూజ పరమాత్మకే చెందుతుంది. అందువల్ల విభిన్న సంప్రదాయాల వారు వేర్వేరు దేవతలను సేవించడంలో తప్పు ఏమీలేదు. ఈ విషయాన్నే భగవానుడు భగవద్గీతలో అర్జునునకు స్పష్టంగా తెలియజేసి ఉన్నాడు.

—బులుసు వేంకట రమణయ్య

---

## నీలిపోగుల్లో నూలిపున్నమి

చొచ్చుకుపోయాడు సురేంద్ర. మూల చుట్టి పెట్టిన సిరిచాపను నేల మీద పరిచి గుమ్మాని కెదురుగా గోడకు చేరగిలబడి కూర్చుని, "హమ్మయ్య! ఆ తలుపు మూసెయ్!" అన్నాడు రొప్పుతూ.

అతడి తీరు చూసి విస్తుపోయిందామె. "ఏమిటీ వేషం?" అంది, బుగ్గన వేలేసుకుంటూ.

"అదంతా ఓ పెద్ద చరిత్ర! ఎవడో మాంత్రికుడు 'సాహసము సేయరా డింగరీ' అంటూ నా బట్టలు మాయం చేశాడు. తింటానికేమున్నా వుందా?" లోకం కళ్ళలో పడకుండా జాగ్రత్తగా తప్పించుకొచ్చిన అతను చిత్రరేఖ ముందు ఏ మాత్రం లజ్జ చెందటం లేదు.

ఇంతలో లోపలి గది తలుపు కిర్రుమంది. లోపలి నుంచి ఓ మనిషి వచ్చాడు. సురేంద్ర వైపు ఓ చూపు విసిరి గబగబా వెళ్ళి వాకిలి తలుపు బార్లా తెరిచి వీధిలో నిలబడ్డాడు. రెప్ప వాల్చేలోగా, తొడుక్కున్న బట్టల్ని విప్పి చుట్ట చుట్టి సురేంద్ర ఒడిలో పడేలా విసిరాడు. అతడి ఒంటి మీద కాకీ నిక్కరు మాత్రం మిగిలింది. ఆ బట్టలు విప్పే వరకూ సోమయ్య సోమయ్యగా కనిపించలేదు.

"బట్టలు దొరికినాయని సంబర పడిపోయినాను గానీ, బావిలో వున్నది నువ్వని నాకు తెలియదు. కోపగించుకోవద్దన్నా!" అనేసి, నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ముందుకు సాగాడు సోమయ్య.

తెరిచిన నోరు మూసుకోవటం మరిచిపోయాడు సురేంద్ర. వాడి కాకీ నిక్కరుకు, తన కట్ డ్రాయర్‌కూ తేడా ఏముంది? అయితే నీలినీడల్లో తక్కుతూ తారాడుతూ ఎన్ని అవస్థలు పడి యిక్కడి కొచ్చాడు తాను! ఇక్కణ్ణుంచి బయటపడి వాడు నట్ట నడివీధుల్లో వీధి దీపాల వెలుగుల్లో ఎంత నింపాదిగా నడిచిపోతున్నాడు!

అది కాదు గానీ వింత – తాను ఎంత విస్సంకోచంగా వచ్చాడిక్కడికి! సోమయ్యకైతే ఈ బట్టలు కావాల్సొచ్చిందా!

చిత్రరేఖ ఓ సారి గుమ్మంలోంచి వీధి చివరికి నిక్కి చూసి కిలారున నవ్వింది. సురేంద్ర కళ్ళలోకి ఎత్తి పొడుపుగా చూసి, "సిగ్గులేని పిల్లడా! ఆ బట్టలు తొడుక్కోవా?" అంటూ తలుపు మూసి గొళ్ళెం పెట్టింది.

చుక్కల కొక్కేలకు చమ్కీ దారాలు కట్టి వెన్నెల పిల్లలు కన్నుల పండుగగా ఉయ్యాల లూగుతున్న వినీలాంబరంలో నిండు చంద్రుడు అందానికి ఏలికగా వెలిగిపోతున్నాడు. □

GRAMS . "SUGARS"
TANUKU

TELEX : RY-0492-242
RY-0492-203
HD-0155-6570

PHONES : 333 (5 lines)




# THE ANDHRA SUGARS LIMITED

VENKATARAYAPURAM (TANUKU) - 534215, S.C. RLY.
WEST GODAVARI DIST., ANDHRA PRADESH.

## MANUFACTURERS OF

## DE-SMET ANDHRA
## WHOLE CANE DIFFUSER TN TYPE
## BEGASSE DIFFUSER TS TYPE

AND

| | |
|---|---|
| SUGAR | SULPHURIC ACID |
| INDUSTRIAL ALCOHOL | SUPER PHOSPHATE |
| DENATURED SPIRITS | CAUSTIC SODA (LYE & FLAKES) |
| ACETIC ANHYDRIDE | CHLORINE |
| ACETIC ACID | HYDROCHLORIC ACID |
| ETHYL ACETATE | CHLOROSULPHONIC ACID |
| ASPIRIN | CAUSTIC POTASH |
| U. D. M. H. (Rocket fuel) | ALUM |

ధన్ ధన్ మంటూ ట్రైన్ కృష్ణా బ్యారేజ్ దాటుకుంటుపోతోంది. ఆ చప్పుడుకు కృష్ణకు మెలకువ వచ్చింది.

కళ్ళు విప్పి బెర్త్ పైనుండి తలవంచి ఎదురుగా కిటికీలో నుండి చూసాడు. చీకటిలో తెల్లని కృష్ణనీరు అస్పష్టంగా కనిపిస్తోంది.

ట్రైన్ బ్యారేజి దాటి పోయింది. కళ్ళు మూసుకున్నాడు కృష్ణ మళ్ళీ. ఉయ్యాలలా ఊగుతున్న ట్రైన్ కుదుపులకు మళ్ళీ నిద్రపట్టేసింది.

అతనికి తిరిగి మెలకువ వచ్చేసరికి ట్రైన్ విజయవాడ దాటిపోయినట్టు ఉంది. దాహంతో నోరు ఎండిపోతోంది. బ్యాగ్ కింద ఉంది. అందులో వాటర్ బాటిల్ ఉంది. అతను బెర్త్ దిగాడు.

కింద తన సీట్లో ఎవరో ఆడమనిషి కూర్చుని ఉంది. కిటికీలో తల ఆనించి దీక్షగా బైటకు చూస్తోంది.

"ఎక్స్క్యూజ్‌మి మిస్" ఆమెను పిలిచాడు.

"ఈ సీటు మీదాండి, అయాంసారి!" అంటూ లేవబోయింది.

"ఫరవాలేదు. ప్లీజ్ సిడౌన్. పైన బెర్త్ ఖాళీగా ఉంది. నేను అక్కడ పడుకుంటాను. మీరు కూర్చున్న సీట్ కింద నా బ్యాగ్ ఉంది అది ఇవ్వండి చాలు" ఆమెను వారిస్తూ బ్యాగ్ అడిగాడు.

ఆమె గబుక్కున వంగొని సీట్ కింద ఉన్న కృష్ణ బ్యాగ్ ఇవతలకు తీసి అందించింది. అతను బ్యాగ్ తీసి అందులో వాటర్ బాటిల్ తీసుకుని మంచినీళ్ళు తాగాడు. తరువాత అది బ్యాగులో పెట్టేసి "థాంక్సండీ"! అంటూ బ్యాగ్ ఆమె చేతికిచ్చాడు. అది భద్రంగా సీటు కిందకు తోసేసింది.

"నేనే మీకు థాంక్స్ చెప్పాలండీ" అంటూ చిన్నగా నవ్వింది. చీకట్లో ఆమె

# వసంతగీతం

దేవినేని ఉష

పలువరుస తళుక్కుమంది.

కృష్ణ కూడా ఎదురు నవ్వుతూ మౌనంగా వెళ్ళి బెర్త్ ఎక్కి పడుకున్నాడు.

రైలు వేగంగా పరిగెత్తసాగింది.

తిరిగి అతనికి మెలకువ వచ్చేటప్పటికి తెల్లవారిపోయింది.

బెర్త్ దిగాడు. మద్రాస్‌లో ఎక్కిన చాలామంది తమ గమ్యాలలో దిగిపోగా వారి స్థానాలలో కొత్త ముఖాలు కనబడ్డాయి. తన సీట్ వేపు చూసాడు.

ఆమె తల కిటికీకి ఆనించి నిద్రపోతోంది. సన్నగా, తెల్లగా చాపలా మెరిసిపోతోంది. ఆకుపచ్చ నైలక్స్ చీర చాటు నుండి ఆమె పొట్ట మెరుస్తూ ఉంది. ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు తీస్తున్నప్పుడు పల్చని ఆమె ఛాతి ఎగిరి పడుతోంది. సన్నజాజి మాలలా అనిపిస్తోంది. కృష్ణ తన చూపులు మరల్చుకున్నాడు. అతని మనసులో మాలతి మెదిలింది. మాలతి గంభీరమైన రూపం, విజ్ఞానం దీపికల్లా వెలిగే కళ్ళు గుర్తువచ్చాయి. అతని మనసు పులకరించింది.

'మైడియర్ మా లా! ఐ లవ్ యూ!' పరవశంగా అనుకున్నాడు.

తన సీట్‌కింద బ్యాగ్ జాగ్రత్తగా ఆమెకు తగలకుండా అవతలకు లాగాడు. అందులో బ్రష్ తీసి బాత్‌రూంలోకి దూరాడు. అతను తిరిగి వచ్చేసరికి ఆమె ఇంకా నిద్రపోతూనే ఉంది. 'రాత్రంతా నిద్రలేనట్టు ఉంది పాపం!' అనుకుంటూ కృష్ణ ఆమె సీట్ ఎదురుగా ఉన్న సీట్‌లో కూర్చున్నాడు.

కిటికీలో నుండి బైటకు చూడసాగాడు. అతని ఆలోచనలలో మాలతి నిండిపోయింది.

కృష్ణకు కాబోయే భార్య మాలతి. కృష్ణకు తల్లీ, తండ్రీ చిన్ననాడే చనిపోయారు. అప్పటికి కృష్ణకు ఐదేళ్ళు. కృష్ణ తండ్రి ఆర్.టి.సి. డ్రైవర్. భార్య అంతక్రితం కృష్ణకు నాలుగోయేట మరణించింది. తండ్రి ఈశ్వర్ కృష్ణను హాస్టల్‌లో పెట్టి పెంచసాగాడు.

కృష్ణకు ఐదు సంవత్సరాల వయసులో ఈశ్వర్ బస్ తిరుపతి లోయలో పడిపోయింది. ఈశ్వర్‌తో పాటు బస్‌లో అందరూ ఘోరంగా మరణించారు. ఈశ్వర్ మరణం కృష్ణకు అర్థం అయ్యే వయసు కాదు అది. ఈశ్వర్ ఉద్యోగం మీద చనిపోయినందుకు ముప్ఫయివేల రూపాయలు వచ్చాయి. అవి ఆర్.టి.సి. అధికారులు కృష్ణపేరున బ్యాంక్‌లో వేసారు. కృష్ణను హాస్టల్‌లోనే ఉంచాలని నిర్ణయించారు. ఆ సమయంలో ఈశ్వర్ దూరపు బంధువు వరుసకు తమ్ముడు అయిన సుబ్బారావు ముక్కుపచ్చలారని కృష్ణను చూసి జాలిపడ్డాడు. అప్పటికి అతనికి ఇద్దరు ఆడపిల్లలు ఉన్నారు. మగపిల్లలు లేరు.

కృష్ణను తను పెంచుకుంటానని సుబ్బారావు ముందుకు వచ్చాడు. అధికారులు ఆలోచించి కృష్ణను సుబ్బారావుకు అప్పగించారు. కృష్ణ పేరున ముప్ఫయివేలు వారు అప్పటికే పదిహేను సంవత్సరాలు ఫిక్స్‌డ్‌లో వేసారు కాబట్టి డబ్బు కోసం సుబ్బారావు ముందుకు వచ్చాడన్న ఆలోచన లేదు. పసివాడు కాబట్టి ఆలనా, పాలనా ఉండాలని యోచించి వారు కృష్ణను సుబ్బారావుకు అప్పగించారు.

సుబ్బారావు మాట నిలబెట్టుకున్నాడు. అతని భార్య కూడా కొడుకుమీద చూపించే ప్రేమ అంతా కృష్ణమీద చూపించేది.

సుబ్బారావు కూడా ఆర్. టి. సి.లో పర్చేజింగ్ ఆఫీసర్‌గా చేస్తున్నాడు.

అతని కూతుళ్ళలో పెద్ద కూతురు శాంతి పదేళ్ళది, చిన్న కూతురు ప్రమీల ఏడేళ్ళది. ఇద్దరూ కృష్ణను స్వంత తమ్ముడిలా చూసుకునేవారు.

కాలం గడచిపోసాగింది. పెరుగుతున్న కృష్ణ తల్లీ, తండ్రినీ మర్చిపోసాగాడు. స్కూల్ ఫైనల్ ఫస్ట్ క్లాస్‌లో పాసయ్యాడు.

కృష్ణకు వయసుతో పాటు తెలివి తేటలూ, జాలి ఏర్పడ్డాయి. ఆ ఇంట్లో ఏ బజారు పనైనా కృష్ణ చేయాల్సిందే. ప్రతి ఒక్క బాధ్యత అతని చేతులమీదే నడవాలి.

కృష్ణ కాలేజీలో చేరిన ఏడే సుబ్బారావు పెద్ద కూతురు శాంతి పెళ్ళి చేసాడు. ఆ పెళ్ళి పెత్తనం అంతా కృష్ణదే.

శాంతి అత్తవారింటికి వెళ్తూ అమ్మా, నాన్న గురించి విచారించలేదు. కృష్ణను వదిలి వెళ్ళాల్సి వచ్చినందుకు బాధపడిపోయింది. శాంతి భర్త రాజేష్ కృష్ణతో అభిమానంగా మాట్లాడాడు.



కొత్త సీరియల్ ప్రారంభం!



# వసంతగీతం

కృష్ణకు ఇంటర్‌లో కూడా క్లాస్ వచ్చింది. సుబ్బారావు సలహాపై బి. కామ్ ..చేసాడు.

బి. కామ్ కూడా జిల్లాకే ప్రథమశ్రేణిలో పాసయ్యాడు. అతనికి ఆ వెంటనే ..రాబాద్‌లో సెంట్రల్ బ్యాంక్‌లో జాబ్ వచ్చింది. కృష్ణ వెళ్ళి చేరిపోయాడు. ..డు గదుల ఇల్లు తీసుకున్నాడు. హోటల్ భోజనం చేసేవాడు. సుబ్బారావు, ..ని భార్య వరమ్మని తనతో వచ్చి తన దగ్గరే ఉండమని కోరేవాడు. సుబ్బారావు ..ల పెళ్ళి ప్రయత్నాలలో ఉన్నాడు. రిటైర్ అయ్యాక నీ వద్దే ఉంటామని ..ని రమ్మని బలవంతం చేస్తున్న కృష్ణకు నచ్చజెప్పేవారు.

ప్రమీలకు కూడా మంచి సంబంధం వచ్చింది. శాంతి భర్త రాజేష్ ఇంజనీర్. ..రికోటలో అతని జాబ్. ప్రమీల కాబోయే భర్త ఎయిర్‌ఫోర్స్‌లో మెకానిక్‌గా ..న్నాడు.

కృష్ణ ప్రమీల పెళ్ళికి పది రోజుల ముందే ఇంటికి వెళ్ళిపోయాడు. పెళ్ళి ..ట్లు అన్నీ తానే చేయసాగాడు. సుబ్బారావుకు నిశ్చింతగా అనిపించింది. ..రోజు రానే వచ్చింది.

పెళ్ళికొడుకు కమలాకర్ తరుపున వచ్చిన వాళ్ళలో ఒక అమ్మాయి కృష్ణను ..ంగా ఆకర్షించింది. కమలాకర్‌కు చాలా దగ్గరగా మసలుతోంది ఆమె. ..లాకర్ బాబాయ్ కూతురనీ, వాళ్ళు ఉండేది మద్రాసులో అనీ రాబట్టాడు ... ఆమె గురించి అతను ఆ వెంటనే మనసు పారేసుకోకపోయినా ఆమెను ..లో పెట్టుకున్నాడు.

సుబ్బారావు కృష్ణను పిలిచి కమలాకర్ తండ్రికీ, పిన తండ్రికీ, ..మామలకు అందరికీ పరిచయం చేసాడు. కృష్ణ వినయంగా మాట్లాడాడు. ..ందరిలో కమలాకర్ పినతండ్రి కృష్ణను చాలా ఆసక్తిగా మాట్లాడించాడు. ..విసుగు లేకుండా ఆయనతో మాట్లాడాడు.

పెళ్ళి దివ్యంగా జరిగిపోయింది. కృష్ణ తిరిగి హైదరాబాద్ వచ్చేసాడు.

ప్రమీల ఢిల్లీ వెళ్ళబోయే ముందు తమ్ముడికి లెటర్ వ్రాసింది. అది చూసి ..విజయవాడ వచ్చాడు.

ప్రమీల, కమలాకర్ ప్రయాణం ఏర్పాటులో ఉన్నారు. కమలాకర్, కృష్ణ ..గా స్నేహంగా మాట్లాడుకున్నారు. శాంతి, రాజేష్ కూడా వచ్చారు. ఇల్లంతా ..వడిగా ఉంది.

అందరూ హాల్లో కూర్చుని నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకోసాగారు. ..బ్బారావుగారు కూడా వచ్చి జాయిన్ అయారు.

"ఒరే కృష్ణా! నీకు పెళ్ళి సంబంధం వచ్చిందిరా" నవ్వుతూ చెప్పారు.

"మైగాడ్! ఎక్కడ నాన్నా?" భయంగా చూసాడు కృష్ణ. అక్కలు, బావలు ..సి ముసిగా నవ్వుకున్నారు.

"మీ చిన్న బావ బాబాయిగారు గుర్తున్నారా?" అంటూ ఆ రోజు.... రాజేష్ ..్త చేసాడు.

"ఆఁ! గుర్తు వచ్చింది. ఆయనకు మద్రాస్‌లో జాబ్ కదండీ" అంటూ ..లాకర్ వేపు చూసాడు.

"అవునురా! వారి అమ్మాయే. పేరు మాలతి. ఎమ్. ఎ. పూర్తి చేసి పి. హెచ్. ..చేస్తోంది" సుబ్బారావు గారు అన్నారు.

"అమ్మో! అంత చదువు ఉన్న పిల్లా! నేనేమో ఒట్టి గ్రాడ్యుయేట్‌నే" కృష్ణ ..వేహంగా అన్నాడు.

మాలతి అతనికి బాగానే గుర్తు ఉంది. ఆమెను కాదనేందుకు కారణం లేదు. ఆమె చదువు గురించి విని జంకాడు.

"మా బాబాయికి మీరు బాగా నచ్చారు. అంత చదివినా మా మాలకు ఫీలింగ్ ..దదు. ఏదో చదువు వస్తోంది కదా అని చదివింది. ఇక జాబ్ అంటారా? మీ ..మైతే చేస్తుంది. లేకపోతే లేదు. దట్సాల్!" కమలాకర్ చెప్పాడు.

"నాకు వద్దనటానికి అవసరం లేదు. ఆమెకు ఇష్టమైతే. అయామ్ రెడీ!" ..భుజాలు ఎగరేసాడు.

"వెరీ థాంక్స్!" అంటూ కమలాకర్ కృష్ణకు షేక్‌హాండ్ ఇచ్చాడు.

"నేను చెప్పలేదా అల్లుడుగారూ! మా కృష్ణ మన మాట జవదాటడని" గర్వంగా చూసారు సుబ్బారావు గారు.

"కృష్ణా! నేను అల్లుడిగారి బాబాయికి నీ అంగీకారం తెల్పి నీకు లెటర్ వ్రాస్తాను" అన్నారు సుబ్బారావుగారు. ఆ సంభాషణ అక్కడితో ఆగింది.

మర్నాడు ఉదయం కూతురి కోసం వరమ్మగారు రకరకాల పిండి వంటలు చేయించింది. ఆ రాత్రే వారి ప్రయాణం. తమిళనాడుకు టికెట్స్ తెచ్చారు.

ఆ రాత్రి ఎవరికీ నిద్రలేదు. పన్నెండుదాకా కబుర్లతో కాలక్షేపం చేసారు. కృష్ణ బైటకు వెళ్ళి ఆటోలు తెచ్చాడు. ఇంటిల్లపాది రెండు ఆటోల్లో సర్దుకుని కూర్చున్నారు.

కమలాకర్ స్వంత వూరు భీమవరం. అతని వాళ్ళు కొత్త దంపతులకు అక్కడే వీడ్కోలు చెప్పేసారు.

ట్రైన్‌లో ప్రమీల సామానంతా జాగ్రత్తగా సర్దారు. గార్డు గ్రీన్ సిగ్నల్ చూపించాడు.

"బావగారు! విష్ యు హాపీ మేరిడ్ లైఫ్!" కృష్ణ మనస్ఫూర్తిగా అంటూ కమలాకర్‌కు కిటికి బైట నుండి చేయి అందించాడు.

"వెరీ మెనీ థాంక్స్! త్వరలో మీ వెడ్డింగ్ పంపిస్తారని గెస్ చేస్తున్నాను" కమలాకర్ కృష్ణ చేయి గట్టిగా పట్టుకుని ఊపుతూ అన్నాడు.

"ఓ.కే." కృష్ణ పెదవులపై నవ్వు విరిసింది.

"మాల మేరేజ్‌కి పెత్తనం అంతా నాదే. అంతే కాదు. మీకు కాళ్ళు కడిగేది కూడా నేనే. ఎందుకంటారా మా బాబాయ్‌కు మగపిల్లలు లేరు"

"ఐ. సి. అయితే ఛాన్స్ అంతా నాదేనన్న మాట" కృష్ణ కొంటిగా కన్ను గిటాడు.

ప్రమీల నవ్వింది.

కృష్ణ చామనఛాయలో ఉంటాడు. విశాలమైన నుదురు, సన్నగా వెక్కినట్టు ఉన్న చెంపల్లో రెండు వేపులా ఆడపిల్లలకు పడినట్టుగా సొట్టలు పడతాయి. దాదాపు ఐదున్నర అడుగులు ఉంటాడు. పొడుగుకు తగ్గ లావుతో హుందాగా ఉంటాడు.

ట్రైన్ కదిలింది. అందరూ వీడ్కోలు చెప్పారు. చిన్న కుదుపుతో మెల్లగా సాగిన తమిళనాడు ఎక్స్‌ప్రెస్ క్రమంగా వేగం పుంజుకుని దూరంగా చుక్కలా కనిపిస్తూ స్టేషన్ దాటిపోయింది.

ప్రమీల దూరం అయినందుకు అందరి హృదయాలు భారమయ్యాయి. వరమ్మ దుఃఖంతో కళ్ళు ఒత్తుకుంటూ నడిచింది.

మర్నాడు శాంతి, రాజేష్ కూడా వెళ్ళిపోయారు.

కృష్ణ కూడా ప్రయాణమయ్యాడు. చిన్న కూతురు ప్రమీల కోసం చేయించిన పిండి వంటల్లో తీసినవి కొన్ని శాంతికివ్వగా మిగిలినవి కృష్ణ బ్యాగులో సర్దింది వరమ్మ.

కృష్ణ హైదరాబాద్ వచ్చేసాడు. పగలంతా బ్యాంకులో కాలక్షేపం చేస్తూ నైట్ ఎమ్. కామ్‌కు ప్రిపేరవ్వాలని నిశ్చయించుకున్నాడు. మాలతి చదువును దృష్టిలో పెట్టుకునే అతను ఈ నిర్ణయం తీసుకున్నాడు. తన భార్య పి. హెచ్. డి. చేస్తున్నప్పుడు తను కనీసం పోస్ట్ గ్రాడ్యుయేట్ అయినా అవాలని కోరిక.

నెల రోజులు గడిచి పోయాయి. అప్పుడప్పుడు అక్కలు, బావలు లెటర్స్ వ్రాస్తే వారికి జవాబు వ్రాస్తూ తనకు తోచిన బహుమతులు పోస్ట్ ద్వారా పంపేవాడు.

ఆరోజు సుబ్బారావు గారి నుండి లెటర్ వచ్చింది. మాలతి తండ్రి వచ్చి తనతో మాట్లాడాడు అనీ కృష్ణను ఒక్కసారి మద్రాసు పంపవలసిందిగా కోరాడని, కాబట్టి కృష్ణ మద్రాస్ వెళ్ళేందుకు సిద్ధం అయి విజయవాడ రమ్మని వ్రాసారు.

ఈసారి కృష్ణకు నాలుగురోజుల కంటే ఎక్కువ సెలవు దొరకలేదు.

బస్‌లో విజయవాడ వచ్చాడు ఉదయానికి . ఇంటికి వెళ్ళేసరికి వరమ్మ మొహంనిండా సంతోషం నింపుకుని ఆహ్వానించింది.

కాఫీలయ్యాక సుబ్బారావుగారు కృష్ణను దగ్గర కూర్చో బెట్టుకున్నారు. మాలతి తండ్రి రామనాథం ఇస్తానన్న కట్నకానుకల గురించి చెప్పాడు.

"నువ్వు అయనకు బాగా నచ్చావురా" ! చివరగా అన్నారు. కృష్ణ నవ్వాడు.

"నువ్వు వెళ్ళి ఫార్మాలిటీగా పిల్లను చూసిరా! నీకు నచ్చితే నేను, అమ్మా శ్రీహరికోట వెళ్ళి పెద్దక్కను, బావగార్ని తీసుకువెళ్ళి పసుపు , కుంకుమ పెట్టి ఖాయం చేసుకు వస్తాం."

"అలాగే నాన్నా! నాకు ఈసారి లీవ్ నాలుగు రోజులే ఉంది. నేను మెడ్రాసే వెళ్ళి వచ్చేటప్పుడు ఇక్కడ దిగను. సరాసరి వెళ్ళిపోతాను. వెళ్ళగానే మీకు లెటర్ వ్రాస్తాను. ఏమంటారు?"

సుబ్బారావుగారి తల పంకించారు. "ఇవాళ తిథి మంచిదే. మధ్యాహ్నం కోరమాండల్ ఎక్స్‌ప్రెస్‌కు బయల్దేరు".

"అలాగే నండి" అంటూ కృష్ణ లేచాడు. బీసెంట్ రోడ్ సెంటర్‌కు వచ్చాడు. పాత ఫ్రెండ్స్ కనబడ్డారు. వాళ్ళతో పదింటి వరకూ కాలక్షేపం చేసి తిరిగి ఇంటికి వచ్చాడు. వరమ్మ అతని కోసం భోజనం సిద్ధం చేసింది. సుబ్బారావుగారు డ్యూటికి వెళ్ళి పోయారు.

కృష్ణ తల్లితో కబుర్లు చెప్తూ భోజనం పూర్తి చేసాడు. ఆ తల్లి, తండ్రికి తను స్వంత కొడుకుననే తెలుసు కృష్ణకు. వీళ్ళు తనని పెంచుకున్నారన్న అనుమానం కృష్ణకు ఎప్పుడు రాలేదు. ఇన్నేళ్ళబట్టి ఆ ఇంట్లో ఆ ప్రస్తావన ఎవరి నోటి వెంటా రాలేదు.

పన్నెండు అవుతుండగా తల్లికి చెప్పి బైటకు వచ్చి రిక్షా కట్టించుకున్నాడు. వరమ్మ అక్కడ అందర్ని అడిగానని చెప్పమంది . తలూపాడు.

అతను స్టేషన్‌కు వచ్చిన కాసేపటికి కోరమాండలు ఎక్స్‌ప్రెస్ వచ్చేసింది. కృష్ణ టి. సిని పట్టుకుని ఎలాగో సీటు రిజర్వ్ చేయించుకున్నాడు.

ట్రైన్ కదిలింది. కృష్ణ ఆలోచనలో మునిగిపోయాడు. ఫార్మాలిటికి తండ్రి వెళ్ళ మన్నాడని వెళ్ళటమే కాని అతనికి మాలతి బాగానే గుర్తు ఉంది. సాయంత్రం ఏడుగంటలకు మెడ్రాస్‌లో దిగాడు. తండ్రి ఇచ్చిన ఎడ్రెస్ ప్రకారం టాక్సీలో నుంగంబాకం రామనాథం ఇంటికి వెడదామా అనుకున్నాడు. కానీ ఇలా రాత్రివేళ వెళితే బాగోదని దర్జాగా హోటల్‌లో దిగాడు. ఆరాత్రి అంతా అక్కడ గడిపి ఉదయం పదకొండు గంటలు అవుతుండగా టాక్సీలో మాలతి ఇంటికి వచ్చాడు.

పోష్ కాలనీ అది. పెద్ద పెద్ద భవనాలు నిలబడి ఉన్నాయి.

గేట్ లోపల చిన్న గార్డెన్ ఉంది. గులాబీలు విరగ బూసి నవ్వుతున్నాయి.

చలిమాసాలు ప్రారభంలో ఉన్న మూలంగా కాబోలు చేమంతి మొక్కలన్నీ దట్టంగా మొగ్గలేసి చెట్లును పరచుకున్నాయి.

ముచ్చటైన డాబాకు రత్నావళి రంగులు వేసారు. ముఖద్వారం వేసి ఉంది. కాసేపు అలానే నిలబడి పోయాడు. ఎదురుగా తలుపు పక్కగా గోడకు కాలింగ్ బెల్ కనబడింది. మోగించాడు. కొన్ని క్షణాలకు తలుపు తెరుచుకుంది.

సన్నగా, బంగారు తీగలా మెరిసిపోతూ అప్పుడే యవ్వనంలోకి అడుగు పెట్టబోతున్న పదిహేను సంవత్సరాల అమ్మాయి తలుపు తీసింది. ఆ పిల్లలో మాలతి పోలికలు బాగా కనబడుతున్నాయి. వేసుకున్న తెల్ల లంగాపై పసుపు పచ్చ ఓణీలో నక్షత్ర చామంతిలా ఆహ్లాదమైన అనుభూతి కలిగిస్తోంది.

"యేరు వేణుండమ్!" తమిళంలో అడిగింది. కృష్ణ తడబడిపోయాడు.

"చూడమ్మా"! తెలుగులో ఎడ్రసింగ్ చేసాడు.

"ఓ, మీరు తెలుగు వారా? అయాంసారీ! ఎవరు కావాలి"? మళ్ళీ అడిగింది.

"రామనాథం గారు....."

"లేరండీ. ఈ టైమ్‌లో మాడాడి హైకోర్టుకు వెళతారు".

"నేను వారితో మాట్లాడాలి".

"అలాగే హైకోర్టుకు వెళితే డాడీ కనిపిస్తారు" నిస్సంకోచంగా చెప్పేసింది ఆ పిల్ల.

పరాయి వ్యక్తులను లోపలకు పిలిచే రోజులు కావివి. అంతే కాక రామనాథం హైకోర్టులో ప్రాసిక్యూటర్‌గా చేస్తున్నాడు. అందు వలన ఆయన కోసం ఎప్పుడూ ఒకరో ఒకరు వస్తూనే ఉంటారు. అలా వచ్చిన వాళ్ళందరికీ ఇంట్లోకి ప్రవేశం దొరకదు. అలానే తండ్రి కోసం ఎవరో వచ్చారనుకుని ఆ పిల్ల అలా చెప్పేసింది.

కృష్ణ గొంతులో వెలక్కాయ పడింది. రామనాథం లాయరే అని విన్నాడు కానీ అంతకు మించి అతనికి వివరాలు తెలియవు. ఇలా అనుకుంటే ఉదయమే వచ్చేవాడు.

"సాయంత్రం ఉంటారా పాపా"? అడిగాడు.

"ఫైవ్ దాటాకా ఉంటారండి" అంది.

"ఓకే అప్పుడు వస్తాను. అయనతో ఒక మాట చెప్తావా"?

"ష్యూర్"! నవ్వింది.

"విజయవాడ నుండి కమలాకర్ బావమరిది కృష్ణ వచ్చాడని, సాయంత్రం వస్తానని , దయచేసి వెయిట్ చేయమని చెప్పు."

వింటున్న ఆ అమ్మాయి కళ్ళు వెదల్పు అయ్యాయి.

"ఓ, గాడ్! అంటే మీరు మాఅక్క మాచ్ గురించి.... కదు!" సందేహంగా అడిగింది.

"యస్"! తలవూపాడు.

"క్షమించండి. మీరెవరో తెలియక ఇలా నుంచో బెట్టేసాను. ప్లీజ్! కమ్!" హడావుడిగా తడబడిపోతూ గుమ్మంలో నుండి అడ్డు తొలగింది.

ఆ అమ్మాయి కంగారు చూస్తూ నవ్వుకుంటూ లోపలకు వెళ్ళాడు.

"కూర్చోండి" కుర్చీ చూపించింది. "మమ్మీ, మమ్మీ"! కేకలు పెట్టింది.

"స్నానం చేస్తున్నారు అమ్మగారు" పని మనిషి ఇవతలకు వచ్చి చెప్పింది.

"ఓమైగాడ్! ఆవిడ ఇప్పుడే వెళ్ళాలా? సారీ అండి. నేను అసలు కమలాకర్ అన్నయ్య మేరేజ్‌కు రాలా. అప్పుడు నాకు టైప్ ఎగ్జామ్స్ ఉండిపోయాయి. అందుకే మీరెవరో తెలుసుకోలేదు. మీరు ఇవాళో రేపో రావచ్చని డాడీ అంటున్నారు. ఉండండి. మీరు ఒక వేళ తను లేనప్పుడు వస్తే డాడీ ఫోన్ చేయ మన్నారు" అంటూ ఎదురుగా గాడ్రేజ్ టేబుల్ మీద ఉన్న ఫోన్ రింగ్ చేసింది.

రామనాథంగారు లైన్‌లోకి వచ్చినట్టున్నారు.

"డాడీ! బంధువు వచ్చారు. కమలాకర్ అన్నయ్య బ్రదర్ ఇన్‌లా ఆ, పేరేమిటండీ"? మౌత్ పీస్ చేతో మూసి తలతిప్పి కృష్ణను అడిగింది.

"కృష్ణ" ఆ అమ్మాయి కంగారుకు నవ్వుకుంటూ చెప్పాడు.

"ఆ కృష్ణట డాడీ. ఓ. కే వచ్చేస్తారా! అలాగే" అంటూ ఫోన్ పెట్టేసింది.

"ముత్యాలూ నాయర్‌నడిగి కాఫీ పట్టుకురా"! పని మనిషిని కేకలేసింది.

"చూడు బేబీ! ఏం చదువుతున్నావు"? కృష్ణ అడిగాడు.

"ఇంటర్ ఫస్టియర్"! అంతలో మాలతి తల్లి వచ్చింది. "ఎవరు స్వప్నా"? అంటూ.

బొద్దుగా, తెల్లగా ఉందావిడ. కృష్ణను ఆప్యాయంగా పలకరించింది. కాఫీ ఇచ్చింది. ఒక పావుగంట ఏవో కబుర్లు చెప్పింది. కృష్ణ వినయంగా , స్పష్టంగా జవాబివ్వసాగాడు.

రామనాథం గారు వచ్చేసారు. ఆయనకు ఇద్దరే కూతుళ్ళని కమలాకర్ ద్వారా విన్నాడు. చిన్నపిల్ల స్వప్నే కనబడింది కాని అతనికి మాలతి కనబడలేదు. తను ఆమె గురించి అడగటం భావ్యం కాదని అడగలేదు. "ఎటూకాని టైమ్‌లో వచ్చాడు. ఈవెనింగ్ రావాల్సింది" అనుకున్నాడు. (ఇంకా ఉంది)



# స్కృత విద్వాంసులు-శ్రీపురాణంవారు

త గొప్ప పండితులయి ఉన్నా సరే, వారి . శాశ్వతంగా ఉండాలంటే ఏదైనా మంచి థాన్ని రచించాలి. తగినంత పాండిత్యం పోయినా

లు తమ రచనలవల్ల కీర్తిని నిలుపుకుంటారు పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు ర్థులైన పండితులూ, రసవంతంగా కవిత్వం ప్పవారూ అయినా, ఆయన విస్మృతి పథంలో పోవడానికి కారణం, తీర్థులుగారు గ్రంథ రచన క్యకపోవడమే గ్రంథాలు రచించి, అచ్చు ుంచి ధనం సంపాదించాలని గాని, కీర్తి పాదించాలని కాని ఆయనకు కోరికలేదు ధైన్యం ుండా జీవి తం గడిచిపోతే చాలుననే ఆయన ుకునేవారు.

ర్థులుగారు విశాఖపట్నంజిల్లాలోని గవరవరం గ్రామంలో గత శతాబ్ది చివరి పాదంలో ుంచారు బాల్యంలో అక్కడనే దువ్వూరి ్యనారాయణ శాస్త్రిగారి వద్ద కావ్యాలు రంభించి, సంస్కృతంలో ప్రవేశం పాదించారు.

ర్వాత విద్యానగరం అని పేరు పొందిన యనగరానికి వచ్చి, అక్కడ సుప్రసిద్ధ డితులైన రుద్రాభట్ల రామశాస్త్రిగారికి శిష్యులై ు సంస్కృత భాషా జ్ఞానమును వృద్ధి పరచు , ఆ పిదప ఆ నగరమునందు సంస్థానాధిపతులు పించిన సంస్కృత పాఠశాలయందు విద్యార్థిగా ారు.

జయనగర సంస్థానాధిపతులైన గజపతి ులు సంస్కృతంలో చక్కని పాండిత్యం వారు. వారికి ఆ భాషపయి అభిమానం ఎక్కువ దువల్ల సంస్కృత బాషా వ్యాప్తి కోసం ాలను స్థాపించి సమర్థులైన శాస్త్ర డితులను అధ్యాపకులుగా నియమించేవారు. ఈ బ్ది ప్రారంభంలోనే అది ఆంధ్ర ప్రదేశంలో ్యాతిని పొందింది. విద్యార్థులకు ఉచితంగా ల సౌకర్యం, భోజన సౌకర్యం ఏర్పాటు ుబడింది. అందువల్ల దేశంలోని చాలా చోట్ల ుడి విద్యార్థులు వచ్చి, కోరిన శాస్త్రాలనూ, ాత్యాన్నీ అభ్యసించి, గట్టి పాండిత్యం పాదించి కృతార్థులయేవారు. అప్పట్లో పేరి- నాథ శాస్త్రిగారు, మహా మహోపాధ్యాయ ా- సుబ్బారాయ శాస్త్రిగారు, కొంపెల్ల నాథ శాస్త్రిగారు, నెదూరు వేంకటశాస్త్రిగారు న్నగు వైయాకరణ ధురంధురులు అక్కడి ్యపకులు. మేడేపల్లి వేంకటరమణాచార్యులు ు సంస్కృతాంధ్రాలు బోధించేవారు. ్థులుగారు వారి వాత్సల్యం చూరగొని వ్యాకరణ, సాహిత్యాలలో మంచి జ్ఞానం సంపాదించారు. విద్యార్థులందరిలోనూ ఆయనే వయస్సులో పెద్ద తెలివి తేటల్లో కూడా అందువల్ల ఆయన వారికి నాయకుడయినారు. సహజంగా చక్కని కవిత్వం అలవడింది గనుక అప్పుడప్పుడు సందర్భాను సారంగా చక్కని పద్యాలు అల్లి వాళ్ళకు ఆనందం కలిగించేవారు.

ఈ శతాబ్ది ప్రారంభ దశలో ఇప్పటిలాగ విశ్వ విద్యాలయాలు ప్రాచ విద్యల్లో పరీక్షలు పెట్టి పట్టాలిచ్చే పద్ధతి లేదు కాశీ విద్యాపీఠం వారు వివిధ విషయాల్లో "తీర్థ" పరీక్షలు పెట్టి కృతార్థు-లయిన వారికి పట్టాలిచ్చేవారు. విజయ నగర పాఠశాలా విద్యార్థులు కూడా ఆ పరీక్షలనే యిస్తూ వుండేవారు సాహిత్య ప్రియులైన తీర్థులుగారు 'కావ్య తీర్థ' పరీక్షకు చదివేవారు. ఆ పరీక్షలో నెగ్గడం వల్ల ఆయన "కావ్య తీర్థు"లైనారు. ఆ తర్వాతనే ఆయన తన పేరు చివర తీర్థ పదాన్ని చేర్చుకోవడం జరిగింది. అంతకు పూర్వం ఆయన కేవలం సూర్యనారాయణగారు మాత్రమే!

ఈయన స్వాతంత్ర్య ప్రియులు, ఆత్మాభిమానం ఎక్కువ. ధైర్య సాహసాలు అధికం. అందరూ వీటిని అలవరచుకోవాలని తోడి విద్యార్థులకు బోధించేవారు. మహారాజావారు విద్యార్థులకు భోజన సౌకర్యం కలిగించినా, భోజన గృహంలో ఉండిన గుమాస్తా వీరిని తగినట్లు గమనించే వాడుకాడు. ఆ గృహానికి సప్లయి చేసిన మంచి పదార్థాలను తన యింటికి చేరవేస్తూ, చవుకరకం కూరలే వండించేవాడు. తప్పుపట్టిన పప్పు నూకతో పచ్చళ్ళు చేయించేవాడు. చెడిపోయిన ఊరగాయనే ఇచ్చేవాడు. ఎంత బతిమాలినా మార్పు జరగలేదు. కొంత కాలం చూచి విసిగి, యీయన మార్గాంతరం తోచక విద్యార్థులచేత సమ్మె అంటే ఏమిటో యెరుగని ఆ రోజుల్లో సమ్మె చేయించారు. మూడునాలుగు రోజులు విద్యార్థులెవ్వరూ పాఠశాలకు వెళ్ళలేదు. అధ్యాపకులు సంగతిని గ్రహించి, భోజనం విషయంలో తాము చూసుకుంటామని వాగ్దానం చేసి, సమ్మె మానిపించారు. కాని, వారి మాటలు సాగలేదు. మొండివాడైన ఆ గుమాస్తా వారిని లెక్క చేయలేదు. అప్పట్లో- మహారాజా వారి కాలేజీ ప్రిన్సిపాలు శ్రీ కిళాంబి రామానుజాచార్యులుగారు, విద్యార్థుల భోజన వసతి గృహాలకూ, పాఠశాలకూ పర్య-వేక్షకులుగా ఉండేవారు. వారికి ఈ విషయం మనవి చేసుకోవాలని అనుకున్నా- విద్యార్థులకు వారిని దర్శించడానికి ఒకసారయినా అవకాశం లభించ-లేదు.

ఒకసారి విజయనగరం పార్కులోని టవునుహాలులో ఒక మహా సభ జరిగింది. ఆ సభకు శ్రీ రామానుజాచార్యులుగారే అధ్యక్షత వహించారు. అదేమంచి అవకాశమని తెలుసుకుని తీర్థులుగారు భోజన గృహం అన్యాయాలను వివరిస్తూ రసవంతంగా పద్యాలు శ్రీ రామానుజాచార్యులు గారిని సంబోధిస్తూ "మహిత గుణ గణ ధుర్య రామానుజార్య!" అనే మకుటంతో చెప్పి- సభకు వెళ్ళి- సభాధ్యక్షునివల్ల అయిదు నిమిషాలు మాటలాడడానికి అనుమతి పొంది, ఆ పద్యాలు పదినిమిషాలు వినిపించారు. సభాధ్యక్షునితో పాటు సభలోని వారందరూ నిర్ఘాంత పోయారు. తీర్థులుగారు చివరి పద్యం చివర.

"అయ్య కోనేటి నీ రమృతాబ్ధి గాగ
అతి బృహస్పతులైన పండితుల వద్ద
చదువుకొంటిమి; చాలు నీ చదువు మాకు
మహిత గుణగణ ధుర్య! రామానుజార్య!"

అని చదివేసరికి సభ్యుల కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి. సభాధ్యక్షులకు ఈయనపయి విపరీతమైన కోపం వచ్చింది. ఆయన క్రమశిక్షణకు పేరు పొందినవారు.

సభ ముగిసిన వెంటనే "ఇక మీద ఈ విద్యార్థికి భోజనం పెట్టవద్దు" అని చీటీ వ్రాసి భోజన గృహం గుమాస్తాకు పంపించాడు. ఈ విధంగా జరుగుతుందని ముందే గ్రహించిన తీర్థులుగారు "నేను మళ్ళీ వచ్చి చెప్పేవరకూ నాకు గైరు హాజరు వేయించవలసిన"దని చీటీవ్రాసి, పర్యవేక్షకుల చీటీ అందుటకు ముందుగానే గుమాస్తా చేతికిచ్చి ఆత్మగౌరవం నిలుపుకున్నారు. ఆ తర్వాత ఆయన పాఠశాలకు కూడా వెళ్ళలేదు. అప్పటికే తగినంత

చిత్రకారుడు : ఎ. ఆర్. ఎస్. భగవాన్



పాండిత్యం సంపాదించుటవల్ల ఉద్యోగానికి యత్నించాలనే సంకల్పం ఆయనకు కలిగింది.

ఆ కాలంలో తిరుపతి వేంకట కవులు రసవంతమైన కవిత్వం చెప్పుతూ, శతావధానాలు చేస్తూ పెక్కు సభలలో సన్మానాలు పొందుతూ గొప్ప కీర్తి గడించారు. వారిపైనే కాకుండా వారిశిష్యులపైని కూడా ప్రజలకు గొప్ప గౌరవం ఉండినది. అందువల్ల చాలామంది వారికి శిష్యులుండేవారు. కవులూ, పండితులూ కూడా వారిశిష్యులమని అనిపించుకోడానికి కొద్ది కాలంపాటయినా వారిని ఆశ్రయించేవారు. సరస కవులూ, పండితులూ అయిన తీర్థులుగారుకూడా కొన్నాళ్లపాటు శిష్యరికం చేశారు. ఇది వారి భవిష్యత్తుకు తోడ్పడింది. తీర్థులుగారు తర్వాత జీవనోపాధి కోసం చెన్నపట్నం చేరారు.

సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర గ్రంథ ప్రకాశకులు వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారు వీరి ప్రతిభా పాండిత్యాలను గుర్తించి తీర్థులుగారిని తమ సంస్థలో పండితులనుగా నియమించారు. గ్రంథ సంస్కరణ, ముఖ్యమైన గ్రంథాల ప్రూఫులు దిద్దే పని ఈయనకు అప్పగించబడింది. అంతకు ముందే కాబోలు- తీర్థులుగారు "కామేశ్వరి" అనే తెలుగు సాహిత్య మాసపత్రికను స్థాపించి కొంత కాలం నడిపారు. తిరుపతి వేంకట కవుల వ్యాసాలు కూడా అందులో ప్రకటించబడేవి! వీరి గురువులు మేడేపల్లి వేంకట రమణా చార్యులుగారు, తాము రచించిన "దేవవ్రత చరిత్ర" అనే పెద్ద ప్రబంధాన్ని ఆనంద ప్రెస్సులో అచ్చు వేయించే పని యీయనకే అప్పగించి దానికి చక్కని పీఠికను ఈయన చేతనే వ్రాయించారు. గురువులకు తీర్థులుగారియెడ గల గౌరవం వీటివల్ల స్పష్టమవుతున్నది. సుప్రసిద్ధ సంగీత విద్వాంసురాలు శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారికి సాహిత్య విద్యా గురువుగా కూడా ఉండేవారు.

బొంబాయిలో ప్రారంభమైన అఖిలభారతీయ స్వాతంత్రోద్యమం దేశం నలుమూలలా వ్యాపించి, "వందేమాతరం" శంఖారావం నలుదిక్కులా ప్రతిధ్వనిస్తున్న ఆ కాలంలో ఒకప్పుడు మద్రాసులో జాతీయ మహాసభ జరిగింది. ఆ సభలో బ్రిటిష్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన సంస్కరణలను తీవ్రంగా విమర్శిస్తూ ఈయన వ్రాసిన పద్యాలు సభ్యులతోపాటు, సభాధ్యక్షులూ, హిందూ పత్రికా సంపాదకులూ అయిన శ్రీమాన్ కస్తూరి రంగ అయ్యంగారిని చకితులయ్యినారు. సభలో ఉన్న ఆంధ్ర పత్రికాధిపతులు, దేశోద్ధారక శ్రీ కాశీనాదుని నాగేశ్వరరావు పంతులుగారు ఈయనను ప్రశంసించి, తమ ఆఫీసులో పండితునిగా తీసికొన్నారు. నాటి నుండి వయః పరిమితిని అనుసరించి రిటైరయిన వరకూ తీర్థులుగారు ఆంధ్రపత్రికా కార్యాలయంలోనే పని చేశారు. ప్రూఫులు చూడడంతోపాటు, పంతులుగారు నిర్వహిస్తూ ఉండిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం పనిలో మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి వేలాల సుబ్బారావుగారితో పాటు సహాయకులుగా ఉండేవారు. భారతి పత్రికలో వ్యాసాలు ప్రకటించేవారు. ఆనంద ప్రెస్సు వారి కోరికపై చిన్న కథల పుస్తకాలు వ్రాసి, వారు ప్రకటించే గ్రంథాలను పరిష్కరించేవారు.

కవిత్వ, పాండిత్యాలలో ఘటికులయినా సూర్యనారాయణ తీర్థులుగారు నిండుకుండ తొణకదన్నట్లు ఏమి తెలియని వారివలెనే ఉండేవారు; ఆయన నిరాడంబరులు. స్వాతంత్ర్య ప్రియులయినా, ఎవ్వరినీ ఎదిరించి మాటలాడేవారుకారు. తనవద్దకు వచ్చిన పిన్నలను వాత్సల్యంతో చూచేవారు. సమవయస్కులనూ, పెద్దలనూ ఎంతో గౌరవించేవారు. ఏ విషయంలోనూ జోక్యం కలుగ చేసుకునేవారు కారు. సర్వసాధారణంగా జీవితం గడిచిపోతే చాలునని తృప్తి పడేవారు. ఇట్టివారు చాలా అరుదుగా కానవస్తారు.

— బులుసు వేంకట రమణయ్య

## ద్దరూ ఉద్యోగస్తులైతే...?

# డబ్బు సంపాదనే లక్ష్యం కాదు.....!

క్టరు కిలారు బుచ్చిబాబు, డాక్టరు లీల ్యాభర్తలు. డా. బుచ్చిబాబు యమ్. డి. యవాడ ప్రభుత్వ ఆసుపత్రిలో కార్డియాలజీ ర్ట్‌మెంటులో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పని ్తున్నారు. డా. లీల బుచ్చిబాబు గైనకాలజిస్టు. ేటు ప్రాక్టీసు చేస్తున్నారు ఈమె.

## డబ్బు సంపాదనే లక్ష్యం కాదు!

'కేవలం డబ్బు కోసమే అయితే నేనెప్పుడో ప్రైవేటు ప్రాక్టీసు పెట్టే వాడిని. కానీ నాలో నేర్చుకోవాలన్న తృష్ణ తగ్గలేదు. ప్రభుత్వాసుపత్రిలో ఉద్యోగం వలన ఎన్నో కేసులు నా దృష్టికి వచ్చినాయి.



డాక్టర్ లీల, డా. కె. బుచ్చిబాబు

## ారు చాలా సిన్సియర్!

నేను ప్రభుత్వోద్యోగం చెయ్యడానికి ఇష్టపడను. ుమనేమో ప్రభుత్వోద్యోగంలో ఉంటే అనేక ందికి సేవ చేయవచ్చు అంటారు. ఆయన ్టాన్ని కాదనలేక ఊరుకున్నాను. ఆయనలోని ్రియారిటీ నాకు నచ్చింది. చెప్పుకోకూడదు గానీ ాంటి డాక్టర్లు ప్రభుత్వ ఆసుపత్రులకి ఎంతో ుసరం!' అన్నారు డా. లీలా బుచ్చిబాబు.

దానివల్ల నేనెంతో తెలుసుకున్నాను. నా శ్రీమతికి నాకూ ఇక్కడే అభిప్రాయభేదం! మిగితా విషయాలలో మేమిద్దరం ఒకటే!' అన్నారు డా. బుచ్చిబాబు.

డా. బుచ్చిబాబు, లీలలకి ఇద్దరు మొగపిల్లలు. 'ఇద్దర్నీ డాక్టర్లు చెయ్యాలనుకుంటున్నారా?' అని అడిగితే, పెద్దవాడు డాక్టరు చదవాలని కుతూహలపడుతున్నాడు. చిన్నవాడిది పూర్తిగా బిజినెస్ మెంటాలిటీ. ఇంజనీరయ్యి ప్రాజక్టులు కట్టాలని ఉవ్విళ్ళూరుతున్నాడు. ఏది యేమైనా వాళ్ళిష్ట ప్రకారం వాళ్ళ చదువుసంధ్యలు చెప్పిస్తామన్నారు. డా. బుచ్చిబాబు.

"నేను డాక్టరు కావాలనే ఉద్దేశంతో నే చదివాను. డాక్టరునే వివాహం చేసుకోవాలని అనుకోలేదు. అనుకోకుండా వచ్చిన సంబంధం డాక్టరు కావడంతో, నాకు నచ్చడంతో ఒప్పేసుకున్నాను." అనే డాక్టరు బుచ్చిబాబుకి ప్రజాసేవ చేయడంలో ఎంతో తృప్తి ఉంటోంది. ప్రైవేటు ప్రాక్టీసు విషయంలో అసంతృప్తే మిగులుతోంది!" అన్న అభిప్రాయం ఉంది!

## విదేశాలకు వెళ్ళాలన్న మోజులేదు!

'విదేశాలలో చదువుకునే అవకాశం, ఉద్యోగ అవకాశాలు వచ్చినా నిరాకరించాము ఇద్దరమూ. ఆ వాతావరణంమీద ఆసక్తి లేదు. అక్కడ ఉంటే కేవలం డబ్బు మాత్రం సంపాదించవచ్చు. ఇక్కడ అటు డబ్బు, అటు పేరు ప్రఖ్యాతులు కూడా సంపాదించుకోవచ్చు. అయినా మనదేశంలో అక్కడి వైద్య సౌకర్యాలతో సరితూగే ఆసుపత్రులు వెలిసాయి కదా!' అన్నారు.

మా వృత్తిలో పగలూరెయీ అన్న తేడా ఉండదు. యమర్జన్సీ కేసులు వస్తే అర్ధరాత్రి కూడా లేచి చూస్తాము. కానీ కొంతమందికి పనీపాటూ లేకుండా పగలంతా తిరిగి తిరిగి ఇంటికి ఏ అర్ధరాత్రో చేరి ఇంట్లో వాళ్ళ ఆరోగ్యం బాగోలేదని అప్పుడొచ్చి డిస్టర్బ్ చేస్తారు.

అలాంటి సమయాల్లో విసుక్కోవాల్సి వస్తుంది. డాక్టర్లు కూడా మనుషులే! అర్ధరాత్రి, అపరాత్రి లేపినా లేచి చూస్తారులే అనుకోవడం భావ్యం కాదు.' అత్యవసర పరిస్థితులు కాకపోయినా అర్ధరాత్రి వచ్చు లేపే వారిని దృష్టిలో పెట్టుకుని అన్నారు డా. బుచ్చిబాబు.

## కుటుంబ బాధ్యతలు!

'నిర్వర్తించడానికే నేను, ప్రభుత్వోద్యోగంలో చేరలేదు. ప్రైవేటు ప్రాక్టీసులో కాస్త విరామం దొరుకుతుంది. ఇంటిని, పిల్లల్ని జాగ్రత్తగా చూసుకోవచ్చు.' అనే డా. లీల ఇంటి అలంకరణలూ, గార్డెనింగ్‌లో ప్రత్యేక శ్రద్ధ చూపిస్తారనిపించింది వాళ్ళ ఇంటి వాతావరణం చూసినప్పుడు.

ఖాళీ దొరకడం చాలా కష్టం! అలా దొరికితే సినిమాలు చూడటం హాబీగా పెట్టుకున్నాం!

'భవిష్యత్తులో ఉద్యోగం మానేసి మంచి నర్సింగ్‌హోమ్ పెట్టుకోవాలన్న ఆలోచన లేకపోలేదు' అన్నారు డా. బుచ్చిబాబు. 'ఆ రోజు కోసం ఎదురు చూస్తుంటాను!' అన్నారు డా. లీలాబుచ్చిబాబు.

చదివిన చదువును సార్థకం చేసుకోవడంలో స్వార్థం లేదు కదండీ!

భార్యాభర్త లిద్దరూ డాక్టర్లు కావడం కుటుంబానికీ, సంఘానికీ కూడా ఆరోగ్యకరం!

—కృష్ణాజీ

# నీకు నీవే - నాకు నేనే

మధురాంతకం రాజారాం

"ఏమయ్యో జగన్నాథం! నిన్నేనయ్యా! ఇట్టా చూడు. ఇదో యిక్కడ...."

బాగా పరిచయమున్న గొంతే! తటాలున తిరిగి చూచాను. పిలుస్తూ ఆ వ్యక్తి అట్నువైపు పేవ్‌మెంటు మీది నుంచే రోడ్డుపైకి వచ్చేశాడు.

"నీకు పుణ్యముంటుందిగానీ తప్పుకోవయ్యా బాబూ! తప్పుకో; తప్పుకో" అంటూ గొంతు చించుకున్నాను.

వెంట్రుకవాసిలో ప్రమాదం తప్పింది. అతడి శరీరాన్ని ఒరుసుకున్నట్టుగా లారీ వెళ్ళిపోయింది.

"ఎంత సేపయ్యా నిన్ను పిలిచేది! ఇనిపించుకోవే! అన్నట్టిప్పుడొచ్చావూర్నుంచి?"

మళ్ళీ గుండె గుభేలుమంది ఈసారి కారు!

"ఓరి నీఇల్లు బంగారంగానూ! కారొస్తోందయ్యా బాబూ! ఆగు. అక్కడే ఆగిపో!" అంటూ దవడలు నొప్పి పుట్టేటట్టు మళ్ళీ బిగ్గరగా అరిచాను.

కారు దూసుకుంటూ జారిపోయింది. తన అవయవాలన్నింటితోనూ అతడు సురక్షితంగా మిగిలివున్నాడంటే, అందుకు కారణం కారుడ్రయివరు తీసుకున్న జాగ్రత్త అయినా కావాలి. లేకుంటే, భూమిపైన అతడి కింకా నూకలు మిగిలివుండడమైనా అయివుండాలి.

చిన్న కుర్రాడైతే అందుబాటులోకి రాగానే సాచి నాలుగు లెంపకాయలిచ్చుకోవలసిన పని!

"మంచివాడివేలే రంగప్పా! రోడ్డు క్రాసు చేసేటప్పుడు అటూ యిటూ చూచుకోనక్కర్లేదా? ఇది టౌన్లో రోడ్డయ్యా బాబూ! మీ మద్దిమాకుల పల్లెలో బండిబాటకాదు" అని హెచ్చరించాను.




"అదృష్టమేనయ్యా! అయితే మాత్రం? లేక లేక మన పక్కోడు ఒకడు కనిపిస్తే ప్రాణాలు లేచొచ్చినట్టుండదా? నీకు తెలుసునో, తెలియదో! నేనిప్పుడుండడం యిక్కడ్నే!"

"ఏం మాటలే రంగప్పా! కూతుర్ని చూడాలనిపించి యిలా వచ్చి వుంటావు. ఉంటే గింటే వారం పది రోజులుంటావు. ఆ మాత్రానికి పట్నంలో శాశ్వత పౌరసత్వం పుచ్చుకున్నట్టు మాట్లాడితే ఎలా? నీ ధోరణి నాకేమీ బాగుండలేదు" అన్నాను.

'ఓస్ ఇంతేనా నీ తెలివి!' అన్నట్టు రంగప్ప పకాలున నవ్వేశాడు. "అదేంలేదులే జగన్నాథం! మద్దిమాకుల పల్లెలో ఏముందయ్యా? బతికినంతకాలం ఆ గుడ్డి కొంపలో బతికినాను. ఇప్పుడింక దానికీ నాకూ రుణం తీరిపోయిందనుకో! రాజనాల భోజనం దొరికినాక రాగిపిండి సంగటి కోసరం పాలుమారే వాడెవడుంటాడు? అయినా నువ్వు చూళ్లేదులే! చూస్తే తెలుస్తుంది రెండంతస్తుల మహిళ్. బాడిగిల్లేం కాదులే, సొంతమే! రూము రూముకు ఫాను. ఎక్కడ కావలిస్తే అక్కడ కొళాయి. కూచోవాలంటే సోపాలు. పడుకోవాలంటే నవారు మంచాలు. అవి గోడలు కావనుకో, అద్దాలు. అది నేలకాదే, పాలరాయి వంటపనికి ఆడమనిషి. బజారు పన్లకు బంట్రోతు. అంతెందుకు. పాళేగాళ్లదేవిడి అనుకోరాదా జగన్నాథం! నాకిక్కడేం కొదవ చెప్పు. కాలుమీద కాలేసుకుని కూచున్నాసరే, కావలసిందంతా చక్కా నా దగ్గరికే నడిచొచ్చేస్తుంది...."

"రావచ్చునయ్యా, ఒప్పుకుంటాను. కానీ బొందితోనే కైలాసానికి వెళ్లడం సాధ్యమా? పల్లెతో వున్న లంకెలన్నీ తెంచుకుని నువ్వు పట్నానికొచ్చి చేరిపోవడమన్నా అంతేగదా! ఇల్లూ వాకిలీ, గొడ్డూగోదా, పొలమూ పుట్రా, అన్నింటికి మించి ప్రానోట్లపైన తిరిగే డబ్బు- అవన్నీ ఏం కావాలి?" అంటూ సందేహం వెలిబుచ్చాను.

విరాగిలా ఒక దరహాసం వెలువరించాడు రంగప్ప. "ఆస్తి మాటేముందిలే జగన్నాథం! మా నాయన నాకిచ్చి పోయిందంతా ఒక పూరిగుడిసె మాత్రం. నేను నా హయాంలో కయ్యలు కొనినాను. తోటలు పెంచినాను. మిద్దె కట్టినాను. డబ్బులుగూడా దండిగానే మూటగట్టినాను. కానీ వాటన్నింటికన్నా నాబిడ్డే నాకెక్కువ. ఉన్నదంతా తెగనమ్మేసి, బాకీలు గూడా వసూలు చేసుకుంటే ఎంత లేదన్నా రెండు లక్షలు చేతికొస్తుంది. తీసుకొచ్చి బ్యాంకిలో వేసుకుంటే, ఆ డబ్బు మాత్రం పిల్లలు పెట్టదా? కృష్ణా, రామా అనుకుంటూ నేను నా కూతురి పంచలో నే కాలం గడిపేస్తాను. ఏం జగన్నాథం! ఇది మంచి ఆలోచన కాదంటావా?"

తొందరపడి నేను అవుననిగానీ, కాదనిగానీ చెప్పలేదు. కొన్ని ప్రశ్నలకు సమాధానం తేల్చి చెప్పవలసింది కాలమే- మనిషికాదు. అందుకని, "నీకెలా మంచిదని తోస్తే అలా చేయవయా రంగప్పా! అవతల నాకు చాలా అర్జంటు పనుంది వెళ్తొస్తాను" అంటూ సెలవు తీసుకున్నాను.

నే నప్పుడు టౌనుకు వెళ్లింది స్పాట్ వాల్యుయేషన్ పనిపైన. పది పన్నెండు రోజులైనా అక్కడ వుండవలసిన సందర్భం. కానీ రంగప్ప ఎక్కడ వెంట తగులుకుంటాడోనన్న జంకుతో నా ఆచూకీ అతడికి తెలియనివ్వకుండా జాగ్రత్త పడ్డాను. కానీ చేయడానికి పనిగానీ, మాట్లాడడానికి మనుషులుగానీ లేని సమయాల్లో నా ఆలోచనలు వుండి వుండీ రంగప్ప చుట్టూ ముసురుకుంటూ వచ్చాయి.

బుద్ధి తెలిసినప్పటి నుంచీ నాకు రంగప్పతో పరిచయం కద్దు. అడ్డు దారి గుండా వెళ్తే మద్దిమాకులపల్లె మా వూరికి రెండు మైళ్ల దూరంలో వుంటుంది. ఆ వూళ్లో మాకుకొంత పొలముండేది. (తరువాత్తరువాత ఆ పొలాన్నిగూడా రంగప్పే కొనేశాడనుకోండి! అది వేరే సంగతి) సదరు పొలాన్ని సాగు చెయ్యించడం కోసం మా నాన్నగారు తరచుగా ఆ పల్లెకు వెళ్తుండేవారు.



తోకంటి నారాయణ అన్నట్టుగా అప్పుడప్పుడూ నేనుగూడా ఆయన వెంట వెళ్లేవాణ్ని ఊరి ముందర రచ్చపైన వినాయకుడెలాగో, మద్దిమాకులపల్లెలో రంగప్ప అలాగు. వెళ్లినప్పుడల్లా అతడు మాకు మిట్ కావడం ఖాయం.

బగు మాటెత్తగానే చీకటి, మంచిని గురించి
చుకోగానే చెడు జ్ఞప్తికి వచ్చినట్టుగా
ప్పను గురించి తలుచుకోగానే జ్ఞప్తికి వచ్చేది
ి పిసినిగొట్టుతనం. అతడు తెల్లగా వుతికిన
లు కట్టుకోగా నేనెప్పుడూ చూడలేదు. ఎంత
ం వెళ్ళవలసి వచ్చినా తన కాళ్ళను తాను
ుకోడమేగానీ, అతడు బస్సులపైకి
రపడేవాడుగాదు. పండగనాడైనా అతడు దేవుడి
కొబ్బరికాయ కొట్టి వుంటాడా అని న
మానం. ఏదైనా వస్తువు కొనడం కోసం అతడు
ులోకి వెళ్ళాడంటే, కోమటిశెట్టి కుతకుతలాడి
ువాడు. ఒడ సరుకు రేటెంతో అడిగి
సుకుని, ఆ లెక్కన ఒక పలం పంచదార పొట్లం
వ్వ మనడం రంగప్ప పద్ధతి.
ఘనిక విజ్ఞానం వల్ల మానవుడికెన్నో ప్రయో
బు చేకూరాయంటే, రంగప్ప సుతరామూ
ుకోడు. అప్పుడే పుట్టిన పసి సిసుగు స్పష్టంగా
గ్గాడడం ఎంతటి అరిష్టమో, చిన తెప్పుగానే ఒక
(రేడియో) గొంతు విప్పడమున్నూ అంతే
మనేవాడు. ఆకాశంపైన తేకచుక్కు
డడం ఎంతటి అనర్ధమో, నేలపైన రైళ్ళు
ులు పరుగెత్తడమున్నూ అంతే అనర్థ
వాడు. ఫోటో తీయించుకోడమంటే చావుదగ్గర
మేనని అతడి భావన. అంతటితో
ుంది? సమాజంలో చోటు చేసుకునే మార్పు
ంత మంచిదైనాసరే, అతడి పాలిటికి మ్రింగరాని
నే వుండిపోతూ వచ్చింది. ఆడా మగా తేడా
ుడా, కలిగినోడు అన్న వ్యత్యాసం లేకుండా
లందరూ ఒక బడిలోకి వెళ్ళి చదువుకోడమంటే
గుర్రాలు గాడిదలు కుక్కలు మొదలైన నానా
జంతువుల్ని ఒక లోగిలిలో కట్టి
య్యడమేనని అతడి సిద్ధాంతం. కులం కట్టును
ంఘించడమంటే కరెంటు కమ్మిన
ుకోడమేనని అతడి నమ్మకం. బీదవాళ్ళు,
గాళ్ళు పూర్వ జన్మలో పంచ మహాపాతకాలు
ి వాళ్ళై వుంటారని, వాళ్ళకు సాయం
డమంటే వాళ్ళ పాపాల్ని పంచుకోడమేనని
ి ఊహ. "మాటలెందుకులే రాఘవయ్యా! ఈ
ుంక బాగుపడేది అనుమానమే'నంటూ
ుయించేవాడు రంగప్ప 'వొస్తాడొస్తాడు'
ా చేతబట్టుకొని, నిలువెత్తు గుర్రమెక్కి
ిగ వసంత రాయలొస్తాడు. పెద్దంతరం
తరం, పైగనిమ కింది గనిమ, చిన్నాపెద్దా
ంపు లేకుండా నడుచుకునే వాళ్ళను
లెగిరేటట్టుగా కొట్టి, ఎండల్లో బండలపై
డతాడు.'
స్థితి చేజారిపోవడంతో మాకు పల్లెతో
న అనుబంధం తెగిపోయింది. ఆ తరువాత
కాలానికి మా నాన్నగారున్నూ పోయారు. డిగ్రీ
ుకుని, 'బియిడి' ట్రియినింగ్ గూడా పొందివచ్చి
మావూరి హైస్కూల్లోనే టీచరుగా
రుకున్నాను. అయినాసరే, ఎప్పుడో
ుడు, ఎక్కడో ఒక చోట తారసిల్లి రంగప్ప నా

# ఉగాది వర్ణచిత్రం!

సామాన్యుని స్థితిగతులు
చిత్రగించవచ్చావా?
ఓ అక్షయనామ ఉగాది!
బడ్జెట్ బరువుతో
మనిషి నడుము విరిగింది!
చీకటి బజార్లోని తోడేళ్ళకు
ఆకలి నానాటికీ ఎక్కువవుతోంది!
కడుపుకు తినేవి అన్నీ రెట్టింపుధరతో
వికటాట్టహాసం చేస్తున్నాయ్!
కల్తీలతో అవి నిలువెల్లా కులుకుతున్నాయ్!
రోగాన్ని విరగడచేసే మందులే
ఎన్నెన్నో కల్తీలతో కొత్తకొత్త రోగాలను
మెత్తమెత్తగా అంటిస్తున్నాయ్!
బ్రతికేందుకు తిండి
వంటికి చుట్టే బట్ట
చదివే చదువూ నేడు భోగవస్తువులయ్యాయి!
రంగులు వెలిసిపోయిన
సామాన్యుని జీవిత తైలవర్ణచిత్రాన్ని చూసి
ఉలిక్కి పడుతున్నావా ఉగాదీ!
అక్షయనామాన్ని ధరించిన నువ్వు
అభయహస్తమిచ్చి ప్రజల్ని రక్షిస్తావా?
సుఖశాంతులు అందిస్తావా?

—కొడిమెల శ్రీరామమూర్తి

# నీకు నీవే- నాకు నేనే

బుర్రని వెడెక్కించడం మట్టుకూ మానలేదు.

ఒకనాటి మధ్యాహ్నం పన్నెండు గంటలవేళ. అప్పుడు నాకు క్లాసు లేకపోవడంవల్ల చల్లటి గాలి కోసం బడికట్టడాలకు వెనుక వైపున వున్న చింతచెట్టు క్రిందికి వెళ్ళాను. అక్కడొక చెట్టు బోదెకు చేరగిలబడినట్టుగా కూచుని, అర్ధనిమీలిత నేత్రుడైవున్న రంగప్ప కనిపించాడు. మూడు గిన్నెల మిల్సు కారియర్ ఒకటి, దాని ప్రక్కనే చిన్నవాటర్‌బాటిల్ ఒకటి తల్లీ బిడ్డల్లా ఒక చెట్టు కొమ్మకు వ్రేలాడుతున్నాయి.

"ఏమిటి రంగప్పా! ఇక్కడేం చేస్తున్నావు?" ఏస్తుపోతూ ప్రశ్నించాను.

"ఆ రోజు నువ్వు బడిలో లేదులే జగన్నాథం! మా అమ్మి శివగంగనిక్కడ్నే ఆరులో చేర్పించినాను" అన్నాడు రంగప్ప.

"చేర్పిస్తే మట్టుకు? ఆ పిల్ల కోసమని నువ్వీ వేళప్పుడు అన్నం తీసుకొస్తావా? చాలని దానికి నీళ్ళు గూడానా? ఏంబాబూ! నీ కూతురు మా వూరినీళ్ళయినా ముట్టుకో గూడదా?"

"కాదులేవయ్యా! చెప్పేదాకా నిదానించవే! తెల్లారెప్పుడో వండిపెడ్తే ఆ అన్నం మధ్యాహ్నానికి చల్లారిపోదా? ప్రతి దినమూ చల్లారిన తిండి తింటే బిడ్డ ఒళ్ళేం కావాలని? ఇంక మంచి నీళ్ళంటావా? మా అమ్మికి మొదట్నుంచీ మా యింటి చేదబావి నీళ్ళే వాడుక. మారిస్తే జలుబు చేస్తుంది....."

నాకు ఒళ్ళు మండింది. "అబ్బబ్బ, నీ కూతురికి జలుబు చేయడమా! ఎంత మాటింతమాట! బ్రహ్మాండం బద్దలైపోదూ! సరే, అదలా వుంచు. ఆడదానికి చదువెందుకనే వాడివి గదా! ఇప్పుడా మాట ఏమయింది? నీ కూతురు మాత్రం ఆడదిగాక పోయిందా?" నిలదీసి అడిగాను.

నా అజ్ఞానానికి జాలిపడ్డట్టుగా నవ్వేశాడు రంగప్ప."అది గాదయ్యా జగన్నాథం! గుళ్లో వుండే దేవుడూ రాయే! కాళ్ల కిందపడే బండరాయీ రాయే! రెండూ ఒకటేనంటావా? నా కూతురికేమయ్యా, పెట్టి పుట్టింది! జొన్న కంకి మీద పిచ్చుక గువ్వ. ప్రపంచకంలో ఎన్ని చదువులుంటాయో, అన్నీ దానికొచ్చెయ్యాల! అది డాక్టరు గావాల. కలకటేరు గావాల. దాన్నెప్పుడూ ఆడదనుకోబాకు! అది రాణీ మహారాణి!"

రంగప్పను గురించి నేనెన్ని ఆరోపణలైనా చెయ్యగలను. కానీ తన కూతుర్ని పెంచడంలో అతడు కనపరచిన చిత్తశుద్ధిని మాత్రం శంకించలేను. అయిదు వందలమంది పిల్లలున్న హైస్కూల్లో నేను రంగప్ప కూతురు కోసం వెదుక్కోవలసిన అవసరం లేకపోయింది. రోజుకొక రకం దుస్తులు ధరిస్తూ, తొడుక్కున్న దుస్తుల రంగును బట్టి గులాబీలా, చేమంతిలా, కనకాంబరాలా, దిశాంబరంలా కానవచ్చేది శివగంగ. బడికంతా రిస్టు వాచీ కట్టుకునే స్టూడెంటు ఆ అమ్మాయి ఒక్కతేనని చెప్పొచ్చు. డాలరుతో బాటుగా మెడలో ఒక చిన్న బంగారు గొలుసు. అసలే అందమైన పిల్ల. ఈ ముస్తాబు వల్ల చుక్కల్లో చందమామలా కనిపించడంలో అబ్బురమేముంది? అహార్యంలో మట్టుకే గాదు. చదువుల్లో గూడా తన కూతురు ముందు వరుసలో వుండాలని రంగప్ప ఆశించాడు. యాభై రూపాయల నెలసరి జీతం ఏర్పాటుచేసి అతడొక రిటైర్డు టీచరు చేత తన కుమార్తెకు ప్రయివేటు చెప్పిస్తున్నాడని విన్నాను.

'ఒక్కగానొక్క కూతురు, పైగా తల్లి లేని బిడ్డ. గారాబంగా పెంచుకోడా మరి!' అని పదిమంది చెప్పుకోడం నా చెవిని బడుతూ వచ్చింది.

తొమ్మిదో తరగతిలో వుండగా శివగంగకు రంగప్ప సైకిలు కొనిపెట్టాడు. గ్రామీణ సమాజంలో ఒక ఆడపిల్ల సైకిలు తొక్కడం విడ్డూరమే! కానీ రంగప్ప కూతురు గదా! అతడేం సామాన్యుడు గాదు. రెండు లక్షల రూపాయల స్థితిమంతుడు. బొత్తిగా అవుటాఫ్ డేట్ అయిపోయింది గానీ, లేకపోతే తన కూతురికొక పంచకల్యాణి గుర్రాన్నే కొనిపెట్టి గలిగి వుండేవాడు. గుర్రంపైన చిన్న రుద్రమదేవిలా ద్యోతకం కావలసిన శివగంగ, చిన్న ఆంగ్లో యిండియన్ దొరసానిలా సైకిలు పైన బడికొస్తూ వుంది.

ఎస్సెస్సీ పరీక్షల్లో మంచి మార్కులతోటే పాసయింది శివగంగ. రంగప్ప ఆమెను తిరుపతికి తీసుకెళ్ళి పద్మావతి మహిళా కళాశాలలో చేర్పించాడని తెలిసింది.

శివగంగ హైస్కూలు గడప దాటిపోయింది గనుక, యిక రంగప్పకు నాతో అట్టే పని వుండదని నేననుకున్నాను. నా ఊహ పొరపాటు. అప్పటి నుంచి నాకు రంగప్ప ఉబ్బడి యిబ్బడిగా పని కల్పించాడు. ఉత్తరాలకు ప్రత్యుత్తరాలు రాయడం, మనియార్డరు ఫారాలు నింపడం, ప్రోగ్రెస్సు కార్డులు వివరించడం మొదలైన వాటితో బాటు మన దేశంలోని ఉన్నత విద్యా స్వరూపాన్ని గురించి నేనప్పుడప్పుడూ అతడికి ప్రయివేటు చెప్పడం గూడా తప్పనిసరైపోయింది.

-ఇంటర్మీడియెట్ అనేది రెండేళ్ళు చదవాలి. ఇందులో రెండు భాషలతో బాటు 'గ్రూపు' అని ఒకటుంటుంది. అందులో తీసుకునే సబ్జక్టులను బట్టి సాధారణంగా విద్యార్థి పై చదువులేమిటో నిర్ణయమవుతాయి. ఇంటరు ముగిశాక కొందరు మెడికల్ కాలేజిలో చేరి డాక్టర్లవుతారు. కొందరు ఇంజనీర్లవుతారు. మిగిలినవాళ్ళు బి.ఎ., బి.యస్సి, బి.కాం. లాంటి కోర్సులలో చేరతారు. చివరి మూడూ మూడేళ్ల కోర్సులు అవి పూర్తయ్యాక రెండేళ్ల పి. జి. కోర్సులున్నాయి. ఆ పైన యం. ఫిల్‌కు గానీ, పి. హెచ్. డి కి గానీ ...

"ఈ లెక్కన చచ్చేదాకా చదవతా వుండి పోవచ్చునే!" విస్మయం ప్రకటించేవాడు రంగప్ప.

"నిజమే మరి! కలిగిన మారాజులు ఎంత కాలమైనా తమ పిల్లల్ని చదివించుకోగలరు. ఎటొచ్చి జరుగుబాటు లేనివాళ్ళకే యిబ్బంది. వాళ్ళు తొందర తొందరగా చదువు ముగించి బ్రతుకుదెరువు కోసం ఏ వృత్తిలోనో, ఉద్యోగంలోనో ప్రవేశించవలసి వుంటుంది ...."

రంగప్ప తన కుమార్తెను చదివించడంలో చాలా ఓరిమి ప్రదర్శించేడనే చెప్పాలి. 'పద్మావతి'లో అయిదేళ్ళున్నాక ఆమె పై చదువుల కోసం యూనివర్సిటీ కాలేజిలో చేరింది. నెలకు నాలుగైదు వందల చొప్పున తన సంవత్సరాదాయంలో సగపాలు రంగప్ప కూతురు చదువు క్రిందే వెచ్చిస్తూ వచ్చాడు. మద్దిమాకుల పల్లెనుంచి ఒక ఒంటెద్దు బండి వచ్చి మా వూరి బస్‌స్టాండులో ఆగివున్నట్టయితే, ఆ రోజున రంగప్ప కూతురు శివగంగ తిరుపతి నుంచి రాబోతున్నదని మేమందరమూ అనుకునేవాళ్లం. చలవద్దాలు సరిచేసుకుంటూ, వానిటీ బ్యాగును వూపుకుంటూ పల్లకీలో నుంచి దిగే రాకుమారిలా ఎత్తు మడమల జోళ్ళలో నుంచి, సుతారంగా బస్సు దిగేది శివగంగ. పెట్టె, పరుపు, సంచులు మొదలైన వాటిని రంగప్ప పదిలంగా క్రిందికి దించుకునేవాడు. వంకరటింకర దారిపైన ఒంటెద్దు బండి సాగిపోతూ వుంటే పొలాల్లో పని చేసుకుంటూ వుండే కూలీనాలీ బక్క జనమంతా 'అదో, రంగప్ప కూతురొచ్చేసింది' అని అంటూ బాట పైకి పరుగెత్తుకొచ్చేసేవాళ్ళు.

సరే! రంగప్ప కూతురు చదువుకుంటూ వుందనీ, యింకా చదువుకోవాల్సింది వుందనీ కాలం ఆగుతుందా? ఆగదు. చూస్తూ చూస్తూ వుండగా ఆమెకు పాతికేళ్ళొచ్చాయి. ఆకాశమంత పందిరివేసి, భూదేవంత అరుగు నిర్మించి కూతురికి జాంజామ్మని పెండ్లి చేసెయ్యాలన్న కోరిక ఏనాటినుంచో రంగప్ప మనసులో చిందులేస్తూ వుంది. ఇలా వుండగా పిట్ట పిడుగులాంటి వార్త ఒకటి మా గ్రామీణ ప్రాంతంలోకి మొచట గాలి కబురుగా ప్రాకి వచ్చి, తరువాత పచ్చి నిజంగా ప్రచారమైపోయింది

భయపడకండి! మరేం అమంగళంకాదు. తండ్రి ఎప్పుడో చేస్తాడని వేచి కూచోకుండా, శివగంగ వివాహ నిర్ణయాన్ని తన చేతుల్లోనే తీసుకుంది. ఇంతకూ అది 'బేడ్ చాయిస్' అని చెప్పడానికి గూడా వీల్లేదు. రీసెర్చిలో గైడ్‌గా వుండిన ప్రొఫెసరే నిజ జీవితంలో భాగస్వామి గావడం ఎంతటి వాళ్లకు దొరికే భాగ్యం! ఆయనకెప్పుడో పెళ్ళయింది. పెళ్ళయిన కొద్ది కాలానికే భార్య పోయింది. దాదాపు పదేళ్లనుంచి విదురుడుగా ఏకాంత జీవితం గడుపుతున్నాడు. బ్రహ్మర్షి పదవికి బారెడు దూరంలో వున్న విశ్వామిత్రుడికే మనసు చలించగా, యింక ప్రొఫెసరు గారి మాటకేముంది? ఇంతకూ తన పబ్బం గడుపుకోడానికి ఆతడామెను వంచించి వుంటే అది వేరే సంగతి. అదేంలేదు పాపం! చట్టబద్ధంగా రిజిస్ట్రారు ఆఫీసులో పెళ్ళి చేసుకున్నాడు. ఆ తతంగం పూర్తికాగానే మిత్రులు కొందర్ని పిలిచి విందు గూడా ఏర్పాటుచేశాడు. అంతటితో మద్దిమాకుల పల్లె నడిమింటి రంగప్ప కూతురు శివగంగ, కొబ్బరికాయలోకి నీళ్లెక్కినంత సహజంగా తిరుపతి నాగరిక సమాజంలో మిసెస్ శివగంగా దక్షిణామూర్తిగా మారిపోయింది.

తండ్రి దృక్పథంలో నుంచి నేనీ సంఘటన గురించి పరి పరి విధాలుగా ఆలోచించాను. ఈ దెబ్బ నుంచి బహుశా యిక రంగప్పకోలుకోవడం సాధ్యంకాదనిపించింది. హఠాత్తుగా ఆతడెక్కడ తారసిల్లిపోతాడోనని భయపడ్డాను గూడా! ఎదురైతే అతడు భోరున ఏడ్చేస్తాడు. అతణ్ని నేనెలా సముదాయించగలను?

ఒకనాటి సాయంకాలం నేను ఊరి బయటకు వెళ్లి తిరిగొస్తుండగా సేద్యగాడి చేత కిరసనాయిలు డబ్బా మోయించుకెళ్తున్న రంగప్ప నాకు చెరువు పైన ఎదురయ్యాడు. సేద్యగాణ్ని సాగిపొమ్మని నన్ను తూము రాయి పైన కూచోబెట్టే ఆశ్చర్యమేమిటంటే కాగడా వేసి వెదికినా ముఖంలో దిగులుగానీ, దైన్యంగానీ రావడంలేదు. పైగా ఆకాశానికి మూడే బారల ఉత్సాహంగా వున్నాడు.

"ఏమయ్యా జగన్నాథం! ఒక ... ముడుచుకోడమేనా? ఒక నొసలు చిట్లించడ ... ఒక పెదవులు కొరుక్కోడమేనా? వీళ్లకేం ... కాలం వచ్చిందో నీకేమైనా తెలుసునా?"

వీళ్లకు అంటే ఎవళ్లకు? **అయోమయంగా** వైపు చూచాను

"వీళ్లంటే లోకులేనయ్యా! నా కూతురేం చేసిందని వీళ్ల ఉద్దేశం? ఆహా, తెలియకనేనయ్యా నిన్నడగడం! నువ్వు చె... కూతురు చేసింది తప్పేనంటావా?"

తాను ముద్దాయిగా పరిగణించిన లోకుల... నన్ను ప్రతినిధిగాఎన్నిక చేసి, రంగయ్య కుమార్తె తరపున వకాల్తా పుచ్చుకొనేసరికి తికమక పడిపోయాను.

లోకుల మాటకేం రంగప్పా! వాళ్ళు క... గదా! వాళ్ల సంగతి నీకొద్దు. నీ కూతరు చేసి... నీకు నచ్చితే చాలు" అన్నాను.

"ఆ మాటన్నావు కాబట్టి బాగుంది. కా... కులాంతరమంటారేమో! నేనొకటడుగుతా కులమయ్యా బోడి కులం! చొక్కమయిన ఎవడికేడ్చింది? వరసగా పది తరాలు క... చూస్తే ఎక్కడో ఒకొక్కడ కథ బెడిసి వుంటుంది. ఆహా, అది కాదులే! అసలుకంటే వుంది బాగా చదువుకున్నోడు. ఉద్యోగస్తుడు. దండిగా సంపాదించే అటువంటివాడు రంగప్ప కళ్ళుడైపోయినాడ అని మనసొప్పనితనం. వాకేం తెలియదా?"

అవసరాన్నిబట్టి రాజ్యాంగ ... సవరించుకుంటూ వెళ్లినట్లుగా, కూతురి



## క్షయ అక్షయ! భయం అభయం!

క్షయ!
అంతా భయంతో ఉన్నారు,
నీవు వస్తున్నావంటే.
అందుకే నీ పేరుకు ముందు
"అ" చేర్చాం. అక్షయ అన్నాం.
అందరినీ ఆదరించు
అందరికీ అందించు చేయూత
ఆశలను తీర్చు, ఆనంద మిచ్చు.

అక్షయా, నీవు వచ్చి
షష్టి పూర్తి అయింది
నీకు ఆయుష్యహోమం,
స్వర్ణాభిషేకం
అన్నీ ఏర్పాట్లు చేశాం
కానీ మంచి నెయ్యిలేక,
బంగారు బిస్కెట్లు దొరక్క
అన్నీ నిలిపి వేశాం.

మేము ఏమి చేయలేదని అనుకోకు.
మేము ప్రతిజ్ఞలు, వాగ్దానాలు, దీక్షలు
చేస్తాం. పనులు మాత్రం చేయలేం,
చెయ్యం. అయినా క్షమించు ఎందుకంటే
మా పాలకులు వాగ్దాన కర్ణులు.
అరటిపండు చూపిస్తారు
అర చేతిలో పెట్టరు

అబద్ధాలకు పెట్టింది పేరు.
మాకు గృహ వసతి,
మంచినీరు, పట్టుకాదు-
నూలు వస్త్రాలు ఆకాశంలో
అమర్చి పెట్టారు.
అందుకో లేక అఘోరిస్తున్నాం.

పొగమంచు వల్ల
మామిడి దెబ్బ తిన్నది.
రాజధానిలో నీటి
కరువు వల్ల చింతపండు
అలాగే ఉంచాను అందుకే
వేప పచ్చడి రుచి మారవచ్చు.
అందుకే క్షమించు,
క్షయా క్షమించు!

– ఎం. ఎస్. ఎం.

## నీకు నీవే - నాకు నేనే

తన అభిప్రాయాలను, ఆచారాలను మార్చుకుంటూవస్తున్నాడు రంగప్ప. పరమలోభిగా పేరు తెచ్చుకున్నవాగు, కుమార్తె కోసం రూపాయను గుడ్డి గవ్వలా ఖర్చు పెట్టాడు. ఆడదానికి చదువెందుకనే చాదస్తుడు తన కూతురు చదువుల్లో ఎల్లల్ని స్పృశించాలని ఆశించాడు. ఆఖరుకు తన బిడ్డ దగ్గరికి వచ్చేసరికి కరెంటు కమ్మిలాంటి 'కుల కట్టు' సైతం అతడి పాలిటికి పట్టి చొప్పదంటై పోయింది. ఇటీవల రోడ్డుపైన తారసిల్లినప్పుడు 'అన్నింటికన్నా నా కూతురే నాకెక్కువ' అన్నాడు రంగప్ప. ఆ ఎక్కువైన దాని కోసం అతడు దేన్ని వదులుకోడానికైనా సిద్ధంగానే వున్నట్టున్నాడు!

* * * *

పేపర్లు దిద్దే పని పది రోజుల పర్యంతం కొనసాగింది. ఆ డ్యూటీ నుంచి విడుదలైన నాటి రాత్రి రెండో సినిమాకు వెళ్లి తెల్లవారు జామున బయల్దేరే బస్సును అందుకోడం కోసం బస్ స్టేషనుకు చేరుకున్నాను. మామూలు మేరకు తిరుపతి బస్ స్టేషను రద్దీగానే వుంది. కూర్చోడాని-కెక్కడైనా తావు దొరుకుతుందేమోనని బెంచీల వైపు చూస్తుండగా, మోకాళ్ల మధ్య తలదాచుకుని వానలో తడిసిన పిట్టలా ఒదిగి కూర్చున్న వ్యక్తి ఒకతను ఒక బెంచీ పైన కనిపించాడు. ముసుగులో నుంచి తల పైకెత్తేదాకా అతడెవరో నాకు తెలిసింది గాదు. తెలిశాక దగ్గరగా వెళ్లి భుజంపైన చెయ్యివేసి "ఏమిట రంగప్పా! ఈవేళప్పుడు యిక్కడెందు-కున్నావు? ఊరికొస్తున్నావా ఏమిటి?" అని అడిగాను.

రంగప్ప మాట్లాడలేదు. మాటల యొక్క నిరుపయోగత్వాన్ని గుర్తెరిగిన విరాగిలా మౌనంగా కూర్చున్నాడు.

"పోనీ, ఊరికి వెళ్లాలని అనుకున్నా వనుకో! పగటిపూట బయల్దేరగూడదా? ఈ రాత్రి వేళ రెడ్ బిల్డింగ్స్ నుంచి యింత దూరం నడిచొచ్చి ..."

"కాదులేవయ్యా!" విసుక్కుంటున్నట్లుగా అన్నాడు రంగప్ప." నేను రాత్రి పదిగంటలెప్పుడెప్పుడో యిక్కడికొచ్చేసినాను ..."

"ఎందుకూ? అప్పుడు బస్సులుండవే!"

"ఉండేటప్పుడుంటాయి. వెళ్లేటప్పుడు వెళ్తాను."

-అంతేగానీ, ఇక్కడ మాత్రం వుండనే వుండను - అని అతడు చెప్పలేదు. కానీ ఆ భావం అతడి మాటల్లో ధ్వనించింది.

రంగప్ప ఈ నిర్ణయానికి రావడానికి వెనుక కారణాలేవో వుండే వుండాలి. అడిగే చొరవా నాకున్నప్పటికీ, ఆ పని చేయడానికి నాకెందుకో మనస్కరించడం లేదు. ఉండి వుండీ రంగప్పే ప్రేలిపోయాడు.

"ఏమయ్యా జగన్నాధం నేనంటే పల్లెటూరి గొర్రెని. నువ్వు నాలాంటోడివేమి గాదు. కొద్దో గొప్పో చదువుకున్నోడివి. పదూళ్లు తిరిగినోడివి. పది సంగతులు తెలిసినోడివి. నాకేదైనా తెలియకపోతే నిన్నడగాల. నువ్వు జవాబు చెప్పాల. ఏమంటావు?"

ఏమంటాను? ఈ ముంగాళ్ల బంధం దేనికి దారితీస్తుందో తెలియకపోయినా గంగిరెద్దులా 'సరే'నని తలాడించాను.

"నిద్ర లేవగానే ముఖమైనా కడుక్కోకుండాకాఫీ త్రాగొచ్చునా?"

"త్రాగ్గూడదు."

"రోడ్డు పైన తిరిగినట్లు ఇల్లంతా చెప్పులేసుకుని తిరగొచ్చునా?"

"తిరగకూడదు".

"ఆరిపోయేదానికి, కాల్చేదానికి ఎడం లేకుండా అదే పనిగా సిగరెట్లు కాల్చొచ్చునా?"

"కాల్చకూడదు."

"ఇంటికొచ్చే వాళ్లనంతా పోగేసుకొని నడి రేతిరి దాకా కొప్పుగిరి పోయేటట్టు అరవొచ్చునా?"

"అరవగూడదు."

"సరే! నువ్వూ నేనూ. అట్లా అనుకోడం వల్ల ఏం లాభం?"

"పోనీ, 'ఇది పద్ధతి కాదు బాబూ! మార్చుకోవాలి'- అని నువ్వే అల్లుడిగారితో చెప్పలేక పోయావా రంగప్పా?"

"ఆ మనిషితో నాకేం మాటలు? చెప్పాల్సిన నాలుగు మాటలూ నేను 'మా అమ్మితోనే చెప్పేసినాను."

"ఏమంది?"

"ఏమంటుంది?" - రంగప్ప కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. డగ్గుత్తికలో నుంచి మాటలు చాలా అస్పష్టంగా వినిపించాయి.

"నీకి జాదరబందీ అంతా ఎందుకు నాన్నా? పట్నవాసంలో యిమడలేవు. మన వూరు వెళ్లిపో. అక్కడే వుండు - అనేసింది."

ఇది నిజంగా గట్టి దెబ్బే! ఎదురు చూడని చోటు నుంచి వచ్చి, తగలరాని చోట తగిలింది.

నేను రంగప్పను చివరసారిగ చూడడం ఆ బస్సు ప్రయాణంలోనే. తిరుపతి నుంచి తిరిగివచ్చాక అతడు జబ్బుపడ్డాడని విన్నాను. రెండు నెలల తర్వాత ఆ దుర్వార్త గూడా వినవలసి వచ్చింది. అయితే ఒకటి. పోతూ పోతూ అతడొక చరిత్రను సృష్టించి పోగలడని మాత్రం ఎవ్వరూ అనుకోలేదు. స్వార్జితమైన ఆస్తిపాస్తులన్నింటినీ మా వూరి హైస్కూలుకు చెందేటట్లుగా నిర్ణయించి, ఆ డబ్బుతో కట్టే కట్టడానికి తన పేరు పెట్టవలసిందిగా అతడు వీలునామా రాయించి పోయాడు.

రంగప్ప జీవిత కథ మూలంగా నేనొక గొప్ప రహస్యం గ్రహించాను. అన్నింటికన్నా మానవుడికి ఎక్కువైనదేమిటో నాకు స్పష్టంగా తెలిసిపోయింది □

# ప్రముఖ నిర్మాత శ్రీ డి. వి. ఎస్. రాజు

"అలలు లేని కొలను వంటి వ్యక్తిత్వం
మంచికి పట్టం కట్టే మనస్తత్వం
కలిపి కూడితే డి. వి. ఎస్. రాజు;
పరిశ్రమలో మకుటం లేని మహారాజు.

మండుటెండనూ, పండు వెన్నెలనూ
ఒకే దృష్టితో చూస్తారు.
ఎండిపోయిన పువ్వును కూడ
ఎద లోగిలిలో దాస్తారు..."

ప్రముఖ నిర్మాత శ్రీ డి. వి. ఎస్. రాజు గురించి మరో సుప్రసిద్ధ నిర్మాత, సహజ కవి శ్రీ ఎం. ఎస్. రెడ్డి అన్న ముత్యాల మాటలవి.

1966 నుంచి (రెండు సార్లుగా) మొత్తం అయిదేళ్ళపాటు దక్షిణ భారత ఫిలిమ్ వాణిజ్య మండలి కార్యదర్శిగా, ఆ మండలి ఆధ్వర్యంలో నిర్వహింపబడే ఫిలిమ్ అక్టింగ్ స్కూల్ కరస్పాండెంట్‌గా, 1977లో ఆ మండలి అధ్యక్షులుగా, 1979లో ప్రారంభమైన ఆంధ్రప్రదేశ్ ఫిలిమ్ ఛేంబర్ తొలి అధ్యక్షులుగా, 1980లో ఫిలిమ్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా అధ్యక్షులుగా, ఆ సంవత్సరమే స్థాపించబడిన నేషనల్ ఫిలిమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ తొలి ఛైర్మన్‌గా, ప్రస్తుతం ఆంధ్ర చలన చిత్రాభివృద్ధి మండలి ఛైర్మన్‌గా ఉన్న రాజుగారు 1978లో మద్రాసులో ఇటీవల హైదరాబాద్‌లో నిర్వహించబడిన ఫిల్మోత్సవ్‌లలో ప్రముఖ పాత్ర వహించారు. హైదరాబాద్‌లో ఈ మధ్య ఫిల్మోత్సవ్ దేశ విదేశీయుల ప్రశంసలందుకునే రీతిలో నిర్వహించబడిన ప్రస్తావన తెస్తే, రాజుగారు మందహాసంతో "అవునండి. ఇది వరకు మన దేశంలోని ఇతర ప్రధాన నగరాలలో జరిగిన చలన చిత్రోత్సవాలలోని లోటుపాట్లను గుర్తుంచుకుని, ఇతర దేశాలలో ఈ ఉత్సవాలు ఎంత చక్కగా నిర్వహించబడుతూంటాయో దృష్టిలో ఉంచుకుని- ఈ రెండూ క్రోడీకరించి, క్రమబద్ధంగా, నిర్దుష్టమైన రీతిలో అటు మన రాష్ట్ర ప్రభుత్వం, ఇటు పరిశ్రమ కలిసి మన ముఖ్యమంత్రిగారి నేతృత్వంలో అవిరళమైన కృషి చేశాయి: హాజరయ్యే విదేశీ ప్రతినిధులకు వసతి సౌకర్యాలు సమకూర్చడం దగ్గర నుంచి ప్రతి చిన్న విషయం గురించి అత్యంత శ్రద్ధ వహించడం జరిగింది. అందుకే ఈ 'ఫిల్మోత్సవ్' నిర్వాహక వర్గం మీరన్నట్లు ప్రశంసలందుకోగలిగింది," అన్నారు.

"ఐతే, ఈ ఉత్సవంలో ప్రదర్శింపబడ్డ కొన్ని విదేశీ చిత్రాలు తీవ్ర విమర్శలకు గురయ్యాయి," అన్నాను.

"ఆ చిత్రాలు ఆశించిన స్థాయిలో లేకపోవడానికి కొన్ని కారణాలున్నాయి. ఫిల్మోత్సవ్‌లో పాల్గొనే చిత్రాలకు ఫ్రీ మార్కెట్ లేనందువల్ల విదేశీ చిత్ర ప్రముఖులు మన చిత్రోత్సవాల పట్ల ఎక్కువ ఆసక్తి చూపడం లేదు. అందుకే కేన్స్, బెర్లిన్, మాంట్రియల్, మాస్కో, న్యూయార్క్, లండన్, వెనిస్ చిత్రోత్సవాలలో ప్రదర్శించబడిన అత్యుత్తమ చిత్రాలను ఇక్కడ ప్రదర్శించడం అంతగా లాభదాయకం కాదని వారు భావిస్తున్నారు. విదేశీ చిత్రాల దిగుమతిని మన కేంద్ర ప్రభుత్వం క్రమబద్ధం చేసి, చాలా పరిమితం చేసింది.మన ప్రభుత్వం ఇకనైనా ఈ విషయాన్ని కూలంకషంగా పరిశీలించి, తగు చర్యలు తీసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. అంత వరకు మన ఫిల్మోత్సవాలలో ప్రదర్శింపబడే చిత్రాల స్థాయి ఇలాగే ఉంటుంది. పైగా, విదేశాలలో కూడా మారుతూన్న ప్రేక్షకుల అభిరుచులకు అనుగుణంగా, వాళ్ళ చిత్రాలు ఇదివరకటి స్థాయిలో నిర్మింపబడడం లేదేమో అని కూడా అనిపిస్తోంది."

"ఆంధ్రప్రదేశ్ ఫిలిమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన తెలుగు చలన చిత్ర పరిశ్రమాభివృద్ధికి ఏ విధంగా తోడ్పడుతూందంటారు?"

"చలన చిత్ర నిర్మాణానికి అవసరమయ్యే స్టూడియో, డబ్బింగ్ థియేటర్, రికార్డింగ్ థియేటర్, లేబరేటరి, ఎడిటింగ్, ఔట్‌డోర్ ఎక్విప్‌మెంట్ ఏర్పాటు చేసుకునేవారికి స్థలాల ఏర్పాట్లు, ఆర్థిక సహాయం అందిస్తోంది. థియేటర్స్ నిర్మించే వారికి కూడా స్థలం, ఆర్థిక సహాయం అందిస్తోంది. చలన చిత్రోత్సవాలు నిర్వహిస్తోంది. సినిమా రంగానికి చెందిన వారికి, కళాభిమానులకు చిత్ర నిర్మాణంలో వస్తున్న మార్పులను గురించి తెలుసుకోడానికి ఈ చలన చిత్రోత్సవాలు ఎంతో ఉపకరిస్తాయి. ఇతర దేశాల చిత్రాలు చూడడం వల్ల కొత్త పోకడలకు నాంది పలకడానికి ఇదొక చక్కని అవకాశం. అలాగే ఒక ప్రాంతం వారి ఆచారాలను, సంప్రదాయాలను మరొక ప్రాంతం వారు తెలుసుకోడానికి వీలుంటుంది. ఇకపోతే- రాష్ట్ర ప్రభుత్వంలోని వివిధ శాఖల వారికి, మారుమూల గ్రామాలలో నివసించే వారికి ప్రభుత్వం చేపట్టిన అభివృద్ధి పథకాలను గురించి డాకుమెంటరిలు తయారు చేస్తోంది ఈ కార్పొరేషన్. రాష్ట్రంలో జరుగుతున్న ముఖ్యమైన సంఘటనలపై వార్తా చిత్రాలను నిర్మించి, ప్రజ[...] అందజేస్తోంది. గ్రామీణ ప్రజల విజ్ఞానాభివృ[...] ఎంతగానో తోడ్పడుతోంది. ఇలా ఈ కార్పొరే[...] ప్రయోజనం క్రమేణా మరింత బలపడుతుం[...]" అన్నారు శ్రీరాజు.

ఈయన స్వస్థలం పశ్చిమ గోదావరి జిల్లా[...] కవిటం. 1928 డిసెంబర్ 13న జన్మించారు. 195[...] మద్రాసులో 'సినీ లితో వర్క్స్'ను నిర్వహించారు[...] ఎన్. టి. రామారావు, వారి సోదరులు [...] త్రివిక్రమరావుగార్ల తోటి సాన్నిహిత్యం కొద్దీ [...] 'నేషనల్ ఆర్ట్ థియేటర్స్'లో భాగస్వామిగా 195[...] చిత్ర నిర్మాణరంగంలో ప్రవేశించారు. 195[...] కొందరు మిత్రులతో కలసి 'ప్రగతి ఆర్ట్ ప్రొడక్ష[...]



నెలకొల్పి, "మా బాబు", తమిళంలో "అన్బుమ[...] తీశారు. 1964లో స్వంత సంస్థ డి. వి. ఎస్. ప్రొడ[...] స్థాపించారు. "మంగమ్మ శపథం, పిడుగు రాము[...] గండి కోట రహస్యం, తిక్క శంకరయ్య, చిన్న[...] స్నేహితులు, ధనమా-దైవమా?, జీవన జ[...] (1975లో స్వర్ణ నంది), జీవిత నౌక, కాలాంతకు[...] ప్రెసిడెంట్‌పేరమ్మ, అల్లుడు పట్టిన భర[...] ప్రణయ గీతం, మార్చండి మన చట్టాలు", హిం[...] "ముజేఇన్‌సాఫ్ చాహియే" నిర్మించారు.

వీరి కొత్త చిత్రం చిరంజీవి హీ[...] కె.రాఘవేంద్రరావు దర్శకత్వంలో ఎత్తునతయారవుతోంది.

వీరి జనకులు దాట్ల బలరామరాజుగారు ప్రమ[...] రాజకీయవేత్త, మాజీ పార్లమెంట్ సభ్యులు.

–(జి.వి.

సీరియల్

# ...వి కోరిన ప్రేమ

ఎం.డి.సౌజన్య

(గత సంచిక తరువాయి)

అన్నపూర్ణ కదంతా ఒక పీడకలలా అనిపించింది. కటిక పేదరికాన్ని ...నుభవించి యీలోకాన్ని శాశ్వతంగా వీడి, చివరిక్షణం వరకు తాను నమ్మిన ...టక కళకే అంకితమైన ఆదర్శ కళాకారుడు మురళీధర్– అతని కుటుంబం ...ర్థికంగా చితికి పోయి బలయి పోవటం ఆమెనెంతో కలవరపరచింది!

అతనలా చితికి పోవటానికి అతని కుటుంబం ఆర్థికంగా అలా దెబ్బతిని ...వటానికి అతను నమ్ముకున్న ఔత్సాహిక నాటకరంగమే కారణం!

ఇలా ఎందరు కళాకారులు సమిధలుగా మారి నాటక రంగాన్ని ...తికిస్తున్నారో?

ఇంతా చేసి వాళ్ళు పొందిందేమిటి?

ఇన్ని బాధలు పడి నాటక కళకు సేవ ఎందుకు చేయాలి!?

ఎవరినో అనందింప చేయటానికి.... ఎక్కడా ఆదరణకు నోచుకోని ...టకరంగాన్ని ఎందుకు పట్టుకువేలాడాలి!?

ఇలా నాటకరంగం మీద ఏహ్యాభావాన్ని పెంచుకున్న అన్నపూర్ణ రెండు ...జాలు తిండీ తిప్పలు లేకుండా దిగులుగా పడుకుంది.

మూడో రోజు ఆమె ఏదైనా ప్రత్యామ్నాయ కార్యక్రమం చేపట్టాలని ...నుకుంది.

బేగ్‌లో డబ్బు తీసుకోడానికి చేయి పెట్టగా అందులో మురళీధర్ యిచ్చిన ...ట్లం చేతికి తగిలింది.

ఆ పొట్లం విప్పి చూసింది బాధగా!

అది చివరిసారి మురళీధర్ తనకిచ్చిన పారితోషికం .

అయితే అందులో డబ్బుకు బదులుగా ఉన్న వస్తువు చూసి షాక్ తింది ...న్నపూర్ణ.

అది చేతితో తాకటానికే ఆమె భయపడింది.

అది ఒక స్త్రీ మంగళ సూత్రం!

అది ఎవరి మంగళసూత్రమో ఊహించగానే ఆమె కళ్ళల్లో నీళ్ళు సంకల్పితంగా ఉబికాయి.

చివరికి అభిమాన ధనుడైన మురళీధర్ తన భార్య మాంగళ్యం ఇచ్చి తనకు ...వ్వవలసిన పారితోషికం అందించాడు!

మైగాడ్.... ఇంతకంటే ఘోరం ఏముంటుంది!?

ఛీ.... ఛీ..... !! ఇంత నికృష్టమైన సంపాదన లేకపోతేనేం? ఆక్షణంలోనే ఆమె ...క నిర్ణయం తీసుకుంది!!

ఇక జీవితంలో నటిగా రంగస్థలమెక్క కూడదని గట్టి నిర్ణయం తీసుకుంది

అన్నపూర్ణ!

ఆ సంఘటన ఆమె జీవిత గమనాన్ని, ఆలోచనా ధోరణిని , నాటకరంగం పట్ల ఆమెకున్న ప్రేమాభిమానాలని తుడిచి పెట్టి వేసింది!

"ఆక్షణంలో తీసుకున్న నిర్ణయం..... ఇప్పుడు..... ఇన్నాళ్ళకు తిరిగి.... మైగాడ్..... ఏమిటి పరీక్ష!?" అంటూ వాపోయింది అన్నపూర్ణ.

ఇంకా ఆ కోటీశ్వరురాలు.... ఆలోచనలో పడ్డ అన్నపూర్ణ సమాధానం కోసం ఆశగా ఎదురు చూస్తోంది.

ఎందుకో ఆమెకు అన్నపూర్ణ తప్పక ఒప్పుకుంటుందని– ఒక స్త్రీ, తోటి స్త్రీ పరిస్థితిని సానుభూతితో అర్థం చేసుకోగలదని ఆశపడుతోంది.

"మా అబ్బాయి కాంతిభూషణ్ మంచి చిత్రకారుడమ్మా! వాడికున్న ఆ చిత్ర కళా చాదస్తమే వాడు పేరు ప్రతిష్టలు ఆర్జించటానికి..... చివరికి వాడు మతిలేని వాడు కావటానికి దారి తీసింది!! మనస్తత్వ శాస్త్రాధ్యయనం చేసే డాక్టర్లు చెప్పటం..... ప్రేమ పిచ్చిలో పడి పిచ్చివాడయి పోయిన కాంతిభూషణ్ మళ్ళీ మామూలు మనిషికావాలంటే..... అతన్ని ప్రేమించి అతనిలో మళ్ళీ ప్రేమ చిగురింప చేసే మనిషి కావాలన్నారు....... !! ఇది చివరి ప్రయత్నమే !! ఈ ప్రయత్నం ఫలించక పోతే నా కాంతిభూషణ్..... నాకు ...... శా...... శ్వతంగా దూరమయి పోవటం..... ఖా.....యం!" అంది గొంతు గాద్గదికమయి పోతుండగా

అన్నపూర్ణ ఆమె వైపు తల ఎత్తి చూసింది.

ఆమె కళ్ళు భారంగా వర్షిస్తున్నాయి.

"ఇదిగో నమ్మా..... లక్షరూపాయల చెక్కు! ఓ అయిదారు నెలలు డాక్టర్లు చెప్పినట్టు మా అబ్బాయితో ప్రేమనటించు!!.... వాడి మనసులో కాస్త పరివర్తన వచ్చి వాడు ఈ లోకంలోకి వచ్చి పడేట్టు చూడు!! వాడేం చేస్తున్నాడో.... ఏం మాట్లాడు తున్నాడో.... ఎలా ప్రవర్తిస్తున్నాడో... నిజంగా వాడెంత మంచివాడో..... ఎంత ఠీవిగా.... దర్పంగా వాడు ప్రవర్తిస్తాడో.... అసలు పోలికే లేదమ్మా!! నేపాల్ బార్డర్‌లో పనిచేసే ఒక మిలిటరీ ఆఫీసర్ కూతురిని మా అబ్బాయి ప్రేమించి.... ఆ అమ్మాయి చేత మోసగింప బడ్డాడట!!.... అప్పటి నుంచి .... ఏదేదో మాట్లాడు తాడు.... బాధ పడతాడు..... కోపంగా పళ్ళు పటపట కొరుకుతాడు..... అంతలోనే హృదయ విదారకంగా ఏడుస్తాడు.... !!!

ఇకనిన్నే ఈ పనికి ప్రోత్సహిస్తున్న కారణం..... నువ్వు.... ముమ్మూర్తులా మా అబ్బాయి ప్రేమించిన ఆ తెలుగు అమ్మాయిలా వుండటమే కారణం!! ఆ అమ్మాయి పేరు అవంతి..... !! ఇదిగో ఈ ఫొటో చూడమ్మా.... !" అంటూ ఆ ఫొటో చేతిలో పెట్టింది.

అన్నపూర్ణకు ఆశ్చర్యం వేసి..... ఆ ఫొటో అసంకల్పితంగానే అందుకుంది!!

ఆ ఫొటోలో ఉన్న అమ్మాయి రెండు జడలతో ముమ్మూర్తులా అన్నపూర్ణలాగే వుంది!!

"ఈ అమ్మాయి ఎవరు? " అడిగింది అన్నపూర్ణ."''చెప్పాకదమ్మా..... అక్కడ నేపాల్ బార్డర్‌లో పని చేసిన ఒక మిలిటరీ కలనల్ కుమార్తెట!! . ఆయన మన ఆంధ్రుడేనటమ్మా!" చెప్పింది.

"తమాషాగా వుందే..... !! మనిషిని పోలిన మనుషులుంటారని తను అంతవరకు కథల్లో చదివినా..... సినిమాల్లో ట్రిక్కుల వల్ల చూసినా.... అంతగా ఆమె పట్టించు కోలేదు.

కాని ఇవ్వాళ కంటి ముందు కనిపిస్తున్న నిజాన్ని కాదనేదెలా?

"రెండు జడలు వెసుకుని ఫొటో దిగి – ఆ ఫొటో – ఈ ఫొటో ..... ప్రక్క ప్రక్కన పెడితే రెండూ అచ్చం ఒకేలా వుంటాయి!! అసలు నేనే.... ఎవరిది ఏ ఫొటోనో తేల్చుకో లేనేమో?" అనుకుంది, ఇంకా ఆ ఫొటో వైపు కళ్ళార్పకుండా చూస్తూ.

'అందుకే నీ కోసమే వచ్చానమ్మా!? కాదనకుండా ఒక సారి ఆలోచించమ్మా!?" " అంది ఆ కోటీశ్వరురాలు ప్రాధేయ పూర్వకంగా.

అన్నపూర్ణ వెంటనే ఒక నిర్ణయానికి రాలేక పోయింది. అయితే రంగస్థల నటిగా మానివేశాక ఆమెకు ఎందరో అభిమానులు మళ్ళీ రంగస్థలం ఎక్కమని ప్రోత్సహిస్తూ..... ప్రార్థిస్తూ..... అర్థిస్తూ..... ఉత్తరాలు వ్రాశారు.

అనేక సమాజాలవాళ్ళు పెద్ద మొత్తాలు ఆశ చూపారు. ప్రభుత్వం

**జరిగినకథ- 1:** ప్రఖ్యాత నటి అన్నపూర్ణను ఒక కోటీశ్వరురాలు తన ...న్నకొడుకు ప్రాణాలు కాపాడమని వేడుకుంది. ఆ కోటీశ్వరురాలు కోరుతున్న ...పని నటనకు సంబంధించినది కాబట్టి అన్నపూర్ణ ఆమె అభ్యర్థనను ...ప్పుకోలేక పోయింది. అన్నపూర్ణకు గతంలో భార్య మరణవార్త విని కూడా ...మురళీధర్ గుండె నిబ్బరంతో 'ఇల్లాలు' నాటకంలో నటించి స్టేజి మీదే ...గుండె పోటుతో మరణించిన సంఘటన గురుకు వచ్చింది.

తరఫున కుటుంబ నియంత్రణ కోసం ప్రచారం చేసే నాటక బృందం ఆమెకు నటిగా ఉద్యోగం ఇస్తామన్నది.

అయితే అన్నపూర్ణ రంగస్థలం ఎట్టి పరిస్థితుల్లోనూ ఎక్కకూడదని నిర్ణయించుకుని ఆ విషయమే ధృడంగా చెప్పింది – వ్రాసింది.

కాని ఇన్నాళ్ళకు జీవిత రంగస్థలంమీద నటించి, కొడుకు ప్రాణం కాపాడమని ఒక తల్లి అర్థిస్తోంది!

ఇదిరంగస్థలం కాదు....! ముఖానికి రంగు ఉండదు! స్టేజి వుండదు! ప్రేక్షకులు.... జడ్జీలు వుండరు!! అయితే.... ఇది నటనే!?

అందుకే అన్నపూర్ణ ఏ సమాధానం చెప్పలేక మౌనంగా వూరుకుంది.

మౌనం అర్ధాంగికారంగా అనుకుని ఆ వచ్చిన జమిందారిణి కాసేపు నిరీక్షించి సరే! త్వరగా ఆలోచించి ఒక నిర్ణయానికి రామ్మా!! ఇది నువ్వు మనస్ఫూర్తిగా సహకరిస్తే సానుకూలపడే పని!! బలవంతం చేయటం నా అభిమతం కాదు! ఇదిగో నా అడ్రసు.... వెళ్ళొస్తాను!" అంటూ ఆమె నిష్క్రమించింది.

వెళ్ళిపోతున్న ఆ ఖరీదైన కారు వైపు చూస్తూ అన్నపూర్ణ నిలబడింది.

అప్పటికి ఆ జమిందారిణి వచ్చి వెళ్ళి వారం రోజులు దాటింది! అన్నపూర్ణ ఆ విషయమే మరచిపోయినట్లుంది! ఏదో నవల చదువుతున్న ఆమె.... "పోస్ట్!" అన్న కేకతో ఈ లోకంలోకి వచ్చిపడింది.

ఇదివరకు ఆమె నటిగా నాటక రంగాన్ని ఏలుతున్న రోజుల్లో - వివిధ పరిషత్తుల్లో బహుమతులు వచ్చినందుకు అభినందనలు తెలుపుతూ అభిమానులు ఉత్తరాలు వ్రాసేవాళ్ళు!

నాటకాన్ని చూసిన ప్రాత్రికేయులు - నాటకరంగ విమర్శకులు, తోటి నటులు అభినందిస్తూ, రక రకాలుగా పొగుడుతూ ఉత్తర పరంపర, దాదా రోజుకో పాతిక ఉత్తరాలైనా వచ్చేవి!

కాని.. ఆమె జీవిత గమనాన్నే మార్చిన ఆ మరువ లేని సంఘటన జరిగాక అన్నపూర్ణ నాటకరంగానికి దూరమైంది!!

అంతే.... క్రమేపి ఆమెకు అభిమానులు, వాళ్ళ అభిమాన ఉత్తరా పరంపరా దూరమైంది!

వొకప్పుడు ఆమెకు ఉత్తరాలు రాకపోవటం ఆశ్చర్యం కలిగిసే ఇప్పుడు – ఇన్నాళ్ళకు – తిరిగి ఉత్తరం రావటం ఆమెకి ఆశ్చర్యం కలిగించింది

"పొరపాటున ఎవరికో ఇవ్వవలసిన ఉత్తరం– నాకు ఇవ్వటానికి రావట లేదుకదా!?" అనుకుంది అన్నపూర్ణ పోస్ట్‌మన్‌ను చూసి.

"ఉత్తరంతో పాటు, ఇదిగో నమ్మా మీకు ఈ రిజిష్టర్డ్ పార్సిల్ కూడ వుంది–!" అంటూ, ఓ పెద్ద బౌండ్ బుక్‌సైజున్న పార్సిల్ వొకటిచ్చాడు పోస్ట్‌మన్



# బలికోరిన ప్రేమ

"ఉత్తరమే కాక, రిజిష్టర్ పార్సిల్ కూడానా? ఆశ్చర్యంగా వుందే?" అనుకుంది అన్నపూర్ణ సంతకం పెట్టి అది తీసుకుంటూ.

మొదట ఆ ఉత్తరం ఎక్కడి నుంచో తీసి చూసింది. అది విశాఖపట్నం నుంచి వచ్చింది.

"ఎవరు పంపి వుంటారు? ఈ ఉత్తరం– ఈ పార్సిల్? రెండూ ఒకళ్ళు పంపినవే!" అనుకుంది, రెండింటిమీద దస్తూరి ఒకరే వ్రాసిందని తెలిసి–

మొదట అన్నపూర్ణ ఉత్తరం చదవటానికి తెరిచింది.

ఎంతో కుదిరికగా, అందంగా, చూడ ముచ్చటగా వున్న ఆ అక్షరాలు చూడంగానే ఈ ఉత్తరం వ్రాసిన వాళ్ళకు కాస్త రాసే అలవాటు వుండి వుండాలి– లేకపోతే ఇంత కుదిరిగ్గా వ్రాయలేరు!– అనుకుంది. ఉత్తరం చదవటం మొదలు పెట్టింది.

"అమ్మా అన్నపూర్ణా!! నీ రాక కోసం ఎదురు చూశాను!! నేను మళ్ళీ వచ్చి నిన్ను నటించమని కోరాలనుకున్నాను! కానీ.... నీ నిర్ణయం మారదని.... అది మార్చలేనేమోనని.... అది మార్చే శక్తి నాలో లేదని నేను అర్థం చేసుకున్నాను!

కాని నువ్వు మొన్న చేసిన ఒక మంచి పని పేపర్లో చదివి ముగ్ధురాలయ్యాను!

ఇక జీవితంలో రంగస్థలంమీద ముఖానికి రంగు వేసుకుని నటించ కూడదనే నీ వ్యక్తిగత నిర్ణయాన్ని నేను ప్రశ్నించటం లేదు!! అలా ప్రశ్నించే హక్కు ఎవరికీ లేదు.... అది పూర్తిగా నీ స్వవిషయం!!

కాని నువ్వు మొన్న చేసిన మంచి పని పేపర్లో చదివి మళ్ళీ నాకు నీ సాయం కోరే అవకాశం ఆ భగవంతుడే కల్పించాడని భావిస్తున్నాను!

ఎంతటి నియమ నిష్టలైనా.... ఒక మంచి పని కోసం ఒక్కోసారి సడలించాల్సి వస్తుంది? అది, అలాటి ప్రత్యేక సందర్భాల్లో తప్పు కాదను కుంటాను!! భారతంలో ధర్మరాజంతటి మహోన్నతుడే.... అశ్వత్థామ చనిపోయాడని అబద్ధం చెప్పాల్సి వచ్చింది....! అలా చెప్పమని ప్రోత్సహించింది స్వయాన దేవుడైన కృష్ణపరమాత్ముడే!

మనమంతా మానవ మాత్రులం!!

కన్న తల్లిగా.... ఒకే ఒక కొడుకు.... మతి చెడి.... ఈ లోకం ఎట్టక.... తనమై పోతుంటే.... ఏ మార్గం లేక.... ఒక స్త్రీని కోరదగ్గ సాయం కాకపోయినా నన్ను.... నీ నిర్ణయాన్ని మరో మారు పునః పరిశీలించమని ప్రార్థిస్తున్నాను.

ఈ ఉత్తరంతో పాటు నీకు ఒక పార్సిల్ కూడా పంపుతున్నాను!

అందులో మా కాంతిభూషన్ వ్రాసుకున్న డైరీ లున్నాయి. అవి చదివితే నీకు.... వాడి పరిస్థితేమిటో అర్థమవుతుంది!

హాస్పిటల్‌లో మొన్న నువ్వు చేసిన ఆ మంచి పని.... మా కాంతిభూషన్ కోసం నువ్వు చేయవలసిన పని– రెండూ దాదాపు ఒకలాంటివే!

ఆలోచిస్తే ఈ రెండు కేసులూ వొకలాంటివే!

నా అభ్యర్థనను మన్నించే వీలుంటే మరోసారి నీ నిర్ణయాన్ని పునఃపరిశీలించమని ప్రార్థిస్తున్నాను!!

ఇట్లు,
ఓ అభాగ్య తల్లి,
రమాదేవి.

ఆ ఉత్తరం చదవటం పూర్తికాగానే, అన్నపూర్ణ మళ్ళీ ఆలోచనల్లో పడింది....!!

తను ఇక నటించటం లేదని.... నటించ కూడదని నిర్ణయం తీసుకున్నానని.... రమాదేవికి చెప్పిన రెండవరోజే, అనుకోని ఒక అద్భుత సంఘటన జరిగింది.

అన్నపూర్ణ తల్లికి అనారోగ్యంగా ఉంటే– అన్నపూర్ణను నటిగా ఎంతో అభిమానించి ఉచిత వైద్యం చేసే ఒక పెద్ద క్లినిక్ డాక్టర్ రంగారావు గారి హాస్పిటల్‌కు తీసి కెళ్ళింది.

అన్నపూర్ణ వెళ్ళేసరికి డాక్టర్ రంగారావు ఒక సైకియాట్రిస్ట్ డాక్టర్‌తో మాట్లాడుతూ, " ఆ పసివాడి మనో వేదన తగ్గటానికి అది తప్ప మరో మార్గం లేదు డాక్టర్!" అనటం విన్నది.

సైకియాట్రిస్ట్ వెళ్ళిపోయాక కూడా డాక్టర్ రంగారావు కూడా కాస్సేపు ఏదో ఆలోచిస్తున్నట్టు కళ్ళు మూసుకుని వుండటం– ఎంతో సేపు అన్యమనస్కంగా వున్నట్టుగా శూన్యంలోకి చూస్తూ వుండటం, ఆమెకు ఆశ్చర్యం కలిగించింది!

అన్నపూర్ణకు ఎన్నో ఏళ్ళుగా డాక్టర్ రంగారావుతో ఎంతో పరిచయం, చనువూ వున్నాయి.

అందుకే "ఏమిటి డాక్టర్! ఎప్పుడూ లేనిది ఇవ్వాళ ఎంతో ప్రత్యేకంగా.... ఉన్నారు!?" అంది.

ఆ మాటలతో డాక్టర్ రంగారావు వులిక్కి పడ్డట్టయి తనను అలా ప్రశ్నించింది అన్నపూర్ణని అర్థం చేసుకుని, "ఒక పెక్యూలియర్ కేసొకటి డీల్ చేస్తున్నానమ్మా! మా క్లినిక్ ప్రక్కనే వున్న అనాధ బాలల ఆశ్రమంలో .... ఒక అబ్బాయికి జబ్బుగా వుంటే.... అనాధ బాలల ఆశ్రమానికి ఉచిత సేవ చేయాలనే ఒక సిద్ధాంతానికి కట్టుబడి.... ఆ అబ్బాయిని నా హాస్పిటల్‌లో చేర్చుకున్నాను! పైగా ఆ ఆశ్రమ గౌరవ కార్యదర్శిని నేనే.

అరవింద్ అనే ఆ అబ్బాయికి తొమ్మిది.... పదేళ్ళుంటా యేమో!

ఈ అబ్బాయిమీద నాకు ప్రత్యేక శ్రద్ధ కలగటానికి కారణం.... ఈ అబ్బాయిని కన్న తల్లి ఎవరో.... ఆ పిల్లవాణ్ణి పుట్టగానే– మా ఇంటి గడప దగ్గర వదలి వెళ్ళింది!! ఆ పసివాడి ప్రక్కనే ఓ చీటీ కూడా వుంది– ఉత్తరం రూపంలో.

ఓ దుర్మార్గుడి మోసంలో పడి, అలా గర్భవతి అయి, కన్న తల్లినని లోకానికి చెప్పుకోలేక– అవివాహిత కావటం వల్ల ఆ పసివాణ్ణి అనాధాశ్రమానికి అప్పగించమని అందులో సారాంశం!!

నేను అనాధాశ్రమ గౌరవ కార్యదర్శిని కావటం వల్ల– నా సాయం అలా ఆ అభాగ్యురాలు కోరిందేమోనని నేనూ అనుకున్నాను!!

తరువాత ఆ పిల్లవాణ్ణి అలాగే అనాధాశ్రమంలో చేర్చాను! అందుకే ఆ పిల్లవాడంటే ఆశ్రమంలోని పిల్లలందరిలోకి ప్రత్యేక మమత, అభిమానం.

అతన్ని చూడటానికే నేను ఇదివరకటి కంటే ఆశ్రమానికి ఎక్కువగా వెళుతుండే వాడిని!

ఆ పిల్లవాడి పట్ల ఎక్కువ శ్రద్ధ తీసుకుంటూ వుండేవాడిని.

ముద్దులు మూటగడుతూ– ఎంతో ఎఱ్ఱగా– అందంగా ఉండే ఆ పసివాడంటే నాకు ఎందుకో మరింత ఆకర్షణ ఏర్పడింది.

అందుకే అతన్ని గురించి మరింత శ్రద్ధ తీసుకునే వాడిని.

నేను ఆశ్రమ గౌరవ కార్యదర్శిని కావటం వల్ల ఆ పిల్లవాడి పట్ల ఆశ్రమంలో వాళ్ళు కూడా ఓ ప్రత్యేక శ్రద్ధ చూపుతూ వుండేవాళ్ళు.

అయితే అరవింద్ ఎంతో చురకైన తెలివి తేటలు ప్రదర్శిస్తుండే వాడు కావటం చేత.... అతని చదువు విషయంలోనూ నేనూ ప్రత్యేక శ్రద్ధ వహిస్తూ, అతనితో చనువుగా వుండే వాణ్ణి!!

అరవింద్ నన్ను, "నాన్నగారూ" అంటూ పిలుస్తూ ఎప్పుడు నేను వస్తానా అని తపించి పోతున్నట్లుండేవాడు.

మూడేళ్ళకే అరవింద్‌కు అక్షరాలు అన్నీ రావటమే కాకుండా.... అతను ఏది ఒకసారి విన్నా.... ఎవరైనా చదివి వినిపించినా, ఏక సంథాగ్రాహిలా చెబుతుండేవాడు. రేడియోలో పాటలు– నాటికలు– చివరికి వార్తలు సైతం విన్నవి విన్నట్టు చెబుతూండేవాడు.

నాకు ఆ పసివాణ్ణి చూస్తే ముచ్చట వేసేది.

ఒక్కోసారి ఆ పిల్లవాణ్ణి నేనే ఎందుకు దత్తత తీసుకో కూడదు? ఆ పిల్లవాణ్ణి నా పిల్లలతోనే ఎందుకు పెంచకూడదూ? అనాధాశ్రమంలో కాకుండా నిజమైన తల్లిదండ్రుల లాలనలో పెరిగితే.... ఆ పిల్లవాడు తప్పకుండా చాలా గొప్ప వాడవుతాడని నాకనిపించి, ఆ విషయమే మా ఆవిడతో చెప్పాను! కాని.... మా ఆవిడ అందుకు వొప్పుకోలేదు!

"మనకు పిల్లలు లేకపోతేనే గదా....!! అయినా.... మన పిల్లల్ని గురించి మంచి చెడ్డలు మీరేమి పట్టించుకున్నారు గనుక? ఎప్పుడూ.... హాస్పిటల్.... క్లినిక్.... అంటూ అవే సరిపోతాయి!! పైగా.... బాధ్యత తీసుకోగానే సరిపోదు....!! రేపు మన ఆస్తితో పాటు.... అన్నింటిలో హక్కు ఆ పిల్లవాడికి ఇవ్వాల్సి

వస్తుంది! మీ ప్రాక్టీసంతా దానధర్మాలకి, నాటకాల బృందాలకి, పుణ్య కార్యాలకి– సంఘసేవకి సరిపోతుంటే.... మీరు వెనకేసింది ఏముంది!? మా నాన్న ఇచ్చిపోయిన ఆస్తి మూలుగు తుండబట్టి ఈ మాత్రమన్నా క్లినిక్ ఒకటి తెరవ గలిగారు! ఇందులో దానధర్మాలు చేయటానికి మీకు హక్కు లేదు!" అంది. కోపంగా. అంతటితో ఆ ప్రయత్నం మానుకున్నాను. కొన్నాళ్ళు గడిచాయి. అయినా ఆ పిల్లవాడి మీద ఎందుకో రోజు రోజుకూ మమకారం పెరిగిందే తప్ప తరిగింది లేదు! అయిష్టంగానే.... మరో మార్గంలేక అరవిందను అనాథాశ్రమంలోనే వుంచి పెంచుతున్నాను. అయితే.... అయిదారేళ్ళకే, అయిదారు క్లాసులు చదువుతున్న పిల్లల తెలివి తేటలు.... చలాకితనం అరవింద్‌లో ముగ్ధుణ్ణి చేస్తుండగా, "నాన్నగారూ....!! ఇక్కడున్న వాళ్ళకు ఎప్పుడూ.... ఏదో వొక వూరి నుంచి ఉత్తరాలు వస్తుంటయ్....! మరి నాకు ఒక్క ఉత్తరం ఎవరూ వ్రాయరేం?" అన్నాడు.

అలా వచ్చిన ఉత్తరాలు మెల్లిగా చదివి పెట్టటం, ఎవరన్నా చదువుతుంటే కుతూహలంగా వినటం– ఆ ఉత్తరాలు అడిగి తీసుకుని..... ఆ ఉత్తరం వ్రాసిన వాళ్ళు తన బంధువులే అయినట్టు ఊహించుకుని ఆనందిస్తుండటం చేస్తుండే వాడట అరవింద్!!

తన ఉత్తరాల సంగతి అరవింద్ పదేపదే అడుగుతుండటంతో మరో మార్గంలేక నేను ఒకరోజు హైద్రాబాద్‌లో వున్న ఒక స్నేహితుడికి అరవింద్ అడ్రస్ ఇచ్చి అందులో వ్రాయవలసిన మేటర్ చెప్పి ఒక ఉత్తరం పోస్టు చేయించాను. ఆ ఉత్తరం అరవింద్ తల్లి వ్రాసినట్టు ఆమె హైద్రాబాద్‌లో ఒక ప్రైవేట్ స్కూల్లో టీచర్‌గా పని చేస్తున్నట్లు అందులో వ్రాయించాను!!

అలా ఒక్క ఉత్తరమైనా వస్తే అరవింద్ ఆనందిస్తాడని నేను ఆశించాను!! కాని తరువాత అది తప్పని తెలిసింది!! ఆ మొదటి ఉత్తరం వచ్చిన రోజు అరవింద్ ఆనందానికి అవధులు లేవు!

"నాన్నగారూ! మా అమ్మ ఇన్నాళ్ళకు ఒక ఉత్తరం వ్రాసింది! మా అమ స్కూల్లో ఓ టీచర్‌గా పనిచేస్తుండగా...... నేను ఇక్కడ వుండి ఈ టీచర్ల దగ్గ చదువుకోవటం ఏమిటి?" అన్నాడు.

"అక్కడ...... తనతో పాటు నిన్ను అట్టి పెట్టించి చదివించటానికి వీలు వుండి వుండదు! అందుకే నిన్ను ఇక్కడ వదలి పెట్టి వుంటుంది!!" అన్నాను. క్రమేపి రెండు మూడేళ్ళు అరవింద్ ఉత్తరాలు రాయటం– వాటికి నేను హైద్రాబాద్ నుంచి తగిన సమాధానాలు వచ్చేట్టుగా తిరిగి ఉత్తరాలు వ్రాయటం చేయించాను!!

ఒక్కో సారి..... దీపావళికి ..... సంక్రాంతికి చిన్న చిన్న బహుమతులు బొమ్మలు పంపుతుండే ఏర్పాట్లూ చేశాను!!

ఒకసారి తనను చూడటానికి తప్పక రమ్మనమని..... అలా రాకపోతే..... ఆమె వచ్చే వరకు అమరణ నిరాహారదీక్ష చేస్తానని అరవింద్ ఉత్తరం వ్రాశాడట!

ఆ విషయం మొదట రెండు మూడు రోజులు నాదృష్టికి రాలేదు!!

కాని తరవాత క్రమేపి నిజం తెలిసింది!!

నేను ..... ఇక..... అరవింద్ అమ్మను పిలిపించటం కంటే మరో మార్గం లేదని నిర్ణయించుకున్నాను. అసలు ఎక్కడుందో తెలియని అమ్మను..... ఎలా అరవింద్ దగ్గరకు రప్పించటం?

ఒక పత్రికా ప్రకటన చేస్తే!!?

చేసినా ఆమె చూస్తుందని.... ఎప్పుడో వదలేసిన పసివాడు, అదీ అవివాహితగా వుండగా జరిగిన పొరపాటుకు ప్రతి రూపమైన ఆ పసివాణ్ణి తిరిగి ఎలా ఆమె ..... ఆ బిడ్డకు తల్లినని వస్తుంది. ఇలా ఏంచేయాలో ఆలోచిస్తూ నేను, అప్పటికే నీరసంగా కోమాలోకి పోయిన అరవింద్‌ను నా ఆసుపత్రికి తెచ్చి సెలైన్ ఎక్కించి ఎలాగో చావకుండా కాపాడుకొస్తున్నాను!

నేను ఎంతో దూరం ఆలోచించకుండా, అనాలోచితంగా, లేని అమ్మను సృష్టించి, అరవింద్‌ను కొన్నాళ్ళు మభ్య పెట్టి అతన్ని అనవసరంగా ఆ పరిస్థితికి తెచ్చానన్న భయం పట్టుకుంది.

అరవింద్ చిన్న వాడైనా మొండి పట్టుదల వున్నవాడు. అపస్మారక స్థితినుంచి అతను కోలుకున్నా..... ఎప్పుడన్నా కళ్ళు తెరచినా" డాక్టర్! మా అమ్మను నన్ను చూడటానికి రమ్మని ఒక సారి వ్రాయరూ?" అనేవాడు. నేను ఏం చేయాలో తోచక "అలాగే బాబూ!" అనే వాణ్ని.

తరువాత బాధపడేవాణ్ణి!

ఇంతవరకు అరవింద్ ఇంకా సెలైన్‌తోనే బ్రతుకుతున్నాడు.

వారం నుంచి టెంపరేచరూ కొద్దిగా పెరిగింది! నిద్రలోనే 'అమ్మా! అ అంటూ కలవరిస్తున్నాడు. అనవసరంగా ఓ పసివాడిలో లేని భ్రమలు కల్పిం అతని చావుకు నేను కారణం అవుతున్నానేమోనన్న ఆందోళన నా మనసు తొలచివేస్తోంది!" అన్నాడు.

ఒక కథలా డాక్టర్ రంగారావు చెప్పిన సంఘటనలన్నీ విన్న అన్నపూ "డాక్టర్! అరవింద్ వాళ్ళమ్మ ఎలా వుంటుందో అరవింద్ ఎరగడు క అలాంటప్పుడు... అరవింద్ అమ్మలా ఒక స్త్రీని పరిచయం చేస్తే ఏమి నష్టం!? అరవింద్ దిగులు ఆ విధంగా దూరం చేయవచ్చు గదా!?" అంది.

"అన్నపూర్ణ చెప్పిన సలహా తనకు అంతవరకు తట్టకపోయినా ... ఆ చెప్పిన సలహా పాటించటం వల్ల మేలే కాని... కీడేదీ వుండదు!" అనుకున్నా డాక్టర్ రంగారావు.

"నువ్వు చెప్పిన సలహా బాగానే వుందమ్మా .... కాని అలా ఆ పిల్లవా నమ్మించేట్టుగా నటించే వ్యక్తి ఏది?" అన్నాడు డాక్టర్ రంగారావు.

అన్నపూర్ణ బాలనటిగా వుండగానే డాక్టర్ రంగారావు గౌరవాధ్యక్షుడు వున్న అనేక నాటక సమాజాలలో బాలనటిగా పరిచయం. నటిగా ఆమె ప్ర డాక్టర్ రంగారావుకు తెలుసు.

నటిగా అన్నపూర్ణ నాటకరంగం నుంచి విరమించుకున్నదన్న సం తెలుసు!

ఆ విషయం తెలిసీ బాధ పడింది, ఎక్కువగా డాక్టర్ రంగారావే!

అందుకే ఆయన చొరవ చేసుకుని యీ విషయంగా ఏ అడగలేకపోయాడు.

పరిస్థితి అర్థం చేసుకున్న అన్నపూర్ణ "డాక్టర్! ఇంత మంచి పనికి నే సహకరించకపోతే... ఈ మానవ జన్మకు అర్థం లేదు! చెప్పండి నన చేయమంటారో?" అంది, పట్టుదలగా.

డాక్టర్ రంగారావు ఆమె నిర్ణయాన్ని హర్షిస్తూ "ఇప్పటికే చా ఆలస్యమైందమ్మా! అయినా నీ ప్రయత్నంగా నువ్వు చేయగలిగింది చే తప్పేముంది!? అరవింద్ వాళ్ళమ్మ ఉందనుకుని ఊహిస్తూ వ్రాసిన ఉత్తరా హైద్రాబాద్‌లో నేను ఏర్పాటు చేసిన మనుషులు తిరిగి నాకు పంపారు! అవి ను తీసుకుని.... నువ్వే అరవింద్ తల్లిగా రంగ ప్రవేశం చేయాలి!" అన్నా అన్నపూర్ణ ఆలస్యం చేయలేదు.

పది నిముషాల్లో అరవింద్ మంచం దగ్గరకు వెళ్ళటానికి సిద్ధమైంది.

(ఇంకా ఉం



## నా ప్రాణమిత్రులు

# రామచంద్రకాశ్యప, రామన్నపంతులు

-డి. వి. నరసరాజు

రామచంద్ర కాశ్యపతో నా మొట్టమొదటి పరిచయం- మదరాసు లయోలా కాలేజీలో- 1940లో!

అతను నాకంటె ఒక సంవత్సరం జూనియర్! నేను సీనియర్ బి.ఎ.లో వుండగా- అతను వచ్చి- బి.యే.లో చేరాడు.

రామన్న పంతులుగారితో పరిచయం- విజయవాడలో – 1948 ప్రాంతాల!

మేము ముగ్గురమూ విజయవాడ- (అప్పుడు బెజవాడ) వాసులమైనా-

హైస్కూలు చదువులు- నేను హిందూ హైస్కూలు, వాళ్ళిద్దరూ మునిసిపల్ హైస్కూలు కావడంతో –

వాళ్ళిద్దరికీ పరస్పరం పరిచయం వుందిగాని- నాకు వాళ్లతో పరిచయం లేదు.–

మదరాసు లయోలా కాలేజీలో- ఆంధ్ర విజ్ఞాన సమితి- నాటక విభాగానికి నేను కార్యదర్శిని.

ప్రతి సంవత్సరం ఒక నాటకం ప్రదర్శించడం ఆనవాయితీ.

ఆ సంవత్సరం (1940) "రాణాప్రతాప్" ప్రదర్శించాం.

అందులో నేను రాణాప్రతాప్- కొండముది గోపాలరాయ శర్మ ప్రఖ్యాత సినీ- నాటక రచయిత (నా సహాధ్యాయి) శక్తసింహుడు- రామచంద్ర



వ్యాస రచయిత

కాశ్యప- అక్బర్!

యిప్పుడు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా రిటైర్ అయిన- శ్రీ జస్టిస్- కోకా రామచంద్రరావు గారు- అందులో ఒక స్త్రీ పాత్ర ధరించారు.

ఆంధ్రప్రదేశ్ రెవిన్యూ కార్యదర్శిగా పనిచేస్తూ అకాల మరణం వాతబడిన- శ్రీ ఎ. చంద్రశేఖర్ ఐ.ఎ.యస్. కూడ మరొక స్త్రీ పాత్ర ధరించారు.

ప్రస్తుతం- ఆంధ్రప్రదేశ్ పోలీస్ యిన్స్పెక్టర్ జనరల్‌గా రిటైర్ అయిన శ్రీ కొన రామచంద్రారెడ్డి గారు గూడ ఒక వేషం వేశారు.

ఆ నాటకం చూడడానికి వచ్చిన- ఫిలిం ప్రొడ్యూసర్ శ్రీ పంతం చిన్నారావుగారు- కాశ్యప నటనకు ముగ్ధులై- ఒక బహుమతి ప్రకటించారు.

ప్రస్తుతం- హైకోర్టు సీనియర్ అడ్వకేట్- శ్రీ కటికినేని జగన్నాథరావు గారు- నాకు ఒక బహుమతి ప్రకటించారు. (అప్పుడు ఆయన "లా" కాలేజీలో చదువుతున్నారు)

గోపాలరాయ శర్మకు గూడ ఒక బహుమతి లభించింది.

ఆ తరువాత గూడా- కాశ్యప లయోలా కాలేజీలోనూ- లా కాలేజీలోనూ- నాటకాలు ప్రదర్శించి బహుమతులు పొందాడు.

నేను బి.యే.తో చదువు ముగించి- బెజవాడ వచ్చేశాను.

కాశ్యప లా పూర్తిచేసి- బెజవాడలో- ప్రాక్టీసు పెట్టాడు.

1947- డిసెంబర్‌లో అనుకుంటాను- బెజవాడలో ఆంధ్ర నాటక కళాపరిషత్తు నాటక పోటీలు- దుర్గాకళామందిరంలో జరిగాయి!

ఆచార్య ఆత్రేయ- "ఈనాడు" నాటకం ప్రదర్శించారు.

ప్రస్తుత ఆంధ్ర ముఖ్య మంత్రి శ్రీ యన్. టి. రామారావు గారు- "చేసిన పాపం" నాటిక ప్రదర్శించారు. రచన- కొప్పరపు సుబ్బారావుగారు.

జగ్గయ్యగారు గూడ ఒక నాటికలో పాల్గొన్నారు.

ఆ నాటకాలు చూచి- కాశ్యప- రామన్నపంతులు- నేనూ- వుత్సాహపడి- మళ్ళీ నాటకాలు ప్రదర్శించాలని- నిర్ణయించుకున్నాం!

అప్పటికే- కొప్పరపు సుబ్బారావు గారు- లిటిల్ థియేటర్ తరఫున మంచి గ్రంథాలయం సమకూర్చారు- విజయవాడలో

నాటక ప్రదర్శనలకు- రాఘవకళా కేంద్రం స్థాపించాం!

మొదట- సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారి- "విశ్వం పెళ్ళి" నాటకం విజయవాడలో- హనుమంతరాయ గ్రంథాలయంలో ప్రదర్శించాం.

అందులో- ప్రధాన పాత్రధారులు- కాశ్యప, గుడిపాటి వెంకటచలంగారి కుమార్తె కుమారి నిర్మల!

అందులో నేనొక చిన్న వేషం వేశాను!

ఆ తరువాత- కొప్పరపు సుబ్బారావు గారు- జె. బి. ప్రీస్ట్లీ వ్రాసిన "యిన్స్పెక్టర్ కాల్స్" నాటకాన్ని "ఇనప తెరలు"గా వ్రాశారు.

ఆ నాటకం- రాఘవ కళాకేంద్రం తరఫున 1950లో కాకినాడలో జరిగిన నాటక కళాపరిషత్తులో ప్రదర్శించాం!

నేనూ- మాదినేని వెంకటేశ్వరరావు, రామచంద్ర కాశ్యప, వెంపటి రాధాకృష్ణ, కొటగిరి పార్థసారథిరావు- శ్రీమతులు కొప్పరపు సరోజినీదేవి, వీరమాచనేని సరోజినిదేవి- అందులో పాత్రధారులం!

మద్రాసు కళాసాగర్‌లో "నాటకం" ప్రదర్శన సందర్భంగా శ్రీయుతులు డి. వి. నరసరాజు, రామచంద్ర కాశ్యప, రామన్న పంతులు



మందులు మింగించాను. ఇది సంస్కారవంతులు చేసే పని కాదంటారా?"

"సాయంత్రానిక్కూడా, ఆమెకు జ్వరం తగ్గకపోతే, ఆమెను కారులో హాస్పటల్‌కు తీసుకెళ్ళటం, మానవత్వమున్న మనుష్యులు చేసే పని కాదంటారా?"

"నాకు చదువూ, సంస్కారం ఉంది కాబట్టే, స్వప్న అమాయకత్వాన్ని స్వార్థానికి ఉపయోగించుకోకుండా ఆమెకు మంచి స్నేహితుడిగా మిగిలి పోయాను. ఆమె మనస్సు ఇప్పటికీ, ఎప్పటికీ మీది. ఆమె మనస్సుతో సంబంధం లేకుండా, ఆమె శరీరం మాత్రమే చాలను కుంటే, స్వప్న కిష్టం లేకపోయినా వాళ్ళ డాడి చేత కాళ్ళు కడిగి కన్యాదానం చేయించుకునే వాడిని. సభ్యత, సంస్కారం మరిచిపోయి ఇప్పుడు ప్రవర్తిస్తున్నది మీరో, నేనో ఆలోచించండి."

"శాంతి నర్సింగ్ హోమ్‌లో ఎనిమిదో నెంబరు స్పెషల్ రూములో మీ భార్య అపస్మారక స్థితిలో ఉంది. వెళ్ళి చూడండి. నేను చెప్పింది నిజమో, కాదో మీకే తెలుస్తుంది." అన్నాడు రఘునాథ్ కోపంగా.

సిగ్గుతో జయరాం తలవాలి పోయింది. ఒక్క నిముషం కూడా, అతని ముందు కూర్చోలేక పోయాడు. రఘునాథ్ చెప్పిన ప్రకారం హాస్పటల్ కెళ్ళాడు.

మూడు రోజుల నుంచి నూటమూడు డిగ్రీల జ్వర తీవ్రతతో, ఆహార మేమీ తీసుకోకపోవటం మూలంగా, స్వప్న ముఖం బాగా వాడిపోయి ఉంది. మత్తు లాంటి నిద్రలో నిద్రపోతున్న స్వప్న జయరాం రావటం, వెళ్ళటం కూడా గమనించ లేదు. ఒక గంట కూర్చున్నాడు. స్వప్న కళ్ళు తెరవ లేదు. రాములమ్మను జాగ్రత్తగా చూసుకొమ్మని చెప్పి ఇంటి కొచ్చేసాడు.



# ప్రేమసాగరం

రఘునాథ్. స్వప్న అంతజ్వరంలో హాస్పటల్‌లో ఉంటే ఏ సీ రూములో పడుకుని హాయిగా నిద్రపోలేక పోయాడు. హాస్పటల్‌కొచ్చి స్వప్న మంచానికి దగ్గరగా కుర్చీ లాక్కుని నిద్రపోకుండా అలాగే కూర్చున్నాడు.

ఉదయం అయిదు గంటలకు తెలివి వచ్చింది స్వప్నకు. కళ్ళు తెరవగానే, ఎదురుగా రఘునాథ్, రాములమ్మ కనిపించారు.

"ఎలా ఉంది స్వప్నా?"

"ఎలా ఉందమ్మా?" రాములమ్మ, రఘునాథ్ ఇద్దరూ ఒకేసారి ప్రశ్నించారు.

"అలసటగా ఉంది. తల తిరుగుతున్నట్లుగా ఉంది". నీరసంగా అంది.

రఘునాథ్ ఆమె చెయి అందుకుని చూసాడు. వేడిగా లేదు.

"జ్వరం తగ్గిపోయింది స్వప్నా! ఇంకేం భయం లేదు". అన్నాడు. అతను వారిస్తున్నా వినకుండా లేచి, దిళ్ళు ఎత్తుగా అమర్చుకుని, వాటికి ఆనుకుని కూర్చుంది.

"చాలా భయపడ్డాను. నీ జ్వరం తగ్గింది. అంతే చాలు." అన్నాడు రఘునాథ్ తేలికపడిన మనస్సుతో.

"నేను తగ్గినందుకు బాధ పడుతున్నాను. నేను చచ్చి పోయినా బావుండేది. ఎందుకు బావా! నన్ను బ్రతికించావు?"

"అంతమాటనకు స్వప్నా! నువ్వు బ్రతుకుతున్నది నీకోసం కాదు. మాకోసం."

కనురెప్పలెత్తి అతని వైపు చూసింది.

"నేను బాధపడతానని తెల్సి కూడా, ఎందుకిలా మాట్లాడతావు? నన్ను బాధపెట్టటం నీకు సరదానా?"

అతను బాధపడుతున్నాడని అర్థం చేసుకున్న స్వప్న" నా పైన నీకె అభిమానముందో ప్రత్యక్షంగా చూసి ఆనందించాలని అలా అన్నాను. " అం నవ్వుతూ.

"హోటల్ కెళ్ళి కాఫీ తీసుకొస్తాను," అంటూ రఘునాథ్ లేచి ఫ్లాస్క్ తీసుకుని బయట కెళ్ళాడు. అతను వెళ్ళింతర్వాత రాములమ్మ వైపు తి "అయ్యగారు నన్ను చూడటానికొచ్చారా ఇక్కడకు రాలేదా?" అనడిగిం దిగులుగా.

"రాత్రి వచ్చారమ్మా. కాస్సేపు కూర్చుని వెళ్ళి పోయారు. నాకే ఎంతో బాధనిపించిందమ్మా. ప్రేమించి పెళ్ళి చేసుకున్న భర్త, భార్య ఒళ్ళు తెలియని జ్వరంతో పడుంటే, తనకేం పట్టనట్టు వెళ్ళిపోయాడు. రఘునాథ్ బాబుగారు మాత్రం రాత్రంతా కన్నుమూయకుండా మీ మంచం దగ్గర కూర్చున్నారు."

"ఆయనకు నేనొక్కదాన్నే కాదు భార్యను." అంది గాఢంగా నిట్టూరుస్తూ.

"ఇప్పటికయినా, నా మాట వినమ్మా. ఆ మనుష్యులు మధ్య మీరు బ్రతకలేరు. వాళ్ళకు కావాల్సింది మీరు కాదు. మీడబ్బు. ఆ తల్లీ కూతుళ్ళు, గాదికింద పందికొక్కుల్లా మీ సొమ్మంతా తెగతింటున్నారా? జ్వరంతో హాస్పటల్‌లో పడుంటే, కనీసం మిమ్మల్ని చూడటానికొచ్చారా రాలేదు."

"వాళ్ళను గురించి , నాదగ్గర మాట్లాడకు. వినటానికే అసహ్యంగా ఉంది నాకు." దిళ్ళు సరిచేసుకుని పడుకుంటూ బాధగా అంది.

* * * *

స్వప్న హాస్పటల్‌లో పది రోజులుంది. ఆ పది రోజులూ రాములమ్మ స్వప్నను కనిపెట్టుకుని ఆమె మంచందగ్గరే ఉంది. అన్ని రోజులలో వరలక్ష్మి గానీ, మోహినిగానీ, ఒక్క సారి కూడా స్వప్నను చూడటానికి రాలేదు.

రాములమ్మ వంట చెయ్యకుండా, హాస్పటల్‌లో ఉందన్న కోపంతో, ఆమెకు భోజనం కూడా పంపించ లేదు. రఘునాథ్, ఆ పది రోజులూ, హాస్పటల్‌లోనే ఉండి, ఆమెను కంటికి రెప్పలా చూసుకున్నాడు. నాయర్ రెండు పూటలా క్యారియర్ తీసుకొచ్చి రాములమ్మకిచ్చి వెళ్ళేవాడు.

జయరాం రెండు పూటలా వచ్చి కాస్సేపు కూర్చుని వెళ్ళేవాడు. స్వప్నకు పాలు, పళ్ళు రఘునాథ్ తెచ్చి ఇస్తుంటే చూస్తూ కూర్చునే వాడు. తను తెచ్చే వాడు కాదు. అతను తీసుకొస్తుంటే వారించే వాడుకాదు.

అతని మనస్సులో ఏముందో స్వప్నకర్థమయేది కాదు.

పది రోజుల జ్వరంతో బాగా నీరసించి పోయింది. ఇంటికి తీసుకొచ్చే రోజున, రఘునాధ్ కారు తీసుకొచ్చి తనింటి కెళదాం అన్నాడు. స్వప్న వప్పుకోలేదు. తనింటికే వెళతానంది రాములమ్మను, ఆమెనూ వాళ్ళింటి దగ్గర డ్రాప్ చేసి వెళ్ళాడు.

తన బెడ్‌రూముచూసిన స్వప్నకు కళ్ళు తిరిగి నంత పనయింది. ఒక్క వస్తువు పెట్టింది పెట్టిన చోట లేదు. గదంతా చిందరవందరగా ఉంది. ఆ రూములో టేకు చెక్కతో చేసిన పూర్వకాలం నాటి పెద్ద బీరువా ఉంది. దాన్నిండా, వెండి సామాను కంచాలు, గ్లాసులు, జగ్గులూ, టాయిలెట్ బాక్సులూ, కూజాలు ఎన్నో రకాల సామాన్లుంటాయి. అన్నీ చూస్తూ ఆ బీరువాకూడా తెరిచి చూసింది ఒక్క వెండి సామాను లేదు.

బెడ్ రూములో ఉండే, టీ. వీ., టేప్ రికార్డర్, ఫోన్, డ్రస్సింగ్ టేబుల్, ఏవీలేవు బెడ్ రూము అన్న పేరుకు ఒక్క డబల్ కాట్ తప్ప ఆ రూములో విలువయిన వస్తువు ఒక్కటీ లేదు. చివరగా తన బట్టల బీరువా తెరిచింది. ఖరీదయిన చీరలు కనిపించ లేదు.

తను జ్వరంతో, హాస్పటల్‌లో ఉన్న సమయంలో తను బ్రతకదన్నుద్దేశ్యంతో, ఇవన్నీ అమ్మా కూతుళ్ళు హస్తగతం చేసుకునుంటారనుకుంది. తన నడిగితే, అవన్నీ తనే ఇచ్చేది. అలా చాటుగా తీసుకోవాల్సిన అవసరం లేదు వాళ్ళ తేలిక బుద్ధికి బాధపడింది.

ఆ రూములోకి జయరాం వచ్చాడు. అతన్ని చూడగానే, మనస్సులో పొంగుతున్న కోపాన్ని ఆపుకోలేక పోయింది.

"ఈ గదిలో ఉండాల్సిన వస్తువులన్నీ ఏమయ్యాయి?" అంది

"గది శుభ్రం చేయించేటప్పుడు , తీయించి ఉంటారు."

"బీరువాలో నుంచి వెండిసామాను కూడా, గది శుభ్రం చేయించటానికే లించారా? బీరువాలో చీరలెలా మాయమయ్యాయి?"

వెండిసామాను మోహిని తీసి, తన రూములో పెట్టుకుంటున్నప్పుడు, ౹రాం చూసాడు. ఫోన్, టీవీ కూడా తీసుకెళుతుంటే, ఆ రెండయినా ఆ ములో ఉంచండి అని అతను చెబుతున్నా వినిపించుకోకుండా మోహిని ౹కెళ్ళి తన బెడ్ రూములో పెట్టుకుంది. ఇప్పుడు స్వప్న అలా నిలదీసి ఘగుతుంటే సమాధానం చెప్పలేక తికమకపడ్డాడు

"మాట్లాడరేం? నా ఇంట్లో ఉంటూ, నా తిండి తింటూ, నా రూములోనే ంగతనం చేసిన వాళ్ళు ఎంతకయినా తెగిస్తారు? వాళ్ళు ఒక్క నిమిషం కూడా ఇంట్లో ఉండటానికి వీల్లేదు. ఇంత దోచుకుంటున్నా చాలలేదా? నా ాములో వస్తువులు కూడా దోచుకోవాలా? ఫోన్ ఉపయోగించటం కూడా లియని వాళ్ళు, ఫోన్ కూడా తీసుకెళ్ళి రూములో పెట్టుకున్నారంటే, వాళ్ళు చుకోటటానికి, ఈ ఇంట్లో పనికిరాని వస్తువేదీ లేదనుకుంటాను."

జయరాం ఏం మాట్లాడగలడు? మాట్లాడకుండా తలవంచుకున్నాడు.

"నీ సంత ఇక ఒక్క రోజు కూడా నా ఇంట్లో ఉండటానికి వీలులేదు. మీరుగా వాళ్ళను బయటకు పంపిస్తే సరి. లేకపోతే నా నౌఖర్ల చేత వాళ్ళను బయటకు పంపించాల్సి వస్తుంది"

"ఇప్పుడికిప్పుడు వెళ్ళమంటే, ఎలా వెళతారు?"

"ఆ విషయాలన్నీ నాకు తెలియవు. వాళ్ళు మాత్రం నా ఇంట్లో ఉండటానికి వీల్లేదు. వాళ్ళను వదిలి మీరుండలేకపోతే, వాళ్ళతో కూడా మీరెళ్ళండి" అంది. ఆమె మాటల్లో కోపం, కసి పోటీ పడుతున్నాయి.

"నేను కూడా వెళతే, వంటరిగా ఉంటావా?"

"ఇప్పుడు మాత్రం నేను వంటరిదాన్ని కాదా?"

"స్వప్నా! ఎందుకలా ఆవేశపడతావు?"

"ఏం చెయ్యమంటారు? ఆవేశపడక, మీరందరూ కల్సి చేస్తున్న పనులకు ఆనందించమంటారా? నేను హాస్పటల్‌లో ఉంటే, ఒక్కసారి కూడా నన్ను చూడటానికి రాకుండా, నేను బ్రతికానో చచ్చానో కూడా తెల్సుకోకుండా, నా చావు కోసం ఎదురు చూస్తూ నన్ను దోచుకు తింటున్న వాళ్ళను ఎంత కాలమని భరించమంటారు?" రెండు చేతుల్లో ముఖం దాచుకుని ఏడుస్తూ అంది.

జయరాం బయటకెళ్ళాడు.

★ ★ ★ ★ ★

"రాములమ్మా! నౌఖర్లెవరూ కనిపించరేం? నన్ను పలకరించటానికి ఒక్కరూ రాలేదు. సోములు, రంగడు, రామయ్య, తాత వీళ్ళంతా ఏమయ్యారు?" అంది స్వప్న.

రాములమ్మ కళ్ళలో నీళ్ళూరుతున్నాయి తలొంచుకుని నిల్చుందే తప్ప పెదవి విప్పలేదు.

"మాట్లాడవేం? ఏమయ్యారు వీళ్ళంతా?"

"అందర్నీ పనిలో నుంచి అయ్యగారే తీసేసి, కొత్త వాళ్ళను పెట్టారమ్మా? వాళ్ళంతా, వాళ్ళకు అనుకూలమయిన మనుష్యులు మీకు గంటకొకసారి టీ తాగటం అలవాటు కదా అని టీ పెట్టబోతే కొత్తగా వచ్చిన వంటమనిషి, నువ్వు వంటగదిలోకి రావటానికి వీల్లేదు. నేను పెట్టిస్తాను దూరంగా నిలబడు అందమ్మా. నేను ముప్పయి సంవత్సరాల నుంచి ఈ ఇంట్లో వంట చేస్తున్నాను. ఇలా ఇంతవరకూ, నన్నెవరూ అనలేదమ్మా. ఈ విషయాలన్నీ మీకు చెప్పి మిమ్మల్ని బాధ పెట్టటం ఎందుకని ఊరుకున్నాను. రెండోసారి టీ పెట్టమని అడిగితే, ఈ ఇంట్లో నేను వంట చెయ్యటానికి వచ్చాను గానీ, గంట గంటకు టీలు తయారు చేసి, అందించటానికి కాదని గయ్యిమంది. నేను తయారు చేస్తానంటే చెయ్యనియ్యదు. తనను తయారు చేసి ఇవ్వమంటే, ఇలా అంటుంది. ఇప్పుడు అమ్మగార్కి టీ ఇవ్వాలి అని చెబితే, ఇంట్లో పాలు అయిపోయాయి అంది. ఆమె అలా అంటున్నప్పుడు, వరలక్ష్మి, మోహినీ ఎదురుగానే నవ్వుకుంటూ నిల్చున్నారు. వాళ్ళే ఆమె చేత ఇలా మాట్లాడిస్తున్నారనుకుంటాను " బాధగా అంది రాములమ్మ

పనివాళ్ళను మానిపించటం, తమ గదిలోని వస్తువులన్నీ మాయం చెయ్యటం, జయరాం ఆమె రూమును తమ బెడ్‌రూముగా మార్చుకోవటం ఇవన్నీ తలుచుకుంటే, తన చుట్టూ ఉచ్చులు బిగుసుకుంటున్నాయని అర్థమయింది స్వప్నకు.

తన బాధను ఎవరితో చెప్పుగలదు? రఘునాధ్‌కు చెబితే, ఆ ఇంట్లో నుంచి బయటకు రమ్మంటాడు తనా పని చెయ్యలేనప్పుడు, అతనికి చెప్పుకోవటం కూడా అనవసరమే.

అస్సలు వీళ్ళు మనుష్యులా? రాక్షసులా? ఇలాంటి మనుష్యులు కూడా ఉంటారా? భగవంతుడా! ఎందుకు నా జీవితంతో ఇలా ఆడుకుంటున్నావు? ఇంతకంటే ఒక్కసారిగా నా ప్రాణాలు తీసుకో. అంటూ హృదయభారం తగ్గేవరకూ ఏడ్చింది.

ఎవరు ఆమెను ఓదార్చగలరు? ఇలాంటి అభాగ్యుల మొరలు ఆలకించలేకనే, ఆ భగవంతుడు కూడా, శిలగా మారిపోయాడేమో!

(ఇంకా వుంది)






### పి. ఆర్. గుంటూరు

★ ప్రేమ విలువ ఎంత?

● 'మనం యిచ్చుకున్నంత!

★ మనం అంతా మనుషులమే అయి వుండి మనలో మనకే అన్ని విభేదాలు ఎందుకు?

● అందుకే మనిషి తెలివైన మృగం అనడం

★ భగవంతుడు ఒక్కడే అంటూనే ముక్కోటి దేవత లంటారెందుకు?

● భగవంతుడొకడే- ముక్కోటి కళ్ళకి- ముక్కోటి రూపాల్లో కనబడటం సహజమే కదా? లోకోభిన్నరుచిః అన్న సూత్రం తెలిసిన వాడు దేవుడు!

★ మీరి మధ్య సరిగా రచనలు చేయక పోవ 'డానికి కారణం ఏమిటి?

● శరీరం' మనవలు'?

### జి. వి. కె. హైదరాబాదు

★ సాధించే పెళ్ళాల నేమనాలి?

● భర్త మీద ప్రేమ ఎక్కువ వున్న కొలదీ – 'ఆయనగారి లోపాలు సరిదిద్దాలన్న తాపత్రయమూ ఎక్కువగా వుంటుంది' ్ది సాధింపు అనుకుంటే ఎలా?!

### కె. వి. ఆర్; పి. ఎల్. ఆర్. ఖర్గపూరు

★ ఒక వైపు పత్రికలు పెరుగుతున్నాయి. కాని వాటిలోని సాహిత్యపు విలువలు మాత్రం పెరగడం లేదు. ఎందుకు?

● అక్షరాస్యత పెరిగిందే గాని సభ్యత పెరగ లేదనడానికి నిదర్శనే – ఇది మన సినిమాల లాగానే మన పత్రికలూ – డబ్బిచ్చి కొనేవాడికే – ప్రథమ తాంబూలం యిస్తాయి. సహజమే కదా

★ మీ ఎకడమిక్ క్వాలిఫికేషన్సు మేడం?

● సిక్ష్ ఫైడియర్ సార్' నిట్

### కె. వి. ఎస్. కాకినాడ

★ సృష్టిలో అందమైన వాటిని చూసి అందరూ ఆనందిస్తారు కదా మరి సృష్టిలో ఒక భాగం అయిన స్త్రీని చూస్తే తప్పంటారేమిటి?

● స్త్రీ ప్రకృతిలో భాగం కాదు. సృష్టికి మూలం. జులాయిగా చూసి కించపరచ కూడదని అలా అంటారు

### జి. ఆర్. కె. రాయగడ

★ నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. ఆమే ప్రేమించింది. ఇద్దరి మధ్య అంతవరకు మౌనం రాజ్యమేలింది గాని యిప్పుడా అమ్మాయికి పెళ్ళి నిశ్చయం అయింది ఇప్పుడు నేను ఏం చేయాలి?

● శుభ ముహూర్తాని కెళ్ళి రెండక్షింతలు జల్లి రండి! ఏడవద్దు. మరి సినిమా టిక్‌గా వుంటుంది!!

### పి. డి. ఎమ్మిగనూరు

★ అక్కా నేను ప్రేమించిన అమ్మాయిని ఎప్పుడైనాసరే వరకట్నం తీసుకోకుండా చేసుకుంటాను.

● ఎంత త్యాగశీలివయ్యా తమ్ముడూ!!




### బి. వి. ఆర్. ఎమ్. రాయగడ

★ ప్రేయసి, ప్రియుని లేఖ యితరులు చూడకూడదు అంటారు పెద్దలు ఎందుకు?

● ప్రేమలేఖలే కాదు – ఏ ఉత్తరాలైనా – ఇతరులవి చదవడం – అనాగరికం.

★ నిజమైన ప్రేమ అంటే ఎలాంటిది?

● ఒకరినొకరు గౌరవించుకుంటూ – విభేద లున్నా అధిగమించి ఒక దిశగా చూడకల్గినదే నిజమైన ప్రేమ

### ఎమ్. యి. ఎస్; వి. ఎస్. కె. ఇల్లెందు

★ మీరు ఎంత మంది పాఠకులు వద్దని చెప్పినా ప్రశ్నావళి వదిలి పెట్టేట్టు లేరు. ఆంధ్రపత్రిక సర్కులేషన్ పెరగాలంటే కొత్త శీర్షికలు ప్రవేశ పెట్టక్కరలేదు. ప్రశ్నావళి శీర్షిక తీసేస్తే చాలు.. మగాళ్ళుగా పుట్టడమే మేం చేసుకున్న పాపమా అనిపించేట్టుగా వున్నాయి మీ జవాబులు.

● ఇంత ఉడుక్కుంటే ఎలా స్వామి! ఆంధ్రపత్రిక ఎప్పుడూ "వాపు కోసం" తాపత్రయపడినట్టు నేనెరగనే! –"బలుపు వుంది" మీరేం బెంగపడకండి. ఇక నేనేం ్క్మిణి చేతి తులసి దళన్నా – నా ప్రశ్నావళి శీర్షికొక్కటితో పత్రిక బ తూచేయడానికి!... మరి 'ఆడాళ్ళలాగ' 'పుట్టుక' గురించి బాధపడి పోవడం ఏం బాగా

### కె. ఆర్. ఎమ్. హైదరాబాదు

★ తొందరపడి పని చేస్తే తర చింతించవలసివస్తుందంటారే....

● కాని మంచి పని తక్షణం చేసేయ ఉత్తమం ఇంకా 'మంచి'గా తరవాత చే అనుకునే కంటె

### ఎస్. ఏలూరు

★ సృష్టి రహస్యములు అంటే ఏమిటి?

● మనకర్థం కానివి!

★ ఇంటర్వ్యూలలో పాఠ్యాంశములలో ప్రశ్నలు అడగాలా? లేక చచ్చు ప్రశ్నలు కూ అడుగవచ్చా? (నీవెన్ని మెట్లెక్కి వచ్చావు లాంటివి)

● చదుకున్నది పనికొచ్చే ఉద్యోగాలు చేస్తున్న దెందరని మీ ఉద్దేశ్యం?! ఉద్యోగం పరీక్ష కాదు లోకజ్ఞానంతో కాస్త పని వుండేది. అందుకే మీ ఐక్యూ వెల్లడించే ఏ ప్రశ్నలైనా అడుగుతారు.

★ వరకట్నం ఆడపిల్ల తరఫున సంసారానికి కొంత పెట్టుబడి అంటాను.

● పెట్టుబడి యిచ్చుకుని కాపరానికి వెళ్లాక భోజనానికి ఉద్యోగం చెయ్యాలా?! 'డబ్బు యిస్తేనే పెళ్ళి' అన్నది – దండగ పెళ్ళి. ఇది ఆడపిల్లలు ఎంత తొందరగా, ఎంత సీరియస్‌గా – గ్రహిస్తే అంత మంచిది. □

# చిన్న పట్టణాల్లోని డీలర్లకు 1800 లాభాన్నిచ్చే వస్తువులు



## మహావీర్ ఎంటర్‌ప్రైజెస్

కాంచన్‌జంగ కాంప్లెక్స్, కింగ్ కోఠి రోడ్, హైదరాబాద్-1 ఫోన్స్: 231198, 235856

ప్రియమైన డీలరులారా,

మీకు వ్యాపార మొత్తాన్ని ఎక్కువ చేసుకొని అధికంగా లాభాలను గడించటంలో ఆసక్తి ఉన్నచో ఈ వస్తువులు మీ షోరూంలో ఉండవలసింది.

36 అగ్రశ్రేణి బ్రాండుల విస్తృత శ్రేణిలోగల 1800 లకు పైగా విశిష్టమైన వస్తువులకు ఆంధ్రప్రదేశ్‌లో మాది అతి పెద్దదైన పంపిణీ సంస్థ. అవి: ఇంటి సామానులు, వంట పరికరములు, టేబిల్ సామాగ్రి, నావల్టీలు, బొమ్మలు, మిక్సీలు, ప్రెషర్ కుక్కర్లు, ఎలక్ట్రానిక్ గ్యాస్ లైటర్లు మొదలగునవి. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రముఖ పట్టణాలలో 1440 మా అధీకృత స్టాకిస్టులున్నారు: వారు మా విక్రయ విధానంలో భాగంగా ఉన్నందుకు సంతోషిస్తున్నారు.

ఇప్పుడు మేము మా వ్యాపార పరిధిని చిన్న చిన్న పట్టణాలకు విస్తృతము చేయటానికి పథకాన్ని రూపొందిస్తున్నాము. ఈ వస్తువులతో మీకు మీ వ్యాపారాన్ని మరియు లాభాన్ని రెండింతలు చేయటంలో ఆసక్తివుంటే, స్టాకిస్టులుగా ఉండటానికి పూర్తి వివరములకు దయచేసి మాకు వ్రాయండి.

మీనుండి జవాబు రాగానే మా కంపెనీవారు వస్తువుల నమూనాలతో మిమ్మల్ని కలుసుకొని స్టాకిస్టుగా నియమింపబడుటకు నిబంధనల గూర్చి మాట్లాడుతారు.

ధన్యవాదాలతో,

మహావీర్ ఎంటర్‌ప్రైజెస్

నమ్మకానికి చిహ్నం

- JOHNSON
- Rama • Majestic • Vape • Nuware • Anjali • Milton • Lady Love • Bindal
- Meera • Equity • Nirlep • Swan • Prakash • Crystal • Asian • M-Brand
- Femina • Neelam • Focus • Ajanta • Amar • Hawkins • Kajal Kiran • Samrat




ఆఫీస్ కెళ్ళేసరికి నా టేబుల్‌మీద లెటర్ కనిపించింది. ఓ ప్రముఖ వారపత్రిక ఇటీవలే ప్రకటించిన పిల్లల చిత్రలేఖనం పోటీకి నన్ను జడ్జీగా ఉండమని కోరుతూ రాసిన ఉత్తరం అది.

నాకు ఆశ్చర్యం కలిగింది. నేను గొప్ప చిత్రకారుడిని కాదు. ఈ మధ్యే నా బొమ్మలకు ఆదరణ లభించింది ఇంచుమించుగా అన్ని పత్రికల్లో కొన్ని కథలకు చిత్రాలు గీసే అవకాశం ఇస్తున్నారు.

వెంటనే నా అంగీకారం, కృతజ్ఞతలూ తెలుపుకుంటూ ఆ పత్రికకు ఉత్తరం రాశాను.

ఆ తరువాత నెల రోజులకు ఆ పత్రిక ఆఫీస్ నుంచి ఆహ్వానం వచ్చింది– నేను ఆ రెండో రోజే బయల్దేరి హైద్రాబాద్ చేరుకోవాలని! దాంతో పాటే ప్రయాణపు ఖర్చులకోసం రెండొందలకు డ్రాఫ్ట్ కూడా ఉంది

మర్నాడు రాత్రే బయలుదేరి ఉదయానికల్లా హైద్రాబాద్ చేరుకున్నాను. పత్రిక వాళ్ళు ఏర్పాటు చేసిన హోటల్లో దిగాను

అదే హోటల్లో కథల పోటీ జడ్జీ, నవలల పోటీ జడ్జీ కూడా దిగారు అందరినీ పరిచయం చేశాడు ఆ పత్రిక అసిస్టెంట్ ఎడిటర్ వరహాల్రావ్.

మధ్యాహ్నం అందరం కలిసే భోజనం చేశాం

మధ్యాహ్నం నా గదికి రెండు పెద్ద ఫైల్స్ తీసుకొచ్చాడు వరహాల్రావ్.

"మొదటి ఫైల్లో మేము సెలక్ట్ చేసిన మంచి బొమ్మలు పాతిక ఉన్నాయి. రెండో ఫైల్లో అసలు పోటీకి వచ్చిన బొమ్మలన్నీ ఉంచాము మీరు రెండో ఫైల్లోని బొమ్మలు కూడా చూడాలను కుంటే చూడవచ్చు"– అన్నాడతను.

సాధారణంగా ఎడిటర్‌కి నచ్చలేదంటే పాఠకులకు కూడా నచ్చవు గనుక నేను రెండో ఫైల్ ముట్టుకోలేదు

అంచేత మొదటి ఫైల్లోని బొమ్మలన్నీ తీసి వరుసగా చూడటం మొదలు పెట్టాను. అవన్నీ చిన్న పిల్లలు గీసిన బొమ్మలని ఇట్టే తెలిసి పోతున్నాయి

బొమ్మలన్నీ ఒకదాని కొకటి సంబంధం లేకుండా వెరయిటీగా ఉన్నాయి అన్నీ ఎనిమిదేళ్ళ లోపు వాళ్ళు వేసినవే!

ఒక పాప పెద్ద పులి బొమ్మ వేసింది. అయితే అది పిల్లి పోలికలతో ఉంది

మరో కుర్రాడు ఓ లావుపాటి తల చింపిరి జుట్టు ఉన్న బొమ్మగీసి దానికి "బూచి" అని పేరు పెట్టాడు.

ఇంకో బొమ్మలో ఒకడు తాడుమీద నడుస్తున్నాడు. కింద సర్కస్ అన్న కాప్షన్ ఉంది.

వాటన్నిటిని రెండు మూడుసార్లు విశ్లేషించి చూశాక అన్నిట్లోకీ నాకు నచ్చిన బొమ్మలు మూడు సెలక్ట్ చేసి వాటికి ఫస్ట్, సెకండ్, థర్డ్ గ్రేడింగ్ ఇచ్చి సంతకం చేశాను.

అప్పటికే సాయంత్ర మయిపోయింది

మిగతా జడ్జీలతో పాటు కూర్చుని కాసే గడిపాక రాత్రి భోజనం ముగించి ...మించాను

మర్నాడు ఉదయం నేను ఎన్నిక చేసిన వరహాల్రావ్‌కి అందిస్తే నా పని పోయినట్లే

రాత్రి పదకొండయింది. అయినా ఎంచే... నిద్ర పట్టటం లేదు లైట్ వేసి సిగిరెట్ వెలిగి... ఎదురుగ్గా టీపాయ్ మీద రెండు ఫైల్సూ క... తున్నాయి. హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చింది... ఆ రెండో ఫైల్ తీసి అందులో బొమ్మలు కూ... చూస్తే కాసేపు టైమ్ పాస్ చేయవచ్చని పించింద...

వరుసగా అందులో బొమ్మలన్నీ చూడసాగా... నిజంగానే అవి ఏమాత్రం బాగుండ లేదు అ... చూడటం పూర్తయేసరికి రాత్రి ఒంటి గంటయింది లైటార్పి పడుకున్నాను.

కళ్ళు మూసుకోగానే ఓ బొమ్మ నా కళ్ళముందు కనిపించ సాగింది. బొమ్మంతా నల్లగా పులిమిన ఇండియన్ ఇంక్ అంతే! ఇంకేమి లేదు ఆ బొమ్మను నేను రెండో ఫైల్లో చూశాను.

అవును! బొమ్మల పోటీ అనిపెడితే అలా బొమ్మంతా ఇంక్ పులిమి పంపించా రేమిటి– ఎవరో?–

దానికింద ఏదో కాప్షన్ కూడా ఉంది! అదేమిటా

అని కొద్ది క్షణాలు ఆలోచించాను. గాని ఏమి గుర్తు రావటం లేదు. అసలా బొమ్మ గీసిం దెవరు? ఎందుకలా గీశారు? లేచి లైట్ వేసి టేబుల్ మీదున్న ఆ ఫైల్ తీసుకొచ్చి ఆ బొమ్మ కోసం వెతికాను. ఆఖర్లో దొరికిందది.

తీసుకుని మరోసారి చూశాను. కింద "అమ్మ" అని రాసి ఉంది.

నాకు నవ్వొచ్చింది.

బొమ్మేమి వేయకుండా ఇంక్ పులిమి "అమ్మ" అని రాయట మేమిటి? బొమ్మ గీసిన వారి పేరు చూశాను.

'లాలిమ" వయిసు ఎనిమిదేళ్ళు. అడ్రెస్ కేరాఫ్ కమలాకరం, 9–328, బలరామ్ పేట, మచిలీపట్నం

ఒకవేళ ఆ పిల్లకు బొమ్మ గీయటం తెలీక పోయినా తండ్రి కయినా తెలియాలి కదా! బొమ్మ వేయకుండానే పోటీ కెందుకు పంపినట్టు?

ఒకవేళ ఆ పాపను సంతృప్తి పరచడానికి పంపాడేమో! లైటార్పి మళ్ళీ పడుకున్నాను. కానీ నిద్ర మాత్రం రావటం లేదు.

"లాలిమ" వయసు ఎనిమిదేళ్ళు!

ఎందుకలా ఇంక్ పూసింది?

ఏదొక బొమ్మ గీయవచ్చుగా! జంతువుల బొమ్మలో, ప్రకృతి బొమ్మలో -- ఏదొకటి–

పోనీ అమ్మ బొమ్మే గీయాలనుకుంటే ఏదొక రూపం వేయాలిగానీ ఇలా ఇంకు పులిమేయట మేమిటి?

మళ్ళీ బలవంతంగా నిద్రపోడానికి ప్రయత్నించాను. ప్రయత్నించిన కొద్దీ ఆలోచన లెక్కువయి పోతున్నాయి! ఆ బొమ్మ, ఆ పాప పేరు ఇవే గుర్తు కొస్తున్నాయి.

తెల్లారుతోండగా నిద్ర పట్టింది నాకు. అదీ కలత నిద్రే!

ఫలితాలు ప్రకటించడం, బహుమతులు అంద జేయడం కూడా జరిగి పోయింది.

ఆ తరువాత పత్రిక వారు ఏర్పాటు చేసిన ఫంక్షన్‌లో నేనే ఆ చిన్నారి పాపలకు బహుమతులు కూడా ఇచ్చాను అశ్చర్యం ఏమిటంటే ఆ రోజు కూడా నాకు ఆ ఇంకు పులిమిన బొమ్మే గుర్తు వొచ్చింది. ఆ బొమ్మ గీసిన పాప పేరు, ఇంటి అడ్రసూ అన్నీ కళ్ళముందు మెదిలినయి.

నాకు చిరాకు కూడా కలిగింది– ఆ బొమ్మ అలా గుర్తుండి పోవటం! ఏమి గొప్పతనం, అర్థం లేని ఆ బొమ్మ నన్నంతగా ఎందుకు అంటి పెట్టుకుందో తెలీటం లేదు.

రోజులు గడుస్తున్న కొద్దీ ఆ బొమ్మ విషయం చాలా వరకూ మర్చిపో గలిగాను గానీ– చిన్న పిల్లల బొమ్మలు ఎక్కడ కనిపించినా తక్కున అది మాత్రం గుర్తుకి రాకమానటం లేదు.

ఓసారి మా ఆఫీస్ పని మీద బందరు వెళ్ళాల్సి వచ్చింది. బస్ దిగి బస్స్టాండ్‌కి దగ్గర్లోనే ఉన్న హోటల్ కెళ్ళాను యామ్‌కోసం. రిసెప్షనిస్ట్ వెనుక గోడకు తగిలించి ఉన్న ఓ చిత్రం తక్కున నా దృష్టిని ఆకట్టుకుంది.

ఓ తల్లి పాపను రెండు చేతులో పైకెత్తి ముద్దు పెట్టుకుంటున్న చిత్రం అది

హఠాత్తుగా నాకు మళ్ళీ ఆ బొమ్మ గుర్తు కొచ్చేసింది. ఇంక్ పులిమి కింద అమ్మ అని రాసిన బొమ్మ!

దాంతో పాటు "లాలిమ– వయసు ఎనిమిదేళ్ళు– కేరాఫ్ కమలాకరం, 9–328, బలరామ్ పేట, మచిలీపట్నం" అన్న చిరునామా కూడా గుండె అట్టడుగు పొరల్లో నుంచి పెళ్ళగించుకుంటూ స్మృతిపథంలో కొచ్చింది నాకు పట్టరాని ఆశ్చర్యం కలిగింది.

నేనసలు "మతిమరుపు"కి చాలా ప్రసిద్ధి చెందిన వాడిని! అలాంటిది ఎన్నో రోజుల క్రితం "చిత్రలేఖనం" పోటీలో చూసిన ఓ పనికిరాని బొమ్మనూ, ఆ బొమ్మ గీసిన పాప పేరూ, అడ్రసూ ఇవన్నీ ఎలా గుర్తు పెట్టుకున్నాను? అసలెందుకు గుర్తు పెట్టుకున్నాను?

అంతా అయోమయంగా ఉంది. ఆఫీస్ వ్యవహారాలన్నీ పూర్తి చేసుకున్నాక సాయింత్రం గదికి చేరుకున్నాను. కౌంటర్ దగ్గర మళ్ళీ నా దృష్టి తల్లి, పాపల చిత్రంమీద పడింది.

హిప్నటైజ్ చేసినట్టు మళ్ళీ ఆ ఇంకు పులిమిన బొమ్మ– పాప పేరు, చిరునామా–

పోనీ ఓసారి ఆ పాపను చూస్తే?

ఆబొమ్మ అలా ఎందుగ్గీసిందో అడిగితే– క్రమేపీ వెలుతురు తగ్గిపోతోంది గానీ ఏమినిర్ణయించు కోలేక పోతున్నాను.

వాళ్ళింటి కెళ్ళటం ఎబ్బెట్టుగా ఉంటుందేమో– కానీ వెళ్ళక పోతే మాత్రం నరకంగా తయారయేట్టుంది.

త్వర త్వరగా డ్రస్ చేసుకుని రోడ్డు మీద కొచ్చి రిక్షా ఎక్కాను.

"బలరామ్ పేట పోనీ వోయ్" అన్నాను రిక్షా అతనితో.

పావుగంట సేపటి తర్వాత రిక్షా బలరామ్ పేట చేరుకుంది.

"ఎక్కడసార్ ఇల్లు?" అడిగాడువాడు

"నాకూ తెలీదు అడ్రసుంది " అంటూ అడ్రస్ చెప్పాను వాడు అయిదారు చోట్ల ఆ అడ్రస్ గురించి వాకబు చేశాక ఓ చిన్న సందులోకి తిప్పాడు రిక్షా.

రోడ్డు చాలా సన్నగా ఉంది ఇరువేపులా మురికి గుంటలు– చాలా పాత కాలం నాటి పెంకుటిల్లు శిథిలావస్థలో కనబడుతున్నాయి. అన్నీ అలాంటి ఇళ్ళే.

ఆ ఇళ్ళ కాంపౌండ్‌లో నుంచి రోడ్డు మీదకు వాలి పోయిన చెట్లు ఆ సందుని మరింత ఇరుగ్గా చేసేసినయి.

ఇంచు మించుగా సందు చివరి కెళ్ళాక మరీ పాడు పడినట్టున్న ఓ చిన్న పెంకుటింటి ముందాపాడు రిక్షా.

తలుపు మీద 9–328 నెంబరు చాక్ పీస్‌తో రాసి ఉంది. రిక్షావాడికి అయిదు రూపాయలిచ్చి పంపించివేసి దగ్గరగా వేసి ఉన్న తలుపు తట్టాను.

"కమలాకరం గారూ"

జవాబు రాలేదు

మరోసారి గట్టిగా కొట్టేసరికి "ఆ–ఆ– వచ్చే–" అంటూ ఓ గొంతు వినిపించింది.

ఓనిమిషం తర్వాత సన్నగా ఎముకల గూడులా ఉన్న ఓ వ్యక్తి తలుపు తెరచాడు.

నావేపు ప్రశ్నార్థకంగా చూస్తూ "ఎవరు కావాలండీ?" అనడిగాడు.

నా వివరాలన్నీ చెప్పాను.

"ఆమధ్య ఓ పత్రిక వాళ్ళు చిన్న పిల్లల చిత్రలేఖనం పోటీ పెట్టారు. ఆ పోటీకి లాలిమ అనె పాప ఓ బొమ్మ పంపించింది. "నేను ఆ పోటీకి జడ్జీగా వుండడం వల్ల ఆ బొమ్మ చూడడం తటస్థించింది. ఈ ఊరు ఆఫీస్ పని మీద వచ్చాను. ఓసారి లాలిమను చూద్దామని . ."

"లాలిమ మా అమ్మాయే గానీ అదెప్పుడూ ఇలా పోటీలకు బొమ్మలు పంపిన గుర్తు లేదే .. " ఆశ్చర్యంగా అన్నాడతను.



# అక్షయ నీరాజనం

అరువదేండ్ల ఆవృత్త రంగస్థలంపై
వందన సమర్పణకని
ఆవిర్భవిస్తున్నావు నీవు, అక్షయవు–
శిశిరాంత వసంతం చివురించినట్టు
నీ నిష్క్రమణతో
నూతనావృత్తం ప్రభవిస్తుంది–

విజ్ఞాన విహంగపు విహారం
వియత్తలంలో నే మిగిలి
విపులమైన ఈ పుడమికి
విపత్తునే పంచుతూంది!

కొత్త కనుక, తత్తరపాటు లేకుండా, నీవు
తట్టుకు నిలిచేటందుకు
ఉన్న స్థితిని కాస్త
విన్నవించదలచాను నీకు.

సినిమాల్లో తాము చూస్తున్నది తప్ప
జీవితంలో నీవు చెప్పేది
వినే స్థిమితం లేని
వేగావేశపు వయసు నేడు!
దానికి దురావేశపు మనసుతోడు!

రద్దీ తగ్గేక బస్సెక్కాలని నిలబడ్డం ఈ నాడు,
తరంగాలు తగ్గేక స్నానం చేద్దామని
సముద్రం ఒడ్డున నిలబడడం లాంటిది!
వాగ్దానాల కాగితపు పూలు
వాణిపూజ కనర్హాలు
వేణినలంకరించ డానికి పనికిరావు–

అయినా– అన్ని బజార్లలోనూ
అవే అమ్మకాలు!

కల్యాణ మంటపాలు కట్టుకోమన్న ధనం
అవినీతి మంట పాలు కావడం చూస్తూ
అశ్రువులు కురువక
ఆనందం ఎలా విరుస్తుంది మనసు?

చెప్పడం కాదు – చిక్కు
విప్పడం కావాలి నేడు.
చెప్పి చెప్పిననోరు నొవ్వక పోయినా
విని విని చెవులు విసుగెత్తి పోయాయి!

అభిమన్య సాహసం
అందరికీ సాధ్య పడదు. నిజమే–
అంతభారతంలోనూ ఒక్కడే అభిమన్యుడు!
ఇంత భారతంలోనూ ఆ ఒక్కడి కోసం
వెతుకులాటే మరి!
సారథ శల్యులు మాత్రం
శత సహస్రాలు నరులు. సోదరులు!
ఉండేది ఒక్క యేడే అయినా
మంచి దానవనే కీర్తి
సంతరించుకునేలా సంచరించుకో–
హంసలా, ఆరు మాసాలు చాలన్నారు గుర్తుంచుకో!

వసంతంతో వచ్చే నీ పొందు
సౌందర్య సౌరభాల విందు–
నీ పేరున అది అక్షయంగా నిలవాలనే
ఈ నీరాజనం నీకు–

–మేకా సుధాకరరావు

నేనేమీ మాట్లాడలేదు.

"రండి! కూర్చోండి!" అన్నాడతను ఆహ్వానిస్తూ.

చాలా చిన్న గది అది. రెండు కుర్చీలూ, ఓ టేబులూ, టేబుల్ మీద ఓ పాత రేడియో, గోడకు ఓ కాలెండరూ.

కుర్చీలో కూర్చున్నాను.

"మీ పాప చదువుతున్న స్కూలు వాళ్ళు ఓ పాపతో బొమ్మ వేయించి పోటీకి పంపి ఉంటారు. ఎందుకంటే స్కూల్ నుంచే ఎంట్రీస్ పంపాలని కండిషన్ పెట్టారు–" అన్నాన్నేను.

"ఇంతకూ మిమ్మల్నింత ఇబ్బంది పెట్టిన బొమ్మేం గీసిందది!" అడిగాడతను.

"నిజం చెప్పాలంటే అది బొమ్మే కాదండీ అసలు! అంతా ఇంకు పులిమేసి కింద అమ్మ అని రాసింది. అదే నాకు అర్థం కావటం లేదు. పాపనే అడిగితే ఏమయినా చెప్తుందా అన్న కుతూహలం కొద్దీ ఇలా వచ్చాను."

"ఓహో" తానూ ఆలోచించ సాగాడతను.

## అమ్మ

"నాన్నా! కూర ముక్కలు తరిగేశాను–" అంటూ మాసిపోయిన గౌనూ, తైల సంస్కారం లేక పిచులా– రేగినజుట్టూ.. ఓ చిన్న పిలకలాంటి జడ– చేతులూ, బుగ్గల మీదా మసి–తో లోపల్నుంచి బయటి కొచ్చిందో పిల్ల.

ఆపిల్లే లాలిమ అయుంటుందని అనిపించింది నాకు.

"మావయ్య గారికి నమస్కారం చెయ్" చెప్పాడు కమలాకరం.

"నమస్తే" అందాపిల్ల చాలా మామూలుగా.

"కొన్నాళ్ళ క్రిందట మీ స్కూల్ టీచర్ మీతో బొమ్మలు వేయించి పోటీకి పంపింది కదూ?" అడిగాను.

అవునన్నట్టు తలూపిందామె.

"నువ్వు నల్లగా ఇంకు పులిమి ఓ బొమ్మ వేశావ్ కదూ?"

'ఊ!'

"ఆ బొమ్మకు "అమ్మ" అని పేరు పెట్టావ్ కదూ?"

ఆమె తలూపింది.

'బొమ్మేమీ వేయకుండా "అమ్మ" అని రాశావెందుకు మరి?"

ఆమె ఓ క్షణం ఆలోచించింది గానీ జవాబివ్వలేదు

'చెప్పమ్మా! ఎందుకలా రాశావ్?" కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా గడచింది.

కమలాకరం కుర్చీలో నుంచి నెమ్మదిగా లేచి నిలబడ్డాడు అతని కళ్ళల్లో మెరుపు కనిపించింది నాకు

"నాకు అలానే వేయాలనిపించింది" అంది లాలిమ నెమ్మదిగా

కమలాకరం పాప భుజం తట్టాడు.

"లోపలి కెళ్ళి మావయ్యగారికి మంచినీళ్ళు తెచ్చివ్వు."

లాలిమ లోపలి కెళ్ళిపోయిందీ.

"లాలిమకు పుట్టినప్పుడే వాళ్ళమ్మ చనిపోయింది"– అన్నాడతను.

ఒక్కసారిగా ఆ బొమ్మ మీద– ఆ నల్లని ఇంకు పులిమిన బొమ్మమీద కోటి ఫ్లాష్ లైట్స్ వెలిగించినట్లయింది

లాలిమ ఆ బొమ్మ ఎందుగ్గీసిందో, ఎలా గీసిందో, దానికి అమ్మ అని పేరెందుకు పెట్టిందో – మొత్తం– స్పష్టంగా– తెలిసి పోయింది

లాలిమ మంచినీళ్ళ గ్లాసుతో నా దగ్గరి కొచ్చింది

ఆమెను దగ్గరకు తీసుకున్నాను ఆప్యాయంగా ఆమె చేతిలోని గ్లాసు అందుకొని పక్కన పెట్టాను.

ఆమె రెండు చేతుల్నీ అందుకుని నా కళ్ళ నిండుగా చేరిన నీటిపొరలో నుంచి చూస్తూ ముద్దు పెట్టుకున్నాను.

"అయ్యో– మసి అంటుకుంటుందేమో–" ఆదుర్దాగా అన్నాడు కమలాకరం

"ఫరవాలేదు! నా మనస్సులో ఉన్న మసి పోయింది గదా!" అన్నాను నవ్వుతూ

నవ్వు కన్నీటిలో కలిసి పోతూనే ఉంది

అతికష్టంమీద కన్నీళ్ళు ఆపుకొని నా చేతికున్న ఉంగరం తీసి ఆ పాప చేతికి పెట్టాను

బొమ్మల పోటీలో బహుమతు లందజేసిన లభించని ఆనందం, సంతృప్తి ఆ క్షణంలో వరదలా నన్ను ముంచెత్తింది.

"వస్తాను లాలిమా" అని చెప్పి బయటకు నడిచాను. అలా వెంటనే బయటకు రాకపోతే అక్కడే చిన్నపిల్లాడిలా లాలిమను కౌగలించుకొని ఏడ్చేసే పరిస్థితి వచ్చేది.

"సార్– ఓ మాట ... మాస్తారూ..." అంటూ కమలాకరం పిలవటం వినబడుతున్నా పట్టించుకోకుండా ఉప్పెనలా పొంగు కొస్తున్న దుఃఖానికి చిన్న చిన్న ఆనకట్టలు కడుతూ జనం మధ్య కొచ్చేసాను.

"అవును– అమ్మ అంటే ఎలా ఉంటుందో నాకు మాత్రం ఏం తెలుసని?"

# దేశోద్ధారకునితో పరిచయం

కళాప్రపూర్ణ కొసరాజు

లోకంలో ఎందరో సంపాదించిన వారుండవచ్చు. కోట్లు గడించిన వారుండవచ్చు. వారందర్నీ మనం చూస్తూనే వున్నాం కాని చిత్తశుద్ధి, పరోపకారపారీణత, దాతృత్వ స్వభావం, దయాగుణం, ఎందరికి వున్నదంటారు?

అలాంటివారు వెదకి చూచినా ఏ కోటికొక్కరో ...ని కనిపించరు. అట్టి జాతి రత్నాల కోవకు చెందిన మహనీయుడే మన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు.

వారు స్వయంకృషి వల్ల ఎంతో ధనం సంపాదించారు. "అమృతాంజనం" అనే దివ్యౌషదాన్ని కనిపెట్టి ఆర్థికంగా ఎంతో పరిపుష్టి గడించి ఆ రోజుల్లో ఆయనకు సాటి ఆయనే అనిపించుకొన్న మహావ్యక్తి.

డబ్బు వచ్చిందని గర్వపడక ఆ డబ్బునే ఇంతకు పదింతలు చేద్దామనే స్వార్థాన్నే అనుసరించక, ఆ ధనాన్ని ప్రజా సేవకై వినియోగించాలనే సుసంకల్పం కలిగి "ఆంధ్రపత్రికను" బొంబాయిల్లో స్థాపించి మాతృ భూమిలోని తెలుగు వారిని చైతన్యవంతుల్ని చెయ్యాలనే దీక్ష వహించారు.

క్రమంగా ఆ పత్రికను మద్రాసుకు తరలించి తమ కార్యరంగాన్ని రాజధానీ నగరమైన చెన్నపట్టణానికి మార్చారు. ఆంధ్ర భాషకు, ఆంధ్ర జాతికి, స్వరాజ్య ప్రాప్తికి, ఆంధ్రపత్రిక చేసిన సేవ అపారం, అది విలువ కట్ట సాధ్యం కాదంటే అతిశయోక్తి కాదు.

అప్పుడున్నది బ్రిటీషు ప్రభుత్వ పరిపాలన. దానికి ఎదురు నిలిచి కష్ట నష్టములకోర్చి వ్యాపారం సాగించాలంటే ఎవరికి సాధ్యం, అది శ్రీ నాగేశ్వరరావు పంతులుగారికే సాధ్యం.

ధనం సంపాదించడమే ముఖ్యంగాదు. బానిస తనమున క్రుంగిపోతున్న భారతీయుల దాస్య విమోచనానికి నడుంగట్టడం ఆయనలో ఉన్న ప్రత్యేకత.

భారత జాతీయోద్యమంలో ప్రవేశించాడు. మహాత్మాగాంధీజీ అడుగుజాడల్లో నడిచాడు. దరిద్రనారాయణులకు తోడ్పడడం, అనేక సాంస్కృతిక సంస్థలకు సాయపడటం విద్యుక్త ధర్మంగా భావించి అడిగినవారికి లాకేత్వం ...ుయ్యకుండా దానధర్మాలు విరివిగా వర్షింపజేసి, మహాత్మాగాంధీజీచే "విశ్వదాత" అను గౌరవం పొందాడు. భోగాలను పరిత్యజించి త్యాగాన్ని వరించి దేశం కోసం శ్రీకృష్ణ జన్మస్థానాన్ని అలంకరించాడు.

తెలుగుదేశం నుండి వచ్చిన ప్రతి వ్యక్తి తంబుచెట్టి స్ట్రీటులోని ఆంధ్రపత్రిక ఆఫీసు చూడనివాడు, శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి సహాయం పొందనివాడు ఉండడనే చెప్పాలి. ఎముక లేని చేయి, అలాంటిది ఆయన ఈవి, కరెన్సీ నోటుకు లేని చలామణి, కా - నా చీకటి వుండేదని ప్రజావాణి ప్రతిధ్వనించేది.

కీ. శే. దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారు





కళాప్రపూర్ణ కొసరాజు

దేశోద్ధారకుడుగా, విశ్వదాతగా, ప్రసిద్ధివహించిన గొప్ప వ్యక్తితో పరిచయ భాగ్యం పొందడం అదృష్టమనే భావించాలి.

1931-32 ప్రాంతంలో నేను జమీన్‌రైతు ఉద్యమంలో పాటలూ పద్యాలు వ్రాసి చిత్తూరు జిల్లాలో తిరుత్తని జమీన్‌రైతు సంఘ పక్షాన ఊరూరు తిరిగి ప్రబోధం చేశేవాణ్ణి. మాకు బలం మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి బొల్లిని మునుస్వామి నాయుడుగారు. ఆయన ఆ ప్రాంతంవాడే కావడం వల్ల మాకు ప్రోత్సాహంగా ఉండేవాడు.

మునిస్వామి నాయుడు గారికి నాగేశ్వరరావు పంతులు గారికి ఎక్కువ దోస్తి వుంది. ఆయన ముఖ్యమంత్రి గాక పూర్వం జస్టిసు పక్షంవాడైనా చిత్తూరు జిల్లా కాంగ్రెసులో ముఖ్య పదవి వహించి కాంగ్రెసుకు సహాయపడేవాడు. ఆంధ్రపత్రిక జమీన్ రైతు ఉద్యమానికి పెట్టని కోటగా వుండేది. అందులో తిరుత్తని జమీన్‌రైతు సమస్యలను వివరంగా చిత్రించేది.

తిరుత్తని ప్రాంతం వాడైన పరుచూరి సుందరవరదులు అనే యువకుడుండేవాడు. పచ్చయప్ప కాలేజీలో విద్యార్థిగా వుంటూ, హిందూ, మెయిల్ ఇంగ్లీషు పత్రికలకు విలేఖరిగా వుంటూ "ఆంధ్రపత్రికకు ప్రత్యేక విలేఖరిగా వుంటూ పంతులుగారి సహాయం పొందేవాడు. సుందరవరదులు అంటే పంతులుగారికి ఎక్కువ అభిమానం, తెలివిగలవాణ్ణి ప్రోత్సహించడం పంతులుగారి స్వభావం.

ఈ పరిస్థితుల్లో నేను జమీన్ రైతు ఉద్యమాన్ని గురించి "కడగండ్లు" అనే గేయాలు వ్రాయడం ఆ పుస్తకాన్ని తిరుత్తని జమీన్ రైతు సంఘం ప్రకటించడం జరిగింది. ఆ పుస్తకానికి పరిచయం వ్రాయమని ఆ నాడు రైతు సమస్యల్ని క్షుణ్ణంగా తెలిసిన శ్రీ మోచర్ల రామచంద్రరావుగారిని, వేమవరపు రామదాసుపంతులుగారిని నేనూ సుందరవరదులు కోరాము. ఆ నాడు బ్రిటీషు ప్రభుత్వం, జమిందార్లు పవరులో ఉన్నందున వారిద్దరూ ఆ పుస్తకానికి తొలిపలుకు వ్రాయడానికి అంగీకరించక వెక్కడుగేశారు.

నేనూ, సుందరవరదులు శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి వద్దకు వెళ్లి జరిగిన సంగతి వివరించాం, పంతులుగారు ఆ గేయాలు చదవమని విని, నేను వ్రాస్తానని అప్పటికప్పుడే తొలిపలుకు వ్రాసి యిచ్చారు. ఇది వారితో నాకున్న మొదటి పరిచయం.

తర్వాత ఒకటి రెండుసార్లు కలుసుకోగా రాఘవయ్యచౌదరి నీకు రాజకీయ పరిజ్ఞానం బాగా వున్నట్లుంది. నీవు చాలామంది ప్రముఖులతో తిరుగుతూవుంటావు. మన పత్రికకు ప్రత్యేక విలేఖరిగా వుండమని టెలిగ్రాఫిక్కు



# ఈ "ఉగాది" శతచిత్ర నటుడు రంగనాథ్

మానవ జీవితంలో ఉగాదికి ఒక ప్రత్యేకత ఉంది. ప్రతి ఉగాది మానవుని నవచైతన్యవంతుడ్ని చేస్తుంది. ఈ పెద్ద పండుగ వచ్చేసరికి ఏదో సాధించాలనే ఆరాటం, సాధించినా కూడా మళ్ళా వచ్చే ఉగాదికి ఇంకో కార్యసాధనకై పోరాటం మామూలు. అందుకే మన జీవితాలలో సరికొత్త వెలుగును నింపడానికి వచ్చే ప్రతి ఉగాది మనకెంతో ఇష్టం.

నా మటుకు నేను గత ఉగాదికి అఖిలాంధ్ర ప్రజా కోటికి గుర్తుండే సందేశాత్మక చిత్రం "ఈ చదువులు మాకొద్దు"లో అరవింద్ పాత్రలో నటించి, సంతృప్తి చెందాను. మరికొన్ని ముఖ్యమైన పాత్రల ద్వార కూడా ప్రేక్షకుల మన్ననలు పొందగల్గడం న అదృష్టం.

ఇక, ఈ ఉగాదికి నా నట జీవితంలో చాలా మార్పు వచ్చింది. ఎన్నో విజయవంతమైన మలుపులు తిరిగాయి. నట జీవితంలోనే కాక వ్యక్తిగత జీవితంలో కూడా కొన్ని శుభకార్యాలు దొర్లించాను.

ఈ సంవత్సరారంభంలో విడుదలైన నేను నటించిన రెండు చిత్రాలు అమోఘమైన ప్రజాదరణను పొందాయి. అందులో ఒకటి "నాగదేవత". సుప్రసిద్ధ సంస్థలలో ఒకటైన ఎ. వి ఎం. నిర్మించిన "నాగదేవత"లో విజయశాంతి భర్తగా ప్రధాన పాత్రలో నటించాను.

ఇక, రెండవది పౌరాణిక చిత్రమైన "శ్రీదత్త దర్శనము". ఇందులో కార్తవీర్యార్జునిగా నటించి అందరి ప్రశంసలు పొందగలిగాను. ఇది నా జీవితంలోనే మరచి పోలేని ఘన విజయంగ భావిస్తున్నాను. ఈ చిత్రం ఆంధ్ర ప్రేక్షక మహాశయుల హృదయ పల్లకిలో స్థానం సంపాదించుకొని, అందరిచే ముక్తకంఠంతో అత్యుత్తమ చిత్రంగా కొనియాడబడుతోంది.

ఈ రెండు చిత్రాల విజయాలూ నాలో కొత్త ఊపునిచ్చాయి.

అంతేకాక నా 100 వ చిత్రంగా విడుదలైన "అడవి దొంగ" ఘనవిజయం సాధించింది.

ఇప్పుడు కేరెక్టర్ ఆర్టిస్ట్‌గా, విలన్‌గా పలు చిత్రాలలో రకరకాల పాత్రల ద్వారా మీ ముందుకు వస్తున్నాను.

అందుకే ఈ ఉగాదికి ఆనందామృత హృదయంతో స్వాగతం చెప్తున్నాను.



ఇంత కాలంగా నా చిత్రాలు చూసి, నాకు సలహాలిస్తూ ప్రోత్సహిస్తున్న నా అభిమానులకు, వారి వారి అభిమాన నటులతో పాటు నన్నూ అభిమానిస్తున్న ఇతర నటీనటుల అభిమానులకు, నా శ్రేయోభిలాషులకు, దర్శక నిర్మాతలకు, సాటి నటీనటులకు, పాత్రికేయ మిత్రులకే కాక యావన్మందికి "ఈ ఉగాది" సరికొత్త వెలుగులు పంచాలని, వారందరి జీవితాలు ఆనంద బృందావనములై విలసిల్లాలని మనసారా కోరుతూ విజయోత్సవ పర్వమైన ఉగాదికి అనురాగ పుష్పతోరణంతో స్వాగతం పలుకుతున్నాను!

మీ
రంగనాథ్

---

అథార్టీ కూడా యిచ్చారు. అందుకు నేను ఒప్పుకొని నాకు మీరు జీతంగాగాని, రెమ్యూనరేషన్‌గాగాని ఏమీ యివ్వనక్కరలేదండీ ఇదే గౌరవంగా స్వీకరించి వార్తలు పంపుతానని సెలవు తీసుకొన్నా.

అప్పటి నుండి వారితో పరిచయం వృద్ధి అయింది. ఒకనాడు నేను జాతీయ జెండా పాటవ్రాసి వినిపించడానికి వెళ్ళా ఆ సమయంలో కృష్ణాపత్రిక ముట్నూరు కృష్ణారావుగారు వారితో మాట్లాడడానికి వస్తే ఆయనకు నన్ను పరిచయం చేసి ఆ పాట వినిపించమన్నారు. విని ఇద్దరూ ఎంతో సంతోషించారు. అలా వారిని తరుచు దర్శించడం జరుగుతూ వుండేది. ఎంతో ఆప్యాయంగా పలకరించేవారు.

ఆ పత్రికలో సహాయ సంపాదకులుగా వున్న కొడాలి శివరామకృష్ణరావుగారు సుందరవరదులు-గారికి నాకూ ఎక్కువ సన్నిహితులు వారికుమారుడు వెంకట సుబ్బారావుగారు (హంపీయాత్రకర్త)

## దేశోద్ధారకునితో పరిచయం

పరమపదించినప్పుడు గూడా నేపద్యాలు వ్రాశా. నేను మద్రాసులో తరుచుగా వుంటూ వుండేవాణ్ణి. రెండు రోజుల కొకసారైనా ఆంధ్రపత్రిక ఆఫీసుకు వెళ్ళి వస్తూ వుండేవాణ్ణి. ఆఫీసు పనికాగానే నేనూ. శివరామకృష్ణరావుగారు చైనా బజారుకో బీచీ షికారుకో వెళ్ళి కబుర్లు చెప్పకుంటూ వుండేవాళ్లం. ఒకనాడు శివరామకృష్ణరావుగారు కొసరాజూ నీవు సంవత్సరాలుగా వార్తలు పంపుతున్నావు, పంతులుగారు విశ్వదాత" నీవు అడిగితే డబ్బుయిస్తాడుకదా అని ప్రోత్సహించినా నేను మొదటనే అలా చెప్పానులేండి అని ఆ ప్రయత్నం మానేశాను.

అనాడు ఆంధ్రపత్రిక, తెలుగుదేశానికి దిక్కు. తెల్లవారునప్పటికి ఎప్పుడు పత్రిక వస్తుందా అని ఆంధ్రులు ఎదురు చూచేవారు. ఎన్నికలలో నిలిచిన అభ్యర్థులు గెలవడానికి ఆంధ్రపత్రిక సాధనంగా ఉపయోగించుకొనేవారు.

ఇంకొక దినపత్రిక జస్టిసు పార్టీవారు స్థాపించి నది ఉన్నా అది పార్టీ ప్రచారానికి ఉపయోగించు కోవడానికి పనికి వచ్చేది.

ఉత్తమ గుణ సంపన్నుడు, దానశీలుడు, ఆంధ్రపత్రిక, భారతి పత్రికలను. స్థాపించి ప్రజాసేవ చేసిన మహనీయుడు. విశ్వదాత దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు వారు లేని లోటు తీర్చరానిది. స్వరాజ్యసాధనకు, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి ఆయన చేసినసేవ సుప్రసిద్ధం, ఆయనకీర్తి అజరామరం. తెలుగుగడ్డపై ఎలాంటి త్యాగశీలురు జన్మించారో భావితరాలవారు తెలుసుకో గలరు. ఆయన చరిత్ర సువర్ణాక్షరాలతో లిఖింప తగినది.



సీరియల్

# జీవితం చేజారిందా?

కాకాని కమల

(గత సంచిక తరువాయి)

"సెహబాష్ ..." అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి. ఆయనకి తెలియకుండా అప్రయత్నంగానే ఆయన నోటి వెంట ఆ మాట వచ్చేసింది.

భర్త అలా అనగానే అదేదో 'ఎనిమిదో వింత' అయినట్లు వరలక్ష్మమ్మ విస్తుబోతూ భర్త ముఖంలోకి చూసింది.

దానికి కారణం లేకపోలేదు.

రఘునాధయ్యకి సంగీతం అంటే అట్టే అభిరుచి లేదు.

ఆయన గొప్ప దైవభక్తుడు. ఆధ్యాత్మికతకి "సంగీతం" ప్రతీక. సామ వేద సారం అంతా సంగీత - సాహిత్యాల్లోనే ఇమిడి వుంది. ఆ విషయం ఆయనకి తెలియంది కాదు.

వయసులో వున్నప్పుడు సంగీతం అంటే గొప్ప అభిరుచి వుండేది. కాని ఈ మధ్య కాస్త విముఖత్వం వచ్చింది.

కారణం - పిచ్చెక్కినట్లు ఛెళ్ళు ఛెళ్ళున "తాళం పేరుతో" తొడలు బాదుకుంటూ, తల తిరుగుడు రోగం వున్నట్లుగా గిరగిరా తల తిప్పుతూ, కుప్పిగంతులు వేస్తున్నట్లు "స్టేజీ" మీద కూర్చొన్న చోటు నుంచి నాలుగంగుళాలు ఎత్తుకి ఎగిరెగిరి పడుతూ, పెద్ద పెద్ద విద్వాంసులు అనబడేవారు, కాస్త ఓ 'డోసు' పుచ్చుకుని "కచ్చేరి" పేరుతో చేసే సర్కస్ ఫీట్లు టి. వి ల్లోనూ, స్టేజీల మీద చూశాక అప్పట్నించి శాస్త్రీయ సంగీతం అంటే కాస్త 'ఎలర్జీ' పుట్టింది రఘునాధయ్యకి.

ఎవరైనా వచ్చి వందా - యాభై రూపాయల టిక్కెట్లు అంటగట్టినా మొహమాటానికి టిక్కెట్లు కొంటాడు గాని వెళ్ళటం మానివేశాడు. ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మీ, బాలమురళీనో అయితే మాత్రం వెళతాడు.

"కున్నక్కుడి వైద్యనాధన్" వాయులీన్ వాయిద్యం అన్నా, "చిట్టిబాబు" వీణా నాదం అన్నా చెవి-కోసుకుంటాడు.

రఘునాధయ్య ఇంట్లో వున్నా, పొలం వెళ్ళినా ఆయన కూడా ఒక చిన్న పోర్టబుల్ టేపురికార్డర్ వుంటుంది. అందులో ఎప్పుడూ వాళ్ళ రికార్డ్సు "ప్లే" అవుతూ వుంటుంది.

కాని ప్రత్యక్ష కచ్చేరిలకి మాత్రం చచ్చినా పోడు.

> **జరిగినకథ —2:** ఆరోజు సీతను చూసుకోవటానికి పెళ్ళివారు వస్తున్నారని విశ్వేశ్వరయ్య ఆఫీసుకి మధ్యాహ్నం శెలవు పెట్టి వచ్చి సుభద్రమ్మతో చెబుతాడు. ఇక సుభద్రమ్మ పెళ్ళిచూపుల ఏర్పాట్లు చేయడానికి నానా హైరానా పడుతుంటుంది. వరుడు ప్రభాకర్ రెండవ పెళ్ళి అన్న చిన్న లోపం తప్పించి యువకుడు, లక్షల ఆస్తికి వారసుడు. మొదటి భార్యకి ఇద్దరు పిల్లలు ఉన్నారు. సీత అందరికి నచ్చింది.

అందుకే "సీత" సంగీతం పాడబోతూంది అంటే కాస్త బెదిరాడు.

కాబోయే కోడలు "కళలు" ఎలా వుంటాయోనని? కాని - సాక్షాత్ గాన సరస్వతిలా ఎదురుగా కూర్చుని, బాలమురళిలా తొణుకు బెణుకు లేకుండా ఎంతో భావయుక్తంగా సంగీత - సాహిత్యాలకి న్యాయం చేస్తూ ఆమె పాడేసరికి ముగ్ధుడయ్యాడు.

తనకి తెలియకుండానే "సెహబాస్ ..." అని ప్రశంసించాడు.

ఆ ప్రశంసకి సీత అందంగా సిగ్గుపడితే, వరలక్ష్మమ్మ ముసి ముసి నవ్వులు నవ్వింది.

"ఇంకేం? ఆయనకి నచ్చితే ఇంక తిరుగు లేదమ్మాయ్. ఆయన్ని మెప్పించడం అంటే సామాన్యంకాదు ..." అంది ఓరగా భర్తకేసి చూస్తూ.

చిదానందంగా నవ్వాడు రఘునాధయ్య.

"కాదూ మరి? మన పెళ్ళిచూపుల్లో" నే చేసిన పూజా ఫలము" అంటూ నువ్వు పాడిన సంగీతానికి దడుసుకొని మళ్ళీ ఇప్పుడే కదా తేరుకున్నాను." అన్నాడు.

జోక్ పేలింది. అందరి వదనాలు ఒక్కసారి నవ్వుల్తో వికశించాయి.

సీత లేచి లోపలికి వచ్చేసింది.

సుభద్రమ్మ కాఫీ, టిఫిన్ల హడావుడిలో పడింది.

"అక్కా! పెళ్ళికొడుకు చాలా బావున్నాడక్కా. రెండో పెళ్ళి అయితే మాత్రం ఏం? సినిమా హీరోలా వున్నాడు. పైగా ... బోల్డు డబ్బు ..." అంది లక్ష్మి మెరిసే కళ్ళతో.

సీత పెదవుల మీద చిన్న మందహాసం కదిలి మాయం అయింది.

పది నిమిషాల తరువాత శివరావు లోపలికి వచ్చాడు.

విశ్వేశ్వరయ్యని పక్కకి పిలిచి -

"అతనికి మన సీత నచ్చిందట. కాని పది నిమిషాలు ఏకాంతంగా మాట్లాడాలి అంటున్నాడు." అన్నాడు.

".....!?"

విశ్వేశ్వరయ్యకి ముందు ఒక్క క్షణం ఏమి అర్ధంకాలేదు.

తీరా అర్ధం అయిన తరువాత ఆయన వదనం కాస్త అప్రసన్నంగా అయ్యింది.

కాని శివరావు నచ్చ చెప్పిన మీదట –

"సరే .... ఆడపిల్ల గలవాళ్ళం. తప్పేది ఏముంది?" అని చిన్నగా నిట్టూర్చి సణుగుతూ లోపలికి వెళ్ళాడు.

మధ్య హాలుకి దక్షిణం వైపుగా వున్న డ్రాయింగ్ రూమ్‌లో ఇద్దరికి ఏకాంతం ఏర్పాటుచేశారు.

సుభద్రమ్మ సీతని చెయ్యి పట్టుకుని తీసుకువచ్చి ఆ గదిలో టేబిల్ ప్రక్కగా వున్న కుర్చీలో కూర్చోబెట్టింది.

"అమ్మా సీతా! ఆ అబ్బాయి ఏం అడిగినా కాస్త నిదానంగా అనుకూలంగా జవాబు చెప్పు తల్లి! ఏదో ... ఈ సంబంధం అయినా ఖాయం అయితే నువ్వు అదృష్టవంతురాలివి. ఆ భగవంతుడు మన్ని ఓ కంట చూసినట్లే ..." అంటూ చెప్పి గుమ్మం కర్టెన్ సరిగా జరిపి వెళ్లిపోయింది సుభద్రమ్మ

సీత ఆ గదిలో ఒక్కర్తే ఎక్కు బిక్కుమంటూ కూర్చుంది.

ఆమెకి వూపిరి ఆడనట్లుగ అయి ... ఎందుకో ఆ సందర్భం చాలా భయం కలిగించింది.

ఇంతవరకూ చాలామంది వచ్చి చూసుకొని వెళ్లారు.

కాని ఇట్లా ఏకాంతంగా మాట్లాడాలి అంటూ ఎవ్వరూ అడగలేదు.

"అయినా తనతో ప్రత్యేకించి మాట్లాడే విషయాలు ఏమి వుంటాయి? అతడు తనతో ఏం చెప్పబోతున్నాడు? అన్ని పెద్దవాళ్లే మాట్లాడుకున్నారు కదా?" అనుకుంది. గుబులుగా గుండెదడ ఢడా కొట్టుకుంటోంది.

ఇంతలో -

గుమ్మం దగ్గర బూట్ల శబ్దం వినిపించి చప్పున లేచి నిల్చుంది.

ప్రభాకర్ తల దించుకొని గుమ్మం తెర తొలగించుకొని లోపలికి వచ్చాడు.

అతని చేతిలో సిగరెట్ కాలుతూంది.

నిల్చున్న సీతని చూసి కూర్చోమన్నట్లు చేతితో సైగ చేశాడు.

కాని అతను మాత్రం కూర్చోలేదు!

ఒక్కసారి గదంతా కలయ చూసి దక్షిణం వైపువున్న కిటికి దగ్గరికి వెళ్ళి నిల్చున్నాడు.

"... ... ... ..."

"... ... ... ..."

కొద్ది క్షణాలు ఇద్దరి మధ్య నిశ్శబ్దం తరువాత అతనే అన్నాడు మృదువుగా....

"చూడండి. నేను మీతో కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి అనుకుంటున్నాను. నేను చెప్పే విషయాలు మీకు కొంచెం బాధ అనిపించవచ్చు. కాని నేనేమిటో, నా మనసు ఏమిటో మీకు పెళ్ళికి ముందే తెలియటం మంచిదని నా అభిప్రాయం. సంసారంలో కలతలు మనస్పర్థలు.... ఇలాంటివన్ని నాకు ఇష్టం వుండదు. అందుకే మాట్లాడాలి అనుకున్నాను. మీకేం అభ్యంతరం వుండదు కదా?"

"ఊహుఁ!...." అన్నట్లు తలూపింది సీత.

"నా గురించి మీ పెద్దవాళ్ళ ద్వారా ఏం విన్నారో నాకు తెలియదు. కాని నేను



# జీవితం చేజారిందా

ఏమిటో మీకే తెలియాలి...."

అతను సిగరెట్ దమ్ము గట్టిగా పీల్చి సీతమీంచి దృష్టి తప్పించి కిటికి రెక్కపై చెయ్యి ఆన్చి బయటికి చూస్తూ అన్నాడు.

"నేను సంధ్యని చదువుకొనే రోజుల్లోనే ప్రేమించి పెళ్ళి చేసుకున్నాను. ఆమె లేని జీవితం లేదు అనుకున్నాను. ఆమెతో గడిపింది ఐదు సంవత్సరాలే, అయినా పది జన్మలకి సరిపడా ఆనందాన్ని పొందాను. కాని భగవంతుడు చిన్న చూపు చూశాడు. ఆమె నన్ను అన్యాయం చేసి వెళ్ళిపోయింది....

పిల్లలు చిన్నవాళ్ళు. వాళ్ళకి తల్లి ప్రేమ, ఆదరణ ఏమి తెలియదు. అందుకే పరిస్థితుల ప్రాబల్యానికి తల వంచి.... మళ్ళీ పెళ్ళి చేసుకుంటున్నాను.... సంధ్య లోకం దృష్టిలో చనిపోయింది. భౌతికంగా ఆమె నా సరసన లేకపోవచ్చు. కాని మానసికంగా అనుక్షణం నాతో నే వుంది. నేను బ్రతకటానికి ఆ వూహలే చాలు. కాని.... పిల్లలు పసివాళ్ళు. వాళ్ళకివేమి అర్థం కావు...."

"... ... ... ..."

"సీతగారూ! నా మనస్థితి ఏమిటో మీకు అద్దంలో చూపినట్లు వివరించాను. నేను మిమ్మల్ని మనసా వాచా ప్రేమించలేక పోవచ్చు. అది నా బలహీనత. మీరు ఆశించిన అనురాగం.... నా నుంచి.... లభించక పోవచ్చు.

కాని....

నా ఇంట్లో ఇతరత్రా మీకు ఏ లోటు వుండదు. నా చిన్న పిల్లలకి తల్లి ప్రేమ ఏమిటో మీరు "రుచి" చూపాలి. నేను మళ్ళీ పెళ్ళికి సిద్ధపడటంలో ని ముఖ్య వుద్దేశ్యం ఇదే! ఈ విషయంలో మాత్రం ఏ చిన్న పొరపాటు జరిగినా నేను క్షమించ లేను. నా జీవితంలో కూడా మీకు చోటు వుండదు. నా పిల్లల్ని ప్రేమించినంత కాలం మీరు నా ఇంటికి మహారాజ్ఞి. నా మనసు నా వశం తప్పి పోయింది. ఇప్పట్లో.... కాదు.... అసలు.... నాలో మార్పు రాకపోవచ్చు. భర్తగ నా నుంచి మీకు సరిఅయిన న్యాయం జరగక పోవచ్చు.

.... కాబట్టి బాగా ఆలోచించుకొని మీ నిర్ణయం తీసుకోండి. మనసులో ఒకటి పెట్టుకుని పైకి ఒకటి చెప్పటం నాకు నచ్చదు. అందుకే మనసు విప్పి వివరంగా నా గురించి చెప్తున్నాను...." చెప్పింది కొద్దిగానే అయినా....

చాలా సిన్సియర్‌గ నిర్మొహ మాటంగా చెప్పాడు. కట్టె- కొట్టె అన్నట్లు సరిగ్గా పది నిమిషాలు మాట్లాడాడు. అంతే....

ఆ తరువాత "బాగా ఆలోచించుకుని నిర్ణయం తీసుకోమని" సీతని హెచ్చరించి అతను ఆ గదిలోంచి వెళ్ళిపొయ్యాడు.

కాని సీత అక్కడ్నుంచి కదల లేకపోయింది. ఆమె మనసు- తనువు మొద్దుబారి చైతన్య రహితం అయిపొయ్యాయి.




"అతనేం చెప్పాడు?

తనేం విందీ?"

ఒక విధంగా అతడి సిన్సియారిటి సీతకి నచ్చింది.

కాని.... ప్రేమ.... అనురాగం లేని పెళ్ళి. తన భవిష్యత్తు ఒక అందమైన కాగితం పువ్వు అనుకుంటే.... ఉప్పెనలా గుండెల్లోంచి దుఃఖం పొంగి వచ్చింది.

ప్రతి ఆడపిల్ల పెళ్ళి గురించి కలలు కంటుంది. పేదవాడయినా సరే.... తన భర్త తనని ఎంతగానో ప్రేమించి ఆరాధించాలి అనుకుంటుంది. కాని.... ఇంటి కావలి కోసం కుక్కని తెచ్చి తిండి పడేసినట్లు భార్యని ఆదరించే మగవాడ్ని ఏ ఆడది కోరుకోదు.

అలా అని.... తను.... ఈ పెళ్ళి ఇష్టం లేదని చెప్పగలదా?

ఇంతవరకు తన తండ్రి ఎన్ని సంబంధాలు తీసుకు వచ్చాడు. చెప్పులు అరిగిపోయేలా పెళ్ళికొడుకుల కోసం తిరిగి ఎంతో డబ్బు ఖర్చు పెట్టాడు.

అయినా ఏ ఒక్కరూ తనని చేసుకుందుకు ముందుకు రాలేదు.

కారణం వరకట్నం!

తన తల్లి తండ్రి ఆడపిల్లల పెళ్ళిళ్ళ గురించి కుమిలిపోతున్నారు.

ఇటువంటి పరిస్థితిలో ఒక ఉన్నతుడైన వ్యక్తి తనని పెళ్ళి చేసుకుందుకు సంసిద్ధత చూపుతున్నాడు.

అతడు తనని మనసా- వాచా ప్రేమించలేకపోవచ్చు. కాని పెళ్ళి పేరుతో సంఘంలో తనకి ఒక సముచిత స్థానం, రక్షణ కల్పిస్తానంటున్నాడు.

మరీ తనకి ఇష్టం లేదు అనుకుంటే తను ఈ పెళ్ళి మానెయ్యవచ్చు. వద్దు అని చెప్పచ్చు.

పెళ్ళి చేసుకోకుండా బ్రతికేవాళ్ళు ప్రపంచంలో ఎంత మంది లేరు? అయితే వాళ్ళల్లో పలువురు మగవాళ్ళు. పదిమందిని ఎదిరించి నిలబడ గలవారు.

స్త్రీ శక్తి స్వరూపిణే అయినా పెళ్ళాడకుండా బ్రతక లేదు!

అతడు ప్రేమించలేనన్నాడని తను ఈ అవకాశాన్ని తిరస్కరిస్తే, గంజి నీళ్ళకి నోచుకోని వాడు దొరికిన అన్నాన్ని కాదని అమృతాన్ని ఆశించటమే అవుతుంది. అసలు....

"ఢన్...."

గుమ్మం దగ్గర తలుపు తోసిన శబ్దం అయ్యింది.

తెగని ఆలోచన్లతో కొట్టుకుని పోతున్న సీత వులిక్కిపడి తల ఎత్తింది.

వుప్పొంగే సముద్రంలా మొఖం అంతా సంతోషాన్ని నింపుకొని సుభద్రమ్మ లోపలికి వచ్చింది. వస్తూనే రెండు చేతులా సీతని కౌగలించుకుని బొట బొటా కన్నీళ్ళు కార్చింది.

"అమ్మా సీతా! నువ్వు అదృష్టవంతురాలివి తల్లి. ఇన్నాళ్ళకి భగవంతుడు నా మొరలు ఆలకించాడు. ఈ పేద తల్లి కడుపున పుట్టి నువ్వు గొప్పింటి కోడలువి కాబోతున్నావే. వాళ్ళందరికి నువ్వు నచ్చావుటే తల్లి. మీ అత్తగారు ఒకటే మురిసిపోతూంది. కాని.... ఆ అబ్బాయి నీ అభిప్రాయం కూడా కనుక్కోమంటున్నాడు. ఆ తరువాతే లగ్న పత్రిక వెయ్యాలిట. మీ అత్తగారు నిన్ను అడగటానికి వస్తూంది. చక్కగా నమ్రతగా జవాబు చెప్పు తల్లి!" అంటు ఇంకా ఏదో చెప్పబోయింది సుభద్రమ్మ.

అంతలోనే కర్టెన్ తొలగించుకుని చిరునవ్వుతో వరలక్ష్మమ్మ "ఒదినగారూ...." అంటూ లోపలికి వచ్చింది.

సీత గభాల్న కుర్చీలోంచి లేచి నిల్చుంది.

వరలక్ష్మమ్మ ఆప్యాయంగా సీత చేతిని అందుకుంది.

"అమ్మాయ్ సీతా! అసలు మళ్ళీ పెళ్ళి వద్దని భీష్మించుకున్న మా ప్రభు నిన్ను చూడగానే ఒప్పుకున్నాడు తల్లి. నీ అభిప్రాయం కూడా చెప్తే మిగత కార్యక్రమం అంతా లాంఛనంగా అయ్యిందనిపిస్తాం. ఇవ్వాళ తిథి నక్షత్రం.... వారం.... అన్ని బాగున్నాయి" అంది ఆప్యాయంగా సీత మొఖంలోకి చూస్తూ.

సీత చప్పున తల దించుకుంది.

"... ... ... ..."

"మాలాంటి పేద ఇంట్లో పుట్టి మీలాంటి పెద్ద ఇంటి కోడలు కావటం నిజంగా దాని అదృష్టం వదినగారూ. అది చిన్న పిల్ల. దాని మొఖం చూస్తే తెలియటం లేదూ? అంతకంటె చెప్పటాని కేముంది?" అంది సుభద్రమ్మ చీర

# హృదయపూర్వక ఉగాది అభినందనలతో

నాణ్యతకు, ఉత్తమ సేవకు 1977 నుండి ప్రసిద్ధిచెందిన వెట్ గ్రైండర్స్ సంస్థనుండి "జ్యోతి" డొమెస్టిక్ వెట్ గ్రైండర్స్ సాదారకం, టిల్టింగ్ రకం ప్రవేశపెట్టబడుచున్నవి



★ ఈ 'జ్యోతి' వెట్ గ్రైండర్‌ను మీ ఇంట్లో అమర్చుకొని ప్రతిరోజు ఇడ్లీ, వడ, దోశ, మొ॥ చేసుకోండి.

★ దీర్ఘకాలం మన్నేవిధంగా సహజమైన రాయితోనే ప్రత్యేకంగా తయారు చేయబడినది.

★ 230 వోల్టు విద్యుత్‌తో పని చేయును. అతి తక్కువ కరెంటు ఖర్చు.

★ మీ బడ్జెటుకు తగ్గట్లు అందుబాటులో ధరలు.

★ 1 లీటరు, 1½ లీటరు, 2 లీటర్ల సైజులలో లభిస్తాయి.

★ గ్యారంటీ యివ్వడమే కాకుండా, కొనుగోలు తర్వాత మంచి సర్వీస్ అందజేయబడుతుంది.



**టిల్టింగ్ వెట్ గ్రైండర్ ప్రత్యేకతలు:**

* యంత్రాన్ని వంచుకొని, చేతికి పిండి అంటుకోకుండా పాత్రలోకి తీసుకోవచ్చును.
* రెండు రాళ్లు తిరగటంవలన అరుగుదల వుండదు.
* త్వరితంగా రుబ్బుతుంది.

హోటల్సు, ఫ్యాక్టరీలు, కాంటీన్లు, హాస్టల్సుకు మరియు వాణిజ్యపరంగా పెద్దసైజు గ్రైండర్లుకూడా లభిస్తాయి.

మేము వీటినికూడా సరఫరా చేస్తాము:

ఫ్లోర్‌మిల్స్, బేబి ఆయిల్ ఎక్స్‌పెల్లర్స్, కారంమిషన్లు, కాఫీపొడి గ్రైండర్స్, రోస్టర్స్, పాప్‌కార్న్ యంత్రాలు, వేరుశెనగ డికార్టికేటర్స్, వెన్నతీసే యంత్రాలు, సేమియా యంత్రాలు, ఎస్ప్రెసోకాఫీయంత్రాలు, వ్యవసాయానికి, గృహాలకు పనికివచ్చే పంపుసెట్లు, బోర్‌వెల్ జెట్ పంపులు మొ...

పై యంత్రాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రామోదయ పథకంక్రింద కూడా లభించును.

వివరాలకు సంప్రదించండి:

## శ్రీ బాలకృష్ణ ఇంజనీరింగ్ కంపెనీ,

**5-1-372/2/3, రాణీగంజ్ బస్‌స్టాండువద్ద,**

**సికింద్రాబాద్ - 500 003.**

ఫోన్ : 821520

## జీవితం చేజారిందా

కొంగుతో కళ్ళు తుడుచుకుంటు.

ఆ మాటలు చెప్తున్నప్పుడు ఆవిడ కంటి వెంట జలజల ఆనందభాష్పాలు రాలి మాటల్లో సంతోషం వెల్లువై పొంగింది.

సీత ఏదో చెప్పాలని పెదవి విప్పబోయింది. కాని నోట మాట రాలేదు. తల్లి మొఖం చూస్తుంటే మనసు మూగబోయింది.

వరలక్ష్మమ్మ సీత చెయ్యిపుచ్చుకొని హాల్లోకి తీసుకెళ్ళింది.

అక్కడ పెళ్ళి పెద్దలంతా ఆశీనులై వున్నారు.

"అమ్మాయ్ సీత! పెళ్ళి కొడుకే పట్టుబడుతున్నాడు. నీ అభిప్రాయం కావాలని."

"నీకీ సంబంధం ఇష్టమేనా?" అన్నాడు శివరావు చిరునవ్వుతో.... కుర్చీలోంచి లేచి సీతకి కాస్త దగ్గరగా వచ్చి నిల్చున్నాడు.

"... ... ... ..."

సీత నిర్వేదంగా ఓరగా తల ఎత్తింది.

ఎదురుగా....

తండ్రి ఎంతో ఆతృతతో చూస్తున్నాడు. ఆయన వెనకగా తల్లి నిల్చుని ఆనందంతో చెమ్మగిల్లుతున్న కళ్ళని మాటి మాటికి పయిట చెంగుతో తుడుచుకుంటూంది.

చెల్లెళ్ళు, తమ్ముళ్ళు గుమ్మం చాటుగా నిల్చుని ఎంతో సంతోషంగా అక్క మొగంలోకి చూస్తున్నారు.

"వీళ్ళందర్ని తను నిరాశ పర్చగలదా?.... వ్యధ శిలమీద తలపెట్టాక కత్తివేటుకి వెరవటం ఎందుకు? మనసు లేని పెళ్ళి- ప్రేమలేని పెళ్ళి ఏ ఆడపిల్ల కోరుకుంటుంది!"

అంతరాత్మ ఒద్దు ఒద్దు అంటున్నా తలదించుకుని మూల్గినట్టు "ఊఁ!....." అంది సీత.

ఆ మాట చెప్తున్నప్పుడు కొంచెం కన్నీరు కళ్ళల్లోనే కదిలి ఇంకిపోయింది.

ఆ తరువాత చప్పున లోపలికి వచ్చేసింది.

"శుభశ్య శీఘ్రం" అన్నాడు శాస్త్రిగారు పంచాంగం తెరుస్తూ.

"సాధ్యమైనంత తొందర్లో ముహూర్తం చూడండి శాస్త్రిగారు. పెళ్ళి ఏ ఆర్భాటాలు లేకండా గుళ్ళో అతి క్లుప్తంగా నిరాడంబరంగా జరగాలని మా అబ్బాయి కోరిక" అంది వరలక్ష్మమ్మ.

"అలాగే తల్లి! ఇక్కడ్నుంచి వున్నవన్నీ మంచి ముహూర్తాలే. మీ వీలుని బట్టి సెటిల్ చేసుకోవచ్చు. ఆ ఘడియ వస్తే మనం ఆగమన్న ఆగదు.." అన్నాడు శాస్త్రిగారు. విశ్వేశ్వరయ్య జాతకాల పుస్తకం అందించాడు."




నిజంగా మా సీత అదృష్టవంతురాలు ఒదినగారూ. మీ ఇంటి కోడలు కావటం దాని పూర్వజన్మ సుకృతం...." అంది సుభద్రమ్మ ఆనందంతో.

దక్షిణం వైపుగా వున్న గదిలో ఒంటరిగా కూర్చున్న సీతకి మధ్య హాలులోంచి ఆ హడావుడంతా వినిపిస్తూనే వుంది.

కాని ఆమె వదనంలో కాగడా పెట్టి వెదికినా ఆనందం కనిపించటం లేదు.

ముబ్బు క్రమ్మిన చందమామలా ఆమె మొఖం చిన్నబోయింది.

ఆటుపోటుతో వున్న సముద్రంలా ఆమె మనసు అలజడి చెందుతూంది.

ఇన్నాళ్ళూ పెళ్ళి కాలేదని బాధ పడింది.

ఇప్పుడు అవుతూంది అనుకుంటే బాధ అనిపిస్తుంది.

నిజానికి ఆ పెళ్ళి ఎంత మాత్రం ఇష్టం లేదు సీతకి.

కాని అలా అని తిరస్కరించటం మాత్రం సాధ్యమా? ఎలా?

రాక రాక ఒక సంబంధం వచ్చి, అది తాంబూలాల ఘట్టందాకా వస్తే కన్నవాళ్ళ ఇక్కట్లు చూస్తూ ఏ ఆడపిల్ల అయినా ఎలా కాదన గలదు?

ఎడారిలో నడిచే పాంథుడు తాటి చెట్టు నీడ దొరికినా సేద తీరాలని తాపత్రయ పడతాడు.

ఆకలితో అలమటించే వాడికి గంజినీళ్ళు కూడా అమృతప్రాయమే.

అహంకారంతో ఆ గంజినీళ్ళు కూడా కాదనుకోవటం అవివేకమే అవుతుంది.

వరలక్ష్మమ్మ, రఘునాథరావుల కోరిక మేరకి రెండు నెల్ల వ్యవధిలో అతి దగ్గరగా వున్న ఒక ముహూర్తం నిర్ణయించారు.

పెళ్ళి తిరుపతి కొండమీద జరుగుతుందని పెళ్ళికి ఒక రోజు ముందుగా వరలక్ష్మమ్మ కారులో వస్తానని సుభద్రమ్మకి చెప్పింది.

పెళ్ళి కొడుకు, తండ్రి ఆదిగాగల ముఖ్యులందరూ అట్నుంచి అటే కొండకి వచ్చేలాగ నిర్ణయం చేసుకున్నారు. "వరకట్నం" అంటు ఏమీ లేదు సరికదా ఉభయ ఖర్చులు మగపెళ్ళి వారివే!

మధ్యలో మంచి రోజు చూసుకుని ఒకసారి వచ్చి కాబో యే కోడలుకి పూలు-పళ్ళు పెడతానని చెప్పింది వరలక్ష్మమ్మ.

ఆ తరువాత కాస్సేపు కూర్చుని వాళ్ళు వెళ్ళి పొయ్యారు.

సుభద్రమ్మకి గుండెలమీంచి కొండంత బరువు దించినట్లు అయ్యింది.

సీత మెళ్ళో మూడు ముళ్ళూ పడబోతున్నాయి అనుకొంటే ఆనందం ఆపుకొని నిలవనియ్యటం లేదు. ఆశించినట్లే ఆ సంబంధం ఖాయం అయ్యింది.

"మా సీత రత్నం లాంటి పిల్ల. అందుకే దీనికి మంచి భర్త దొరికాడు. ధనవంతుల ఇంటి కోడలు అవుతూంది" అని మురిసి పోయింది.

నిజంగానే సీత పేరుకి తగినట్లు "రవ్వ" లాంటి పిల్ల. మూర్తీభవించిన స్త్రీత్వంతో కంటికి నిండైన రూపం ఆమెది. కష్టానికి సుఖానికి చలించని మంచి ఓర్పు సహనం, ఇంటిని చక్క దిద్దగల నేర్పు ఆమెకి భగవంతుడిచ్చిన వరాలు.

అయినా ఇంతవరకు ఆమెని చూసుకుందుకు వచ్చిన పెళ్ళి కొడుకు లెవ్వరూ ఆమెని చేసుకుందుకు ఒప్పుకోలేదు. కారణం.... డబ్బు!

ఇప్పుడు ప్రభాకర్ కూడా పరిస్థితుల ప్రాబల్యానికి తలవంచాడేగాని ఆమెపై ప్రేమతో మాత్రం కాదు.

కేవలం తన పిల్లల భవిష్యత్తు దృష్టిలో పెట్టుకుని ఆమెని చేపట్టటానికి ముందుకి వచ్చాడు.

ఆడపిల్లకి "పెళ్ళి" అంటే ఎన్నో కలలు వుంటాయి.

కోర్కెలు వుంటాయి.

ఆశలు వుంటాయి.

కాని -

ఇప్పుడు సీతకి అలాంటి ఆలో చనకి అంతగా ఆస్కారం లేదు.

ఒక బాధ్యతగల కాంట్రాక్టు పద్ధతిలో మెళ్ళో పసుపుతాడు కట్టించుకుంటూంది.

"ఒక విధంగా చెప్పాలంటే వూపిరి తియ్యనియ్యకుండా తన స్వేచ్ఛని చంపే వురితాడు అది!" అనుకుంది ఆవేదనగా సీత.

ఆ రాత్రి పడుకుంటే ఆమెకి నిద్ర పట్టలేదు.

మెదడంతా పాముల బుట్టలా తయారయ్యింది.

ఆలోచన్లు తెగటం లేదు.

మంచంలో కూర్చుని మోకాళ్ళ మీద తల పెట్టుకుని అలా చీకట్లోకి చూస్తూ చాలాసేపు వుండి పోయింది.

* * * *

"నేను మిమ్మల్ని భార్యగా మనసా వాచా ప్రేమించలేక పోవచ్చు. నాకు నిజానికి మళ్ళీ పెళ్ళి ఇష్టం లేదు. నావల్ల మీకే సరి అయిన న్యాయం జరగక పోవచ్చు....."

గదిలో ఏకాంతంలో ప్రభాకర్ తనతో విన్నవించుకున్న ని–వేదన!

సీత మనసులో గంట కొట్టినట్టు మారుమ్రోగుతూంది. మరచిపోదామన్నా మరుపుకు రావటంలేదు!

ఎంత నిష్కర్షగ... ఎంత ధైర్యంగా చెప్పాడు ఆ మాటలు?

ఊహూఁ.... ధైర్యంకాదు. అహంకారం. మగవాడినన్న అధికార దర్పం అతడిచేత ఆ మాటలు చెప్పిస్తే ఆడదానిలోని బానిసత్వ గుణం తన చేత అవుననిపించింది.!

అంతస్తులు అంతస్తులుగ పేరుకుని పోయిన డబ్బు అతనికి వత్తాసు.

తన పేదరికం అలుసు.

అందుకే భార్య కాబోయే అమ్మాయితో అతను అంత ధైర్యంగా ఆ మాటలు చెప్పగలిగాడు?

తన తల్లిదండ్రులు ఆర్థికంగా చితికిపోయి వుండటంచేత ఎలాగైనా ఈ పెళ్ళి జరిగితేనే చాలని ఆశ పడుతున్నారు. వాళ్ళ డబ్బుకి వ్యామోహ పడుతున్నారు.

కాని.....

తను... అసలు ఎలా ఒప్పుకొంది ఈ పెళ్ళికి?

అతను ఎంత నిర్మొహ మాటంగా చెప్పాడు? "నిన్ను భార్యగా ప్రేమించలేను." అని.

అలాంటి వ్యక్తిని ఏ స్త్రీ అయినా పెళ్ళి చేసుకుంటుందా? చేసుకున్న అది పెళ్ళి అవుతుందా? ఆత్మాభిమానం గల ఏ ఆడపిల్ల అయినా ఆ చేదు నిజాన్ని జీర్ణించుకో గలదా? అలాంటి పెళ్ళి జరక్కపోతే మాత్రం ఏం? ఎంతో సున్నితమైన మనసు, ఆత్మాభిమానం గల తను అసలు ఈ "పెళ్ళి ఇష్టమే" అని ఎలా చెప్పింది?

ఊహూఁ.....

లేదు...

తనకి పెళ్ళి అస్సలు ఇష్టంలేదు. జీవితాంతం ఈ మథన పాటుతో బ్రతకలేదు. చేతులు కాలాక ఆకులు పట్టుకోవటం అవివేకం. తన భవిష్యత్తు గురించి తను ఇప్పుడే జాగ్రత్త పడాలి.

భగవంతుడి హృదయ పీఠాన్ని అలరించ వలసిన పూజాపుష్పం ఒక కసాయి కాలుకింద నలగ కూడదు.

తన నూరేళ్ళ నిండు వైవాహిక జీవితం ఒక ప్రేమలేని వ్యక్తికి అంకితం కాకూడదు.

ఇంత తెల్సి తను ఈ పెళ్ళికి అంగీకరిస్తే ఆ తప్పు తనదే అవుతుంది.

అతన్ని కాదు.

ప్రేమ, ఆదరణ తెల్సిన వ్యక్తికి తను భార్య కావాలి. అంతేకాని ఒక ప్రేమపిచ్చివాడికి, అహంకారికి భార్యకూడదు.

అంతకంటే ఆజన్మాంత కన్యగా మిగిలిపోవటంలో నే తన జీవితానికి సార్థకత లభిస్తుంది. అవును.

ఈ పెళ్ళి తను చేసుకోదు.

ఇంకా తాంబూలాలు పుచ్చుకోలేదు. గనక రేపే అమ్మకి చెప్పేస్తుంది.

... వేరే సంబంధం వాళ్ళు ఐదో, పదో వేలు వరకట్నం ఎక్కువ ఇస్తామని ఆశచూపితే, ఖాతాపర్చుకొన్న వివాహాలు కూడా కాదని, పీటల మీద పెళ్ళిళ్ళు కూడా తిరస్కరించిన పెళ్ళికొడుకులు ఎందరో వున్నారు నేడు మన సమాజంలో

అటువంటి వాళ్ళతో పోల్చుకుంటే తన నిర్ణయం తప్పుకాదు..

తెల్సి తెలియని తొందరపాటుతో ఆ పెళ్ళికి ఒప్పుకుంది.

కాని బాగా ఆలో చించిన మీదట తన మనసు అంగీకరించటంలేదు.

అవును.

రేపు ఎలాగైనా అమ్మకి తన మనసులో మాట..... అతడు గదిలో తనతో ఏకాంతంగా మాట్లాడిన విషయాలు చెప్పాలి. ఈ సంబంధం ఒదులు కుందుకు అవిడ్ని ఎలాగైనా ఒప్పించాలి. తను గట్టిగా కాదని పట్టుబడితే ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు?

అమ్మ కొన్నాళ్ళపాటు ఏడుస్తుంది.

నాన్న తన మీద చిరాకు పడతారు.

కాని తరువాత క్రమంగా అన్ని సర్దుకొంటాయి. తనకి పెద్ద చదువులేదు. తనవాళ్ళు వేలకివేలు కట్నాలు ఇవ్వలేరు. తనకి వయసు మించిపోతూంది.

వాళ్ళదగ్గరికి వచ్చిన లక్షాధికార్ల సంబంధాన్ని తను తిరస్కరించినందుకు తెగించిన ఆడదానిగా లోకం జమకట్టి ఇకపై ఎవ్వరూ తనని చేసుకుందుకు ముందుకి రాకపోవచ్చు.

అయినా ఫరవాలేదు.

జీవితం ఒంటరిగానే బ్రతుకుతుంది.

నాలుగిళ్ళల్లో పాచిపని చేసుకుని తన రెక్కల కష్టంతో బ్రతుకుతుంది.

చాతనయితే తన వాళ్ళకి ఆర్థికంగా సాయ పడుతుంది. అంతేగాని.... ఇలా ఇష్టంలేని పెళ్ళి చేసుకొని ఆత్మవంచనతో నిత్యం ఛస్తూ బ్రతకలేదు.

అవును.

ఏమైనా సరే రేపు అమ్మకి చెప్పేస్తాను.

లేకపోతే నేరుగా ఆ ప్రభాకర్‌కి ఉత్తరం రాస్తాను. "నాకీ పెళ్ళి ఇష్టంలేదు' అని.

అవును.

అంతే జరుగుతుంది.

ఆవేశంగా అనుకుంది సీత.

అలా నిర్ణయించుకుంటే మనసుకి ప్రశాంతత అనిపించింది.

దూరంగా హాలో "ఠంగ్– ఠంగ్"మని రెండు గంటలు మ్రోగుతుంటే ఆలో చన్ల మధ్య ఎప్పుడో కలత నిద్రలోకి ఒదిగింది సీత.

**(ఇంకా ఉంది)**

# అక్షయ కు స్వాగతము

బహు విమాన ప్రమాద ప్రబల భూకంపాల
కల్పించి జనకోటి కాలరాచె
ఆఫ్రికా శ్రీలంక లారని దారుణ
మారణ హోమాల మ్రగ్గజేసె
ఒకచో ననావృష్టి ఒకచోట నతివృష్టి
పెచ్చు పెరుగు చిడ పీడగూడ
తెలదోమ తనయింటి దీపమార్ప కుములు
రైతన్న గని నవ్వె రాక్షసముగ

పంచజనులను దుర్దశా పంకమందు
ముంచి చనె క్రోధనాబ్ద మమోఘనామ
అక్షయానంద సుధ మానవాళి దేల్చ
వచ్చు చున్నట్టి అక్షయా! స్వాగతమ్ము

గతమంత చేదుగా గడపిన జీవికి
తీయందనము నేర్పు తీరు దెల్పి
అతి మధురంబైన బ్రతుకు సార్థకముగా
చిరుచేదు రుచి చూపి కరము తట్టి
పరిపూర్ణ జీవిత ప్రతిగ నానారుచుల్
చవి చూపునట్టి పచ్చడి నొసంగ
అరివాడిన హృదయాబ్జముల్ వికసింప
చైతన్య కిరణాళి సంతరించి

ప్రబల నైరాశ్య వృద్ధ పత్రముల రాల్చి
నూతనోత్సాహ పల్లవా పెతు జేసి
సకల మానవ హృదయ వల్లికల మూడు
పూవు లారు కాయలై నర్చు పుణ్యవత్స
రమ్ము! అక్షయ! రావమ్ము! రసను బింప

–సూర్యదేవర రవికుమార్

# మళ్ళీ వచ్చె ఉగాది

ఉగాదొచ్చె తమ్ముడూ! ఉగాదొచ్చె తమ్ముడూ!
జగాది నుండొచ్చె ఉగాదొచ్చె తమ్ముడూ!
సంబరాలు కొందరికీ సంకటాలు అందరికీ
మాయ చేసి పంచి పెట్ట మళ్ళీ వచ్చె తమ్ముడూ!

అబ్బులకాలాన్నుంది వాళ్ళబ్బుల కాలాన్నుండి
వదలకుండ వచ్చి వచ్చి ఏమి వొరగ బెట్టె మనకు?
వద్దు తమ్ముడూ! మనకొద్దు తమ్ముడూ!
ఈ పండగపబ్బాల సుద్దు మనకొద్దు తమ్ముడూ!

మేఘంలో నీళ్ళు దెచ్చు మెలకువలా తెలియవు
తిమ్మిని బమ్మిని చేసి తిరకాసులు తెలియవు
చేతికి చేయిచ్చినట్లి నెత్తిన చెయ్ పెట్ట లేవు
వంగి వంగి దండాలొ వొడిసి జుట్టు పట్ట లేవు
బొట్టు చెమట కొక్క మెతుకు బతుకునీది తమ్ముడూ!
చెమటారని బతుకులో చెలగాటం ఈ పండగ!
వద్దు తమ్ముడూ! మన కొద్దు తమ్ముడూ!
ఈ పండగ పబ్బాల సుద్దు మన కొద్దు తమ్ముడూ!

కోరినంత కొత్త చిగురు కోయిలమ్మకుండగా
మత్తు మత్తుగా మెక్కి మధురంగా పాడురా
వసంతలక్ష్మి పైట చెరగుజిలుగువెలుగు పండగా
పురులు విప్పి నెమళులన్ని నాట్యమ్ములు సల్పురా!
లేత లేత పిందెల తలమోతలతో తరువులుండ
రామచిలుక లారగించి రాజసాలు పోవురా!
ఈ ఉగాది ఊహ నిన్ను ఊరిస్తే తమ్ముడూ!
ఉట్టి మీద కూటి చట్టి వట్టిదిరా తమ్ముడూ!

కులమతాల కలహాలు కదను తొక్కుతున్న భయం
దోపిడీలు మారు పేర దాడులు చేస్తున్న భయం
గూండాలు గుండెలపై కుంపటు లవుతున్న భయం
క్షణంక్షణం బ్రతుకు భయం ప్రతినిత్యం యుద్ధ భయం
అణుశక్తి లో కాన్నే అంతరించుననన్న భయం
చాలని కొదవకు ఈ చాలీచాలని బతుకుల
చాప కింద నీరు లాగ ఉగాదొచ్చెనన్న భయం
వద్దు తమ్ముడూ! మన కొద్దు తమ్ముడూ!
ఈ పండగ పబ్బాల సుద్దు మన కొద్దు తమ్ముడూ!

పెట్టిన వాళ్ళందరికి పుట్టిందే సాక్ష్యమట
పుట్టినారు శ్రీమంతులు పుణ్యాత్ములు వాళ్ళంతా
చేపట్టినారు భోగాలు చెయ్యిదాటి పోకుండా
వచ్చు జన్మ సుఖము వదలి పెట్టి మనకంతా
ఈ జన్మం వాళ్ళదిరా! ఈ పండగ వాళ్ళకురా!!
వద్దు తమ్ముడూ! మనకొద్దు తమ్ముడూ!
ఈ పండగ పబ్బాల సుద్దు మనకొద్దు తమ్ముడూ!!

–పులికంటి కృష్ణారెడ్డి




## ఎ. ఎల్. - భీమవరం

నా వయస్సు 16 సంవత్సరములు. నా జుట్టు నెరిసిపోతున్నది. విటమిన్ల లోపించి అలా జరుగుతున్నదా? జుట్టు నెరవకుండా వుండాలంటే ఏమి చెయ్యాలి?

జుట్టు నెరవటానికి ప్రత్యేక కారణాలంటూ ఎవరికీ ఇంతవరకు తెలియదు. ఎన్నో కారణాలు ఊహింపబడుతూ ఉంటాయి. వంశపారంపర్యంగా ఈ లక్షణం పిన్న వయస్సులో నే రావటం జరుగుతుంది.

## ఎ. ఆర్. ఆర్. - దొండపాడు

నా వయస్సు 16 సంవత్సరములు. నా వీపుపైన, పిరుదులపైన, మోకాళ్ల మీద సంవత్సరంనుండి ఎఱ్ఱని వాతలు కనబడుచున్నవి. గవర్నమెంటు ఆస్పత్రిలో పరీక్ష చేయించగా లెప్రసీకి సంబంధించినదికాదని, ప్రైవేటు డాక్టర్ల చేత వైద్యం చేయించుకోమని సలహా యిచ్చారు. వాటివద్ద స్పర్శజ్ఞానం మామూలుగానే వుంటున్నది. యివి శరీరమంతా వ్యాపించుచున్నట్లు కని పించుచున్నది. నేను డాక్టర్ల చేత, నాటు వైద్యుల చేత, హోమియోపతి వైద్యుల చేత వైద్యం చేయించుకుంటూనే వున్నాను.

మీరు నిపుణులైన చర్మ వైద్యులకి చూపించుకొని వారి సలహా ప్రకారం మందులు వాడటం మంచిది.

## టి. ఎఫ్. ఎ., డెహ్రాడూన్

నా వయస్సు 24 సంవత్సరములు. రోజు ఉదయం లేవగానే నా శరీరము మీద చిన్న చిన్న గుల్లలు వస్తాయి. తరువాత వాటి పైన జిలగా వుంటుంది. వాటిని గికుతున్నప్పుడు అవి చాల పెద్ద పెద్ద దద్దుర్లవలె అగును. 2 గంటలసేపు ఎండలో కూచుంటే వాటి అంతట అవే పోవును. వీటిని హిందిలో శీత్ అంటారు.

చర్మరోగ నిపుణులకి చూపించి, వారి సలహా ప్రకారం యాంటీబయాటిక్ మందులు వాడండి. అరుదుగా స్టెఫ్లోస్టెఫలో వాక్సిన్ వాడవలసి ఉంటుంది.

## కె. యస్, ఆర్. - వేదురుపాక

నాకు సుమారుగా 6 నెలల నుండి తల పై భాగమున (నడి నెత్తి మీద) విపరీతముగా బాధ వచ్చుచున్నది. ముఖ్యంగా చదువుతుంటే బాధ మరీ వచ్చుచున్నది. చదువు మీద కాన్సెంట్రేట్ చెయ్యలేక పోతున్నాను. రాత్రిళ్ళు నిద్ర పట్టటంలేదు. కళ్ళు రెండుసార్లు పరీక్ష చేయించుకుంటే కంటి లోపం లేదన్నారు.

సైకియాట్రిస్టుల సలహాల వల్ల మీకు లాభం ఉంటుంది., దైనందిన జీవితంలో "టెన్షన్" వల్ల ఇలా ఏర్పడే అవకాశం ఉంటుంది. □

# ఎందరో మహానుభావులు

-జంధ్యాల

(అమెరికాలోని తెలుగువారిని 'శంకరాభరణం' అనంతరం అమితంగా ఆకట్టుకున్న చిత్రం "ఆనందభైరవి". ఈ చిత్ర బృందం అక్కడి వాషింగ్టన్‌లోని తెలుగు సమితివారి ఆహ్వానంతో సంయుక్త రాష్ట్రాలలో పర్యటించి వచ్చిన సందర్భంలో అక్కడ నివసించే మన తెలుగువారి గురించి దర్శక రచయిత శ్రీ జంధ్యాల ఇలా వివరించారు)



"ఏ దేశ మేగినా, ఎందు కాలిడినా
ఏ పీఠ మెక్కినా, ఎవరెదురైనా
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా, నీ జాతి నిండు గర్వమ్ము...."

అన్నారు స్వర్గీయ రాయప్రోలు సుబ్బారావుగారు.

నా అమెరికా పర్యటనలో అక్కడి మనుషుల్ని, అక్కడి జీవితాన్ని మరో కోణం నుంచి చూడగలిగాను. ఒక జీవన సరళికి అలవాటు పడిపోయిన నాకు అక్కడి పద్ధతులు, కట్టుబాట్లు చాలా వింతగా కనిపించాయి; విచిత్రంగా అనిపించాయి.

అయితే, అక్కడ వసించే మన తెలుగువాళ్ళు అసలు సిసలైన తెలుగు ఆచారాలను పాటించడం నాకు మరింత ఆశ్చర్యం కలిగించింది.

సుప్రభాతంతో వారి దైనందిన కార్యక్రమం మొదలవుతుంది. ప్రతి తెలుగు వారి గృహాలలోనూ భక్తిగీతాల కేసెట్లున్నాయి. సత్యనారాయణ వ్రతాలు, వెంకటేశ్వర దీపారాధనలు జరుపుకుంటూ నిజానికి మన తెలుగు రాష్ట్రం మరచిపోతున్న తెలుగుతనాన్ని అక్కడి సోదర సోదరీమణులు నిలుపుకుంటున్నారు — అమెరికన్ వాతావరణంలో ఇమిడిపోయినా.

తెలుగుతల్లి ముద్దుబిడ్డ లెందరో అమెరికాలో గొప్ప హోదాలో హుందాగా నివసించడం చూసి కించిత్తు గర్వించాను. ఎందరో డాక్టర్లు, మరెందరో ఇంజనీర్లు — అమెరికన్ల మన్ననలు, గౌరవసత్కారాలు పొందుతూ ఉండడం మనం గర్వించదగ్గ విషయం.

వాషింగ్టన్‌లో అండర్‌గ్రౌండ్ రైల్వే వల్ల చుట్టుపక్కలున్న ఆకాశ హర్మ్యాలకు ప్రమాదాలు జరగకుండా చూసే ఉన్నతోద్యోగంలో ఓ తెలుగు వ్యక్తి ఉన్నాడన్నా, ప్రెసిడెంట్ రీగన్ కార్యాలయంలో ఉన్నతాధికారిగా ఓ తెలుగు బిడ్డ ఉన్నాడన్నా, అమెరికన్ రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌లో మన వాళ్ళెందరో ఉన్నారన్నా — ఏ తెలుగు గుండె ఉప్పొంగదు! ఎనభై శాతం తెలుగు మహిళలు కూడా ఉద్యోగాల్లో ఉన్నారు. వీరు కార్యాలయాలకు వెళ్ళేటప్పుడు ఆ ఉద్యోగపు డ్రెస్ ధరించినా — ఇంటి పట్టున ఉన్నప్పుడు, తెలుగు వారందరూ సమావేశమయ్యేటప్పుడు తెలుగు చీర కట్టులోనే కనిపిస్తున్నారు. కొందరు పెరటి తోటలో గోంగూర మొక్కలు పెంచుకోవడమూ నేను చూశాను. తెలుగు వంటకాలు, తెలుగు సంస్కృతి, తెలుగు భాష వారి ఇళ్ళల్లో కాపురముంటున్నాయి.

మన ఆంధ్రరాష్ట్రంలోని పరిస్థితులను, వస్తున్న పరిణామాలను ఎప్పటికప్పుడు తెలియజేసే రెండు తెలుగు పక్ష పత్రికలు అక్కడ ప్రచురిత మవుతున్నాయి. శ్రీ దండమూడి మోహనరావు సంపాదకత్వాన షికాగో నుంచి వెలువడే "తెలుగు అమెరికా" పత్రికలోనూ, శ్రీ రఘునాథ్ సంపాదకత్వాన న్యూజెర్సీ నుంచి వెలువడే "తెలుగు జ్యోతి" పత్రికలోనూ ఛందోబద్ధంగా అక్కడి తెలుగు వారు చేసిన రచనలు చూసి నా హృదయం పొంగిపోయింది.

వాషింగ్టన్‌లోని తెలుగు వారు ఎంతో శ్రమించి తెలుగు భాషా ఔన్నత్యానికి కళాదీపికగా రూపొందించిన "శ్రీకృష్ణ దేవరాయ విజయం" అనే నాటకం కోసం అప్పటి దేశకాల పరిస్థితులకు అనుగుణంగా కాస్ట్యూమ్స్, వాతావరణాన్ని సృష్టించి, అప్పటి వైభవాన్ని కళ్ళకు కట్టేటట్టు ప్రదర్శించి తెలుగు వారి ప్రతిభను అక్కడ నలుమూలలా వ్యాపింప చేశారు.

అక్కడి తెలుగువారి కళాభిమానం ఇంకా ఎంతటిదంటే, ఒక చక్కని చలన చిత్రాన్ని అక్కడే తీయాలన్న తలంపు యార్లగడ్డ ప్రసాదరావు, గుమ్మలూరు శాస్త్రిగారలకు కలిగింది. నా మదిలో చాలా కాలంగా మెదులుతూన్న ఓ ఇతివృత్తాన్ని వినిపించాను. వారికి బాగా నచ్చింది. అప్పటికప్పుడే ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సంగీత దర్శకత్వంలో ఆయనా, శైలజా మధురంగా గానం చేసిన 'పిబరే రామరసం' అనే సదాశివబ్రహ్మేంద్రస్వామి కీర్తనను వాషింగ్టన్‌లోని ఒమేగా స్టూడియోలో రికార్డ్ చేయించాం. మిస్ షేన్ అనే మహిళ మల్టీ ట్రాక్ స్టీరియోలో చాలా చక్కగా రికార్డ్ చేశారు. ఇలా ఒక తెలుగు చిత్రానికి పాట అమెరికాలో రికార్డవడం ఇదే తొలిసారి. ఈ చిత్రంలో సుహాసిని హీరోయిన్. జూన్ చివరి వారం నుంచి ఆగస్ట్ వరకు వాషింగ్టన్, న్యూయార్క్, చికాగో, డెట్రాయిట్, నయాగరా, పిట్స్‌బర్గ్‌లోని వెంకటేశ్వరస్వామి దేవాలయం వద్ద షూటింగ్ జరుగుతుంది.

ఇంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఉన్న ఆంధ్రులకు తమ తెలుగు గడ్డపై ఉన్న ప్రేమ, తెలుగు వారంటే ఉన్న ఆప్యాయత మరువరానివి. దాదాపు ఇరవై నగరాలలోని మన వాళ్ళ ఇళ్ళల్లో బస చేయడంతో ఎన్నో కుటుంబాలను సన్నిహితంగా గమనించడం తటస్థించింది. వారి ఆప్యాయతకు, వారు మా పట్ల చూపిన అభిమానానికి ఎలా కృతజ్ఞతలు అందజేయాలో తెలియని పరిస్థితి నాది.

అందుకే.... ఎందరో మహానుభావులు, అందరికి వందనాలు! □

# అలివేలు గారి మొగుడు

## సింగరాజు రామచంద్రమూర్తి



చిన్న చిన్న ఇళ్ళకి డిమాండు ఎక్కువ. అంటే అద్దె కొంచెం తక్కువగా ఉండే వాటాలన్నమాట. తక్కువ ఆదాయం గలవారు ఎక్కువకద! పెద్ద వాటాలలోకి జీతాలు ఎక్కువవారు వస్తారు. కాని వాళ్ళకి చేయవలసిన వసతులూ ఎక్కువే. ఎక్కడికి వెళ్ళినా అడిగిన అద్దె పారేసి బ్రతకగలరు అద్దె ఎక్కువగా పెట్టుకోలేనివాళ్ళకి ఈ ఇల్లు వదులుతే మళ్ళీ ఈమాత్రం వసతిగల ఇల్లు దొరకదేమోనన్న భయం ఉంటుంది. వసతులు ఎక్కువచేస్తే అద్దె పెంచుతారన్న భయం కూడా ఉంటుంది. అందువల్ల వాళ్ళు వసతులు అడగకపోగా ఇంటి వాళ్ళు ఎక్కడ కొత్తగా వసతులు చేస్తారోనని దిగులు పడుతూంటారు

మా ఇంటి ఆవిడ అలివేలుగారు ఈ మనస్తత్వం బాగా ఎరిగిన దనుకుంటాను మా కాంపౌండులో చిన్నవి, అతి చిన్నవి మొత్తం ఏడెనిమిది వాటాలున్నాయి. ఆ ఉన్నవాటిలో నేనున్నదే పెద్దది

"పెద్ద ఉద్యోగాల్లో ఉన్నవారు పొగరుగా ఉంటారు అన్నయ్యగారు, "నువ్వెంత నీ ఇల్లెంత" అన్నట్టుంటుంది వాళ్ళ దృష్టి. మీ పద్ధతి వేరనుకొండి. అందువల్ల..." అంటుంటుంది అలివేలుగారు ఎప్పుడయినా నాతో మాట్లాడి నప్పుడు.

నేనయినా నా ఆదాయానికి ఈ వాటాలో ఉండవలసిన వాడినికాను. నాకు ఈ ఇంటిలోనే ప్రమోషను వచ్చింది. అందుకు కొంత, మా ఆవిడ కాపురానికి వచ్చినప్పటినుంచి ఇక్కడే గడపడంవలన ఆవిడకి ఈ ఇల్లు అంటే ప్రేమ కావడం వలన కొంత నేనీ ఇంటిని వదలలేకపోయాను.

అలివేలుగారంటే 'ఇంటి ఆవిడ' అని అంటుంటే ఆవిడ చాలా పెద్దది అన్న అభిప్రాయం కలగచ్చు. కాని కాదు. ఇటీవలనే పెళ్ళి చేసుకుంది. 'పెళ్ళి' అనేసరికి మరీ చిన్నది అన్న ఊహ కలగవచ్చు. అదీ సరికాదు.

"నా గురించి పట్టించుకునే బంధువులు ఎవరూలేరు. తోడబుట్టినవారా పాడా -ఒంటరిదాన్ని. "మేమంతా మీ వాళ్ళం కామా" అనచ్చు మీరు వదినగారు. అన్నయ్యగారికి ట్రాన్స్‌ఫర్ అయితే వెళ్ళిపోతారుకాని నాకోసం కూర్చుంటారా? అందుకే 'నా' అన్న మనిషి కావాలి. ఒంటరిగా ఉన్న ఆడదానిమీద ఏదో ఒక నింద వేసేందుకు ఎవరూ వెనకాడరు. అందుకని నేనే చొరవ చేశాను అన్నయ్యగారు"

నిజంగానే జాలేసింది నాకు మా ఇంటావిడ స్థితి చూస్తే! పెళ్ళి అన్నది ఎవరో ఏర్పాటు చేస్తే సిగ్గుతో ఒప్పుకోవలసినది అయితే సిగ్గుపడుతూ కూర్చుంటే అలానే ఉండిపోయే ప్రమాదం ఉంది ఈవిడ విషయంలో ఇల్లు, వాకిలి ఉంది మనిషి బాగుంటుంది. తనకేం తక్కువ? మంచి ఉద్యోగం కూడా ఉంది!

మేనమామ వరసయిన ఆయన్ని ఒకర్ని పట్టుకుని "నా విషయం ఏమీ పట్టించుకోరేం?" అని నిలేసి అడిగేసింది.

ఆయన కొంచెం బీదవాడు ఈమె ఏమయినా చేయి విదిల్చితే అది భద్రంగా ఇంటికి తీసుకుపోయి పిల్లలకి పెట్టుకునేవాడు. చదువులేదు మంచి ఉద్యోగం లేదు. అలివేలుగారు ఆయనపాలిట కల్పవృక్షం. అటువంటి ఆవిడకి కోపం వస్తే.... వెంటనే రంగంలోకి దిగాడు.

అదుగో ఆయన వెతికి తెచ్చినవాడే అలివేలుగారి మొగుడు

"ఇదేమి సెలెక్షన్ మీ "చెల్లెలు" గారిది? చదువులో స్కూలు దాటనివాడు. ఉద్యోగంలేనివాడు... అసలు చేసుకోదనుకున్నా" అంది మా ఆవిడ.

నేను నవ్వి "ఇంట్లో అద్దెలకిచ్చే సెలక్షన్‌నిబట్టి ఆలోచించాలి ఆవిడ మనస్తత్వం. అతనికి అయినవాళ్ళు లేరు. అణిగి మణిగి ఉంటాడు. చాలదూ? పైగా కొంచెంగా పొలం కూడా ఉందిట" అన్నాను

మనిషి మంచివాడు. ఆరోగ్యంగా ఉన్నాడు. రావడమే మా ఇంటికి వచ్చాడొకరోజున. "మా ఆవిడ కాపురానికి రావడంపోయి నేను వచ్చానండి. ఇక మీరందరు దిక్కు నాకు!" అన్నాడు నవ్వుతూ.

అతని సెన్స్ ఆఫ్ హ్యూమర్ నాకు నచ్చింది.

"మీరేటకదా ఇక్కడ చాలా ఏళ్ళుగా ఉంటున్నది, మా అలివేలు చెప్పింది. కనుక నాకన్న మీకే ఆవిడతో పరిచయం ఎక్కువ నిదానంమీద మా చెల్లెమ్మగారిని అడగాలి మా అలివేలు గురించి. ముందు మీతో వనుండి వచ్చాను బావగారు" అని నవ్వి "అందరూ నన్ను "అలివేలు మొగుడు" అని పిలుస్తారని నాకు తెలుసుననుకోండి. అది లేకుండా "నరసింహారావుగారి పెళ్ళాం" అని పిలి పించలేకపోయినా కనీసం నన్ను "నరసింహారావు" అని పిలిచే పద్ధతు లేమయినా చెప్పండి" అన్నాడు.

నేనన్నవ్వేశాను. "భేతాళ ప్రశ్నలా ఉంది. ఈ వాడ కట్టులో చాలా ఏళ్ళుగా ఇల్లున్న ఆవిడ అలివేలుగారు. కనుక కొంచెం కష్టమయిన పని. ఇంకా నయం మిమ్మల్ని "అరుంధతిగారి అల్లుడు" అని పిలవడం లేదు. ఈవిడ అమ్మ అన్నమాట

అవిడ!"

"అదేం పని పాపం, ఆయన ఇబ్బంది మీకు పట్టినట్టులేదు" అంది మా శారద.

"చెల్లెలు హోదా తీసుకున్నావు అప్పుడే అయితే ఏనండి. మొదటిది ఈ కాంపౌండులో, తరవాత ఈ వీధిలో, అపైన ఈ పేటలో అందరికీ తలలో నాలికలా ఉండటం' రెండవది పేపర్లో పేరు పడాలంటే అద్భుతం చేయాలి. అది అతి మంచి కావచ్చును. అతి చెడూ కావచ్చును" అన్నాను

నవ్వేశాడు అతను.

"మా అలివేలుగారు మంచిది మీ కెటువంటి ఇబ్బంధి ఉండదు లెండి" అన్నాను చివరగా.

వారం రోజులు పోయాక మా శారద చెప్పింది., "మన అలివేలుగారి మొగుడు మీ సలహాని తు.చ. తప్పకుండా అమలు చేస్తున్నాడండోయ్! మన కాంపౌండులోని ఆడవాళ్ళ కందరికీ 'అన్నయ్యగారు', "తమ్ముడుగారు" అయిపోయాడు. నిన్న సావిత్రమ్మగారు అంటోంది "మా అలివేలుగారి మొగుడు ఫచ్చాత్త ప్రాణం తెరిపిగా ఉంది" అని."

"అంత తెరిపికి ఏమయిందిట?"

"ఏముంది, ఎప్పుడూ త్రిపాది నక్షత్రంలా తిరుగుతుంటుందికద రోడ్డమ్మట. పాలు ఒకరు పోయించుకోవాలి, మొగుడికి తాళంచెవు లొకరివ్వాలి. పిల్లలొస్తే అవిడ ఎవరింటికి వెళ్ళినదీ అటునుంచి ఎవరి కొంప మీదుగా ఇంటికి ఎన్నింటికి చేరేది చెప్పాలి. మళ్ళ మొగుడుగారు కాఫీ తాగేసి ఏ క్లబ్బుకో పోతుంటే ఆ తాళం చెవులు పుచ్చుకుని భద్రపరచాలి – ఇన్ని పనులు చేసేందుకు ఓపిక ఎవరికుంటుంది? ఖాళీగా ఉండే ఆయనకి తప్పేస్తే! అందులోను ఉపదేశం కూడా చేశారుకద, అది ఆ సావిత్రమ్మ పాలిట వరం అయింది."

కొంచెం అసూయ ధ్వనించింది మా అవిడ మాటల్లో.

"అవును, నువ్వూ మొన్న గిన్నె ఆయనకే ఇచ్చిపోయావుగా పాలు పోయించుకోమని – నేను ఊరు వెళ్ళిన రోజున!"

"దానిదేముండి. నూటికి కోటికి ఒకసారి. ఇప్పుడందరూ అదే పని. సలహా మీరు చెప్పారని తెలుస్తే అలివేలుగారు మిమ్మల్ని నిలేసి అడుగుతుంది!"

అన్నట్టుగానే అలివేలుగారే ఒకరోజున మా ఇంటికి వచ్చింది. లెక్క ప్రకారం కొన్ని రోజుల కొకసారి ప్రతి వాటాకీ వెళ్ళడం అవిడకి అలవాటు. "కుశలం అడిగేందుకు వచ్చినట్టు వస్తుంది గాని నిజానికి ఎవరయినా మేకులు కొట్టారేమో చూసుకునేందుకు అవిడ వచ్చేది – దొంగ!" అంటుంది మా శారద.

"అన్నయ్యగారు, పెద్ద పెద్ద హోటళ్ళలో రూము నంబర్లకి తాళం చెవులు వేళ్ళాడదీసి ఉంటాయి చూడండి. అలా పెద్ద బోర్డు చేయించాలి మా ఇంట్లో కూడా వాళ్ళ వాళ్ళ పేర్లు రాసి! ఆ పక్కనే పాల చెంబులూ, పెరుగు గిన్నెలూ – రాత్రి పది పదకొండుదాకా ఎవరివి వారికి ఇచ్చాక అప్పుడూ మా పడకలు కన్ను మూసేసరికి తెల్లవారడం "మహాప్రభో ఈ దేశసేవ ఆపండిక" అన్నాను మా ఆయన్ని" అంది.

"మా శారద అందుకుని, "మంచి పనీ చేశారు ఎప్పుడయినా అవసరం వస్తే సాయం చేయొచ్చు కాని రోజూ ఉండేవాళ్ళకి చేయకూడదు" అంది

సావిత్రమ్మగారి గురించి అంటోంది అని తెలుస్తూనే ఉంది ఈర్ష్య ముందు పుట్టి ఆడది తరవాత పుట్టిందేమో!

అయితే వెంటనే రూటు మార్చాడు అలివేలుగారి మొగుడు ఒకరోజు ఒక యువ జంట 'ఫలానావారి ఇల్లెక్కడ?" అని అడిగారు నన్ను నేనున్న వాటా వీధిమీదికి ఉండడం వలన మాకే ఎక్కువగా తగులుతుంటాయి ఇటువంటి విచారణలు ఇన్ని ఏళ్ళుగా ఉంటున్నానన్నమాటేగాని ఆ పేట నైసర్గిక స్వరూపం మినహాయించి ఎవరెక్కడ ఉంటున్నారో నాకు తెలియదు

అందువల్లనే "సారి అండి పైకి వెళ్ళి ఎవర్నయినా అడగండి" అంటున్నానో లేదో మనవాడు వచ్చేశాడు. "నాకు తెలుసండి బావగారు, పదండి మాస్టారు నేను చూపిస్తాను" అంటూ వాళ్ళని వెంటేసుకుని వెళ్ళిపోయాడు. కాసేపటికి తిరిగి వచ్చి నవ్వుతూ 'మన వెనక వీధి వాళ్ళింటికే! వాళ్ళు ఎంతో ఆనందపడ్డారు. ఈ వచ్చినవాళ్ళు ఆ కుటుంబ రావుగారికి స్వయానా చెల్లెలు, బావమరిదీనుట!" అన్నాడు.

"మీ కెలా తెలుసు ఆ ఇల్లు?"

"మా అవిడ వెళ్ళగానే నాలుగు వీధులూ తిరుగుతున్నాను రోజూ. అవిడటు ఆఫీసుకి మనం ఇటు ఇళ్ళని పరిచయం చేసుకోటానికీను అన్న మాట!"

నే నవ్వుతూ "అయితే చెప్పండి చూద్దాం మీ పరిజ్ఞానం. ఇక్కడెక్కడో ఇళ్ళ వాస్తు, జ్యోతిషం చూసే పంతులుగారున్నారట" అన్నాను

"అదా" అని క్షణం ప్రశ్నలు చెప్పేవాడిలా కళ్ళు మూసుకుని "ఈ టెలిఫోను స్థంభం ఉందా. ఇక్కడనుంచి లెక్కెట్టుకుంటూ పదకొండవ స్థంభం దాటగానే ఎడమ వైపు సందులోకి తిరగండి అక్కడనుంచి రెండు–మూడు స్థంభాల మధ్యగా నిలబడి రోడ్డుకి రెండవ వైపు చూసి నేరుగా బాణంలా ముందుకి దూసుకుపొండి అదే ఆయన గది!" అని అప్పుడు కళ్ళు తెరిచి "ఏమిటి పని?" అన్నాడు.

"ఇల్లు కడదామని!"

"అయితే మమ్మల్ని వదిలి వెడుతారన్నమాట!"

"అప్పుడేనా, ఎన్ని అవాంతరాలూ మధ్యలో! ముందు స్థలం చూపించాలి ఆయనకి ఆయన దానిని మంచిదనాలి, అప్పుడు బేరం కుదరాలి అప్పుడు మనం కొంటే.. "నవ్వేశాను తను నవ్వాడు

"మీకు కాగితంమీద గుర్తులు వేసిస్తా నాగండి" అంటూ నేను వద్దంటున్నా వినకుండా బాణాలతో వేసిచ్చాడు "ఈ బాణాలెమ్మట వెళ్ళిపొండి' అన్నాడు.

మర్నాడు మంచి రోజు పైగా శలవు అందుకని, సైకిల్ తీసుకుని అతను చెప్పిన విధంగా టెలిఫోను స్థంభాలు లెక్కెట్టుకుంటూ వెడుతున్నాను కొంతదూరం పోయేసరికి నాకు ఎదురుగా వస్తూ సుధాకర్ కనబడ్డాడు అతను పరధ్యానంగా ఉండడం చూసి నేనే 'హల్లో" అని పలకరించాను

అతను మా కాంపౌండులోనే రెండు గదుల వాటాలో ఉంటున్నవాడు అసలు ఆయన దర్శనమేకాదు ఎప్పుడూను కొలువుల ఉద్యోగం అతనిది ఒక మంచి ప్రయివేటు కంపెనీలో సేల్స్ విషయాలు చూసే ఉద్యోగం

'స్థంభాల లెక్క మరిచిపోయానండి అందుకు మళ్ళీ మొదటికి వస్తున్నాను" అన్నాడు నన్ను చూసి నవ్వుతూ

"ఎలక్ట్రిక్ స్థంభాలా, టెలిఫోన్ స్థంభాలా?' అన్నాను

"ఎలక్ట్రిక్‌వి!"

"టెలిఫోనయితే నేను సాయం చేసుండేవాడిని నావి అవిలెండి ఇంతకీ ఎవరింటికోసం మీరు బయలు దేరింది?"

"హోమియో డాక్టరెవరో ఉన్నారంటేను నరసింహా రావుగారు" అని క్షణం ఆగి "అదే మన ఇంటి ."

"తెలుసులెండి నాకూ ఆయనే చెప్పాడు వాస్తు ఆయన కోసం. అచ్చా సి యూ" ఎవరి స్థంభాల లెక్కలో వాళ్ళం వెళ్ళిపోయాం నేను ముందుకి ఆయన వెనక్కి

మర్నాడు అలివేలుగారి మొగుడు మా ఇంటికి



# "నవ వసంతమా!"

శుభాశుభ ఫలో న్మిశ్రే క్రోధనే శిశిరో గతః,
అధునాక్షయ వర్షం నః పుష్ణాత్వానంద వల్లరిమ్

క్షయయో మతి యిదియ
క్షయయో, ఏమైన గాని సర్వక్షేమ
క్షయముగ లేకుండగన
క్షయముగ నందిచ్చుగాక సౌఖ్యము ప్రజకున్.

చిలుకలు కోయిలల్ రొదలు
సేయగ నందు క్షుధార్త రావముల్
జలములకై జనాల యగచాటుల
గోలలు వించు వించు చి
ల్లులు వడె మా చెవుల్; సుఖము
లుప్తము చేయక నూతనాబ్దమా!
లలిత వసంత గాన మధుర
శ్రుతులన్ వెలయింపు మిపయిన్.

–కొంపెల్ల రామశాస్త్రి

## "అలివేలు గారి మొగుడు"

వస్తే అన్నాను "అదేమిటి నరసింహారావుగారు, చక్కగా ఇంటి నంబరుగాని మరేదయినా గుర్తుగా చెబుతే వెతుక్కునేవాళ్ళకి తేలిక కదా! స్థంభాల లెక్కలు ఇబ్బంది!" అని

వేదాంతి అజ్ఞానిని చూసి నవ్వే నవ్వొకటి నవ్వాడు అతను

"అక్కడే పొరపడ్డారు చిరస్థాయిగా ఉండేవి స్థంభాలే! ఇళ్ళ నంబర్లు వరసక్రమంలో ఏడుస్తాయా? కొందరు బయట గేటుకి నంబరు రాయరు. ఎన్ని కేసులు చూస్తున్నానంటారు రోజూ!" అని అంటుండగానే ఎవరో ఒకాయన వచ్చి మా ముందు సైకిల్‌మించి దిగాడు.

"మీ రిచ్చిన బాణం గుర్తులు తప్పు" అన్నాడు దిగుతూనే.

"ఎవరింటికి?"

"హెడ్‌మాస్టరు గారింటికి."

"ఎవరా తప్పన్నది?"

"నేను అసలు చచ్చాను మీరు చెప్పిన పంపులు లెక్కపెట్టుకోలేక వీధిలో మూడవ పంపు అన్నారా – ఆ మూడవ పంపు కనబడక వూరు బయటిదాకా వెళ్ళిపోయి మళ్ళీ వెనక్కి వచ్చాను. తీరా కనుక్కుంటే ఆ పంపునీళ్ళు రాకపోవడంవలన పీకేసి మూడు రోజులయిందిట!

అయ్యో, నేను గుర్తు పెట్టుకున్న రోజు ఉంది మరి!"

సర్లే వినండి పంపు దాటగానే కుడి పక్క సందులో కుడి వైపు రెండవ ఇంట్లోకి నేరుగా బాణం వేసి "బల్ల దగ్గర కూర్చుంటాడు ఆయన' అన్నారా–

"అవును ఉండి తీరతాడే!"

"ఉన్నాడు కాని హెడ్‌మాస్టారుకాదు ఎవరో ఆయన "ఎవడయ్యా, ఈ బాణాలు వేసిస్తోంది రమ్మను అడుగుతాను. ఇలా మమ్మల్ని డిస్టర్బ్ చేసేందుకు ఆయనకేం హక్కుందో" అంటూ ఎగిరిపడ్డాడు. ఇంతకీ ఆయన కోపాని క్కారణం అంతకు పది నిముషాల ముందు మరొకరు కూడా ఇలాగే వెళ్ళారుట హెడ్‌మాష్టరుగారింటికంటూ వీళ్ళ ఇంట్లోకి. "పైగా పిలవండి మాస్టారుగారిని" అంటూ పోట్లాడాటట. ఆయనెక్కడో దాక్కున్నాడని!

కనుక్కుంటే తెలిసిందేమంటే పంపు దాటకుండా కుడి వైపు సందులో కుడి వైపు రెండవ ఇల్లు ఆయనది. ఈసారి ఎవరికయినా బాణాలు వేసిచ్చే ముందు జాగ్రత్త. మళ్ళీ తప్పుచేస్తే ఆయనిక ఊర్కోడుట! కోర్టకెక్కుతాడుట. చెప్పి వెడదామని వచ్చాను" అంటూనే వెళ్ళిపోయా డాయన.

మర్నాడు పొద్దున్నే చెప్పింది మా శారద "నిన్న అలివేలుగారి మొగుడు మరొక గొప్ప పని చేశాడుట. ఊళ్ళోకి "మధుమతి" అనే సినిమా వచ్చిందిటగా."

"అవును. చాలా బావుంటుంది."

"అవునా, ఆయనా మీలాగానే అలివేలుగారికి చెప్పాడుట ఆవిడకి హిందీ రాదు. అందువల్ల వాటికిపోదు "పోని మీరు రండి" అని అంటే "నేను ఆరు సార్లు చూశాను" అన్నాడుట ఈయన సరేనని మన లలితగారు లేదూ, కాన్వెంటులో పని చేస్తుంది, ఆవిడని బయలుదేర దీసిందిట! అసలావిడతో ఏనాడూ పోదు అలివేలు గారు. కాని వసుదేవుడు – గాడిద కాళ్ళు లాగా ఆవిడకి హిందీ రావడంవల్ల, భర్తగారు మరీ మరీ ఉత్సాహ పరచడంవల్ల ఆవిడని కలుపుకుంది. ఇద్దరూ కలిసి "ఏ హాలులో" అని ఈయనని అడిగితే చెప్పాడుట – ఫలానా హాల్లో పన్నెండు గంటల ఆట అని. అక్కడికి "బాగా తెలుసా?" అనడిగిందట అలివేలుగారు దానికి ఈయన "మన కిప్పుడీ ఊరంతా కరతలామలకం" అన్నాడుట ఘరానాగా.

ఇద్దరూ రిక్షా ఎక్కి హాలు ముందు దిగారు. బయట అంతా ఖాళీగా ఉందిట. కొట్టువాళ్ళు, సోడాలవాళ్ళు వీళ్ళని వింతగా చూస్తూ నవ్వుకుంటున్నారుట గబగబ కౌంటర్లోకెళ్ళి రెండు' టికట్లు అడిగారుట. అక్కడి గుమాస్తా "సినిమా ఏమిటో తెలిసే వచ్చారామ్మా?" అన్నాడుట.

అప్పుడు వీళ్ళకి స్పృహ వచ్చి బానర్ చూస్తే మళయాళం సినిమా!.. తమరికీ తెలుసుగా అవేమిటో "

"ఆమె కామ పిచ్చి" అదేనా?" అడిగాను నవ్వుతూ

"ఆఁ! అందరూ ఎందుకు నవ్వారో అప్పు దర్థం అయిందిట! ఇంటి కొచ్చి చచ్చేలా చీవాట్లు వేసిందిట. "ఊరి వారందరికీ ఇళ్ళ గుర్తులు చెప్పేందుకు మీరేమయినా గూర్ఖానా?" అనడిగిందట... అదుగో ఆయనే వస్తున్నాడు. పరామర్శించండి."

లోపలికి వచ్చాడు "అబ్బబ్బ బావగారు, మీకూ ఈపాటికి తెలిసిపోయి ఉండాలి నిన్నటి సినిమా గొడవ. తరవాత మా ఆవిడ నన్ను చీవాట్లు వేయడం! అయినా మా అలివేలుతో చాలా కష్టమండీ బాబూ ఏది తేలిగ్గా తీసుకోదు. అన్నిటికీ సీరియస్ అయిపోతుంది' నేను మాత్రం మనిషినికానూ, నాకు మాత్రం కోపం రాదూ?

తప్పులు జరుగుతాయి మనుషులం కనుక! కొన్ని వదిలేయాలి తను అన్ని' కరెక్టుగా చేయ గలదా? అయినా ఇన్నేసి ఏళ్ళు పెళ్ళి కాకుండా ఉండకూడదండి ఖచ్చితమయిన అభిప్రాయాలు ఏర్పడిపోతాయి ఆవిడకి వంటరి జీవితం బాగా అలవాటయిపోయింది అయినా నా ఖర్మ.. ఆలోచిస్తే ఇందులో దిగి పొరపాటు చేశానేమోనని పిస్తోందండి" అన్నాడు వస్తూనే

నాకు జాలేసింది. "ఏదో లెండి. మాకు మాత్రం ఉండవా ఏమిటి ఇబ్బందులు? మా ఆవిడికి చిన్నప్పుడే పెళ్ళయింది మరి..... కాని. .."

నా మాట పూర్తి కాకుండానే "ప్రతి ఆడ మనిషిలోనూ దేముడు ఎక్కడెక్కడో అందం పెడతాడండి" అన్నాడు

"అవునవును" అన్నాను

"లలితలేదూ" అని గొంతు తగ్గించి "లలిత.... గొంతు ఎంత బావుంటుందండి! చేతి వేళ్ళు – చాలా నాజూగ్గా; అందంగా వీణ మీటు తున్నట్టుంటాయి సుమా నేనెప్పుడూ చూడలేదు చాలా ఆకర్షణ ఉందమ్మాయిలో! . ." అన్నట్టు మా ఆవిడ కూరలు తెమ్మంది అయ్యో బాబోయ్ ఆలస్యం అయితే గోవిందో గోవింద" అంటూనే వెళ్ళిపోయాడు

నేనూ ఎప్పుడూ ఆ అమ్మాయిని పరికించి చూడలేదు. ముఖం మాత్రం సామాన్యం. అతనన్నట్టు ఎక్కడో ఆకర్షణ పెడతాడీ దేవుడు

మా ఆవిడది కంప్యూటర్ బుర్ర. మనం సమస్యని ఫీడ్ చేస్తే చాలు వివరాలు వచ్చేస్తాయి అందుకనే "శారదా, లలితగారి వయస్సు ఎంత ఉంటుంది?అనడిగాను బిగ్గరగా. వంటింట్లో ఉందనుకుని.

"మీకు తెలియనట్టు. ఇక్కడే తలుపు దగ్గర నిలబడి వింటున్నాను. ఆయన గొంతు తగ్గించి చెప్పడం – గొంతు బావుంటుంది. వేళ్ళు బావుంటాయి ఎత్తులు బావుంటాయి...."

"ఆ చివరి మాట అనలేదు" అన్నాను నవ్వుతూ

"ఇవేగా మీ మగాళ్ళ మాటలు!.... మీరు రోజూ కిటికీలోంచి చూస్తుంటారుగా నన్నడగడం దేనికి?" అంది.

"రామ రామ"

"బుకాయించకండి. మీరు చూసి వెళ్ళాక కిటికీ దగ్గర పీట వేసుకుని మీరు చూసిన వైపు. మీ అంత ఎత్తు నుంచి చూడలేననుకుంటారా! నేరుగా సావిత్రి, లలితా కనబడుతుంటారు!"

"దేవుడి సాక్షిగా! నేను చూసేది అరటి చెట్ల వంక. పచ్చటివి చూస్తే కళ్ళు బాగుంటాయట!"

'అరటిచెట్లే చూస్తారో మరొకటో" అని క్షణం ఆగి, "లలితకి బంధువులు ఎవరూ రారు వాళ్ళవాళ్ళు ఎక్కడో బరంపురంలో ఉంటారంటుంది "దూరం అని నేనూ వెళ్ళను" అంటుంది అయితే కొద్దిమందికే తెలిసిన విషయం ఏమంటే ఎవరినో నమ్మిందట వాడు మోసం చేశాడుట అందువల్ల మళ్ళీ వెనక్కి వాళ్ళ వాళ్ళ దగ్గరకు వెళ్ళేందుకు ఈవిడకి ముఖం చెల్లదు. వాళ్ళు రారు. అసలు ఈవిడ ఈ ఊళ్ళో స్థిరపడినట్లు వాళ్ళకి తెలియదేమో కూడ! ఏం మీ దృష్టి కూడా ఆవిడమీదనే పడిందా?" అంది ఆఖరుమాటగా

నేనేం మాట్లాడలేదు తరవాత రెండు మూడుసార్లు అలివేలుగారి మొగుడు లలిత వాటాలోకి వెడుతూ, రెండు మూడు సార్లు బయటికి వస్తూ కనబడ్డాడు. ఒకసారి వాళ్ళిద్దరూ మా ఇంటికి దూరంగా రోడ్డుమీద మాట్లాడుకుంటూ కనబడ్డారు ఇద్దరి ముఖాలు ఏదో చర్చించుకుంటున్నట్టు సీరియస్‌గా ఉన్నాయి

తరవాత ఒకరోజు రాత్రి పదకొండు ప్రాంతాల అలివేలుగారు మా ఇంటికి వచ్చి "అన్నయ్యగారు, ఆయన ఇంకా ఇంటికి రాలేదండి" అంది ఆందోళనగా

అలాగా' అన్నాను నేనూ ఆందోళనగానే

"అసలెప్పుడూ బయటికి వెళ్ళరు అలాంటిది ఈరోజు మధ్యాహ్నంనుంచి పత్తా లేదు "

"నేనలా రోడ్డుమీద చూసి వస్తాను మీరు వెళ్ళండి' అన్నాను నేను ఆవిడ వెళ్ళిపోయింది.

నేను చొక్కా వేసుకుని వచ్చేసరికి బయట సావిత్రిగారు, మా ఆవిడ గుసగుసలాడుకుంటున్నారు నన్ను చూసి "మీరు పరుగులెట్టబోకండి లలిత కూడా కనబడటం లేదుట' అంది మా ఆవిడ

నేను తెల్లబోయాను.

"నాలుగయిదు రోజులుగా ఊరికే వారిద్దరి మధ్య సమావేశాలు జరుగుతున్నాయి మరి ఆ అమ్మాయి ఉదయం బయటికి వెళ్ళింది ఈరోజు శలవుకదా ఆవిడా ఇంటిలోంచి అస్సలు కదలని మనిషే ఆయనలాగా!"

నేను అలాగే నిలబడిపోయాను

కాసేపాగి వచ్చి "పదండి లోపలికి. అలివేలుగారికి చూచాయగా తెలుసు – లలిత కనబడటం లేదని! మళ్ళీ వచ్చి అడుగుతే తిరుగుదురుగాని" అంది

'రాత్రి గడచిపోయింది అలివేలుగారు మళ్ళీ రాలేదు. ఆ రాత్రే కాదు ఆ మర్నాడల్లా కూడా అసలు ఇంట్లోంచి బయటికే రాలేదు మిగిలిన వాటాల ఆడవాళ్ళు పెట్రేగిపోయి మాట్లాడేసుకుంటున్నారు అలివేలుగారి మొగుడూ, లలితా రోడ్డుమీద కూడా కబుర్లు చెప్పుకుంటూ తిరుగుతున్నారని "అయినా మొగుడన్నాక కొంచెం గౌరవం ఇవ్వాలని,పిల్లాడిని కేక లేసినట్లు మాట్లాడితే తప్పని "

నాకు అలివేలుగారిమీద జాలేసింది "ఒక్కసారి ఆవిడ దగ్గరకు వెళ్ళి ధైర్యం చెప్పరాదూ?" అన్నాను మా శారదని

'భలేవారే. మొగుడు లేచిపోతే ఆవిడ మామూలుగా ఉంటుందా, ఎంత కోపంగా ఉంటుంది?'

వీళ్ళంతా శత్రువులే ఆవిడకి అనిపించింది నేనే వెళ్ళాను వరండాలోంచి చూస్తే మంచంమీద బోర్లా పడుకుని ఉంది. చిన్న చప్పుడు వేస్తే తలెత్తి, కిటికీలోంచి నన్ను చూసి మళ్ళీ దిండులో తల దూర్చేసింది ఏడుపు ఎక్కువయింది అన్న విషయం తెలుస్తూనే ఉంది

వచ్చేశాను

సోమవారం కూడా ఇద్దరిలో ఎవరూ కనబడలేదు అప్పటిదాకా నమ్మని నా కూ్కడా నమ్మకం కలగసాగింది

"ఇంకా మీ పిచ్చిగాని ఈపాటికి పెళ్ళి గిళ్ళి అయిపోయుంటాయి వాళ్ళిద్దరికి!" అంటోంది సావిత్రమ్మగారు మా ఆవిడతో

వీళ్ళిద్దరికి సయోధ్య పెరిగింది

మంగళవారం నన్ను నిద్ర లేపి మరీ చెప్పింది మా ఆవిడ "అరుగో అరుగో వస్తున్నారు అంటూ "

బయటికి వచ్చి చూస్తే అలివేలుగారి మొగుడు గుండుతో కనబడ్డాడు! "బావగారు, అటు చూడండి" అన్నాడు మహోత్సాహంతో

అటుచూస్తే నా చూపు కెదురుగా లలిత, సుధాకర్ నిలబడి ఉన్నారు!

"పెళ్ళి చేశాను" అన్నాడు

బయట నిలబడిఉన్న వాళ్ళంతా తెల్లబోయారు వారిలో నేనూను!

సుధాకర్ అనేవాడు ఉన్నాడని, అతను బ్రహ్మచారని గుర్తు రాలేదు అతను కూడ గత మూడు రోజులుగా కనబడటం లేదన్న అనుమానం కలగలేదు అతనిది కాంపుల ఉద్యోగం కనుక!

"ఏదీ మా అలివేలు" అంటూ గబగబ తమ వాటా వైపుకి వెళ్ళాడు

నాకు చాలా ఆనందం కలిగింది

"అలివేలు గారి మొగుడు అద్భుతాన్ని చేశాడు." అంది శారద

నాక్కొంచెం గర్వంగానే వుంది అన్నీ నేను చెప్పినవే ఆచరిస్తున్నాడతను!

సాయంత్రం నూతన దంపతులు మా ఆవరణలోని వారందరికి గొప్ప విందు చేశారు హోటలు నుంచి తెప్పించి అప్పుడు సుధాకర్ చెప్పాడు "నరసింహారావుగారికి, వారి భార్యకూ మేం ఋణపడి ఉన్నాము మేమిద్దరం ఒక చోట అద్దెకు ఉండేలా చేసినందుకు ఆమెకూ, మా ఇద్దరినీ కలిపినందుకు ఆయనకూ!

నీకో రెండు గదులున్నాయి. మా లలితకూ రెండు గదులున్నాయి అయితే ఈ రెండు వాటాలు వెడం వెడంగా ఉన్నాయి. అయినా అలాగే సర్దుకుంటాము గాని ఇల్లు ఖాళీ చేయం మేము మిమ్మల్నందరినీ వదలలేక పోవడమే దానికి కారణం!అయితే ఇంత చేసిన నరసింహారావుగారు వారి భార్య ఈ కాంపౌండులో నే కొంచెం సర్దుబాట్లు చేసి ఒకే చోట

## "అలివేలు గారి మొగుడు"

ఉండేలా కనీసం మూడు గదులు ఇస్తే కృతజ్ఞులం!"

అలివేలుగారు నవ్వి ఊరుకున్నారు. నరసింహారావుగారు మాత్రం లేచి "ఎవ్వరూ పట్టించుకోకపోతే మా అలివేలుకి నేను దొరికినట్లు ఎందుకూ పనికిరాని సంబంధం వస్తుంది. లేదూ అసలే పెళ్ళే కాదు. అందువల్ల, కనీసం లలితగారికయినా ఆ బాధ తప్పించేందుకు నేను వీరిద్దరినీ ఒకటి చేసేందుకు ఆధ్వర్యం వహించాను తప్పకుండా మన కాంపౌండులో వాళ్ళకి ఏర్పాటుచేద్దాం వాళ్ళు బయటికి వెళ్ళిపోవడం మనకిష్టం ఉండదు అలాగని వాళ్ళు ఇబ్బంది పడడమూ ఇష్టం ఉండదు తప్పకుండా వసతి కలిగిద్దాం" అన్నాడు

షష్టుగా భోంచేసి ఇళ్ళకు చేరాము

మర్నాడు సాయంత్రానికి తెలిసింది 'సుధాకర్‌ని, లలితని ఇల్లు ఖాళీ చేసి పొమ్మంది అలివేలుగారు" అని!

ఆశ్చర్యపోయాను

"ఏమిటి వింత?" అని అడిగాను సుధాకర్ రోడ్డు మీద కనపడితే

"ఎవ్వరితోనూ అనకండి అలివేలుగారు తనకి పెళ్ళి కాని క్రితం నాకు కబురు చేసింది తనని చేసుకుంటానేమో కనుక్కోమని! అప్పటికి నాకసలు పెళ్ళి మీదికి ధ్యాస మళ్ళలేదు అందువల్ల అసలు చేసుకోరుట అని కబురు చేశాను

అయితే ఆనాడు మొదలు పెళ్ళి పట్ల నాకు ఆలోచనలు కలగసాగాయి "చేసుకోవడం అవసరమే" అని నేను నిర్ణయించుకొనేసరికి ఆవిడకి పెళ్ళయిపోయింది తరువాత నరసింహారావుగారు "లలిత మంచి పిల్ల' వగయిరాలు చెప్పాడు నేను వెంటనే సరేనన్నాను ఆవిడ గతం నా కనవసరం మంచిగా ఉంటుంది. అది చాలు అనే తిరపతి తీసుకువెళ్ళి పెళ్ళి చేసి తీసుకువచ్చాడు - అదంతా తెలుసుగా!"

"నిజమే అలివేలుగారు అన్నివిధాలా లలితగారికన్న ఎక్కువ అర్హతలు గల మనిషి. ఇల్లు, మంచి ఉద్యోగం, అందం ఆమెను కాదని మీరు లలితను చేసుకున్నందుకు అహం దెబ్బతిని ఉంటుంది - నాచురల్!" అన్నాను నేను

వాళ్ళు ఖాళీ చేసి పోతుంటే అలివేలుగారి మొగుడు వచ్చి తన బాధ వెళ్ళబోసుకున్నాడు "నా మీద కోప్పడుతుంది మా అలివేలు - అడ్డమయిన పనులూ మీకెందుకు? లేచొచ్చిన వాళ్ళకి పెళ్ళిళ్ళు చేసేందుకు మీరేమయినా రిజిస్ట్రారా? అంటుంది ఇదెక్కడి పాపం అండి" అంటూ -

నేను జాలిపడి ఊరుకున్నాను.

"అలివేలుగారి మొగుడు" అన్న బిరుదు తనెటూ పోగొట్టుకోలేదు "నరసింహారావుగారు' అని పిలిచిన ఏకైక వ్యక్తికి కనీసం ఇల్లు ఇప్పించలేక పోయాడు □

# మీ రూపాయి తగిన విలువ మీకు ఇస్తుందా ?

ఇంటిఖర్చులు

విద్యాభ్యాసం

పండుగలు

పన్నులు

భీమా

పోష కరం

విస్తరణ

వైశ్యాబ్యాంకు రూపొందించిన పొదుపు పథకాలు, మీరు అనుకున్నవీ - అనుకోనివి - అన్ని ఖర్చులకూ అనువైనవి. త్వరితమైన లాభాలకూ లేదా పటిష్టమైన పెరుగుదలకూ మలచబడిన, ఈ పొదుపు పథకాల్లో, మీరు ఒకేసారి కాకుంటే తరచూ, పొదుపు చెయ్యవచ్చు.

ఈ పథకాలు మీ రూపాయికి అదనపు విలువను చేకూరుస్తాయి.

మీరు సామాన్య ఉద్యోగో లేక ఉన్నతాధికారో, స్వయం ఉపాధిలో లేక గృహిణో, మీ డబ్బుకు మంచి విలువనిచ్చే పథకాలు మావద్ద ఉన్నాయి.






ప్రైవేటు రంగంలో ప్రముఖ బ్యాంకు.

**ఏప్రిల్ 1986 - మా పొదుపు అభివృద్ధి మాసం. మీరు కొత్తబాటలో పొదుపు చెయ్యడానికి సరియైన సమయం.**

రండి ! మా బ్యాంకులో ఖాతా తెరిచి, ఒక బహుమతిని పొందండి.



**ది వైశ్యా బ్యాంక్ లిమిటెడ్**

రిజిష్టర్డ్ ఆఫీసు అవెన్యూ రోడ్, బెంగుళూరు - 560 002
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు సెయింట్ మార్క్స్ రోడ్, బెంగుళూరు - 560 001
చైర్మన్ . రమేశ్‌గల్లి

# సినిమా విశేషాలు

— జి.వి.జి.

## చిరంజీవి, కె. రాఘవేంద్రరావులతో డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ భారీ చిత్రం

"రాఘవేంద్రరావుగారి యూనిట్‌తో నిర్మాతకు ఎంతో హాయి. ఏ మాత్రం టెన్షన్ లేకుండా పనులు చకచకా సాగిపోతాయి. రిజల్ట్సు అద్భుతంగా ఉంటాయి," అన్నారు డి. వి. ఎస్. రాజు ఈయన తాజా చిత్రం మొదటి షెడ్యూల్ మార్చి 22 నుంచి 30 వరకు జరిగింది. ఏప్రిల్ నుంచి జూన్ వరకు 21వ తేదీ నుంచి ప్రతి నెలాఖరు వరకు జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తయిపోతుంది. చిరంజీవి, విజయశాంతి, సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, పి. ఎల్. నారాయణ, మాడా, రాజ్యలక్ష్మి, అన్నపూర్ణ, శ్రీలక్ష్మి, వై. విజయ పాత్రధారులు. పరుచూరి సోదరుల రచన, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, సలీమ్ నృత్యాలు, విజయన్ సాహసాలు, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు తెర వెనుక హంగులు. "వృత్తి ధర్మాన్ని పాటించడంలో తనకు తానే సాటి అనిపించుకునే కస్టమ్స్ ఆఫీసర్ పాత్రను తొలిసారిగా చిరంజీవి నిర్వహిస్తున్నారు." అని తెలిపారు డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు. ఇది నవరసభరితమైన భారీ చిత్రం.

## ఏప్రిల్‌లో "పవిత్ర"

"మన పవిత్రమైన సాంప్రదాయాలకు ఆచారాలకు, కట్టుబడి ఉంది, మమతానురాగాలు మూర్తీభవించిన త్యాగశీలి పవిత్ర పాత్రలో భానుప్రియ, అవిటి భర్తగా చంద్రమోహన్, ప్రేమికుడుగా రాజేంద్రప్రసాద్ పోటీలు పడి నటించారు. తిరుపతికి సమీపంలోని తొండవాడ గ్రామ పరిసరాలలో నిరవధికంగా షూటింగ్‌ను జరిపి, పూర్తి చేశాం. డైరెక్టర్‌గా ఈ తొలి చిత్రంతోనే వినయ్‌కు చాలా మంచి పేరొస్తుంది", అన్నారు కె. ఎల్. ఎన్. శాస్త్రి. ఈయన సహ నిర్మాతగా వి. ఆర్. మోహన్, కె. కె. విశ్వనాథం నిర్మించిన విజయలక్ష్మి ఆర్ట్ క్రియేషన్స్ "పవిత్ర" చిత్రంలో సత్యనారాయణ, గొల్లపూడి, నూతన్‌ప్రసాద్, రాళ్ళపల్లి, వేలు, అన్నపూర్ణ, కె. విజయ, వై. విజయ, జయ విజయ నటించారు. కళ్లైమణి కథకు సత్యానంద్ సంభాషణలకర్త. సీతారామశాస్త్రి గీతాలను కృష్ణ చక్ర స్వరపరచారు. శరత్ ఛాయ, కె. వి. నర్సయ్య ప్రొడక్షన్, సాయికుమార్ శిల్పం, సత్యం నిర్వహణతో ఈ చిత్రాన్ని సమర్పించే మహేశ్వరి మూవీస్ అధినేత ఎస్. పి. వెంకన్నబాబు "ఏప్రిల్ రెండవ వారంలో విడుదలకు సన్నాహాలు చేస్తున్నాం," అన్నారు.

"దేశోద్ధారకుడు రావాలి"లో విజయశాంతి, బాలకృష్ణ

(ఫోటో : కె. అహో బలరావు)



# చరిత్ర ప్రసిద్ధి పొందిన పాత్రలలో కృష్ణంరాజు

కృష్ణంరాజు "తాండ్రపాపారాయుడు" మేకప్‌లో ఉన్నారు. నన్ను చూసి, "రండి.... కూర్చోండి," అన్నారు సాదరంగా, కాస్త గంభీరంగానే. అప్పటికే ఆయన ఆ పాత్రలోకి ప్రవేశించారు.

హీరోలు రెండు వర్గాలు... పండితుల అక్షేపణలు, పామరుల ప్రశంసలు పొందే వారు ఒక వర్గం. సామాన్యుల చూపులకు అందకుండా మేధావుల మెప్పులు పొందేవారు మరో వర్గం.

ఈ ఇరు వర్గాలకు చెందిన హీరోలలో కృష్ణంరాజు ఒకరు.

ఈయన సుదీర్ఘ సంఘర్షణాభరిత చలన చిత్ర జైత్రయాత్రలో ఈయన మహోన్నతమైన శిఖరాలను అధిరోహించడానికి కారణం ఈయన ప్రతిభే కాదు, కృషి, దీక్ష పట్టుదల వున్న విషయం సర్వ విదితమే.

చాలా మంది దర్శక నిర్మాతలు ప్రత్యక్షంగా ఒక నటునిలో తాము చూడగలిగే శక్తులనే విశ్వసిస్తారు గాని, వారిలో గుప్తంగా ఉన్న శక్తులను అంచనా కట్టగల వారు బహు అరుదు. అటువంటి దర్శక నిర్మాతలు దొరికే వరకు అర్టిస్టులకు తగిన మంచి అవకాశాలు రావు. ఆ అవకాశాలు కృష్ణంరాజుకు ఆలస్యంగా లభించాయి.

"భక్త కన్నప్ప" నుంచి "బొబ్బిలి బ్రహ్మన్న" వరకు ఆయన భవిష్యత్తుకు బంగారు బాటలు వేసిన పాత్రలు ఎన్నో ఉన్నాయి. "మన ఊరి పాండవులు, కటకటాల రుద్రయ్య, రంగూన్ రౌడీ; త్రిశూలం." ఇలా ఎన్నో చిత్రాలలో ఆయన ధరించిన పాత్రలు దేనికవే విలక్షణమైనవి.

ప్రతి పాత్రనూ ఆయన తనకొక పరీక్షగా భావించి, వాటికి ప్రాణ ప్రతిష్ఠ చేసి, తన నటనా జీవితంలో



విజయోత్సవాలను చవి చూశారు.

తను ధరించబోయే ప్రతి పాత్ర గురించీ ముందే మనసులో క్షుణ్ణంగా రూపకల్పన చేసుకుంటారాయన. అలాంటి పాత్రలు – వైవిధ్యం గలవి ఒకే రోజు మూడు చిత్రాలకు మూడు సెట్సులలో నటించవలసి వచ్చినా – ఏ పాత్రకు ఆ పాత్ర మరొక దానితో ఢీకొని రసాభాస అవకుండా పోషించగల నేర్పరితనం ఆయనకుంది.

పాత్రల ఊహారూప కల్పనలలో మునిగి తేలుతూన్న సమయాన సైతం – ఒక్కోసారి అంతరాంతరాలలో విద్యుద్వేగంతో ఆలోచనా పరంపరలు తీవ్రంగా పరిభ్రమిస్తూన్నా – పైకి నిబ్బరంగా, సుబ్బరంగా, నిండుగా, నెమ్మదిగా, ప్రశాంతంగా, ప్రసన్నంగా ఉండగలరాయన

"మీరీటీవల ఎక్కువగా చరిత్ర ప్రసిద్ధి పొందిన పాత్రలలోనే నటిస్తున్నట్లున్నారు?" అని అడిగాను

అప్పటికాయన మేకప్ పూర్తయింది ఆయన మందహాసంతో, "ఇది పూర్వజన్మ సుకృతమే ననుకోవాలి. నటన నా జీవిత ధ్యేయం. ఇది నాకు భగవత్ప్రసాదితమైన పవిత్రమైన వరం. అందుకే చరిత్ర ప్రసిద్ధి పొందిన పాత్రలలో ఉదాత్తమమైన వాటినే, నటనను ప్రదర్శించడానికి పుష్కలంగా అవకాశం కల్పించే విభిన్నమైన పాత్రలనే, నేను పరిపూర్ణమైన న్యాయం చేకూర్చగలననే విశ్వాసం ఉన్న పాత్రలనే అంగీకరిస్తున్నాను," అన్నారు.

ఇదివరకాయన ఒక గొప్ప పాత్రను అంగీకరించని విషయం బహు కొద్ది మందికే తెలుసు. అది "శంకరాభరణం" చిత్రంలోని శంకరశాస్త్రి పాత్ర. ఆ పాత్రను మొదట ఆయనకు ఇవ్వాలనుకున్నారు ఇది వరకు ఏ ఇమేజ్ లేని నటుడు ధరిస్తే గాని రాణించని మహోత్కృష్టమైన పాత్ర అది గనుక, తాను సరిపోనని నిక్కచ్చిగా చెప్పేశారు కృష్ణంరాజు ఆ తర్వాత "శంకరాభరణం" చిత్రం విడుదలయ్యాక

డైరెక్టర్ కె. విశ్వనాధ్‌తో ఆ విషయమే ప్రస్తావిస్తే కృష్ణంరాజు "అంత గొప్పపాత్రను నాకిచ్చి పాడు చేయాలనుకున్నారా?" అన్నారు మందహాసంతో.

ఇది కృష్ణంరాజు గొప్ప వ్యక్తిత్వానికి ఓ మచ్చుతునక.

ఇంతలో కాస్ట్యూమ్స్ ధరించడంలో నిమగ్నులయ్యారాయన.

ప్రతి నటుడూ తాను ధరించే పాత్రలకు ఒక్కో రకమైన వ్యక్తిత్వాన్ని చేకూర్చుతాడు. ఈ వ్యక్తిత్వాన్ని ఆ నటుడు తన నటనా ప్రభావం చేత సృష్టించాడా, లేక ఆయనకది సహజసిద్ధమైన దేనా – అన్న మీమాంస ఏ ప్రేక్షకుడ్నీ బాధించదు. ప్రేక్షకుడు పాత్రలో చూసే వ్యక్తిత్వం వాస్తవంగా తో చాలి.

ప్రసిద్ధ హాలివుడ్ చిత్ర నిర్మాత ఫ్రాంక్ కాప్రా ఉద్దేశ్యంలో – నటన ద్వారా తెచ్చే వ్యక్తిత్వం కన్నా – తారలలో సహజంగా ఉండే వ్యక్తిత్వమే చలన చిత్రాలకు అధికంగా ఉపయోగిస్తుంది.

అలాగే కృష్ణంరాజు తాను నటించే పాత్రలలో అధికంగా తన వ్యక్తిత్వాన్నే ప్రతిబింబింప చేస్తారు.

ధీర గంభీరుడూ, అరి వీర భయంకరుడూ, యోధానయోధుడు లాంటి రాజసం తొణికిసలాడే పాత్రలలో ప్రేక్షకులను ఉత్తేజితులను చేయగల విలక్షణమైన పాత్ర ఏదైనా ఉంటే, దానికి కృష్ణంరాజే తగిన నటుడని దర్శక నిర్మాతలు ఊహించే స్థాయికి కృష్ణంరాజు ఏనాడో ఎదిగారు.

పైగా, కృష్ణంరాజు పెద తండ్రి, మావయ్యగార్లు బ్రిటిష్ వారి మర తుపాకులకు ఎదురు నిలిచారు. అంచేత, బాల్యంలోనే స్వాతంత్ర్య పోరాటాన్ని కనులార తిలకించిన కృష్ణంరాజు అప్పట్నుంచే స్వాతంత్ర్యోత్సాహాన్ని తనలో నిలుపుకున్నారని ఆయన పోషించిన "సర్దార్ ధర్మన్న" లాంటి పాత్రల ద్వారా ప్రస్ఫుటమయ్యాయి.

అలా ఆయన కీర్తి కిరీటానికి కాబోయే మరో కలికి తురాయి "తాండ్ర పాపారాయుడు".



ఇంకా "విశ్వనాధ నాయకుడు"లో శ్రీకృష్ణదేవరాయలు, "గోన గన్నారెడ్డి, రుద్రభూపతి, బ్రహ్మనాయుడు, విశాల నేత్రాలు, వీరార్జున" వగైరా చిత్రాల్లో విభిన్నమైన పాత్రలకు ప్రాణ ప్రతిష్ఠ చేసి బహుముఖ ప్రశంసలందుకోనున్నారు కృష్ణంరాజు.

గంభీరమైన పాత్రలలో చూసిన కృష్ణంరాజును నిజజీవితంలో చూస్తే, ఆయన నిరాడంబరత్వానికి ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది. కీర్తి ప్రతిష్ఠలు, సిరిసందలు ఆయనలో ఏ అతిశయమూ కల్గించక పోవడం విచిత్రమే మరి.

ఎంత నిగర్వి అంటే, తానొక ప్రముఖ సినిమా హీరో అని జ్ఞాపకం చేసే వారిని ఆయన భరించలేరు, ఆయన కారును బట్టి తప్పితే – ఆ ఛాయల్లో ఆయన ఉన్నారని ఎవ్వరూ తల పోయకుండా తన పనిని తాను నెరవేర్చుకుపోయే తత్త్వం ఆయనిది. ప్రేక్షకుల హృదయాలలో, సినీ పారిశ్రామికుల దృష్టిలో తన స్థానం ఎంతటి మహోన్నతమైనదో తెలియనట్లే ఉండే నిగర్వి ఆయన.

ఎప్పుడూ పరిసరాలు కళకళలాడతూంటే ఆయనకదే బ్రహ్మానందం.

"నా చుట్టూ కనుచూపు మేర దూరంలో అందరూ హాయిగా ఉండేలా చూడాలని నా కోర్కె!" అంటూంటారు కృష్ణంరాజు. ఈయనకు రాజకీయాలలో ప్రవేశించాలనే ఆసక్తి లేదు.

"ప్రజాసేవ చేయాలంటే రాజకీయాలలోకే ప్రవేశించనక్కర్లేదు. కొన్ని పరిశ్రమలు నెలకొల్పితే, ఎందరికో జీవనోపాధి కల్పించినట్లవుతుంది కదా?" అంటారాయన.

ఈయనకు నాగార్జున గ్రూప్ ఆఫ్ కంపెనీస్‌తో సంబంధముంది.

కృష్ణంరాజు ఉదార స్వభావం గురించి చాలా మందికి తెలుసు.

"మీ దర్శకత్వంలో తయారయ్యే చిత్రాన్ని చూడాలని మీ అభిమానులకు ఉంటుంది కదా?" అన్న ప్రశ్నకు –

"గర్వించదగ్గ ప్రతిభావంతులైన డైరెక్టర్లు మనకెందరో ఉండడం మన అదృష్టం. వాళ్ళ చిత్రాల్లో నటిస్తుంటే చాలదా! పైగా, దర్శకత్వమనేది ఫుల్‌టైమ్ జాబ్. ఒక వంక నటిస్తూ, మరో వంక దర్శకత్వం వహించడమంటే – రెండిటి పైనా ఎంతగా దృష్టిని లగ్నం చేసినా – ఏదో ఒక దానికే పరిపూర్ణమైన న్యాయం చేయడానికి వీలవుతుందని నా అభిప్రాయం. నేను పిక్చర్లు బాగా తగ్గించుకుంటే, సంవత్సరానికి ఒక్క పిక్చర్‌ను నా తృప్తి మేరకు డైరెక్ట్ చేయడానికి వీలవుతుందేమో!" అంటున్నప్పుడు కృష్ణంరాజు కాస్ట్యూమ్స్ ధరించడం పూర్తయింది.

తాండ్ర పాపారాయుడుగా కెమెరా ముందుకు నడిచారాయన.

–(జి. వి. జి.)

విజయశాంతి, అరుణ, "అరుణ కిరణం"లో



"మానవుడు – దానవుడు"లో రజని, నళిని





# ఒకే ఈగిల్ జగ్‌తో మీకు ఇవన్నీ...



నిద్ర నుండి లేవగానే పళ్లరసం.



పని మధ్యలో లస్సీ.



4 గంటలకు టీ, కాఫీ.



కోరినప్పుడు వేడి-వేడి సూప్



కోకోతో సుఖ నిద్రకు ఉపక్రమం.



తెల-తెలవారుతూనే టీ, కాఫీ కావాలంటే రాత్రి మీ ఈగిల్‌లో నిండుగా నింపి పెడితే సరి.



ఈగిల్ శ్రేణిలో నుండి మీకు కావాల్సింది తీసుకోండి.... ఇవే కావు మరెన్నో చేయవచ్చు.

## ఈగిల్‌తో ఉపయోగాలు మీకు ఎన్నెన్నో

CLARION-B/E-18/244



**ఈగిల్ ఫ్లాస్క్ ప్రై. లి.**
ఈగిల్ ఎస్టేట్, తలేగావ్ 410 507 (జిల్లా: పుణె), మహారాష్ట్ర
బొంబాయి 322096/97 • ఢిల్లీ 3315066 • కలకత్తా 267350 • బెంగళూర్ 223299 • మద్రాసు 24270 • హైదరాబాద్ 65356 • అహమ్మదాబాద్ 399028 • రాంచి 22446 • ఇండోర్ 64356 • చండీఘర్ • కాన్పూర్.

ఉష్ణోగ్రత మారకుండా నిలిచి వుండాలంటే నిండుగా నింపండి.



# ఆ ఉగాది

-రాధిక

నేను పుట్టింది మద్రాసులో గుడ్ షప్పర్డ్ కాన్వెంట్‌లో చదువుకున్నాను

అప్పుడంతా తమిళ (సౌర) సంవత్సరాది జరుపుకునేవాళ్ళం

మా మేనమామ కొర్కె మీద వాళ్ళ కుటుంబంతో పాటు నేను కొంత కాలం పాటు లండన్‌లో ఉన్నాను. అక్కడ 'హోటల్ మేనేజ్‌మెంట్ కోర్స్'ను ఏడాది పాటు స్టడీ చేశాను అక్కడున్నంత కాలం అక్కడి ఆచారం ప్రకారం జనవరి 1వ తేదిన 'న్యూ ఇయర్స్ డే' జరుపుకునే వాళ్ళం

ఆ తర్వాత మళ్ళీ మద్రాసుకు వచ్చేశాను

అనుకోకుండా "కిళక్కే పోగుం రైల్" (తూర్పు వెళ్ళే రైలు) తమిళ చిత్రంలో నటించడం జరిగింది అసలు నేను సినిమా నటి అవుతానని కలలోనైనా అనుకోలేదు అప్పుడు మా ఇంట్లో ఓ వాటాలో అప్పటి నర్తకిమణి జయకుమారి అద్దెకు ఉండేవారు భారతీరాజాగారు డైరెక్ట్ చేసే ఆ తమిళ చిత్రంలో నాయికగా కొత్త నటిని పరిచయం చేయాలనుకుంటున్నారని, ప్రయత్నిస్తే ఆ అవకాశం నాకు లభించవచ్చని జయకుమారి, మా మమ్మీతో చెప్తే, నాకు తెలియకుండానే నా ఫోటో లను మమ్మీ ఆ చిత్ర నిర్మాత రాజాకణ్ణు గారికి పంపించింది. ఆ సాయంత్రమే వాళ్ళ దగ్గర్నుంచి కబురొస్తే, మమ్మీ నన్ను తీసుకెళ్ళింది వెంటనే నన్ను బుక్ చేసుకున్నారు మొదటి రోజు షూటింగ్‌లో పాల్గొన్న తర్వాత నేను మా నాన్నగారి దగ్గరికి వెళ్ళి, ఆయన ఆశీర్వాదం పొందాను. ఆయన ఎంతగా సంతోషించారో!

మా నాన్నగారు ప్రముఖ నటులు కీ శే. ఎం. ఆర్ రాధాగారు చక్కగా తెలుగు మాట్లాడగలరు. అసలు మేం తమిళనాడులో స్థిరపడిన తెలుగువారమే

"న్యాయం కావాలి" నా తొలి తెలుగు చిత్రం. అప్పట్నుంచీ తెలుగు ఉగాది పండుగ జరుపుకోడం కూడా మామూలైపోయింది

ఒక ఉగాది నాడు మా ఇంట్లో వారంతా నన్ను చూసి గాభరా పడిపోయారు.

ఆ రోజు ఒక బరువైన సన్నివేశంలో పాల్గొన్న నేను బాగా అలసిపోయి, ఇంటికి చేరుకున్నాను. నన్ను చూడగానే మమ్మీ "ఏమైందమ్మా! పండుగ పూట ఆ కట్లేమిటి?" అని హడలిపోయింది

ఆ రోజు షూటింగ్‌లో నేను గాయపడినట్లు కట్టు కట్టుకుని నటించాను ఆ కట్టుకు అక్కడక్కడ రక్తం మరకల్లా ఎర్రరంగు . షూటింగ్ ముగిశాక ఆ కట్లు విప్పకుండానే ఎకాయెకిన ఇంటికి వచ్చేశాను ఆ స్థితిలో నన్ను చూసి మమ్మీతో పాటు నా చెల్లాయి, తమ్ముళ్ళు అందరూ భయపడి పోయారు

ఉగాది పండుగ వచ్చినప్పుడల్లా నాకి విషయం గుర్తొచ్చి, నవ్వుకుంటూంటాను

అందరికీ నా ఉగాది శుభాకాంక్షలు

(సేకరణ :జి. ఎ. జి.)

ఆంధ్రసచిత్రవారపత్రిక

# 1985 సినిమా బాలట్ ఫలితాలు


ఉత్తమ నటుడు
శోభన్‌బాబు


ఉత్తమ నటి
విజయశాంతి


ఉత్తమ దర్శకుడు
టి. కృష్ణ


ఉత్తమ సంగీత దర్శకుడు
చక్రవర్తి


ఉత్తమ సహాయ నటుడు
చంద్రమోహన్


ఉత్తమ సహాయ నటి
శారద


ఉత్తమ హాస్యనటుడు
సుత్తివేలు


ఉత్తమ హాస్యనటి
శ్రీలక్ష్మి

ఉత్తమ చిత్రం

ప్రతిఘటన

## బాలట్ విజేత లందరికీ మా అక్షయ ఉగాది శుభాకాంక్షలు!

# పట్టు వస్త్రాలలో కమనీయ కవిత-
# మరపురాని అసంపూర్ణ కావ్యచరిత





అనాదిగా కళాసృష్టికర్త పుట్టుకతో పుణికి పుచ్చుకున్న కోరికలు, కళాపిపాస, భావ ప్రకటన, ఆత్మ విశ్వాసము, నందుదనము, లక్ష్యాలు, సౌందర్యా విష్కరణకు దోహదం చేస్తున్నై.

మనోల్లా సకరమైన రంగులు, రూపాలు, శబ్ద స్పందనాలు సమ్మిళితం చేసి మానవ జీవిత పరిమళాలను ఉత్తేజితం చేసే కళా సృష్టి కనిపిస్తుంది.

స్వచ్ఛము, సున్నితమూ, సుందరము అయిన సహజ పట్టుదారాల కలయికతో సజీవ సౌందర్యాతిశయంతో కల నిజం చేస్తుంది పోచంపల్లిచీర.



## అమెరికాలో జంధ్యాల రూపొందించే "నటరత్న"లో బాలకృష్ణ, "పడమట సంధ్యారాగం"లో విజయశాంతి

"మిమిక్రీ కళ కొందరికే భగవంతుడిచ్చే వరం. బాలకృష్ణది ఓ మిమిక్రీ కళాకారుడుగా అమెరికా-భారత దేశాల మధ్య సాంస్కృతిక వారధిగా నిలిచే అపురూపమైన పాత్ర. బాలకృష్ణ కూడా ఈ పాత్రను పోషించడం తన అదృష్టంగా భావిస్తున్నారు. జూన్‌లో పదిహేను రోజులపాటు అమెరికాలో షూట్ చేసి, మిగతా భాగాన్ని మన దేశంలో పూర్తి చేస్తాం," అన్నారు జంధ్యాల. ఈయన రచన, దర్శకత్వంలో "రెండు రెళ్ళు ఆరు" అనంతరం ప్రముఖ పంపిణీదారులు సుబ్బారావు నిర్మించే విజయా సినీ క్రియేషన్స్ "నటరత్న" చిత్రంలో శరత్‌బాబు, వేలు, శ్రీలక్ష్మి, ఆదిగాగల వారు పాల్గొంటారు. భమిడిపాటి రాధాకృష్ణ కథ, రమేష్ నాయుడు సంగీతం, ఎస్. గోపాలరెడ్డి ఛాయ, గౌతంరాజు కూర్పు తెర వెనుక హంగులు.

వృత్తి రీత్యా అమెరికాలో స్థిరపడ్డ తెలుగువారైన గుమ్మలూరి శాస్త్రి, మీర్ అబ్దుల్లా తెలుగు భాషాకోవిదులు, చక్కని నటులు కూడా. వీరు అమెరికాలో ప్రదర్శించిన "భువన విజయం" నాటకం బహుముఖ ప్రశంసలందుకుంది. వీరు ప్రవాసాంధ్ర చిత్ర బానర్‌లో, జంధ్యాల దర్శకత్వంలో "పడమట సంధ్యారాగం" చిత్రాన్ని అమెరికాలోని ప్రవాసాంధ్రుల ఖ్యాతిని ఇనుమడింపజేసే రీతిలో నిర్మించనున్నారు. జూలై 25న చిత్రీకరణ మొదలవుతుంది. విజయశాంతి నాయిక, ధర్మతేజ, శేషగిరిరావు, విజయ్, సుధ తక్కిన ముఖ్యపాత్రలను నిర్వహిస్తారు. ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సంగీతం, ఎస్. గోపాలరెడ్డి ఛాయ, గౌతంరాజు కూర్పు వగైరా సాంకేతిక వర్గం.




నేను ఒకళ్లని అనుసరించను. అందుచేత ఉగాదికి సంక్రాంతి ముగ్గు లేస్తాను - సంక్రాంతికి ఉగాది పచ్చడి తింటాను!

## పి. దేవరాజ్ దర్శకత్వంలో "శివుడే శంకరుడు"

"కొత్త థ్రిల్స్ కలిగించే ఆరు ఫైట్స్ ఉన్నా క్రయిమ్‌తో సెంటిమెంట్‌ను జతపరచి జనరంజకంగా రూపొందించాం. శివుడుగా, శంకరుడుగా రామకృష్ణహెగ్డే చాలా చక్కగా చేశాడు,' అన్నారు ప్రముఖ ఛాయాగ్రాహకుడు పి. దేవరాజ్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, ఛాయాగ్రహణంతో పాటు తొలిసారిగా దర్శకత్వం వహించిన బాబూ ఆర్ట్ క్రియేషన్స్ వారి పైసోషియో థ్రిల్లర్‌లో సరిత, తులసి, జగ్గయ్య, గుమ్మడి, వేలు, గొల్లపూడి మారుతీరావు, గిరిబాబు, ఉదయ్, హార్స్‌మన్‌బాబు, సి. హెచ్. కృష్ణమూర్తి, సుశీలాప్రసాద్, అరుణ్‌కుమార్, కె. కె. శర్మ, జ్యోతిలక్ష్మి, జయమాలిని, అనూరాధ పాల్గొన్నారు. కాశీ విశ్వనాథ్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, గాదిరాజు కేశవరావు సహ దర్శకత్వం, శివశంకర్ నృత్యాలతో మానస సమర్పణ.



"ఆలాపన"లో భానుప్రియ, మోహన్

## సినిమా

## వంశీ "ఆలాపన"లో భానుప్రియ, మోహన్

"కలిసే ప్రతి సంధ్యలో, కలిగే పులకింతలో, నాట్యాలన్నీ కరగాలి, నాలో నేనే మిగలాలి" అనే నర్తకి ఉష ఒక దుస్వప్నం నుంచి దూరంగా పారిపోతూ, అరకు లోయలో "ఆ కనులలో కలల నా చెలి, ఆలాపనకు అది మంత్రమ్మై, గొంతులోన గుండె పిలుపులా, సంధ్యలోన అందె మెరుపులా" అనే శివుడి మధురగానానికి ఆకర్షితురాలైంది. శివుడు వృత్తి రీత్యా రైల్వే ట్రాలీమన్, ప్రవృత్తి రీత్యా భావుకుడు. తన ఊహా సుందరి సాక్షాత్కరించిందని శివుడు తన్మయత్వం చెందాడు. కాని, అతని గాన మాధుర్యాన్నే ప్రేమించింది ఉష. ఆమె లక్ష్యం భారతీయ నృత్యాలను మేళవించి ఓ నృత్య రీతిని అభినయించాలని. ఆశయానికి, ఆరాధనకు మధ్య కొట్టుకులాడుతూ మానసిక సంఘర్షణకు గురైన ఆమెను బెనర్జీ అనే నరరూప రాక్షసుడి రాక మరింత క్రుంగదీసింది. ఆమె, శివుడు తన గమ్యాలను ఎలా చేరుకోగలరో రసిక హృదయాల సింహాసనమెక్కే రీతిలో చిత్రీకరించారు వంశీ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఈయన ఊహాలోంచి మెదిలిన ప్రతి ఫ్రేమ్‌కూ రసాస్వదం కల్గించారు ఛాయాగ్రాహకుడు ఎం. వి. రఘు. విన్నకొద్దీ వినాలనే వేటూరి, సి.నా.రె. గీతాలకు కలకండలు కరిగి కరిగి కాలువలై పారినట్లు సంగీతమిచ్చారు ఇళయరాజా. తనికెళ్ళ భరణి మాటలు, ఎస్. పి. ఆనంద్ నృత్యాలు, తోట యాదు శిల్పం, అనిల్ మల్నాడ్ కూర్పు, అల్లారెడ్డి జగన్మోహన్‌రెడ్డి నిర్వహణతో, కె. ఎల్. ఎన్. శాస్త్రి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్, జె. వి. సోమయాజులు, దేవదాస్ కనకాల, ప్రదీప్‌శక్తి, రాళ్ళపల్లి, హేమసుందర్, మల్లికార్జునరావు, శిలానంద్, కృష్ణమూర్తి, శ్రీగోపాల్, రాంబాబు, పద్మనాభశాస్త్రి, వై. విజయ, రూప, ఝాన్సీ, శైలజ వగైరా నటవర్గంతో హరిత చిత్ర మూవీస్ అధినేత పెళ్ళకూరు అమరేంద్రరెడ్డి నిర్మాత. □

# అభిమాన తారలపై అభిప్రాయం

నా అభిమాన నటుడు శోభన్‌బాబు ఎటువంటి పాత్రనైనా అవలీలగా చేయగలిగినా కుటుంబ గాథా చిత్రాలలో నటించడం ఆయనకి సాటి ఆయనే. "తాసిల్దారుగారమ్మాయి", "కోడళ్ళు వస్తున్నారు



జాగ్రత్త", "మానవుడు- దానవుడు" ఈ చిత్రాల పాత్రలలో ఆయన నటించారు అని అనటం కంటే జీవించారు అనడం సముచితం. సాంఘిక చిత్రాలలోనే కాక "వీరాభిమన్య" వంటి పౌరాణిక చిత్రాలలో నటించి తన సామర్ధ్యాన్ని చాటి చూపారు. ఆయన యొక్క అభిమానిగానే కాక ఆయనన్ని మా కుటుంబ సభ్యుడుగా భావిస్తూ ఇచ్చే సలహా దయచేసి హింసకు హింసే సమాధానం అనే "దానవుడు" చిత్రంలోని పాత్రలవంటి. పాత్రలు ధరించవద్దు.

-వి. రవికుమారి, హీరమండలం

★ ★ ★

చలన చిత్ర సీమలో ఎంతో మంది కొత్త నటీమణులు వస్తున్నారు . కాని సావిత్రి తరువాత అంతటి ఉన్నత, ఉదాత్తమైన నటన ఎవరూ ప్రదర్శించ లేకపోతున్నారే అనే బాధ, భావన నాకు కలుగుతోంది. సావిత్రి తరువాత అంతటి అభిమానం ఏ నటిమీద చూపించలేక పోతున్న నేను ప్రతిఘటన చిత్రం చూసిన తరువాత విజయశాంతి నా అభిమాన నటిగా మారిపోయింది. అఖిలాంధ్ర కోటి వేనోళ్ళ పొగడబడుతున్న ఝాన్సి పాత్ర ధారిణి విజయశాంతి నటన ఏ ఇతర నటీమణుల నటనకి అభిమానం సంపాదించుకోలేని నామనస్సు విజయశాంతి నటనకి లొంగి పోయిందంటే నాకే ఆశ్చర్యం వేస్తోంది. ప్రతిఘటన చిత్రం చూసిన



తరువాత నా అభిమాన నటీమణి నటించిన రెండు మూడు చిత్రాలు చూడటం తటస్థించింది. నా మనస్సులో ఆమె మీద పెంచుకున్న అభిమానానికి దెబ్బ తగిలినట్లనిపించింది ఆ సినిమాలు చూసిం. తరువాత అభిమానం దోచుకున్న నావంటి ఎంతో మంది ప్రేక్షకుల మనస్సులని బాధ పెట్టకుండా ముందు ముందు విజయశాంతి కథాబలం ఉన్న, ఉన్నత ప్రమాణములు గల చిత్రాలలోనే నటించాలనేదే నా కోరిక.

–మొవ్వ చండికా మహాలక్ష్మి,
విజయనగర్ కాలనీ, హైదరాబాదు

★ ★ ★

అంతకుముందు 4,5 చిత్రాలలో నటించినా "నేటి భారతం" చిత్రంతో నా అభిమాన నటుడయ్యాడు సుమన్. ఆ చిత్రంలో సుమన్ మీద ఏర్పడిన అభిప్రాయం ఆ తర్వాత కూడ ఆయన నటించిన చిత్రాల ద్వారా పెరుగుతూ వచ్చింది. బెదర్ యాక్షన్ అనిపించకుండా సహజంగా కనిపించే ఆయన నటన, సునిసిత మైన డైలాగ్ డెలివరీ అందుకు ఎంతగానో దోహదం చేసాయి. వర్తమాన నటుడుగా తెలుగు చిత్రసీమకు పరిచయమయిన సుమన్ అనతికాలంలోనే అగ్రనటీమణి జయసుధతో నటించడం ఒక విశేషంగా చెప్పుకోవచ్చు.

నేటి భారతం ,దేశంలో దొంగలు పడ్డారు, సితార,



అమెరికా అల్లుడు చిత్రాలు నాకు చాలా బాగా నచ్చిన చిత్రాలు. సుమన్ నటించే ప్రతి పాత్ర వెరైటీగా, ఉండాలని నా అభిప్రాయం. ఏ నటుడైనా విభిన్న పాత్రలు ధరిస్తేనే అతని నటనకు గుర్తింపు కలిగే అవకాశం వుంటుంది. ఎన్ని చిత్రాలు చేశాను అన్నది కాదు ముఖ్యం. ఎన్ని పాత్రలు కలకాలం ప్రేక్షకుల మనసుల్లో నిలిచేట్లుగా నటించాలి అన్నది ముఖ్య విషయం.

"న్యాయం మీరే చెప్పాలి" లో దగాపడ్డ చెల్లికి అన్నగా చాలా చక్కగా యాక్షన్ చేశాడు. పోతే "కంచు కవచం"లో ఏమాత్రం నటనకు, పాత్రకు ప్రాముఖ్యం లేదు. కుటుంబ కథా చిత్రాలకన్నా న్యాయం కోసం పోరాడే చిత్రాలలోను, దేశాన్ని, ప్రజలను రక్షించగల బాధ్యతకల పాత్రలలోను సుమన్ బాగా నటించి ఆ పాత్రలకు న్యాయం చేకూర్చగలడని నా అభిప్రాయం. దుష్టులకు దూరంగా వుంటూ మా అభిమానం మీరు చిరకాలం నిలుపుకునే చిత్రాల్లో నటించాలని అభిమానిగా నా కోరిక.

–శారదా జాహ్నవి, శ్రీకాళహస్తి

ఊర్వశి శారద నా అభిమాన నటి కళ గురించి ఆమె పుట్టిందో లేక ఆమె గురించి కళే పుట్టిందో తెలియదుగాని మొత్తానికి ఆమె ఎక్కడ ఉంటుందో కళ అక్కడే ఉంటుంది. ఈమధ్య విడుదలైన



సినిమాలలో స్వాతి, ఆడవిదొంగ, బొబ్బిలి బ్రహ్మన్న, ఇంకా ఎన్నో విజయవంతమైన చిత్రాలు ఆమెకి కీర్తి కిరీటాన్ని అందించేయి.

వచనంలో గంభీరత, చూపుల్లో సౌశీల్యత కలిగిన ఆమె నటన ప్రతి మానవాళికి ఒక విశేషత, ఆమె యొక్క తరగని చెరగని భూత వర్తమాన భవిష్యత్ కాలములలో క్రొంగ్రొత్త మలుపులతో తిరిగే ఆ నటన ఎప్పుడూ ప్రేక్షకుల హృదయాలలో పది కాలాలపాటు పదిలంగా నిలిచిపోవాలని ఆశిస్తున్నాను. ఆమెకి ఇవ్వవలసిన సూచన ఆమె ఎప్పుడూ కూడ రాజకీయాలలోకి వెళ్ళవద్దని.

ఆకెళ్ళ కామేశ్వరిదేవి, రామేశ్వరకాలనీ,
గరివిడి

★ ★ ★

నా అభిమాన నటుడు భానుచందర్‌గారు. వ్యక్తిగతంగా నేను భానుచందర్‌గారిని అన్నయ్యగా నా ప్రాణంకంటే ఎక్కువగా ఆరాధిస్తాను పూజిస్తాను. అవసరం వస్తే నా ప్రాణాలు కూడా సంతోషంగా ఇస్తాను. కాని వెనుకాడను. భానుచందర్‌గారు నటించిన చిత్రాలు ఇప్పటివరకు అన్నీ చూశాను. నవ్వితే చాలు ఆయన ముఖ కవళికలు చంద్రుడిలా వికసించుకుంటాయి. ఆ నవ్వే ప్రేక్షకులను మైమరపిస్తుంది. కోపంలో భానూగారి ముఖకవళికలు మండుతున్న సూర్యుడిలా గూండాలను హడలుగొట్టిస్తుంటాయి. భానుగారు ఇక ముందు మంచి హీరోయిన్లతో వస్తూ సైడ్ హీరో పాత్రలు తీసుకోవద్దని మనవి. భానూగారిని



డాక్టర్ పాత్రలో మరియు లాయర్ పాత్రలో చూడాలని ఆ పాత్రలు భానుగారికి బాగా నప్పుతాయని మా అభిప్రాయం.

-షీలా, బ్రాడీపేట, గుంటూరు □

# జీసస్, నన్ను క్షమించు

జ్యోతిర్మయి

వీధి తలుపు దగ్గరగా వేసి లోపలికి వచ్చి విడివిడిగా పారేసిన సామానంతా సర్దుతోంది మాలతి. 'తర్వాత వచ్చి తీరిగ్గా చూడగూడదూ. ఆ 5 నిమిషాలలోనే అన్నీ పీకేసి వెళ్ళిపోయారు. వచ్చాక మళ్ళీ ఎలాగూ బజారు పడతారు.' అనుకుంటూ.

'అవలా ఉంచేద్దూ. తొందరేముంది? నెమ్మదిగా పెట్టుకోవచ్చు.' అన్నారు లక్ష్మీకాంతంగారు.

'అలా పడి ఉంటే ఎలా మరి? కాస్త పక్కకి పెట్టి వెళ్ళి బియ్యం పడేస్తాను.'

'నా భోజనానికేం తొందర లేదు. ఇంకో కప్పు కాఫీ పెట్టు ఈలోపల. ఇంటి కాఫీ తాగి ఎన్నాళ్ళయిందో? చాలా బాగా కలిపావు ఇందాక.'



ఆ మాట వింటూనె నవ్వింది మాలతి.

'ఇంకో రెండు రోజాలుండండి. ఇదే కాఫీకి ఎన్ని వంకలో ఇలాగుందేమిటి అంటూ, ఇన్నాళ్ళయినా కాఫీ పెట్టడమే రాదు అంటారు పైగా. చాలా రోజాలయింది కాబట్టి బాగున్నట్టుంది. రేపట్నుంచీ మళ్ళీ మామూలే! సామాన్లన్నీ ఒక తీరుగా పెట్టి వంటింట్లోకి వెళ్ళి కాఫీ పెట్టుకొచ్చి కుర్చీలో కూర్చుంటూ,

'ఇప్పుడు తీరిగ్గా చెప్పండి. పిల్లలు బయటికి వెళ్ళే హడావిడి. ఒక్క మాట మాట్లాడనివ్వలేదు. అమ్మాయి బాగుందా?'

'బ్రహ్మాండంగా ఉంది. రెండు రోజాలు బలవంతంగా ఆపేశారు ఇద్దరూ. అతను సెలవు కూడా పెట్టుకున్నాడు నా కోసం. మంచివాడు.'

'అమ్మాయి కులాసాగా తిరుగుతోందా?'

'ఆఁ నీ గోల అర్థమయింది. తిన్నగా అడగకూడదు. ఏం హడావుడీ లేదు. ఎందుకింత తొందర. ఏడాది కూడా అవలేదు పెళ్ళయి. హాయిగా ఉండనీ, ఇంటి దగ్గరగా కాలేజీలో పార్ట్‌టైము ఏదో ఖాళీ ఉందట. చేస్తోంది.'

'అదేమిటి? పని మనుషులు సరిగ్గా దొరకరని అంత పనీ అదే చేసుకుంటోంది. మళ్ళీ ఇదొకటి. రేప్రొద్దున్న ఒంటికి ఏమన్నా వస్తే.'

'బాగుంది. వయసులో ఉన్నవాళ్ళు పని చేసుకోరూ. ఇక్కడ ఉద్యోగం వదిలేసింది. చదువు వృధా అయిపోతోందని నువ్వే బాధ పడ్డావు. చాలా సులభంగా చేసుకుంటుంది. చూశాను గదా. అతను పొద్దునే లేచి పోతాడు. అందుకని ఇదీ లేచి, తెల్లారేసరికి పనులన్నీ పూర్తి చేసుకుంటుంది. ఉదయం అతను ఎలాగూ అన్నం తినడు. రొట్టెలు, కూర చేస్తుంది. దానికీ అదే అలవాటయిపోయిందట. రాత్రి తొందరగా భోజనం చేస్తారు. అది బాగానే ఉంది. నువ్వు వూర్కినే గాభరా పడకు.'

'ఆ రొట్టెలు తిని రోజంతా ఎలా ఉంటుందోండీ? నీరసం రాదూ?'

'నయం. రోగం రాదన్నావు కాదు. అక్కడి వాళ్ళు అందరూ బతకడం లేదూ? అయినా 'ఆ వాతావరణానికి రొట్టెలే బాగుంటాయి. అన్నం ఇట్టే అరిగిపోయి వెంటనే మళ్ళీ ఆకలేస్తుంది.'

'సరేలెండి. మీరు అన్నిటికీ ఇలాగే సమర్థిస్తారు. మీరు తెచ్చిన చీరలు నచ్చాయా?'

'ఆఁ అమ్మకి చూపించండి ముందు, ఈ సారి వచ్చినపుడు తీసుకుంటాను అంది. ఫర్వాలేదు నీకు నచ్చినవి తీసుకోమన్నాను. అతను ఆ వాచీ తీసుకోడానికి చాలా మొహమాట పడ్డాడు నాకేమిటి అంటూ. బలవంతంగా ఇచ్చాను. నవంబరులో గేమ్స్ ఉన్నాయి గదా. చూడ్డానికి రమ్మని ఒకటే గోల ఇద్దరూ. కుదరదన్నాను. మోహన్‌ని పంపించమని చెప్పారు.'

'అక్కడికి వెళ్ళి ఆ జనంలో, గోలలో చూసేదేమిటి?టి. వి. లో చూపిస్తారట కదా. ఇంట్లో కూర్చుని హాయిగా చూడచ్చు.'

'అదీ నిజమే. కానీ అక్కడికి వెళ్ళి ప్రత్యక్షంగా చూడ్డంవేరు.'

'సరేలెండి. ఇంతకీ మీ ప్రయాణం ఎలా అయింది? తిండి అదీ సరిగ్గా తిన్నారా? మనిషి కొంచెం చిక్కినట్లున్నారు'.

'ఏమీ తగ్గలేదు. వూర్కినే అంటున్నావు. శుభ్రంగా ఉన్నాను. మా కంపెనీవాళ్ళు అక్కడ మంచి ఏర్పాట్లే చేశారు. మధ్యలో నాలుగు రోజాలు మన కమలాకరం ఇంట్లో ఉన్నాను.'

'ఎలా ఉన్నాడు? వాళ్ళ నాన్న మాత్రం చదువు అవగానే అక్కడికి పోయి మా విషయం పట్టించుకోడం మానేశాడు అని గోల.'

'అదంతే ఇంక. ఏమీ వచ్చే సూచనలు కనిపించలేదు. వాళ్ళింక వాడు సాయం చేస్తాడేమో అన్న ఆశ వదులుకుంటే మంచిది.'

'ఏమో అతను మళ్ళీ వస్తారు. మీరేం కబురు తెస్తారో అని.'

'అదే చెప్తాను. ఈ రోజుల్లో కొడుకుల మీద ఆశలు పెట్టుకుని నిరాశ చెందే బదులు ముందరే మానుకోడం మంచిది.'

'మీరు స్నానానికి వెళ్తారా? నేను పని చూసుకుంటాను.'

లక్ష్మీకాంతంగారు కంపెనీ పనిమీద మూడు నెలల కోసం ఇంగ్లాండు వెళ్ళి వచ్చారు. కమలాకరం ఆయన మేనత్త మనవడు. చదువు అయి, ఫారిన్ వెళ్ళిపోయి మళ్ళీ ఇటు చూడటం మానేశాడు. అతని తండ్రి వస్తే ఏం సమాధానం చెప్పాలా అని ఆలోచిస్తున్నారు. గబుక్కున ఏదో గుర్తు వచ్చినట్టు మాలతి వెనకాతలే వంటింట్లోకి వచ్చి,

'అన్నట్టు నీకో విషయం చెప్పడం మర్చిపోయాను. అక్కడ నా పని అంతా అయిపోయాక మా కంపెనీ అతను సైట్ సీయింగ్ చెయ్యకుండా ఎలా వెడతారు అంటూ గోల పెట్టాడు. లండనంతా అప్పటికే తిరిగి చూశాను. చిన్నప్పట్నుంచీ చదువుతాము కదా హిస్టరీలో అక్కడంతా తిరుగుతుంటే ఎప్పుడో అవన్నీ చూసినట్లే అనిపిస్తుంది. ఎప్పుడో వదలిపోయిన ఊరికి మళ్ళీ వచ్చినట్లనిపిస్తుంది. మనుష్యులు తెల్లగా ఉంటారే తప్ప, బొంబాయిలో, కలకత్తాలో ఉన్నట్లే ఉంటుంది. మనవాళ్ళు ఎక్కడ పడితే అక్కడే కనిపిస్తారు. అంతా కొత్త అనిపించదు.'

బియ్యం కుక్కర్‌లో పెడుతూ, 'ఇంతకీ చెప్పవలసిన విషయం ఏమిటి? ఇవన్నీ మీ ఉత్తరాలలో కూడా రాశారు.' అంది నవ్వుతూ మాలతి.

"ఆఁ లండను చూస్తే చాలదు, చుట్టుప్రక్కల అంతా చూడాలంటూ, వాళ్ళనాన్న కంట్రీ సైడ్‌లో ఇల్లు, ఫారమ్‌తో ఉంటున్నాడని అక్కడికి తీసుకెళ్ళాడు. ఆ ముసలాయన ఎంత చురుగ్గా ఉంటాడో తెలుసా? ఆ వయసుకి ఊరంతా తనే అన్నట్టు అందరికీ సాయంగా ఉంటాడు. నన్ను ఎంతో ఆప్యాయంగా చూశాడు. మన దేశం గురించి ఎంత ఆరాగా అడిగాడో? ఆ చుట్టుప్రక్కల అంతా తిప్పి చూపించాడు. ఇంతకీ సంగతేమిటంటే ఎపుడో మిలటరీలో పనిచేస్తూ అన్ని దేశాలు తిరుగుతూ మనదేశం కూడా వచ్చాడట. ఏ వూరో పాడో ఏమీ గుర్తులేదు. ఈ మధ్యనే భార్య పోయిందట. అందుకని ఈ దుఃఖం మర్చిపోడానికి కొడుకు దేశాలు తిరిగి రమ్మంటున్నాడట. రెండు మూడు నెలల్లో

ఇండియా వస్తానన్నాడు. మన ఊరుకి తప్పకుండా రమ్మన్నాను. అతని కొడుకుతో మా కంపెనీకి ఎలాగూ లావాదేవీలు ఉన్నాయి కదా అందుకని వాళ్ళు కూడా అతన్ని ఎంటర్‌టెయిన్ చేస్తారు.'

'మంచి దుఃఖమే. మనవాళ్ళు భార్య పోతే ఆ వయసులో ఏ వరండాలో నో కాళ్ళు జాచుకుని గోడకి జారబడి పోతారు. ఈయన దేశాలు తిరుగుతాడా?'

'అదే తేడా మనకీ వాళ్ళకీ. బతికినన్నాళ్ళు పూర్తిగా బతకడానికే ప్రయత్నిస్తారు. ఇతనికి బాగా దైవభక్తి, అతని దినచర్య చూడాలి. చివరి రోజులు వచ్చేశాయి. మంచి పనులు చేసి నేను చేసిన పాపాలన్నీ కడుక్కోవాలి అంటూ పొద్దున లేచిన దగ్గర్నుంచీ ఏదో ఒక సాయం చేస్తుంటాడు అందరికీ.'

'ఆ వయసొస్తే చాలామందికి దేవుడి భయం పట్టుకుని భక్తి ఎక్కువయి పోతుందిలెండి.'

'అలాక్కాదు మాలతీ. చాలా గౌరవం కలుగుతుంది అతన్ని చూస్తే.'

'సరే లెండి. ఇంగ్లీషువాడు. అందులో మిలటరీవాడు. ఏవో వెధవ్వేషాలు వేసి ఉంటాడు. అవన్నీ ఇప్పుడు జ్ఞాపకం వస్తుంటాయి.' అని తేల్చి పారేసి, 'మీరు స్నానం చేసి రండి. అన్నం తిందురుగాని' అని ఖంగారు పెట్టింది.

'వచ్చేస్తున్నాను. చారు ఉందా? ఎన్నాళ్ళయిందో తిని.'

'అన్నీ ఉన్నాయి. భోంచేసి కాస్సేపు పడుకుందురుగాని. మళ్ళీ ఆ సుధ మీరు వచ్చారని కాలేజీ నుంచి తొందరగా వచ్చేస్తే, మిమ్మల్ని పడుకోనివ్వదు.'

భోజనం చేసి, 'నిజంగానే అలసటగా ఉందోయ్. పడుకుంటాను.' అని నిద్రపోయారు లక్ష్మీకాంతంగారు.

మాలతి బట్టలు తడిపి పెట్టి, ఆయన తెచ్చిన సామాన్లన్నీ మళ్ళీ చూస్తూ కూర్చుంది. ఏదో ఆలోచిస్తూ. కాలింగ్ బెల్ చప్పుడు విని గబుక్కున లేచింది.

'ఏం చేస్తున్నారు? పడుకున్నారా?' అంటూ వచ్చింది కామాక్షి.

'లేదండీ. ఇదిగో ఇవాళ పొద్దునే ఈయన వచ్చారు. ఇప్పుడే భోజనం చేసి పడుకున్నారు. సామాన్లు సర్దుతున్నాను. కూర్చోండి.'

'అలాగా. బాగా అయిందా ట్రిప్పు.'

'ఆఁ ఢిల్లీలో సరళని చూసి వచ్చారట.'

'కులాసాగా ఉందా? ఏమన్నా విశేషమా?'

'ఏమీ లేదట. ఉద్యోగం చేస్తోంది కాలేజీలో.

'పోనీలెండి. కాలక్షేపంగా ఉంటుంది. మరీ ఏడాది తిరక్కుండా పిల్లల తల్లులయిపోతే చికాకేలెద్దురూ. ఒక సరదా పాడూ ఉండదు. రేపు సాయంత్రం మా నిర్మలకి గాజులు పెట్టిస్తున్నాను. వాళ్ళ అత్తవారింట్లో ఆనవాయితీ లేదట. అక్కడ ఏమీ చెయ్యలేదు. మా యింట్లో ఉంది గదా పోనీ అని సరదాగా పేరంటం చేస్తున్నాను, కొంచెం తొందరగా రండి'.

'తప్పకుండాను. తేలిగ్గా తిరుగుతోందా?'

'ఆఁ బాగానే ఉంది. డాక్టరుకి చూపించాను. వస్తానింక. మీ సరళ ఉద్యోగం చేస్తోందని చెప్తే ఇంతెత్తు లేస్తుంది. నాకప్పుడే కడుపంటూ. వాళ్ళ వాళ్ళకి అసలు ఇష్టంలేదు ఉద్యోగం అవీను.'

'పోనీలెద్దురూ. కావాలనుకుంటే వస్తారా పిల్లలు. అలా అనుకోవద్దనండి. కాఫీ తీసుకుని వెళుదురు



గాని ఉండండి.'

'వద్దండి. ఇందాకే భోజనం అయింది. తప్పకుండా రండి.' అంటూ వెళ్లిపోయింది. ఆవిడ.

ఆవిడ్ని సాగనంపి లోపలికి రాగానే గదిలోంచి 'ఎవరోయ్' అంటూ అడిగారు లక్ష్మీకాంతంగారు నిద్రలోంచే

మన సరళ ఫ్రెండ్ నిర్మల లేదూ, వాళ్ల అమ్మగారు. ఇద్దరికీ ఒక్కసారే పెళ్లయింది. ఏడో నెల గాజులు పెట్టిస్తారట. పేరంటం పిలవడానికి వచ్చారు. అందుకే అన్నాను దీనికేమి విశేషం లేదా అని.'

'బాగుందోయ్! దీన్లో పోటీ ఏమిటి? ఎవరికో వచ్చిందని అందరికీ రావాలంటే ఎలాగ? ఖంగారు పడిపోతావు పూర్కినే. అయినా మనం అమ్మమ్మ తాత అయిపోతే అదోలా ఉంటుంది, ముసలాళ్లమయి పోయినట్టు.'

'బాగుంది. ఇప్పుడు అవలేదేమిటి''

'ఎక్కడ? నా వయసు చెపితే ఎవరూ నమ్మరు.'

నిజమే. తమ ఇద్దరికీ కూడా వయసు తెలియదు. పిల్లలు లేటుగా పుట్టడం వల్ల కూడా అంత వయసుందనుకోరు. అయినా ఆయన రోజులు గడిచిపోయే కొద్దీ మర్చిపోయారు కానీ ఆ పిల్లల కోసం ఎంత ఆరాటపడ్డామో తను మర్చిపోగలదా?

'అదిగో అలా పెట్టకు మొహం. అంత ఖంగారయితే ఎలాగ? ఎవరయినా వింటే నవ్వుతారు.' అంటూ అటు తిరిగి పడుకోబోయిన మనిషి గబుక్కున ఏదో గుర్తు వచ్చినట్టు 'అన్నట్టు మీ అక్కయ్యకెలా ఉంది ఒంట్లో?- అడగడమే మర్చిపోయాను. పూర్తిగా కులాసా చిక్కిందా?' అన్నారు.

'ఆఁ కోలుకుంది. ఇంక యూనివర్సిటీకి వెళ్లదట. మానేసింది.'

'మంచి పని చేశారు. ఇంక రెస్టు తీసుకోవాలి. లేకపోతే స్ట్రెయిన్ అయిపోతారు.'

'అందుకనేమీ కాదులెండి. వచ్చే నెలలో ఢిల్లీలో ఏదో సింపోసియమ్ ఉందిట. అక్కడ ఏదో పేపర్ చదవాలట. అది తయారుచేసుకుంటోంది. మరి ఆరోగ్యం పాడవుతే వెళ్లడానికి వీలవదేమోనని ఇంట్లో ఉంది'.

'మంచి ఇంటరెస్టే. మీ అక్కయ్యకీ; అన్నయ్యలకి కూడా విపరీతమైన తాపత్రయం ఇలాంటివంటే. ఆ రోజుల్లో మీ నాన్నగారు అంతలా చదివించారు ఆవిడనీ మగ పిల్లలతో పాటు. నీకే శ్రద్ధ లేకుండా పోయింది. గానీ నిన్నూ చదివించివారు. నువ్వూ మా అమ్మ కోడలివి అయిపోయావు ...' అని ఇంకా ఏదో అనబోయేంతలో 'నిద్రపోతానన్నారు. ఇదేనేఖిటి? కబుర్లతోనే సరిపోతోంది' అని అడ్డుకుంది మాలతి.

'నిజమే. టైమెంతయింది? నాలుగుకల్లా లేపించు. ఒక్కసారి ఆఫీసుకి వెళ్లి వస్తాను. నువ్వూ కాస్సేపు పడుకోరాదూ.

'ఏదీ. పని పిల్ల రావాలి. మీ బట్టలన్నీ తడిపి పెట్టాను. వచ్చి ఉతుకుతానంది. నాలుగు గంటలకి

# ఉగాది

వరకట్నపు "గాలి గంగ"
భరతం పడుతూ -
రాజకీయ విషనాగుల
పడగలు పద్రొక్కుతూ-
కులమతాగ్ని కీలలపై
కుంభవృష్టి కురిపిస్తూ-
అధికార మోహదాహానికి
అంతిమ గీతం పాడుతూ-
చీకటి బ్రతుకుల ముంగిట్లో
చిరుదివ్వెలు వెలిగిస్తూ-
అవనికి ఆమని తెస్తే "ఉగాది"
అది సమతా సౌధపు పునాది!!-

– చింతలపాటి పూర్ణచంద్రరావు

## జీసస్, నన్ను క్షమించు

లేపిస్తాలెండి' అంటూ తలుపు దగ్గరగా వేసి ఇవతలికి వచ్చింది.

మూడు నెలల తర్వాత ఆయన తిరిగివచ్చారు. పొద్దుట్నించీ సరదాగా ఉంది కబుర్లతో. అలాంటిది సడన్‌గా మనసంతా చికాకయిపోయింది. ఏమీ చెయ్యాలనిపించలేదు. అన్నీ అలా వదిలేసి సోఫాలో తలగడ పడేసుకుని నడుం వాల్చింది.

ఈ రోజు ఇది రెండోసారి తన మనసు గాయపడడం. నిద్ర రావడంలేదు. ఏవేవో ఆలోచనలు.

'నిజమే. అక్కయ్య, అన్నయ్యలు వాళ్ల వాళ్ల రంగాలలో చాలా పేరు సంపాదించుకున్నారు. ఆ రోజుల్లో నాన్నగారు బ్రిటిష్ ప్రభుత్వంలో చాలా పెద్ద ఉద్యోగం చేసేవారు. అలాగని మళ్లీ తన స్నేహితులు కొంతమంది స్వాతంత్ర ఉద్యమంలోకి వెళ్లిపోతే వాళ్ల పిల్లల్ని చదివించడానికి సాయం చేస్తూ ఉండేవారు. ఆడపిల్లలనీ, మగపిల్లలనీ కూడా సమానంగా చదివించాలని ఆయన ఆశ. అక్కయ్య అప్పటికే ఎమ్. ఎ. లో చేరింది. తను స్కూలులో చదువుతుండేది. నాన్నగారికి తనంటే చాలా ముద్దు ఆఖరిదని. పోలికలు కూడా ఆయనవే. పెద్ద కళ్ళు, తెల్లటి రంగు, మంచి మంచి బట్టలు వేసుకునేది. 'మా అమ్మ డాక్టరయిపోతుంది. పెద్దదయితే నాకు బెంగలేదు' అని తెగ మురిసి పోయేవారు. ఆడపిల్లల కోసమని తెరిచిన మిషనరీ స్కూలులో చదివేది. మంచి మార్కులు వచ్చేవి. చాలామంది ఫాషన్ కోసం చదివేవారు. తను మాత్రం చాలా శ్రద్ధగా చదివేది. అమ్మకి మాత్రం ఇవేవీ ఇష్టం ఉండేదికాదు. అక్కయ్య, అన్నయ్య మద్రాసులో చదివేవారు. వాళ్ల చదువుఅయ్యేదాకా ఇల్లు తీసుకుని అక్కడ ఉండమన్నారు అమ్మని. తనని కూడా అక్కడే చేర్పిస్తానని. అమ్మ ఒప్పుకోలేదు. అలాగయినా అక్కయ్య చదువు మానేస్తారని. నాన్నగారు అంతకన్నా ఊరుకోలేదు. తెలిసిన వాళ్ల ఇంట్లో గదులు తీసుకుని అన్ని ఏర్పాట్లు చేసి మరి చదివించేవారు. చిన్నన్నయ్య బెనారస్‌లో చదువుతూ ఉండేవాడు. ఆ రోజుల్లో ఇంట్లో కూడా తనతో ఇంగ్లీషులో మాట్లాడుతూ ఉంటే, అమ్మకు చికాకు వేసేది. భోజనాలు చేస్తూ తను, నాన్నగారు ఇంగ్లీషులో ఏవో కబుర్లు చెప్పుకుంటూంటే అమ్మ ఆముదం తాగినట్లు వెగటుగా మొహం పెట్టేది. రోజులు ఎంతో సరదాగా గడిచిపోతుండేవి.

అలాంటిది అనుకోని చిన్న సంఘటనతో జీవితం అంతా మారిపోయింది. దానికి కారణమైన వ్యక్తి మొగం కూడా గుర్తు లేదు తనకి. అసలు తలుచుకుంటే నిజంగా అలా జరిగిందా? జరిగితే ఎందుకు అలా జరగాలి? అన్న ఆవేశం వస్తుంది. తన చదువు డాక్టరు కావాలన్న కలలు – అన్నీ కాలక్రమాన మర్చిపోయినా ఆ సమయంలో మాత్రం నిలువుగా కూలిపోతుంటే దుఃఖం ఆగేది కాదు. నాన్నగారికి వేరే దారి లేకపోయింది. సమాజాన్ని ఎదిరించి ఆ రోజుల్లో ధైర్యంగా ఆడపిల్లలని చదివించగలననుకున్నారు గానీ, మొత్తం జీవితానికి మచ్చ తెచ్చే పరిస్థితుల్ని మొండిగా ఎదిరించలేకపోయారు. ఇంకొక చోటికి పంపించి చదివించాలన్న ఆలోచన వచ్చింది గానీ అమ్మ మొండి కేసింది. గోల పెట్టింది. తనూ బెదిరిపోయి ఉందేమో కొత్త చోటకి వెళ్లి చదువుకునే ధైర్యం కోల్పోయింది. ఎంత తొందరగా తనని ఆ ఊరు నుంచి తప్పిస్తే అంత మంచిదని అమ్మమ్మ దగ్గరకి పంపించేశారు. అసలు విషయం ఎవరికీ తెలియదు అమ్మకి తప్ప. ఎప్పట్నించో అమ్మమ్మ సణుగుతోంది. ఆడపిల్లల్ని చదివించి సంసారం చేసేస్తున్నారని, ఆ కారణమే చెప్పి, 'ఎలాగూ దీనికి చదువు రావడం లేదు. దండగ. మీ మాట ఎందుకు కాదనాలి? పెద్దమ్మాయితో కలిసి సంబంధం దొరికితే దీనికి చేసేస్తాను' అన్నారు నాన్నగారు. ఎంతో తెలివైన తనని చదువు రాని మొద్దు అంటూ చెప్పడానికి ఆయన ఎంత బాధ పడ్డారో తనకి తెలుసు. అమ్మ, నాన్నగారు లేకుండా ఒక్కర్తే అమ్మమ్మ దగ్గర ఉంటూ కొన్ని రోజులు రాత్రుళ్ళు ఏడ్చుకునేది. అలాగే స్తబ్ధుగా గడిపేది. అమ్మమ్మ, తాతగారు మంచి సంబంధం కోసమని ఊళ్ళన్నీ వాకబు చేస్తున్నారు. నాన్నగారయితే 'చదువుకున్న కుర్రవాడు అయితే చాలు. ఆస్తిపాస్తులు చూడకండి. మనకున్నది చాలు' అని చెప్పారు. కానీ వాళ్ళకలా కాదు. డబ్బుండాలి, చదువుండాలి, మంచి కుటుంబం అయి ఉండాలి. ఆ వేటలో ఏడాది గడిచిపోయింది.

తనకి మాత్రం వేరే లోకంలోకి వచ్చినట్లు ఉండేది. స్కూలు, చదువు, ఫ్రెండ్స్, పార్టీలు ఇవేవీ లేవు. పల్లెటూరు, పాడి, పంట, పొలాలు, వ్రతాలు, నోములు, పేరంటాలు – ఈ లోకంలో పడ్డాను. ఒకరోజు అమ్మమ్మతో పక్క ఊరు పెళ్ళికి వెళ్ళింది

బండిలో. చాలా గొప్పవాళ్ళు. తాతగారికి స్నేహితులు, చుట్టాలు కూడాను. మనవరాలినంటూ అందరికీ గొప్పగా చూపించింది అమ్మమ్మ. ఈ ఏడాదిలో అలాంటివన్నీ అలవాటయిపోయాయి. అందరూ తననే చూసేవారు. అడుగు వెడల్పు జరీ పట్టు పరికిణీ, సిల్కు ఓణీ, నగలు ఏటికి తోడు అందం.

మాటలతో మగపెళ్ళి వారి తరఫు వాళ్ళతో కూడా అమ్మమ్మ కబుర్లు కలిపి, చుట్టరికాలు తీగేసింది. వాళ్ళలో తన అత్తగారు కూడా ఒకరు. ఒకప్పుడు చాలా ఆస్తిపాస్తులు ఉండేవిట. పరిస్థితులు కలిసిరాక చితికిపోయారు. చాలా పేరున్న కుటుంబం. ఎవరి సాయాన్ని అర్థించకుండా తమంతట తమే పరిస్థితుల్ని ఎదుర్కొన్నారు. తమ ఆఖరి అబ్బాయి బెనారస్‌లో ఇంజనీరింగ్ చదువుకున్నాడని, మీ మనవరాల్ని ఇమ్మన్నట్టుగా అడిగారు.

మగపిల్లలందరు చదువుకుని వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు నిలబడగలిగే స్థితికి వచ్చారు. ఆస్తిపాస్తులు పోయాయన్న బెంగ లేదు మాకు. దేవుడి దయ వల్ల తేరుకున్నాం.' అన్నారు అమ్మమ్మ.

'మా అల్లుడికి రాస్తాను. వాళ్ళు వస్తే మిమ్మల్ని కలుస్తాము' అని చెప్పింది.

తిరిగి వస్తుంటే, 'ఒకప్పుడు వాళ్ళెంత మోతుబరులనుకున్నావు? అప్పట్లో వాళ్ళ ఇంటికి వెళ్ళడమే గొప్ప. అలాంటి వాళ్ళు ఇలా అయిపోయారు. అయితేనేం ఆవిడ మొహంలో ఠీవి, కళ చూశావా? ఎక్కడికి పోతాయి? ఇపుడు వాళ్ళంతట వాళ్ళు అడుగుతున్నారు కాబట్టి ఇలా ఆలోచిస్తున్నాం కానీ, ఆ రోజుల్లో అయితే చేసుకునా చేసుకోకపోయినా అడిగితే చాలు అదే గొప్ప. సరే – మీ నాన్నకి కూడా నచ్చుతుంది ఈ సంబంధం' అంటూ అమ్మమ్మ సంబరపడింది.

ఆ తర్వాత చాలా తొందరగా జరిగిపోయాయి. అన్నీ. వాళ్ల అమ్మ చూస్తే చాలని, తను చూడకుండానే చేసుకున్నారు. తన జీవితంలో అనుకోకుండా వచ్చిన అదృష్టం ఏదన్నా ఉంటే అది ఆయనే. నాన్నగారు చాలా బ్రహ్మాండంగా పెళ్ళి చేశారు. అక్కయ్యకి ముందు అనుకున్న ప్రకారం బావతో పెళ్ళయింది. రెండూ ఒక్కసారే చేశారు. ఆయన చదువు పూర్తయే దాకా, అత్తగారి దగ్గరా, అమ్మమ్మ దగ్గరా ఉంటూ ఉండేది. ఇద్దరూ నోములని, వ్రతాలని తమ సరదాలన్నీ తీర్చుకునేవారు.

'పెళ్ళికి ముందు నన్ను చూడాలని అనిపించ లేదా' అని ఆ తర్వాత ఆయన్ని అడిగితే ఎంతో అందంగా సమాధానం చెప్పారు.

'మా అమ్మ నీ అందం గురించి ఎంతగా వర్ణించిందంటే, మళ్ళీ చూస్తానని నీ అందాన్ని చిన్నబుచ్చడం నాకిష్టం లేకపోయింది. ఎలాగూ పెళ్ళయ్యాక నేనే కదా చూసేది.'

తన చదువు ఆగిపోయింది, అనుకున్నట్టుగా ఏమీ జరగలేదు అన్న బాధ ఆయన సాహచర్యంలో తొందరగా మర్చిపోయింది. చదువయిపోయాక మంచి ఉద్యోగం రావడానికి నాన్నగారు సాయం చేశారు. చాలా మొహమాట పడ్డారు ఆయన. అల్లుడి మర్యాదలు చేస్తేనే ఆయన ముడుచుకు పోయేవారు. అలాంటిది నాన్నగారి పలుకుబడితో ఉద్యోగం అంటే మొదట ఒప్పుకోలేదు. నాన్నగారే నచ్చ చెప్పారు. 'నా కొడుకకొటీ నువ్వొకటీ కాదు. అర్హత ఉన్న వాడివి సాయం చేస్తే తప్పేముంది? ఇంకొన్ని రోజు లాగితే ఎలాగూ వస్తుంది. నా వల్ల కొంచెం ముందుగా దొరుగుతుంది. అంతే కదా. అంటూ.

అన్నీ సరిగా జరిగిపోతున్నా అందరికీ ఒకటే చింత. పెళ్ళయి ఎన్నేళ్ళయినా తనకి పిల్లలు లేరు. మిగతా అందరికీ ముగ్గురు, నలుగురు కూడాను. మొదట్లో అంతగా అనిపించక పోయినా రోజులు గడుస్తున్న కొద్దీ ఆయనకి దిగులు పట్టుకుని అప్పుడప్పుడు తేలిపోయేవారు. అత్తగారయితే తన గురించి బెంగపెట్టుకున్నారు. ఆఖరి సంతానం అవడంతో తనలాగే ఆవిడకి ఆయనంటే కొంచెం ఎక్కువ ప్రేమ. ఒకటి రెండుసార్లు ఈ బాధంతా భరించలేక ఆయన్ని మళ్ళీ పెళ్ళి చేసుకోమని కూడా అంది. 'కష్టమైనా, నిష్ఠూరమైనా ఇద్దరమూ కలిసే అనుభవిద్దాము. అంతేకానీ నిన్నెందుకు

చిన్నబుచ్చుకుంటావు అనవసరంగా' అని ఎంతో అనునయించేవారు. తనవల్ల ఆయన కూడా జీవితంలో ఎంతో పోగొట్టుకుంటున్నారు. మౌనంగా తనలో తనే బాధపడుతుంటే మరింత క్రుంగిపోయింది. నాన్నగారు, అమ్మ కూడా ఏడాది తేడాతో, తనకి పిల్లలు లేరనే బాధతో నే పోయారు. ఇవన్నీ కలిసి తన మీద చాలా దెబ్బతీశాయి. అక్క, అన్నలు చాలా అభిమానంగా చూసేవారు కానీ ఈ విషయంలో ఎలా ఓదార్చాలో వాళ్ళకి తెలిసేదికాదు. ఇలా ఎందుకు జరుగుతోంది? తను అనుకున్నవి ఏమి ఎందుకు జరగవు? అందరిలాంటి అదృష్టం కాదా తనది? అంతటికీ ఆ ఊరు పేరు తెలియని వ్యక్తే కారణం అని ఎన్నో తిట్టుకునేది.

పెళ్ళయిన పదకొండు ఏళ్ళకి, అన్ని ఆశలు వదులుకున్నాక, నెల తప్పింది తను. భూమికి అడుగు ఎత్తులో నడిచింది తను సంతోషంతో. మోహన్ పుట్టాడు. ఆ మాట విన్నాకే, మనవడ్ని ఎతుకున్నాకే అత్తగారు కొన్ని రోజులకి పోయారు. ఆఖరి రోజుల్లో ఆవిడకి ఆ తృప్తి కలిగిందని తలుచుకుంటే ఇప్పటికి సంతోషంగా ఉంటుంది, ఆ తర్వాత మాటల్లో–

'ఇన్నాళ్ళు పిల్లలు లేకుండా ఎలా గడిపానో, నాలాంటి ఉపయోగంలేని మనిషిని చేసుకుని మీరు కూడా నాతోపాటు చేయని పాపానికి శిక్ష అనుభవించారు.' అని తను అంటే ఆయన గబుక్కున తన నోరు మూశారు.

## ఉగాది....!

రేపటి ఉగాది కని
నేడు వేపపువ్వుకోంటుంటే
అనిపించింది నాకు,
భవన నిర్మాణంలో నే కాదు–
భగవంతుడికి పెట్టే నైవేద్యంలో కూడా
పేదవాడి పాత్ర వుందని.

– మధుశ్రీ

## జీసస్, నన్ను క్షమించు

'నేను చాలా దుర్మార్గుడ్ని మాలతీ. చేయని పాపానికి శిక్ష అనుభవించింది నువ్వు. అందరూ గొడ్రాలంటే పడ్డది నువ్వే'. అని చాలా బాధగా అన్నారు. తనకేమి అర్ధం కాలేదు. వెర్రిదానిలా చూసింది.

'నిజం మాలతీ. కొన్నాళ్ళ కిందట నా స్నేహితుడొకడు డాక్టరు కలిశాడు. మాటల్లో పిల్లలెంతమంది అంటే లేరని చెప్పాను. పెళ్ళయి ఎన్నాళ్ళయిందని చెపితే, ఎందుకయినా మంచిది నువ్వు 'టెస్ట్ చేయించుకో' అంటూ పరీక్షించాడు. లోపం నాలోనే ఉంది మాలతీ. ఏం ఫర్వాలేదు మందులు వేసుకోమని, తనే ఏడాదిపాటు ట్రీట్ చేశాడు. ఇదంతా నీకు తెలియకుండా చేశాను. ఒకవేళ ఈ లోపం సరికాకపోతె, దానికి నువ్వు బాధ్యత వహిస్తుంటే ఎలా తట్టుకోవాలో నాకర్ధంకాలేదు. నీకు ఎలా చెప్పాలో కూడా అర్ధంకాలేదు. విషయం తెలిశాక నీ నుంచి దాచిపెట్టి నిన్ను మోసం చెయ్యడం నాకు చేతకాదు. చాలా మధనపడ్డాను. చివరికి అంతా సరిగానే ఉంది, ఎందుకు పుట్టరో చూస్తాను అని అన్నాడు గానీ నాకు నమ్మకంలేదు. చివరికి నువ్వు ఆ వార్త చెప్పేదాకా ముళ్ళమీద గడిపాను తెలుసా?' అంటూ తన ఒళ్ళో తలదాచుకున్నారు. తన మనసు ఆర్ద్రమయింది.

అప్పటికిగానీ కొన్నాళ్ళుగా ఆయన ఎందుకలా మౌనంగా అసహనంగా ఉంటున్నారో అర్ధంకాలేదు. తన పరిస్థితి అలాగే ఉండటంతో గట్టిగా అడిగే ధైర్యం ఉండేదికాదు. తెలిసిన కారణమే గదా. దేవుడు పూర్తిగా నిర్దయుడు కాడు. తను కోరుకున్నవి కొన్ని జరగకపోయినా, అనుకోనివి కొన్ని ఇచ్చాడు.

'నాకన్నా మీరే ఎక్కువ బాధపడ్డారండీ. ఏ భర్తా భార్య దగ్గర తనదే లోపం అని ఒప్పుకోలేదు. మాకయితే తరతరాల నుంచి అలవాటే పిల్లలు పుట్టడానికి బాధ్యత మాదే అని. పుట్టకపోతే లోపం మాదే అనుకుంటాం. కానీ మీరిలా నా దగ్గర ఒప్పుకోడం నాకెంతో సంతోషంగా ఉంది. ఒకవేళ ఇలా సవ్యంగా జరక్కపోయినా మీరన్నాళ్ళో నా దగ్గర నుంచి ఈ రహస్యం దాచలేరు. అంది తృప్తిగా, అటువంటి వ్యక్తి తన భర్త అంటే ఎంతో గర్వంగా

ఉంటుంది ఇప్పటికీ.

అటునుంచి ఇటు ఒత్తిగిలింది మాలతి. టైము చూసుకుని, "పని పిల్ల ఇంకా రాలేదు" అనుకుంటూ మళ్ళీ ఆలోచనలో పడింది. తర్వాత సరళ, సుధ పుట్టారు. వాళ్ళ పెంపకంలో ఇంక తీరిక అంటూ లేకుండా జీవితం హాయిగా గడిచిపోయింది. ఆయన కూడా ఉద్యోగంలో చాలా పైకి వచ్చారు. నెమ్మదిగా నచ్చ చెప్పి, నాన్నగారు తనకి ఇచ్చిన డబ్బు కూడా కలిపి ఒక ఇల్లు కట్టించింది. పిల్లలు పెద్దవాళ్ళయి ఇపుడు మరి తోచకుండా ఉంది. ఎవరంతట వాళ్ళు అయిపోయారు. సరళ పెళ్ళయి వెళ్ళిపోయింది. అబ్బాయి సి.ఎ. పాసయి ప్రాక్టీసు చేస్తున్నాడు. సుధ మెడిసిన్ చదువుతోంది. తను చదువుకోలేకపోయినా తన కోరికలన్నీ పిల్లలతో తీర్చుకుంది. సుధ కోటు వేసుకుని, స్టెత్ తీసుకుని, వెడుతుంటే దాన్లో తనని చూసుకుంటుంది. కాలేజీలో జరిగినవన్నీ పూసగుచ్చినట్టు తనతో చెప్పడం దానికొక అలవాటు. అవన్నీ వింటుంటే ఎంతో హాయిగా ఉంటుంది తనకి. ఎపుడన్నా మాటల్లో వీళ్ళవరన్నా,

"దొడ్డమ్మ, మామయ్యల లాగా నువ్వు కూడా చదువుకుంటే ఎంత బాగుండేదమ్మా. వాళ్ళు ముగ్గురూ చదువు కున్నారు. నీకే రాలేదు." అంటే మాత్రం మనసు చివుక్కు మంటుంది. ఈ మధ్య తీరిక ఖక్కువయిపోయి ఇలా పాత రోజులు గుర్తు చేసుకుంటూ ఎందుకూ ఉపయోగం లేని మనస్తాపం పడటం అలవాటయి పోతోంది. ఎలా ఆపుకోవాలో అర్థం కావడం లేదు.

బెల్ చప్పుడయి గబుక్కున లేచింది. పని పిల్ల వచ్చింది. "ఏమే ఇంత ఆలస్యం అయింది? ఇప్పుడు ఆరేస్తే బట్టలు ఎప్పుడు ఆరతాయి?"

"ఏదమ్మా, ఎప్పుడో వద్దామనుకున్నాను.' ఆ రామలక్ష్మమ్మగారు చపాతీలు చేసుకోవాలిట రాత్రికి. అప్పటికప్పుడు గోధుమలు బాగుచేసి మిల్లు పట్టించుకు రమ్మన్నారు. కదల నివ్వలేదు. ఈ పొద్దయింది. గబుక్కున గట్టిగా పిండి ఆరేస్తాను" అంటూ లోపలికి పరుగెత్తింది. "నాలుగు అవుతోంది. కాఫీ కలిపి ఆయన్ని లేపాలి" అనుకుంటూ వంటింట్లోకి వెళ్ళింది మాలతి.

మనసు మాత్రం మళ్ళీ కోతిలా ఆలోచనలు చేస్తోంది. "సరళ తోటి పిల్లలందరు అపుడే తల్లు లయిపోతున్నారు. దానికేమీ లేదంటే తనకి ఏదో భయం. ఎందుకింత ఖంగారు అంటారుగానీ ఆయనకి తెలియదా తామెంత బాధపడ్తారో. "ఈయన కాబట్టి ధైర్యంగా పరీక్ష చేయించు కున్నారు గానీ అందరూ అలా ముందుకు వస్తారా? దాన్లో లోపమో, అతనిదో తెలియద్దూ. అతనిదే అయితే పరీక్ష చేయించుకోడానికి ఒప్పుకుంటాడో లేదో? ఎంత మంచి వాళ్ళయినా ఇలాంటి విషయాల్లో వెనక్కి పోతారు, తప్పంతా ఆడవాళ్ళ మీదకి తోసి. ఏడాది లోపల నెల తప్పకపోతే ఈ రోజుల్లో ఏదో అనుమానమే. ఇపుడే ఎందుకని



పంచాంగ శ్రవణం
చిత్రకారుడు : దేవు దీక్షితులు

జాగ్రత్త పడుతున్నారో ఏమిటో? అలాంటివి చేస్తే తీరా కావాలను కున్నప్పుడు ఏవో కాంప్లికేషన్స్ వస్తాయి. అపుడు గోల పెడ్తారు. ఈసారి వస్తే అడగాలి. ఉత్తరంలో రాయాలంటే అతను చదువుతాడేమోనని ఊర్కుంది. ఏమీ లేకపోతే ఆ డి ఎండ్ సి అన్నా చేయించాలి. కానీ తన పోలిక మాత్రం రాకూడదు. అంతగా పెంచడం కష్టం అంటే చంటిపిల్లని తన దగ్గర ఉంచుకుంటుంది. మూడేళ్ళు దాకా అంతేగానీ ఈ సస్పెన్స్ తను భరించలేదు. అలా ఆరాటపడి పోతోంది మాలతిలోని తల్లి మనసు. గదిలోకి వెళ్ళి ఆయన్ని లేపించింది.

పనిపిల్లని "ఆ పనలా ఉంచి కాస్త ఈ కాఫీ తాగు. ఎప్పుడనగా తిండి తిన్నావో ఏమిటో?" అంటూ కేకేసింది. అది కాఫీ తాగుతుంటే.

"వెళ్ళే ముందు అన్నం కొంచెం ఇక్కడ తిని మరీ పట్టుకెళ్ళు. ఇంటి దగ్గర మీ వాళ్ళందరూ తిన్నాక మిగిలిందేమన్నా తింటే ఇదీ అదీ కలిపి మళ్ళీ రేపు పని చేయడానికి ఓపిక వస్తుంది. మీ అమ్మ పని చేస్తుంది గానీ తిండి గోల చూడదు." అంది.

"ఏం చేస్తుందమ్మా. అందరూ చిన్న పిల్లలు గదా. నేను ఆకలికి ఆగుతాను గానీ వాళ్ళు ఆగలేరు. వాళ్ళు తినందే నాకూ తినాలని పించదు."

"మంచి ప్రేమే. అయినా నువ్వు పడకోస్తే అసలు రోజు గడిచేదేలా? ఏదో ఒకటి తినాలి గాని' అంటూ లక్ష్మీకాంతంగారు రావడం చూసి, కాఫీ ఇచ్చింది.

"జంతికలు చేశాను తింటారా?" అంది.

"ఇయ్యి. ఒక వారం రోజులదాకా నువ్వేమిచ్చినా కాదనను. అన్నింటికీ మొహం వాచిపోయాను." అన్నారు.

# ఇ·వేమన·పద్యాలు




ముష్టి వేపచెట్లు మొదలుగా ప్రజలకు
పరగ మాలికలకు పనికివచ్చు
నిర్దయాత్మకుండు నీచుడెందునకును
పనికిరాడు గదర పరగవేమ

"మూడు నెలలకే. ఏళ్ళ తరబడి అక్కడ ఉంటున్న వాళ్ళు ఎలా ఉంటారు మరి?"

"వాళ్ళు ఎలాగా అక్కడే ఉండాలిగదాని గుండె రాయి చేసుకుంటారు. బయట హోటల్స్‌లో దొరుకుతాయి కానీ చాలా ఖరీదు. అయినా ఇప్పుడు అక్కడా అన్నీ దొరుకుతున్నాయి. సంసారం ఉన్నవాళ్ళకి ఏమీ ఇబ్బంది ఉండదు. ఇంట్లో అన్నీ చేసుకోవచ్చు. నాలా కొన్ని రోజులుండి, అక్కడా ఇక్కడా తినే వాళ్ళకే ఇబ్బంది. అవునూ, సుధ రాలేదు ఇంకా?"

"ఏవో క్లాసులు ఉండి ఉంటాయి. లేకపోతే ఇంతసేపు ఉంటుందా? పొద్దున అసలు కబుర్లు చెప్పే తీరిక ఏది?"

## జీసస్, నన్ను క్షమించు

"శాంతి ఎలా ఉంది? వచ్చారా ఈ మధ్యన వాళ్ళు?"

"వస్తూనే ఉన్నారు. మీ రొచ్చారని తెలుస్తుంది ఇవాళ సాయింత్రం వస్తారేమో. సుధతో కలిసి శాంతి వచ్చినా వస్తుంది."

శాంతి తమ కాబోయే కోడలు. మోహన్‌స్నేహితుడి చెల్లెలు. హౌస్ సర్జన్ చేస్తోంది. ఇద్దరూ నచ్చుకుని చేసుకుంటా మన్నారు. అభ్యంతరం పెట్టవలసిన అవసరమే రాలేదు. వాళ్ళ నాన్నగారు పెద్ద సర్జన్.

"తొందరగా పెళ్ళి చేసేస్తే బాగుంటుందేమో. అలా తిరుగు తుంటారు. చూసే వాళ్ళకి బాగుండదు." తనలో తను అనుకున్నట్లుగా అంది.

"ఏం ఫర్వాలేదు తిరగనీ. ఆ సరదా పెళ్ళయ్యాక రాదు. మనకి తెలిసే తిరుగుతున్నారు గదా. వాళ్ళ ఇంటికి వెళ్ళావా ఈ మధ్య."

"పుట్టిన రోజంటూ ఒక రోజు భోజనానికి పిల్చింది. పిల్లలు వస్తారు, నేనెందుకు అంటూ మామూలుగా రానన్నాను. వాళ్ళ అమ్మగార్ని తీసుకుని వచ్చింది పిలవడానికి. మీరు లేకుండా నేను ఒక్కదాన్ని వెళ్ళడం ఏమిటని రానన్నాను అంతే. ఏమిటో అనుకుంది కాబోలు."

"బాగుంది. ఇప్పట్నుంచీ వియ్యపురాలి అలక ప్రాక్టీసు చేస్తున్నా వేమిటి? అయినా నేను లేందే ఎక్కడికీ వెళ్ళనంటావు గదా ఎన్నాళ్ళు ఇలా ఇద్దరం కలిసి ఉంటాము చెప్పు. ఎపుడో ఒకపుడు ఒకళ్ళమే రెండో వాళ్ళు లేకుండా గడిపే రోజులు వస్తాయి...." ఆ మాటలు వింటుంటేనే మాలతి కళ్ళు నిండుకున్నాయి. మధ్యలో నే, అందుకుని,

"ఎందుకు ఇప్పట్నుంచీ ఆ మాటలు తీరి కూర్చుని. ఆఫీసుకి వెళ్ళాలన్నారు, లేవండి" అని తొందర చేసింది.

"నిజమే. ఆయన లేకుండా తను, తను లేకుండా ఆయన ఉండగలరా? ఊహించుకుంటేనే తట్టుకోలేక పోతోంది. పూర్వకాలపు చిన్నతనం పెళ్ళిళ్ళలో ఈ బంధాలు మరీ ఎక్కువ. ఆ వయసులో తమ జీవిత భాగస్వామి ఎలా ఉండాలి అన్న అవగాహన ఉండదు. అందుకని ముడిపడ్డ వ్యక్తే, తన సర్వస్వం అన్న భావన ముఖ్యంగా ఆడవాళ్ళలో ఎక్కువగా ఉండేది. అలాంటి వాడయితే బాగుండును, ఇలాంటిదయితే బాగుండేది అని అనుకునే అవకాశమే ఉండేది కాదు. అందుకనే ఒకళ్ళు లేకపోతే ఇంకొకళ్ళు ఏదో బతకాలని బతకడమే తప్ప ఉత్సాహం ఉండదు. పూర్వకాలం విన్నట్లుగా ఆయన పోయాక, బెంగ పెట్టుకుని ఆవిడ పోయింది ఏడాది లోపలే అన్నమాట ఈ రోజుల్లో వినము." ఇలా ఆలోచించుకుంటూ ఏమిటో ఈ రోజు ఒకదాని తర్వాత ఒకటి మనసుని బాధపెట్టే సందర్భాలే వస్తున్నాయి. మనసు బాగులేదు. అనుకుంటూ పిల్లలు వచ్చే టైమయిందని లేని ఉత్సాహం తెచ్చుకుంది.

ఆ రోజు రాత్రి విపరీతమైన చెమటలతో, నోరు ఎండిపోయి, వణుకుతూ లేచి కూర్చుంది మాలతి. ఎంతో నిస్సత్తువుగా అనిపించింది. ఇన్నాళ్ళయినా తనకీ భయం పోలేదు. ఆ రోజంతా మనసు బాగు లేకుండా ఉండటం, ఈ కల రావడానికి కారణం అనిపించింది. ఎవరో తరుముతున్నట్లు, పట్టుకుని ఒక పెద్ద పడవమీద తనని తీసుకు పోతున్నట్లు, తను గింజుకోవడం- అలాగే వచ్చింది. ఎవరో ఏమిటి?ఆ మనిషే. లేచి మంచి నీళ్ళు తాగి, "ఈ వయసులో ఇంకా ఇలాంటి కలలు ఏమిటి తనకి?" అనుకుంది

(మిగింపు పై వారం)

# శ్రీ అక్షయనామ సంవత్సరంలో మీ రాశిబలం-ఫలం

★ **మేషరాశి** : మేష రాశికి 1986 శ్రీ క్షయ నామ సంవత్సరం సర్వ విధాలా విజయప్రదమగుగాక! అయినా, గ్రహబలం చూడాలి. అష్టమమున (శని) స్థితుడైనా మూర్తి మంచిదగుట అపకారం జరుగదుగాని, కష్ట నష్టములు తప్పవు. బృహస్పతి లాభమునన్నాడు. అయినా లోహమూర్తియే ఉపకారిగాడు. స్వల్ప లాభం, ఉద్యోగ వృద్ధి, వ్యాపారానుకూలం లేకపోలేదు. రాహు కేతువులు కూడ కొంత కాలం అనుకూలురుగారు. చేసే వ్యాపారానికి అంతరాయం రావచ్చు. జపాదుల వలన మేలు పొందవచ్చు. ఉద్యోగ రీత్యా 'ప్రమోషన్' ఆశించువారికి ఆగస్టు ప్రాంతం అనుకూలదాయకం. పత్రిక, గ్రంథ వ్యాపారులకు, రచయితలకు, విలేఖరులకు, చిత్ర నిర్మాణ దక్షులకు యోగ్య వత్సరం 'శ్రీ క్షయ' వత్సరం. ఏప్రిల్, జూలై, నవంబరు, ఫిబ్రవరిలు యోగదాయకాలు, ధన ప్రదాయకాలు. ఆదాయం 11, వ్య 5.

★ **వృషభరాశి** : వత్సరమంతయు విజయప్రదమని ఆశించవచ్చు. గురుడు 10లో ఉన్నా, శని 7 వ రాశి యందున్నా, 5, 6లందు కేతువున్నా, రాశికి కొంత కాలం రాహువు లాభమందుండగలడు. వ్యాపార వ్యవహార వృత్తులందు సత్ఫలములాశింపవచ్చు. జూలై 14వ తారీకు నుండి కొన్ని నెలలు, నవంబరు వరకు యోగాధ్యములు, వృత్తి యందు వికాసమున్నది. సాధు సజ్జన సాంగత్యమబ్బుతుంది. భూ సంబంధమైన ఆదాయమున్నది. స్థిరాస్తి అభివృద్ధినందగలదు. ఇంట 'శుభం' ఆగస్టు ప్రాంతమున జరుగనున్నది. అయిన వారి సంబంధం నిశ్చయం కావచ్చు. రాజకీయంగా ఏవిధంగా మేలని చెప్ప వీల్లేదు. ప్రయత్నాలు మానుట శ్రేయస్కరం. అనవసర ప్రయాణాలు అనవసరమే. స్త్రీలకు : వృత్తియందు వికాసం. ధనలబ్ధి, సుఖ సంతోషాలు. ఆదాయ వ్యయాలు పైరాశి వలెనని గ్రహించాలి.

★ **మిధునరాశి** : ఈ రాశికి వత్సరమంతయు 6వ యింట శని, సంతోషదాయకమయినా 'మూర్తి' మంచిదిగాదుగా! అందువలన సత్ఫలములాశింపరాదు. అనానుకూలతా జరుగదు. గురు భగవానుని స్థితి భాగ్యమందు. చక్కని స్థితినందుకోగలరని, ఆశించిన వ్యవహారాలందు విజయం సిద్ధింపగలదని, పేరు ప్రతిష్ఠలకు ఆలవాలమని, 'ప్రమోషన్' ఆశింపనగునని, 'ఏప్రిల్, మే నెలలు సర్వత్రా యోగదాయకములని, నూతన ప్రయత్నములు ఫలదాయకములని, వ్యాపార విజయమున్నదని చెప్పనగును. ఇంట శుభం జరుగుట నిశ్చయం. స్త్రీలకు : ఆరోగ్య భాగ్య వృత్తులందు వికాసం. 8 ఆదాయం, 11 భా. వ్యయం-

★ **కర్కాటకరాశి**: 'విజయీభవ' అయినా పంచమ శని 'తామ్ర మూర్తి' ఉపకారిగాడు. బృహస్పతి, అష్టమరాశియందున్నను మూర్తిమత్వమున అపకారిగాడు. రాహు కేతువులు తామ్రమూర్తు, ఉపకారులుగారు. ఆగస్టు 14 తా. దాటిన తరువాత 'రాహు కేతు' గ్రహాల మూర్తి మత్వమున ఉపకారం జరుగును. ఉద్యోగ యత్నాలు ఫలదాయకాలు. వ్యాపారం సుగమంగా జరుగును. దూర ప్రయాణాలు అనుకూలములు, సాగించండి. కొందరకు, 'నవంబరు, డిసెంబరు, నెలల యందు విదేశయానమునకు, ఆటపాటల ప్రావీణ్య ప్రదర్శనమునకు అనుకూలించు. స్త్రీలకు : వస్తు వాహన వస్త్ర, నగ నాణ్యముల సాధనకు, శుభ ప్రస్తావనలకు అనుకూలములు. గ్రహించవలె. లాభం 2, వ్యయం 11గా గ్రహించి మెలగాలి.

★ **సింహరాశి** : శుభదాయక వత్సరంగా పరిగణన. వత్సరమంతయు 'చతుర్థ శని' అయినను మూర్తి మంచిది. అపకారిగాడు. కాని దీర్ఘ రోగులు, మొండి వ్యాధులుగలవారు 'ఆగస్టు' వరకు జాగ్రత్తగా ఉండవలె. బృహస్పతియు సప్తమములో పెద్దగా ఉపకరింపజాలడు. అర్థాష్టమ శని వేధ యున్నందున అనారోగ్యత కల్గునేమో అని శని, 'గురు జపాదులు అవసరమని హెచ్చరిక. రాహు కేతు గ్రహాల వలన అప్రయత్నాదాయం, ఉన్నద్యోగ యత్నాలు నిదానముగా సానుకూలమగును. వ్యాపారము కలసివచ్చును. శుభ కార్యానుకూలత కలిసి రాదు. ముఖ్యముగా 'మే, జూన్' నెలలు యోగింపవు. రాజకీయ తంత్రాలు మీకు కలసిరావు. గ్రహించాలి. పత్రికా ప్రకట లేఖనాదులందు లాభించును. స్త్రీలకు : మానసికాందోళన, పనులందు ఆలస్య అలసత, నిరుత్సాహత, ధనాభావం చెప్పదగిన అంశాలు లాభ వ్యయాలు సమానం. 5 ఆ, 5 వ్యయం.

★ **కన్యారాశి** : సంవత్సరమంతా మీకు యోగదాయకంగా, ఆనందదాయకంగా, ఉత్సాహజనకంగా, చేతిలో ఎప్పుడు డబ్బు మెసలాడుచూ, పండుగ పర్వాలకు, శుభ కార్యాలకు విశేషంగా వెచ్చింపయోగ్యత కలుగుతూ 'యిల్లు' కళ కళలాడుచు, శోభాయమానంగా ఉంటుంది. తృతీయ శని రజత మూర్తి' మూట శని యోగాధ్యుడు. బృహస్పతియు 6లో నున్నను అపకారికాడు 'రాహు కేతువు'ల జపముతో ఈ క్షయ మీకు అక్షయమగును. స్త్రీలకు : నగలకు వస్త్రములకు లోటు లేదు. ఉద్యోగ ప్రగతికి అనుమానం లేదు. నూతన గృహానుకూలతకు అంతరాయం లేదు. అధిక వ్యయం. ఆదాయం 8, వ్యయం 11 పాళ్ళగా ఎరుగవలె.

★ **తులరాశి** : ఈ రాశి వారు 'క్షయ సం.లో క్రితం పద్మంత శ్రమ పడకుందురుగాక! 'ద్వితీయ శని' మధ్య వయస్కులకు ధన ధాన్యాదులతో గృహం పొంగును, ధనార్జనకు అవకాశమున్నది. వయసు మీరిన వారు ఔషధ సేవచే, శని జపాదులచే శాంతినందవచ్చును. ఆరోగ్యము కుదుట పడజేసికొనవచ్చును.

ఐదవరాశియందు స్థితుడైన బృహస్పతి, కుటుంబానందం, శుభ కార్య నిర్వహణకు ఉద్యోగమందు ఉన్నతి, కళా సాహితీ రంగాన ప్రకాశం యిత్యాది శుభములు కలుగ జేయును. చిత్ర నిర్మాతలకు, పంపిణీదారులకు, కార్ఖానా యజమానులకు, ప్రభుత్వమందున్నవారికి హాయి, ఆనందం చేకూరగలదు. స్త్రీలకు : సుఖానందం, గృహానందం, చక్కని సంబధ నిశ్చయమునకు అవకాశం. ఏమయినా 5 ఆదాయం, 14 వంతులు వ్యయం., గ్రహించాలి.

★ **వృశ్చికరాశి** : ఏ రాశి యందే, ఆకాశమున 'శని' స్థితుడు 7న్నర సం. శని బాధ యందున్నవారు. బృహస్పతియు 6వ యిల్లు చేరుకొన్నాడు. ఏం మేలు జరుగుతుంది? కృషి లోపం చేయకండి, చేయు పనులందు నిరుత్సాహత చూపకండి. ప్రయాణాలు తగ్గించండి. చిక్కిన అవకాశాలు సద్వినియోగం చేసికొనండి. రాజకీయంగా శ్రమకు గురి కాకండి, చిత్ర నిర్మాతలు, పంపిణీదారులు, భారీ వ్యాపారం జేసేవారు, విదేశాలందు పరిభ్రమించేవారు జాగ్రత్తగా సంచరించాలి. రచనా విధానమున చిక్కిన అవకాశాలు జార విడువకండి. ఏమయినా 'కృషితో నాస్తి దుర్భిక్షమ్' కదా! స్త్రీలకు : చిన్న వయసువారికి యిబ్బంది లేదు. అయినా బాగా శ్రమించవలె. పరీక్షలందు ఉత్తీర్ణులగుటకు కృషిచేయవలె. కొందరు యిల్లు మారుదురు. చికాకు నుండి విముక్తినందాలి. ఆదాయం 11, వ్యయం 5, గాన నిరుత్సాహతనంద చోటు లేదు.

★ **ధనుస్సు** : మీరాశికి 'క్షయ' వత్సరం అశుభఫల ప్రదము కాకపోవుగాక!వ్యయ శని కష్ట దాయకుడే. అధిక ధనం అనవసర వ్యయం అగుట

గమనిస్తారు. అపనిందలు రావటం గమనిస్తారు. లేనిపోని వ్యవహారాలలో జోక్యం ఉండకుండ చూచుకోవాలి. వస్తువులుగాని గృహంగాని అమ్మటకు ప్రయత్నించరాదు. ఆహార విహారాదులందు జాగ్రత్తపడవలె. శని, బృహస్పతులు అపకారులు. కాన దైవ బలాన్నే నమ్ముకోవలె. జపాదులవసరం. ఆగస్టు, సెప్టెంబరు ప్రాంతాల కొంత శుభం జరుగవచ్చు. స్త్రీలకు : ఉద్యోగ వృత్తులందు సంకటం, కృషి వ్యర్థం, ధనాభావం. ఎట్లయినా 14 ఆదాయం, 11 వ్యయం. నిరుత్సాహత లేదు.

★ **మకరరాశి :** మీ రాశికి ఈ వత్సరం చిత్ర విచిత్ర సంఘటనలు జరుగుతవి. అనేక విధాల లాభించటం గమనింపగలుగుతారు. అనుకోకుండా ధనం అందటం గమనిస్తారు. అధికాదాయానికి అవకాశమున్నది. ఉద్యోగమందు పెంపు చేకూరుతుంది. రాజకీయవాదులకు శుభప్రదం. గనులందు కార్ఖానాలందు, రాళ్ళ వ్యాపారం చేసేవారికి, చలన చిత్ర రంగానుభవం గలవారికి, నిర్మాతలకు సకల విధాల శ్రేయోదాయకమైన వత్సరం, క్షయ, అక్షయమే. ఎందుకో గ్రహించారా? రాశికి 11వ స్థానముందలి శని, ద్వితీయ బృహస్పతులే కారకులు. రాహు కేతువులూ అనుకూలురే. మాటకు విలువ పెరుగుతుంది. గాయక వర్గానికి, విలేఖరులకు, రచయితలకు మేలైన వత్సరం. స్త్రీలకు : నూతనోద్యోగ యత్నాలందు నిమగ్నులయినవారికి ప్రాప్తి. 'ప్రమోషన్' ఆశించినవారికి వత్సరారంభముననే తృప్తి కలుగుతుంది. వివాహాది శుభ కార్యాలు యింట జరుగుటకు అవకాశమున్నది. ఆదాయం 2, వ్యయం 3 పాళ్ళుగా గ్రహించాలి.

★ **కుంభరాశి :** ఈ రాశికి, రాశియందే బృహస్పతి, దశమంలో, అంటే వృశ్చికంలో శని స్థితులు. 2, 3 లందు 9, 8 లందు రాహు కేతువుల స్థితి. విచారింపగా సామాన్యముగా జరిగే వ్యవహారాలకు లోటు రాదు గాని, నూతన యత్నాలు ఫలించుటకు అవకాశం చెప్ప వీలు లేదు. భారీ వ్యాపారానికి దిగుట అంత శ్రేయస్కరం గాదు. గురువు స్థితి ఫిబ్రవరి 27 నుండివత్సరాంతం వరకు శ్రేయోదాయకమే. అనగా ఫిబ్రవరి, మార్చి 1987 సం.లందు దినములు మంచిగా, లాభదాయకముగా, శుభావహముగా జరుగును. 'రాహు కేతువులు' సువర్ణ మూర్తులుగాన అన్ని విధాలా ఉపయోగమని గ్రహించవలె. రాజకీయంగా ఎట్టి అను కూలత లేదని, అనవసర ప్రయాసకు గురి కాగలరని, ఇచ్చుకొన్న సైకం వసూలు చేసికొనుట కనీస ధర్మమని గ్రహించవలె. స్త్రీలకు : వృత్తి యందు ఆటంకములు, ప్రయాణములందు యిబ్బందులు, వస్తువులు పోవుట యిత్యాది అనానుకూలత జరుగవచ్చు. నిశ్చయించుకొన్న శుభ కార్యాలు వాయిదా పడవచ్చు. గ్రహించాలి. ఆదాయ వ్యయాలు 2, 8లుగా తెలిసికోవలెను.

★ **మీనరాశి :** ఈ వత్సరం శుభావహం. 'భాగ్య శని' అనుకూలుడు. చేసిన యత్నాలు లాభదాయకం, వ్యవహారాలు అనుకూలదాయకం. ఆదాయం బాగుంటుంది. అప్పులు వసూలగుటకు వ్యాపారం అనుకూలంగా లాభప్రదాయకంగా, జరుగుటకు అస్కారమున్నది. వ్యాపారంలో చాలమంది నూతన శాఖ ఆరంభించుటకు అవకాశమున్నది. రాజకీయంగా సర్వానుకూలం ఈ రాశి జాతకుల కని గ్రహించాలి. బృహస్పతి 1987 ఫిబ్రవరి నుండి కొంత కాలం అనుకూలుడు. కళాసాహితీ రంగాలందు శ్రమానంతరం గాని ఫలితం అనుకూలంగాదు. విద్యార్థినీ విద్యార్థులు కృషిచేయుట అవసరమని, కృతార్థత నిశ్చయమని గ్రహించాలి. విదేశయానం కొందరకు చెప్పదగిన ముఖ్యాంశం. వాహనవసతి కొందరకు ఏర్పడగలదు. స్త్రీలకు : సుఖ శాంతులకు ఆస్కారం, వృత్తియందు వికాసం. నాట్య నటనాప్రావీణ్యత ప్రకాశించుటకు అనుకూలమైనదే 'క్షయ' వత్సరం అక్షయమే. ఆదాయం కూడా 14, వ్యయం 11 పాళ్ళు.

'రాశిఫలం 'క్షయవత్సరాన' సర్వులకూ అక్షయమగుగాక!' సమస్త సన్మంగళాని భవన్తు' సుఖినో భవంతు!

—విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి



# ప్రగతి పథంలో పొదుపు రథం

ప్రగతి కోసం జాతీయ పొదుపు రథం ఎంతో మేలైనదని ప్రజలంతా ముక్త కంఠంతో చెప్తున్నారు. అందుకు తార్కాణం – గత సంవత్సరం 10 నెలల కాలంలో రూ. 70 కోట్లు రాష్ట్రాభివృద్ధికి లభింప చేసిన పొదుపు పథకాలు ఈ సంవత్సరం అదే కాలంలో రూ. 105 కోట్లు లభింప చేశాయి.

మీరు మీ ప్రగతి, రాష్ట్ర ప్రగతి కోరేవారైతే వెంటనే ఎక్కండి మా పొదుపు రథంలో!

## ఈ ప్రయాణంలోని సుఖాన్ని, శుభాన్ని చూడండి :

- ఏ రకమైన ఋజువులూ అవసరం లేకుండా పోస్టుకార్డు కొనుక్కున్నంత సులభంగా మా పథకాల్లో పాల్గొనవచ్చు
- బ్యాంకులకన్నా హెచ్చువడ్డీ లభిస్తుంది.
- మీరు పొదుపు చేసిన సొమ్ముకు ప్రభుత్వం రక్షణ మరియూ హామీ ఉంటాయి.
- రాష్ట్రంలో ఏ పోస్టాఫీసులోనైనా కొనుక్కోవచ్చు. మరే పోస్టాఫీసులోనైనా మార్చుకోవచ్చు.
- మీరు ఉమ్మడి ఖాతాగా కాని, మీ పిల్లల పేరుతో కాని కొనుక్కోవచ్చు.

* గడువు ముగిసే లోపే డబ్బు పొందవచ్చు ఏ బ్యాంకులోనైనా కుదువ పెట్టుకొని ఋణం పొందవచ్చు.
* డబ్బు, బంగారం పోతే తిరిగి లభించవు కాని, ఈ సర్టిఫికెట్లను పోగొట్టుకున్న వెంటనే నకళ్ళను పొందవచ్చు
* దురదృష్టం కాటువేస్తే ఏ ధృవపత్రాల అవసరం లేకుండా పూర్తి సొమ్ము వారసులకు ఇవ్వబడే భీమా సౌకర్యం ఒక్క పోస్టాఫీసు పొదుపు పత్రాల్లోనే ఉంది.
* పోస్టాఫీసు సేవింగ్స్ ఖాతాలో లక్ష రూపాయలు లాటరీ గెల్చుకోవచ్చు



**కమిషనర్ స్మాల్ సేవింగ్స్‌ను**

లేదా అన్ని పోస్టాఫీసుల్లో నూ, జిల్లా కలెక్టర్ కార్యాలయాల్లో నూ, జాతీయ పొదుపు సంస్థ అధికారులను ఏజంట్లను. సంప్రదించండి




**జాతీయ పొదుపు సంస్థ**

మా భద్రతే మా లక్ష్యం.



Vaisakha/NSO/8602



# ఆంతర్యం



## ఆలపాటి అరుంధతీరావు

వంట యింటికి యింటి యిల్లాలికి ఉన్న సంబంధాన్ని తాత్కాలికంగా తెగ తెంపులు చేసుకొన్నట్టుగా చేతులు దులుపుకొని, ఆ ఉదయాన మిగిలింది సగిలింది పని మనిషికి ఉదారంగా దానం చేసి, ఆ సాయంకాలానికి ఆ మహాతల్లి వస్తుందో? రాదో? అన్న సందేహాన్ని చిరునవ్వు వీడ్కోలుగా రూపొందించి, ఆమెను సాగనంపి తలుపు వేసుకొనివచ్చి వరండాలో వాలు కుర్చీలో వాలబడితే, ఈ కార్మికురాలి మీద దయ దలచినట్టుగా ఆకాశవాణి కార్మికుల కార్యక్రమాన్ని వినిపిస్తూ ఉంటుంది. ఆకాశవాణికి చెవుల్ని, ఇంటి వాకిలికి చూపుల్ని అప్పగించి ఎదురు చూస్తూ కూర్చుంటే - ఆయన కోర్టు నుండి వస్తారు. వచ్చేదేమో కార్లోనే వస్తారు. సరాసరి యింటకే వస్తారు. ఇంట్లో ఉంటున్నా ఆయన లోకంలో ఆయన ఉంటారు. ఆ ఉదయాన ఓడిపోయిన కేసును గురించో లేకుంటే ఆ మధ్యాహ్నం వాదించవలసిన కేసును గురించో జుట్టు పీక్కొంటూ ఉంటారు. వస్తున్న నవ్వును బిగపట్టుకుని వద్దిస్తే కోడి కెలుకులు కెలుకుతారు. కాసేపు నడుం వాలిస్తే వాలుస్తారు. లేకుంటే వచ్చినదారి పట్టుతారు. మొదట మొదట చాలా చిరాకేసేది. ఎందుకీ తపనా? ఎందుకీ సంపాదనా? అని నాలో నేను చాలాసార్లు తర్కించుకునేదానిని కాని రాను రాను అలవాటైపోయింది! అంటే- జీవితంతో అలా రాజీ పడిపోయానన్న మాట!

నేను జీవితంలో రాజీ పడినదానికి, ఆ రాజీని ఆయన గౌరవించినదానికి నిదర్శనాలు- ఇద్దరు కొడుకులు. ఒక్క కూతరు!

ముగ్గురు పిల్లలు బడికి వెళ్ళుతున్నారు!

ఆడ జన్మ ఒక్క దశ వరకు తన్ను గురించి చాలా తీవ్రంగా ఆలోచిస్తుంది. ఈ లోకంలో వున్న సౌఖ్యమంతా తనకే హక్కు భుక్తం భర్త ద్వారా జరగాలని ఆరాటపడుతుంది. ఆ ఆరాటానికి ప్రతిగా ప్రతి రూపాల్ని చూసినప్పుడు తల్లిగా వాళ్ళ బాగోగులే తనవిగా తృప్తి పడుతుంది! లేకుంటే సమస్యల వలయాలైన ఈ సంసారాల్ని ఈదటం చేతనయ్యే పని కాదేమో?-

రోజూ వరండాలో వాలు కుర్చీలో కూర్చుని రేడియో వింటూ, తన లోకమే తనదిగా భావించే భర్తను, ఎంతో భవిష్యత్తును ముందుంచుకున్న పిల్లల్ని గురించి ఆలోచిస్తూంటే పొద్దు కుంకుతుంది. కుంకిన పొద్దు మళ్ళీ మొలుస్తుంది. కాల గమనంలో ఒక్క రోజు జమ అవుతుంది!

'ఆడ బతుకులన్నీ యింతే!' అని కొందరు, 'ఏమిటో ఈ గానుగెద్దు జీవితాల'ని కొందరు [illegible]తూనే ఉంటారు. కాలం గడిచిపోతూనే [illegible]టుంది!

ఆ రోజు దాదాపు యిదే స్థితిలో ఆలోచించుకుంటూ కారు శబ్దం కోసం ఎదురు చూస్తుంటే కాలింగ్‌బెల్ మోగింది. ఎవరా? అని ఆలోచిస్తూనే వెళ్ళి తలుపు తీశాను.

ఒక్క క్షణం నా కన్నుల్ని నేను నమ్మలేకపోయాను!

అవును మరి? ఎలా నమ్మాలి? మెడలో తాళి బొట్టు దారం పచ్చంగా ఉంచుకోలేని పరిస్థితి.. రెండు మూడ రోజులకు ఓసారి కానీ చీర మార్చలేని గతి... కాని యిప్పుడేమో పనిగట్టుకొని అలంకరించినట్టుగా పట్టు చీరతో... వొంటి నిండుకూ నగలతో వయ్యారాల కుప్పలా సాక్షాత్కరించింది.

'కొంపదీసి ఏదైనా లాటరీ తగల్లేదు కదా?' అని ఆలోచిస్తూ ఆశ్చర్యంలో పడి, పడిన చోటు నుండి పైకి లేవలేక అలాగే చూస్తూ నిలుచుండిపోయాను.

"ఏంవిటే? అలా చూస్తున్నావ్! దిష్టి గిష్టి తగిలేను!" అని ముసి ముసిగా నవ్వింది వాహిని!

"ఏంవీ లేదు, ఏంవీ లేదు" అని ఆశ్చర్యంలో నుండి తేరుకొని, 'ఈ పట్టు చీరతో, నగలతో ఎంత నిండుగా ఉన్నావ్? వాహినీ!' అని మెచ్చుకోలుగా అన్నాను.

"ఈ చీర మా అక్కదే! నగలూ మా అక్కవే! మా అమ్మాయికి బంతి, అందర్నీ పిలుద్దామని బయల్దేరా!- రేపు పేరంటానికి, భోజనానికి తప్పకుండా రావాలి సుమా!" అన్నది వాహిని.

వాహిని అక్కయ్య రజని. ఇంచు మించు అదే అలంకరణతో వాహిని పక్కని నిలబడి ఉంది. "ఈ చీరలు, నగలు మా అక్కవి!" అని చెల్లెలు చెబుతూంటే అక్క మొగంలో నవ్వులు అరవిరిసిన మల్లెలే అయ్యాయి.

"అది సరేనే! మా చెల్లెల అందాల్ని తాగుతూ అలాగే నిలుచుంటావా? లేక తాగడానికేనైనా కాసిని మంచినీళ్ళిప్పిస్తావా?" అని సుతారంగా దెప్పింది రజని.

"అయ్యో! నా మతి మండ! యింటికొచ్చిన అతిథుల్ని కనీసం కూర్చోమని కూడా చెప్పకుండా నిలబెట్టేశావ్!... ఇదో వస్తున్నా!"నంటూ మంచినీళ్ళు తేవడానికి గబగబా నడిచాను వాళ్ళని కూర్చోమని చెబుతూ!

నాకు తెలుసు వాళ్ళ నవ్వులు నా వీపును తొలుస్తున్నాయని! అయినా గమనించనట్లే ఫ్రిజ్ తీసి నీళ్ళు గ్లాసుల్లోకి వొంపి తెచ్చాను.

"పిల్లలేరి? బడికి వెళ్ళారా? ఏం చదువుతున్నారు?... అబ్బా! ఇంట్లో ఒంటరిగా బోర్ కొట్టడం లేదూ?" నీళ్ళందుకొంటూ వాహిని వస పిట్టలాగ వాగుతూ ఉంది.

"అబ్బా! ఎంత చల్లగా ఉన్నాయి నీళ్ళు. ప్రాణం లేచి వచ్చినట్లయింది." అని అంటూ రజని గడగడ నీళ్ళు తాగింది.

"ఇంకా పిలవాల్సిన వాళ్ళు చాలామంది ఉన్నారే!... వెళ్ళొస్తా! రేపు తప్పకుండా రావాలి

## అంతర్యం

సుమా! రావడమే కాదు రోజంతా మా యింట్లోనే ఉండాలి. సరదాగా కబుర్లు చెప్పుకుందాం!" అంటూ వాహిని బయలు దేరింది. రజని వెంట నడిచింది!

ఒక కొమ్మను పూసిన రెండు పువ్వుల్లా... ఆ అక్కా చెల్లెళ్ళు ఇద్దరూ ఒకరి పక్కన ఒకరు నడుస్తుంటే చాలాసేపు... తలుపు గడి పెట్టడం కూడా మరచి అలానే చూస్తూ ఉండిపోయాను!

ఇంతకూ నా ఆశ్చర్యానికి కారణం?- ఆ అక్కా చెల్లెళ్ళ సంగమం!

* * * * * *

మా పిన్నివాళ్ళ యింటి కెదురుగా చాలా కాలంగా ఉంటున్నారు సూర్యంగారు. ఆయనకు ఇద్దరు కూతుళ్ళు. ఒక్క కొడుకు. ముగ్గురికి ఎలాగో తన తిప్పలు తానుపడి మూడు ముళ్ళు వేయించారు సూర్యంగారు. ఈ దేశంలో పెండ్లి అనేది తల్లిదండ్రులకు ఒక పెద్ద బాధ్యత. ఆ బాధ్యత తీరిపోయిందంటే నెత్తి బరువు నేల పడినంత రిలీఫ్!-

ఆ రిలీఫ్ దొరికిన సూర్యంగారు నిజంగా హాయిగా ఉండవలసిందే! కాని ముగ్గురికి మూడు ముళ్ళూ వేయించేసరికి అతడికి మూడో కాలు చేతి కొచ్చింది. ఆ ముసిలి దంపతులు పెద్ద అల్లుడు కట్నం కింద కొట్టేసిన సగం యిల్లుపోగా మిగతా సగంలో శేష జీవితాన్ని నెట్టేయడానికి నానా తిప్పలు పడుతున్నారు!

అసలు కథ వాళ్ళని గురించి కాదు కదా?- వాహిన్ని గురించి. వాహిని నా వయస్సుది. ఆ యింట్లో ఆఖరుది. ఇద్దరి పెండ్లిండ్లు చేస్తే తల బొప్పి గట్టేసరికి పరిస్థితిని తలరాత మీదికి నెట్టేసి సూర్యంగారు చేతులు ముడుచుకొని కూర్చోలేదు కానీ బావమరది చేతులు పట్టుకొన్నారు. "నువ్వు చిన్న జీతగాడే కావచ్చు. నీ మనస్సు మాత్రం వెన్న. బావమరిది అంటే బతకగోరేవాడు కదా?- నా బిడ్డ మెడలో తాళిగట్టి మా బతుకుల్నిలా కడతేర్చు బాబూ!" అని ప్రాధేయపడ్డాడు.

వాహిని అదృష్టం బాగుంది. కట్నాలు కానుకలు లేకుండానే ఆ అమ్మాయి కన్నె చెర తొలగింది.

సూర్యం గారింట్లో మధ్య తరగతి మందహాసం విరబూసిందాలు పోయింది.

ఆ తరువాత షరా మామూలే!- వాహిని కాపురానికి వెళ్ళింది. కాపురంలో దేనికైనా కొదవ ఉండవచ్చునేమో కానీ సంతానానికి కొదవ ఉండడానికి వీల్లేదు కదా? వాహిని ఏటా బాలెంతరా లయింది. అబ్బాయి పుడతాడని ఎదురు చూస్తుండగానే నలుగు రమ్మాయిల తల్లి అయింది. చిన్న జీతం. పెద్ద సంసారం. తిప్పలు పట్టడానికి అద్దం వస్తున్న మేనరికం-/ వాహిని సంసారం కాలవాహినితో కలిసి నత్త నడక

# కొనకొత్రి!

బొమ్మన్




నడుస్తూ ఉంది!

"ఏమిటో నే! వద్దు వద్దంటూనే నలుగుర్ని కనుక్కొన్నాను. నన్నొకరి చేతుల్లో పెట్టడానికి నా తల్లి దండ్రులు పడిన తిప్పల్ని తలుచుకొంటే గుండె చెరువవుతుంది. ఈ పిల్లల భవిష్యత్తు ఎలా ఉంటుందో? ఏమో?" అని కనిపించినపుడంతా వాపోతూ ఉండేది!

సూర్యంగారి పరిస్థితి బాగా విషమించింది. "నాకు తోడు నువ్వు. నీకు తోడు నేను!" అని ఆ ముసిలి దంపతులు ఎంతగా సరిపెట్టుకొన్నా కాలూ చెయ్యి ఆడని వయస్సు కదా? ఒక తోడు అవసరమయింది.

గుంటూరులో వ్యాపారం చేసుకొంటున్న కొడుకు కడపటికి కరుణించినట్లుగా తల్లిదండ్రుల అవసరాన్ని గుర్తించాడు. వాళ్ళని తన దగ్గరికి రమ్మన్నాడు.

కొడుకు పిలుపును కాదనలేక పోయారు!

తమ జీవితాలకు ఒక తోడు తప్పనిసరి అని అనుకొన్నారు!

అసలు అక్కణ్ణుంచి మొదలయింది గాలి వాన! చినికి చినికి అది పెను తుఫానయింది!!–

మీరెటూ వెళ్ళి పోతున్నారు గదా? మేము యిల్లు కట్టుకొన్నపుడు మీ యింటి రిపేరుకని యిచ్చిన బాకి ఎలాగూ తీర్చలేరు. సగం మాకివ్వగా మిగిలింది సగం. ఆ కొద్ది స్థలాన్ని బాకి కింద జమకట్టి మాకు రిజిష్టర్ చేయించండి. ఇంట్లో యిల్లు కలిసి పోతుంది. మీ బాకి తీరిపోతుంది. వడ్డీలేక పోయినా ఎలాగో సర్దుకొంటాము. తరువాత అన్నయ్యతో గొడవలొస్తే బాగుండదు!" అని వచ్చి కూర్చుంది పెద్ద కూతురు రజని

"నన్ను కన్నారు. కనిన నేరానికి ఎవరి చేతుల్లోనే పెట్టి కన్నెరికం తీరిందని పించారు. అంతేకాని పెట్టింది పోసిందేమీ లేదు. నేనుకాని మా వారుకాని ఏ రోజునా "యిది యివ్వండి" అని అడగలేదు. ఆయన మంచివారు కాబట్టి సరిపోయింది. ఇప్పుడైనా మించి పోయింది లేదు. అక్కయ్యకు సగం యిల్లు కట్నం కింద యిచ్చారుగా! నాకూ అలానే యిస్తే సరిపోతుంది. బాడుగ యిండ్లల్లో బాధలు మీకు తెలియనివా? ఇంటివాళ్ళ అబ్బాయి పెళ్ళట. ఇల్లు ఖాళీ చేయమంటున్నారు. చాలీ చాలని జీతంతో సంసారాన్ని నెట్టుకరాలేక నా చావు నేను చస్తున్నాను. దయచేసి ఈ యిల్లు నాకిస్తే కనీసం యింటి అద్దె అయినా తగ్గుతుంది బతుక్కొంత వెసులుబాటుగా ఉంటుంది!" అని వాహిని వాదన.

"మీరెలాగా నా దగ్గరికి వచ్చేస్తున్నారు కదా? ఆ స్థలాన్ని నాపేర రాయించండి. మెయిన్‌రోడ్ కాబట్టి ఒకషాపు కట్టి బాడుగకు వదిలేస్తే మంచి అద్దెవస్తుంది. ఆ అద్దెను మీ కోడలి కంచచేస్తే ఆమె మిమ్మల్ని ఏ లోటూ రాకుండా చూసుకొంటుంది" అని కొడుకు సలహా!

సూర్యంగారు అయోమయంలో పడి పోయారు!

సూర్యంగారు అదకత్తెరలో పోక అయ్యారు!

"ఛీ ఛీ! ఏ మనుష్యులు వీళ్ళు? ఏం మనస్తత్వాలు వాళ్ళవి? ఒక రక్తానికి పుట్టిన బిడ్డలేనా వాళ్ళు? వ్యాపారం కలిసొచ్చింది. బాగా సంపాదించాడు. మిద్దెలు మేడలు కట్టుకొన్నాడు. ఎల్లా పాపలతో హాయిగా ఉన్నాడు. వాడి ఆశకూ అంతులేదు. పాపం! చిన్నది. చాలీ చాలని బతుకుతో సతమతమవుతూంది. తోబుట్టువే కదా? దానికే యిచ్చేయ్ నాన్నా!' అనలేదు. అన్ని విధాల హాయిగా ఉన్నా. నాకేమి లోటులేదు కదా! తండ్రి బిడ్డల మధ్య బాకీలా? పోతే పోయింది. చెల్లికిచ్చేయ్ ఆ స్థలాన్ని!' అని అక్క అనడంలేదు!– వీళ్ళకన్నా పశువులు నయం!" అని తనలో తాను మథనపడ్డాడే కాని మాట అనలేక పోయాడు!

ఎవరి మాటను కాదన లేడు. ఔనన లేడు. సర్దుబాటు చేసి చెప్పె సామర్థ్యమా? అసలు లేదు. 'చిన్నదాని అదృష్టం అంతే!' అని తలపట్టుకొన్నాడు సూర్యంగారు.

"ఈ పూటో రేపో పడిపోతుందా కొంప. దానిమీద ఎంత ప్రేముందో?.... అసలు సంగతి తెల్పందే ...నికి విలువ లేదంటూ ఉంది నీ కోడలు!" అని కొడుకు జాగ్రత్తగా తప్పును కోడలి మీదికి నెట్టేశాడు.

"అడకూతురు సొమ్ము తిన్న వాళ్ళు అధోగతి పాలై పోతారు. పోతే పోంది ఈ రోజుతో మీరు నాకు అమ్మానాన్న కాదు. నేను మీకు కూతుర్నికాదు." అని పుల్ల విరిచినట్టు ఖచ్చితంగా పలికింది పెద్ద కూతురు.

గుంటూరులో మిద్దెల మేడల్లో కొడుకు కోరిన జీవితాన్ని అనుభవిస్తున్నాడు. రజని జీవితం మామూలుగానే సాగిపోతూంది. ఎటొచ్చి వాహిని జీవితమే! వాహిని కొవ్వొత్తిలా పరిణమించింది.

స్వార్థం ముందు సంబంధ బాంధవ్యాలు తలవంచుకొన్నాయి!

# ఆంతర్యం

కాల గమనంలో ఆటు పోట్లకు అలిసి పోయిన ఆ ముసలి జీవులు ఈ పరిస్థితికి తట్టుకో లేక.... ఎవరితో డూ లేకుండానే..... ఎవరి చేత చేయించుకో కుండానే శాశ్వతంగా సెలవు తీసుకున్నారు!

కబుర్లు విన్న వెంటనే రెక్కలు గట్టుకొని వచ్చాడు సుపుత్రుడు. బ్రతికి ఉన్నపుడు బాగోగులు చూడకపోయినా చచ్చి నపుడు మాత్రం వెనుకాముందు చూడకుండా డబ్బుని మంచినీళ్ళ ప్రాయంగా చల్లి ఆర్భాటంగా కర్మ కాండలు నిర్వహించాడు!

"అబ్బ! ఎంత గొప్పగా జరిపించాడండి కార్యాలు?" అని యిరుగు పొరుగు అంటూంటే ఋణం తీరిపోయినట్లు మురిసి పోయాడు.

'అయ్యో! మమ్మల్ని అన్యాయం చేశారే!! మా బాకీ బాకీగా మిగిలి పోవాల్సిందేనా? దీన్ని గురించి యింకెవరాలో చిస్తారు? అని అస్తమానం రుసరుస లాడు తూనే ఉంది రజని.

వాహిని మాత్రం చిన్న పోయినట్లు కూర్చుంది. పల్లెత్తు మాట పలకడం లేదు. పలకరిస్తే కళ్ళ నీళ్ళు పెట్టుకొంటుంది. లేకుంటే తన లోకంలో తానుంటుంది.

ఆమె పరిస్థితిని గమనించిన అన్న గారి గుండె చెరువయింది!

"అమ్మా వాహినీ! జరిగిందేదో జరిగిపోయింది. ఈ యిల్లు నువ్వే తీసుకో! అలా చేస్తే అమ్మా నాన్నల కోర్కె తీర్చిన వాళ్ళవుతాం. నీ కంత ఆసరా కలిగించి నోళ్ళవుతాం. ఎంతయినా తోబుట్టువు కదా?" అని అన్నాడు . సతీమణి మూతి విరుపులు లెక్క చేయకుండా!

కానీ రజనిమాత్రం 'ససేమిరా వీల్లేదు అంది. నాబాకీ తీర్చితే కానీ వీల్లేదు. లేదా ఇల్లు అమ్మేసి తీర్చండి!" అని పట్టు బట్టింది.

అన్న వాదించాడు. బంధువర్గం జోక్యం చేసుకొనింది. సంవత్సరీకాలు అయిన తర్వాత యిల్లు అమ్మి రజని బాకీ తీర్చేటట్లు , అంత వరకు వాహిని అయింట్లో ఉండేటట్లు, ఆ యింటిని జాగ్రత్తగా కాపాడేటట్లు ఒక వప్పందానికి వచ్చారు.

అప్పటి నుండి అక్కా చెల్లెళ్ళు ఉప్పు నిప్పు అయ్యారు.

అన్నకు చెల్లెళ్ళకు మాటా మంతీ ఏమీలేవు. రాకపోకలు లేవు. ఎవరి దారిన వాళ్ళున్నారు.

అంతవరకు తెలుసు!

కానీ ఆ ఉప్పు నిప్పే ఉప్పు పప్పులా కలిసి కనిపించేసరికి నా ఆశ్చర్యానికి అంతు లేదు.

"ఎలా కలిశారబ్బా? అక్క చీరలు నగలు చెల్లెల కిచ్చేటంత సామరస్యం ఎలా కుదిరింది? ఏం జరిగి ఉంటుంది?" అని హాయిగా కూర్చుని ఆలోచనల్ని తింటున్నాను.

అంతలో శ్రీవారు వచ్చారు!

నా ఆలోచనల్లో నేను తల మునకలవుతూనే లేచి కాఫీ కలిపి యిచ్చాను. ఎంతైనా లాయర్ కదా? నా పరధ్యానాన్ని పసికట్టారు.

"ఏం? అలా ఉన్నావ్?" అని అడిగారు కాఫీ తాగుతూ!

"ఫరవాలేదే! ఈ మతిమరుపు మనిషి క్కూడా మతి ఉందే?" అని అనుకొంటూనే నా సందేహాన్ని సవిస్తరంగా శ్రీవారికి విన్నవించాను.

ఆయన పకపక నవ్వారు!

"ఎందుకండీ అలా నవ్వుతున్నారో?

"మరేం చేయాలంటావ్?"

"కారణం తెలిస్తే చెప్పండి కానీ అకారణంగా మాత్రం నవ్వవద్దండి!"

"అబ్బా! ముగ్గురు పిల్లల తల్లయినా మూతి విరుపులు మాత్రం మెరుపుల్లా ఉన్నాయ్!"

"అయితే చిరునవ్వుల మెరుపుల కోసం యింకో చిన్నదాన్ని వెతుక్కోండి!' అంటూ విసురుగా కాఫీ కప్పు చేతి కందుకొన్నాను'

ఆయన తటాలున నా చేతిని పొదివి పట్టుకొన్నారు. 'అంత కోపమైతే ఎలాగమ్మా? మాట మాటకు నీలాగా జడ్జిగారు కూడా కోపగించు కుంటే ఈ పాటికి నేను చెట్టు కింద ప్లీడరయ్యే వాడిని తెలుసా?– పోనీలె కానీ' ఇంతకూ యువర్ ఆనర్ – మీరు అడిగింది?.....'

"ఆ కోర్టు పరిభాష కొంచెం కూడా ఎందుకండీ?"

"అయితే అమ్మడూ! నీ సందేహానికి కారణం నుడివెద వినుడు. కీర్తిశేషులు శ్రీ శ్రీ శ్రీ సూర్యం గారు ఇంతకుముందు ఏడో ఊళ్ళో పంతులు గిరి వెలిగిస్తున్నప్పుడు చాలా చవకగా అయిదెకరాల పొలాన్ని కొని పెట్టారట!– ఇప్పుడు దాని విలువ అంతకు నూరంతలు అమాంతంగా పెరిగి పోయిందట బైపాస్ రోడ్డు పుణ్యమా అని! ఆసంగతి యిప్పుడు బయట పడింది. అక్కా చెల్లెళ్ళిద్దరూ ఏకమయ్యారు అన్నపై యుద్ధం ప్రకటించడానికి. ఆ యుద్ధానికి సారథి ఎవరనుకున్నావ్?...... శ్రీ శ్రీ శ్రీ మీ శ్రీవారే!..... భార్యలతో కలిసి భర్తలు కూడా వచ్చి వకాలత్‌లో సంతకాలు పెట్టించినారు. ఇక అన్నగారు బోనులో నిలబడడం తప్పదు. అక్కా చెల్లెళ్ళ సంగమంతో ఆంతర్యాన్ని అవధరించి నారు కదూ!" అన్నారు మావారు నవ్వుతూ!

ఆ ఆంతర్యం తెలిశాక ఆత్మీయతలు, అనురాగాలు, రక్తసంబంధ బాంధవ్యాల్లో ఆంతర్యం అంతా అర్థ రహితంగా తోచి నేను ఆలోచిస్తున్నాను. తన కొక కేసు దొరికించనో, తన ప్రాక్టీసు పెరిగించనో ఆయన మాత్రం చిరునవ్వులు చిందిస్తున్నారు!

బ్రదుకుల్లో ఆంతర్యం యిదేనేమో మరి !! □

# సాగర్

## అత్యుత్తమమైన నిజమైన కూలర్



- నాణ్యత కలిగిన స్విచ్‌లు
- నాణ్యత కలిగిన పంపులు మరియు మోటారు
- లీకేజి ఉండదు
- తుప్పు పట్టదు
- గట్టి నిర్మాణం [ఫైబర్ గ్లాస్ మరియు అల్యూమినియం]
- అన్నివైపులా గాలి వచ్చే అవకాశం



2 సంవత్సరములు గ్యారంటీ

మార్కెటెడ్ బై:

**సంయుక్త**

రామమందిరం రోడ్, విజయవాడ-2,
ఫోన్స్: 64015, 65019.

[illegible]




దర్శకత్వం
**రాజాచంద్ర**

నిర్మాత
**పి. శశిభూషణ్**

చక్రవర్తి గణేష్‌పాత్రో తివారి భాస్కరరాజు రాజగోపాల్

# సీక్రెట్ ఏజంట్ విక్రమ్

13

విక్రమ్, మార్టిన్‌లని సిపాయిలు చుట్టుముట్టారు.
ఎవరు మీరు?
నా పేరు విక్రమ్. భారత గూఢచారిశాఖ ఏజంట్‌ని. ఇతను ఇంటర్‌పోల్ ఏజంట్ మార్టిన్.

29/13

వాళ్ల కెప్టెన్ ముందుకు వస్తాడు.
విక్రమ్! మీరు క్షేమంగా ఉన్నారు కదా?
కెప్టెన్ మల్‌హోత్రా! మిమ్మల్ని కలుసుకున్నందుకు సంతోషంగా ఉంది. మీ వాళ్ళు మేమే నేరస్తులమని పొరపడ్డారు! అన్నట్టు ఇతను ఇంటర్‌పోల్ ఏజంట్ మార్టిన్.

హలో మార్టిన్! మేము వాళ్ల మందు పాతరలని తీసి వేసాము లోపలికి వెళ్దామా?
అలాగే. కానీ ఈ సొరంగ మార్గంలో కాదు. మీ పటాలానికి అన్ని వైపుల నుంచీ చుట్టుముట్టమని ఆదేశాలు ఇవ్వండి.

ప్రధాన ద్వారం వెలుపల ఒక ట్రక్కు నించి ఏదో సరుకు దించుతున్నారు
వాళ్ళు ఎదురు చూడని విధంగా మనం వాళ్లని పట్టుకుందాము
అలాగే. పదండి వెళ్దాం.

వాళ్ళు ఎలాంటి ప్రతిఘటనా లేకుండానే లొంగి పోయారు.
చేతులు పైకెత్తండి!

లోపల ఉన్నవారు కూడా సైన్యానికి లొంగి పోయారు

ఓహ్! మరచాను! మార్టిన్, కెప్టెన్ నాతో రండి.

ఆ రహస్య మార్గం ద్వారం వద్ద–
ఆఁ! మేము సరైన సమయానికే వచ్చాము కాల్చినా! చేతులు పైకెత్తు!
ఇతనేనా పినికంతటికీ నాయకుడు?



కాదు. ఇతనొక పావు లాంటివాడు. నాయకులంతా ఈ బ్రీఫ్‌కేస్‌లో ఉన్నారు. మనం ప్రధాన కార్యాలయానికి వెళ్ళి దానిని పరిశీలించాలి కెప్టెన్! మీ సహాయానికి ధన్యవాదాలు.
మా సహాయం మీకు ఎప్పుడు కావాలన్నా సిద్ధమే విక్రమ్!

(ఇంకా ఉంది)

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3,

## హైదరాబాద్ కార్పొరేషన్‌కు మజ్లిస్ హరిజన మేయర్:-

హైదరాబాద మునిసిపల్ కార్పొరేషన్‌కు మజ్లిస్ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ అభ్యర్థి 28 సంవత్సరాల హరిజన అభ్యర్థి శ్రీ కె. ప్రకాశ్‌రావు మార్చి 14వ తేదిన మేయరుగా ఎన్నికయ్యారు. శ్రీ ప్రకాశ్‌రావు చింతల్‌బస్తి నియోజకవర్గం సభ్యుడు. ఈయనకు 68 వోట్లు, ఇతనితో పోటీ చేసిన భారతీయ జనతాపార్టీ అభ్యర్థి శ్రీ కె. ముత్యాలుకు 15 వోట్లు వచ్చాయి. తెలుగుదేశం పార్టీ వోటింగులో పాల్గొనలేదు. కార్పొరేషన్ సభ్యుల సంఖ్య మొత్తం 117 - వందమంది కార్పొరేటర్లు, 13 మంది జంటనగరాల విధాన సభ సభ్యులు, నలుగురు పార్లమెంటు సభ్యులు. శ్రీ ప్రకాశ్‌రావు రెండవ రౌండ్‌లో ఎన్నికయినట్లుగా ప్రత్యేకాధికారి శ్రీ అర్జున్‌రావు ప్రకటించారు. ఎన్నిక కాగానే మజ్లిస్ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ అధ్యక్షుడు సుల్తాన్ సలాహుద్దిన్ ఓవైసి ప్రసంగిస్తూ రాజకీయ పక్షాలు మతప్రసక్తి రహితత్వాన్ని గురించి కేవలం ప్రచారం చేస్తాయే గాని, ఆచరణలో ఆ తత్వాన్ని అనుసరించవని, తమ పార్టీ ఆచరణలో మత ప్రసక్తిరహితత్వాన్ని చూపి హరిజనుణ్ణి మేయర్‌గా ఎన్నుకుందని అన్నారు. మజ్లిస్ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సభ్యుడు శ్రీ ఎం. కె. మొబిన్ డిప్యూటీ మేయర్‌గా ఎన్నికయ్యారు. ఆయనకు 68 వోట్లు. ఆయనతో పోటీచేసిన భారతీయ జనతాపార్టీ అభ్యర్థిని శ్రీమతి టి. విజయలక్ష్మికి 15 వోట్లు వచ్చాయి. శ్రీ ప్రకాశ్‌రావు మేయరు పదవి స్వీకరించడానికి ముందు శ్రీ ఓవైసి పాదాలు తాకి పాదాభి వందనం చేశారు. తర్వాత ప్రత్యేకాధికారి శ్రీ అర్జున్‌రావు ఆయనను పుష్పమాలాలంకృతుని చేసి మేయర్ పీఠానికి తీసుకువెళ్లారు. ఈ ఎన్నికలో కాంగ్రెసు పార్టీ మజ్లిస్ ఇత్తెహాదుల్ ముస్లిమీన్‌కు అనుకూలంగా వోటు చేసింది. మతసామరస్య దృష్టితో కాంగ్రెస్ మజ్లిస్‌తో సహకరించిందని, రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ జలగం వెంగళరావు అన్నారు. ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం రాష్ట్ర శ్రేయస్సు కోసం తమ పార్టీ మజ్లిస్‌ను సమర్థించిందని ఆయన అన్నారు. తెలుగుదేశంపార్టీ లోగడ మజ్లిస్‌తోను, బి. జె. పి.తోను పొత్తు కలిపిందని, కనుక ఇప్పుడు తమ పార్టీ మజ్లిస్‌కు అనుకూలంగా వోటు చేసిందని ఆక్షేపించే హక్కు తెలుగుదేశంపార్టీ అధ్యక్షుడు శ్రీ ఎన్. టి. రామారావుకు లేదని శ్రీ వెంగళరావు అన్నారు. శ్రీ ప్రకాశ్‌రావును అభినందిస్తూ జరిగిన సభలో శ్రీ ఓవైసి ప్రసంగిస్తూ మునిసిపల్ కార్పొరేషన్ జంటనగరాలకు పౌర సౌకర్యాలు ఇతోధికంగా కలిగించడానికి కృషి చేస్తుందని అన్నారు. "నేను 22 సంవత్సరాలుగా రాష్ట్ర విధాన సభ సభ్యుడుగా ఉన్నాను. పదకొండుమంది ముఖ్యమంత్రులను చూచాను. వారిలో శ్రీ వెంగళరావు మాత్రమే నాకు నచ్చారు." అని శ్రీ ఓవైసి అన్నారు. కొత్త మేయర్ శ్రీ ప్రకాశ్‌రావు ప్రసంగిస్తూ, తనబోటి బీద హరిజనుణ్ణి మేయరుగా ఎన్నుకున్నందుకు శ్రీ ఓవైసికి కృతజ్ఞతా

# హైదరాబాద్ నోట్‌బుక్

వందనాలు సమర్పించారు

## శ్రీరామ గానసభ త్యాగరాజోత్సవాలు:-

కొత్త నల్లకుంట శ్రీరామ గానసభ త్యాగరాజోత్సవాలను రామాలయంలో ఫిబ్రవరి 26 నుంచి వారంపాటు జరిపింది. యువకళాకారులను ప్రోత్సహించడం ఈ సంస్థ లక్ష్యం. ఉత్సవాలు వారంపాటు జరిగాయి. శ్రీ మోహన్‌కందా ఉత్సవాన్ని ప్రారంభించారు. సాంస్కృతిక శాఖ మాజీ కమీషనర్ శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించారు. వందమంది సంగీత విద్వాంసులు, సంగీత ప్రేమికులు 'ఉంఛవృత్తి' నిర్వహించారు సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ నూకల చినసత్యనారాయణ త్యాగరాజస్వామి పాత్ర ధరించి 'ఉంఛవృత్తి'లో పెక్కు త్యాగరాజ కీర్తనలను గానం చేశారు. పిదప దాదాపు 200 మంది పంచరత్న కీర్తనలు బృందగానం చేశారు. 'శ్రీరామ గానసభ ప్రతి నెల సంగీత కచ్చేరీలు నిర్వహించడానికి వీలుగా 18 మంది దాతలు చెరి 400 రూపాయలు విరాళమిచ్చారు. దీనితో ఉత్సాహితులైన సంఘ కార్యదర్శి శ్రీ సత్యనారాయణ తమ సంఘం శ్రీరామనవమి, వినాయకచవితి, నవరాత్రి, దసరా, త్యాగరాజ ఆరాధనోత్సవాలను జరుపుతుందని ప్రకటించారు. ఈ ఉత్సవంలో శ్రీయుతులు నూకల చినసత్యనారాయణ, సవిత, చక్రపాణి, జయలక్ష్మి సంతానం, కలావతి, కర్పగం రంగాచారి, మంగమ్మ, భాగ్యలక్ష్మి, మణిరఘునాథ్, కె. వెంకటాచారి, కె. మురళీకృష్ణ, ఎన్. జయలక్ష్మి, బేబీ స్వర్ణ, అనూరాధ, వినోద్, జయంతిరామ, సత్యనారాయణరావు, కె. ఎస్. ఎల్ సరోజని, కమలా సుబ్బారావు, కందా అపర్ణ, బండి సుబ్బలక్ష్మి, శ్రీవల్లి, బి. ఎస్. నారాయణ, యెల్లా వేంకటేశ్వరరావు, బి. ఆర్. సి. అయ్యంగార్, పేరి సుబ్బారావు, పేరి రామమూర్తి, చాగంటి కపాలీశ్వరరావు, రాజేశ్వరరావు, పాలగుమ్మి విశ్వనాథం, రమణ, వంకాయల వెంకటరమణ, జె. జయలక్ష్మి, బండి శ్యామల, మణిరఘునాథ్, రాధా గోపాలకృష్ణన్, బి. ప్రమీల, ఎన్. సేతుమాధవి, సి. పద్మజా సుబ్రమణ్యన్, ఎస్. సుబ్బలక్ష్మి, ప్రమీళ, ఎ. వి. ఎస్. కృష్ణరావు మున్నగు కళాకారులు పాల్గొన్నారు. ఐదవ రోజున శ్రీ యెల్లా వేంకటేశ్వరరావు బృందం మృదంగ తరంగిణిని ప్రదర్శించారు. కళల వ్యాప్తికి ఎన్ని సంఘాలు ఉదయించినా చాలదు. శ్రీరామ గానసభ వృద్ధ కళాకారుల గొప్పదనాన్ని యువ కళాకారులకు వారసత్వంగా అందివ్వడంలోను, ప్రోత్సహించడంలోను గొప్ప కృషి చేయగలదని ఆశిస్తున్నాను.

## రాజ్యసభ ఎన్నికల్లో తెలుగుదేశం ఘనవిజయం!

ఆంధ్రప్రదేశ్ విధానసభ ఐదుగురు తెలుగుదేశం సభ్యులను రాజ్యసభకు ఎన్నుకొని తెలుగుదేశంపార్టీ ప్రలోభాలకు గురికాలేదని, సమైక్యంతో గొప్పగా వ్యవహరించిందని నిరూపించింది. ఐదుగురు తెలుగుదేశం సభ్యులు ఎన్నికయ్యారు వారు శ్రీయుతులు టి. మనోహర్, రావుగోపాలరావు (చలనచిత్ర నటుడు), కె. ప్రభాకరరావు, డి. విజయమోహన్‌రెడ్డి, శ్రీమతి రేణుక, ఒక్క కాంగ్రెసు (ఐ) సభ్యుడు శ్రీ జి. స్వామినాయక్ ఎన్నికయ్యారు. ఇది సత్యానికి, న్యాయానికి విజయమని, ఇతరులు డబ్బు మూటగట్టుకుని ఎంత ప్రయత్నించినా తెలుగుదేశం సభ్యులు గట్టిగా నిలబడ్డారని ముఖ్యమంత్రి శ్రీ రామారావు అన్నారు. తెలుగుదేశం సభ్యులను రామకృష్ణ స్టూడియోస్‌లో విజయోత్సవ సభలో అభినందించారు. ముఖ్యమంత్రి ఆ సభలో సి. పి. ఐ. · (ఎం)ను తమ పార్టీకి సహకారం ఇచ్చినందుకు అభినందించారు. కాంగ్రెస్ (ఐ) సభ్యులు, వారి మిత్రులైన మజ్లిస్ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ వారు 54 మంది వున్నా కాంగ్రెస్-ఐ అభ్యర్థి శ్రీ జి. స్వామి నాయక్ ఎనిమిదవ రౌండ్‌లో గెలవడం సిగ్గుచేటని తెలుగుదేశం పార్లమెంటరీ పార్టీ నాయకుడు శ్రీ ఉపేంద్ర అన్నారు. పార్లమెంటులో తెలుగుదేశం బలం 40 అయిందని (లోకసభలో 30 మంది, రాజ్యసభలో 10 మంది), శ్రీ ఉపేంద్ర అన్నారు. కార్పొరేషన్ ఎన్నికలలో తెలుగుదేశం పార్టీకి 24 స్థానాలు వచ్చినందుకు సిగ్గుతో శ్రీ ఎన్. టి. రామారావు రాజీనామా ఇవ్వాలని కోరిన రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావు ఇప్పుడు ఈ పరాజయానికి తమ పదవికి రాజీనామా ఇవ్వాలని విధాన సభలో తెలుగుదేశం ఛీఫ్ విప్ శ్రీ టి. సీతారాం అన్నారు. ఇది తెలుగుదేశంపార్టీకి గర్వ కారణమైన విజయమని, సి. పి. ఐ (ఎం) సభ్యుడు శ్రీ నండూరి ప్రసాదరావు అన్నారు. తెలుగుదేశం ఈ బలంతో పార్లమెంటులో రాష్ట్ర ప్రయోజనాలను, ప్రజాస్వామాన్ని రక్షించడానికి పాటుపడుతుందని ఆశిస్తున్నానని శ్రీ ప్రసాదరావు అన్నారు.

## ఉపశ్రుతి:-

ఉద్యోగం పురుష లక్షణం అన్నారుగదా, ఉద్యోగం లేని వారిది - నిరుద్యోగులది - ఏమి లక్షణం? - అనడిగారు ఒకరు. స్ఫూజ హాస్యప్రియులైన మిత్రులు శ్రీ అబ్బూరి వరదరాజేశ్వరరావు వెంటనే నిరుద్యోగం కిం పురుష లక్షణం - అన్నారు. అంటే ఏమిటి? - అనడిగారు ఆ మిత్రుడు. కిం పురుషులంటే దేవ యోనులు కదండి. దేవతలు పనేం చేస్తారు? కనుక నిరుద్యోగం కిం పురుష లక్షణం - అని వ్యాఖ్యానించారు వరద

-తిరుమల రామచంద్ర

చెల్లించండి రూ.375/-
ఇంటికి తీసుకెళ్ళండి
ఒక **మహారాజ** ఈరోజే!

# నాణ్యతను పోల్చి చూడండి, ధరను పోల్చి చూడండి. ఉత్తమమైనది ఎంపిక చేసుకోండి.

## మహారాజ బహుళ ప్రయోజనకారి కిచెన్ మెషిన్




గృహిణులకు మరేదీ యింతకంటె సహాయపడదు. మహారాజ సంపూర్ణమైన బహుళ ప్రయోజనకారి కిచెన్ మెషిన్ 500 వాట్లు, 35 నిమిషముల వరకు నిరాటంకంగా పని చేయగల మోటారు, 18000 ఆర్.పి.ఎమ్ తో బాటు 210 నుంచి 240 వోల్టుల వరకు సాధించగలుగుతుంది. గ్రైండర్ ఎంత శక్తివంతమైనదంటే, గట్టిపసుపు కొమ్ములను కూడా మెత్తటి పొడుంగా చేస్తుంది. పొడి వస్తువుల గ్రైండింగ్‌కి, తడి వస్తువుల గ్రైండింగ్‌కి ముద్ద చేయడానికి చిలకడానికి అత్యంత అనువైనది. భారత దేశపు అతి దృఢమైన, అతి శక్తివంతమైన కిచెన్ మెషిన్.

మొదట్లో చెల్లించవలసిన మొత్తం రూ. 375 మిగతా సొమ్ము 6 నెలవారి వాయిదాల్లో.

MAHARAJA is the India's most sturdy and powerful Kitchen Machine.

**SERVICE CENTRE** **APM - INDIA**

| | | |
|---|---|---|
| Challapalli Bunglow<br>Eluru Road<br>VIJAYAWADA | 29, 30 T. S. R.<br>Municipal Complex<br>VISHAKHAPATNAM | Adarsh Nagar<br>Ritz Hotel Road<br>HYDERABAD |

# 8 కోట్లకుపైగా టి.వి.సెట్లు అమ్ముడుపోయాయి ప్రపంచమంతటా

....ఏ మహోన్నతమైన జర్మనీదేశం నుండి గ్రండింగి టెక్నాలజీతో 8 కోట్ల టి.వి.లను ప్రపంచ వ్యాప్తంగా అందించిందో అదే టెక్నాలజి నుండి సింక్రోమా కలర్ టి.వి.లభ్యమవుతుంది.




# Sinclaire TV

**PRESTIGE PLUS PERFORMANCE**



# టెక్నాలజీలో అత్యున్నత శిఖరాల నధిరోహిస్తూ,



## తోషిబా
# డిజియానా

## 207 R3E
## రిమోట్ కంట్రోల్ మోడల్

ఎలక్ట్రానిక్ యుగాన్ని సృష్టించి
మౌంట్‌ఫ్యూజీ శిఖరాన్ని అధిష్టించిన
జపాన్‌వారి వినూత్న అధునాతన తోషిబా
టెక్నాలజీ అపూర్వసృష్టి డిజియానా టి.వి.
డిజియానా 207 R3E కార్డ్‌లెస్
రిమోట్ కంట్రోల్ మిమ్మలను
సమ్మోహితం చేస్తుంది. ఒక్క
బటన్ నొక్కితే చాలు ప్రపంచాన్ని మీ కళ్ల
ముందుంచుతుంది. బొమ్మలో సజీవ
స్పష్టత శబ్దంలో సహజ విశిష్టత
కలబోసుకున్నది డిజియానా టి.వి.

మీ కంటికి ఎటువంటి హాని, అలసట,
ఆటంకం - కలిగించని స్క్రీన్ ఉంది. దీని
సున్నితమూ, సుందరమూ అయిన రూపం
మీ ఇంటికి, కంటికి హుందాగా కొత్త
వెలుగు లిచ్చే దీపం. మీ ఇంటికి
తరిగిపోని సిరి, డిజియానా టి.వి.
ఈ రోజే మిమ్మల్ని మంత్రముగ్ధుల్ని
చేసే డిజియానా వినోద
ప్రపంచంలో అడుగుపెట్టి
చూడండి!




kiron/ai/86